సుబ్రహ్మణ్యకవి, ధరణికోట

ఇంద్రాహల్యావిలాసంబనునాటకము

చెన్నపట్టణము, 1898

Record no. 300

Subrahmaṇyakavi, Dharaṇikōṭa

Iṃdrāhalyāvilāsambanunāṭakamu

Cennapaṭṭaṇamu, 1898

Record no. 300

## Bibliographic Record Target

సుబ్రహ్మణ్యకవి, ధరణికోట.

ఇంద్రాహల్యావిలాసంబనునాటకము / ధరణికోట సుబ్రహ్మణ్యకవివరునిచే రచియింపంబడినది.- చెన్నపట్టణము : ఉమామహేశ్వరముద్రాక్షరశాల, 1898.

8, 240 p. ;21 cm.

Record no. 300

Subrahmaṇyakavi, Dharaṇikōṭa.

Iṃdrāhalyāvilāsambanunāṭakamu / Dharaṇikōṭa Subrahmaṇyakavivarunicē raciyimpambaḍinadi.- Cennapaṭṭaṇamu : Umāmahēśvaramudrākṣaraśāla, 1898.

8, 240 p. ;21 cm.

Record no. 300

56

శ్రీ ర[illegible]

# ఇంద్ర[illegible]సంబను నాటకము.

ఇది,

శ్రీమీనాక్షీదేవీసమేతుండైన
శ్రీవాలమేటిచొక్కనాథస్వామివారికర్పణంబగునటుల
మ-రా-రా-శ్రీ, అన్నారెడ్డి
రామచంద్రారెడ్డినామాంకితంబుగ

బ్రహ్మశ్రీ, ధరణికోట,
సుబ్రహ్మణ్యకవివరునిచే
రచియింపంబడి

వే॥ దంపూరికామాక్షయ్యగారు మొదలగుపండితులచే,
బరిష్కరింపంబడి
వైశ్యకులశిఖామణియగు మ-రా-రా-శ్రీ, బత్తెన
గురువప్పశెట్టిగారిప్రోత్సాహమువలన
చె-తె-జ-ప్ర-పా. అక్కయ్యవారి స్వకీయ
శ్రీమదుమామహేశ్వర
ముద్రాక్షరశాలయందుముద్రింపించి
ప్రచురింపంబడియె.



చెన్నపట్టణము ౧౮౯౮ సం-సెప్టంబరు నెల.



శ్రీమీనాక్షీసమేత చొక్క-నాథేశ్వరుడు.

## ప్రకటనపత్రిక.

ఇందువలన యెల్లవారలకు తెలయచాయడము యేమనగా—

యీపుస్తకము వలయువారలు చన్నపట్టణము పెద్దినాయునిపేటవద్ద మండీవీధినయినప్ప మేస్త్రీసందులో నెంగరరుగలగృహామునందు ☞ మ-రా-రా-శ్రీ, బత్తిన-గుర్వప్పశెట్టిగారివద్దనున్ను- నెల్లూరుజిల్లా, గూడూరుతాలూకాకోటమజురావాల మేటిగ్రామములో ☞ బ్రహ్మశ్రీ ధరణికోటసుబ్బరామయ్యగారివద్దనున్ను ☞ మ-రా-రా శ్రీ, అన్నారెడ్డి రామచంద్రారెడ్డిగారి వద్దనున్ను వ్రాసి తెప్పించుకోవచ్చును. దీనిక్రయం అణాలు౧-౬పోస్టేజి అ. ౨ వి. పి. ద్వారాకూడా పంపబడును.

శ్రీరస్తు.

ఇంద్రాహల్యావిలాసము సందరి

## విషయసూచిక.

పూర్వభాగము.

(122)

దేవతాప్రార్థనము.

## విషయసూచిక.



### మూడవదినము కథ.



## విషయసూచిక.





### ఉత్తరభాగము.

## విషయసూచిక.



విషయసూచిక - సంపూర్ణము.

## ప్రకటన.





శ్రీరామా - శుభమస్తు - అవిఘ్నమస్తు.

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.

# ఇంద్రాహల్యావిలాసము.

## ప్రథమదినంకథా.

### పూర్వభాగము — దేవతాప్రార్థనము.

పీఠిక.

శ్రీమన్మినాక్షీసమేతచొక్కనాథేశ్వరాయనమః.

శ్రీక్షోణీధరకార్ముక । మోక్షాధిపవాలమేటిపురనిలయ విరూపాక్షాశ్రితరక్షకమీనాక్షీప్రాణేశ చొక్కనాధగిరీశా॥

గణపతిప్రార్థనా.

క॥ విఘ్నాంధకారభానుని । విఘ్నాచలపవిని విఘ్నవిపినానలుని । విఘ్నకరిహరినిగొలిచెద । విఘ్నాహివిహంగవరుని విఘ్నేశ్వరునిన్॥

దరువు - నాట- ఆదితాళం.

గజాననాపాహిగజాననాపాహి।గజాననాపాహిగజాననా॥గ॥ భజింతుమీమృదుపదాంబుజములం।గజారిప్రియసుతగజాననా॥గ॥౧॥ ఫణీంద్రవరభూషణాతిసద్గుణ। గణార్యపోషణగజాననా ॥గ॥౨॥ ధరన్నాదుష్కృతినిరంతరముశ్రీ। కరంబుజేయుముగజాననా॥ గజా॥ ౩॥ ఉమాతనయవాలమేటినిలయా। గమాంతవిహారణ గజాననా॥ గజాననాపాహి గజాననా॥ ౪॥

(సరస్వతీప్రార్థన.)

ఉ॥ నందితకీరవాణి యెలనాగశిరోమణి। పుష్పసంయుతేం। దిందిరవేణిశంకరసతీకమలాయువతీయుతామితా। నందమృణాళిపాణికరుణారసవీక్షణివాణిశ్రీశతా। నందునిరాణినేననుదినంబుభజింతునభీష్టసిద్ధికిన్॥ ❀

(దరువు- శ్రీరాగం- ఆదితాళము.)

కమలసంభవురాణి। పులినశ్రోణి। కమనియ్యశుకవాణి గీర్వాణి- అమరకిన్నెరనరభుజంగవిహంగపుంగవసుందరీజన। సముదయార్చితమైన నీమృదుచరణములునెమ్మతినినమ్మితి॥ కమల॥ ౧॥ కురదకుట్మలరదన। సంపూర్ణరా। కేందుసన్నిభవదన। పొందుగాయీనాటకంబుపసందుగా నిఖిలావనీతల। మందుసజ్జన బృందములకానందముగ చెన్నొంద జేయుము॥ కమల॥ ౨॥ వీణాపుస్తకపాణీ। సుకవీంద్రవన్యా। ద్విమలపద్మవిహారిణీ। వేణిజితఫణివేదశాస్త్రపురాణవేత్తలటంచువిద్వ। శ్రేణియశము నుగొనుటనీకళ్యాణమగుకృపవలనగాదె॥ కమల॥ ౩॥ కనకరత్నవిభూషణీ - శ్రీవాలమే। టినగరజనపోషణి - జననీనావాంఛితముసఫలంబొనరజేయుదయాబ్ధివనినెమ్మనముననువాక్కునకాయంబునను నిన్ననయముభజించెద॥ కమల॥ ౪॥ ❀



(గౌరీస్తవము.)

శా॥ శ్రీమీనాక్షినివాలమేటినగరశ్రీచొక్కనాథేశచి। త్తామోదప్రియకారిణిన్గుణవతిన్ హర్యక్షవాహన్యుమన్। కౌమారిన్పరదేవతన్భగవతిన్కాత్యాయనినైష్ణవిన్। వేమారేనునుతింతుమత్కృతిజగద్విఖ్యాతమైభాసిలన్॥—వ॥ వెంకయ.

(వసంతభైరవి - అటతాళము.)

శ్రీరాజరాజేశ్వరి। జగదీశ్వరి. శ్రీకంఠప్రాణేశ్వరి। గౌరిహైమవతీకౌమారికాత్యాయనీ। వీరమోహినీ। శాంభవీభ్రమరాంబిక॥ శ్రీ॥ ౧॥ బగళాసజ్జనపావనీ కోకిలవాణి। పంకేరుహపాణి మృగరాజగమనిపన్నగరాజభూషణి। నిగమాంతసంచారిణీ పరదేవీ॥ శ్రీరా॥ ౨॥ భావజగురుసోదరీ। బింబాధరీ - బాలాత్రిపురసుందరీ। కైవల్యదాయినీకలుష సంహారిణీ। దైవతచూడామణీ వరకళ్యాణి॥ శ్రీరాజ॥ ౩॥ మదమరాళగామినీ। మధుకరవేణీ। మహిషాసురమర్దనీ- వదనాబ్జహసితశైవాత్మకమండల। సదమలాగాత్రిభాషా కమలాసఖి॥ శ్రీరాజ॥ ౪॥ పురహరార్ధశరీరిణీ। వాలమేటి। పుటభేదననివాసినీ- కరుణాకటాక్షవీక్షణిసాధుజననిత్య। పరిపాలినీలలితాంబశ్రీమీనాక్షి॥ శ్రీరాజ॥ ౫॥

(విష్ణుస్తుతి.)

క॥ ఉష్ణకరకోటినిభరో। చిష్ణున్ జివిషద్విరోధిజిష్ణున్ శ్రీతవర్ధిష్ణున్ నతజిష్ణుశ్రీ। విష్ణున్ ధ్యానింతుపటువివేకంబమరన్॥

(లక్ష్మీస్తవము.)

ఉ॥ క్షీరపయోధిపుత్రికినిశ్రీహరిపట్టపుదేవికిన్ లసచ్చారుసువర్ణగాత్రికిని చంద్రసహోదరికిన్ బ్రశస్తశ్యం। గారిక[illegible]భాగ్యదాయినికికల్మషహారిణికిన్సదానము। స్కారములాచరింతువరసంపదలన్మకిసంతసంబునన్॥

(బ్రహ్మప్రార్థన)

మ॥ హరినాభీకమలోద్భవున్ ద్రుహిణుహంసాశ్వున్విధాతన్ చవా। చరనిర్మాణఘనప్రవీణు నమలాంచశ్వేతపద్మాసనున్। బరమేష్ఠిన్ప్ర

రాననున్విధినిగీర్వాణమానసోనాధుని । స్వరభక్తిన్వినుతింతుమత్కవితసాంగోపాంగమైరంజిలన్॥

(హనూమత్ప్రార్థన.)

ఉ॥ మారుతపుత్రుఁ గస్సకవిమాన్యచరిత్రునిదోషజైత్రునిన్ । మేరుసమానగాత్రుని నమేయతపోవ్రతజిద్విధాత్రునిన్ । చారుప్రసన్నవక్త్రుని నిశాచరకాననవీతిహోత్రునిన్ । కోరిభజింతుగోత్రచరగోత్రపవిత్రుని రామభృత్యునిన్॥

వ॥ అని ఇష్టదేవతాభివందనంబొనరించియీప్రబంధంబురచింపననుజ్ఞ యిచ్చినసచ్చరిత్రునివంశంబభివర్ణించెద.

## కృతిపతివంశావళి

సీ॥ శ్రీమద్విరాట్పాదజాతసంభవపావనంబిలపంటకులము । యలజతుర్థకులంబునందుప్రధానమై పటిమగాంచినదిలపంటకులము । సాహసవితరణోత్సాహవిశ్వాససంభరితధీయుతమిలపంటకులము । తపనియ్యగోధనధాన్యాదికైశ్వర్య పరిపూర్ణయుతమిలపంటకులము । అట్టిపంటకులమునందు నన్నారెడ్డి । పోలిరెడ్డి సుగుణభూషణుండు । భద్రయశుడుభోగభాగ్యసంపూర్ణుడై । విస్తరిల్లెజనులుప్రస్తుతింప॥

క॥ ఘనపుణ్యాలలరిభళిధా । త్రినియన్నారెడ్డిపోలిరెడ్డికినెవ్వాకైనగారనదగినైకొనె । గుణవతినంకమ్మదనకులసతిగాగన్॥

క॥ మతిబతివ్రతసిమ్మలక్ష్మీ । సతికీభాగ్యవతిసాటిజనునంచుసుధీమతులగ్గింపజెలంగెను । హతకలుషకదంబనుకమాంబధరిత్రిన్॥

క॥ కూరిమినంకమయందు నన్నారెడ్డికులాబ్ధిపూర్ణనలినాప్తువపోలారెడ్డిగాంచెబుత్రుని । నారాయణరెడ్డినతిగుణాకరుప్రీతిన్॥

శా॥ నీతిస్సంతతసత్యవాక్యఫణితిన్దివ్యస్వభావోన్నతిన్ । భూతాంతఃకరణానురాగసుమతిన్భూమీసురార్చారతిన్ । న్ఖ్యాతింజెందినసద్గుణావళులనన్నారెడ్డినారాయణా । ఖ్యాతున్బోలినవారులేరనగవేటన్స్మించెధాత్రిస్థలిన్॥



క॥ శ్రీనారాయణుడురమా । మానినినివరించినటులమానితపుణ్యుండానారాయణరెడ్డిల । జ్ఞానాంబనుపెండ్లియయ్యెకౌతుకమొప్పన్॥

క॥ అజ్ఞానరహితమగుని । వ్యజ్ఞానంబునమనోహరార్యాచరణలన్ । ప్రజ్ఞావతులహహాయన । గాజ్ఞానమదనరేశివునికామినికైనమైగ॥

శా॥ ధారాళంబుగజ్ఞానమందుగనె । నన్నారెడ్డి నారాయణుం । డారూఢిన్కులదీపకుండు । సుగుణుండైయొప్పుశ్రీరామచంద్రారెడ్డిన్కడునీతిమంతుడగుకృష్ణారెడ్డినింబొందగా । వారుర్విస్థలిరామకృష్ణులవలెన్ స్వర్థిల్లిరత్యున్నతిన్॥

ఉ॥ శీలులుసత్యధన్యులువిశిష్టమతుల్కరుణాలయుల్సుధీ । పాలులుశాంతులుత్తములుపాపవిదారులుపుణ్యమూర్తులై । లోలవిశాలపౌరుషులులోభవిదారితులీరటంచునా । ర్యాళినుతించగాప్రబలిరన్నయుదంముడుసద్యశస్కులై॥—వ॥ వారిలోన.

క॥ శ్రీరామచంద్రునకుసరి । యారాయిగామచంద్రుడనిజనులనన । న్నారెడ్డిరామచంద్రుడు । ధారుణినుతికెక్కెసతులధార్మికుడగుచున్॥

వెండియు॥ సీ॥ గురుకటాక్షముజెంది పరతత్వమార్గంబు సరణినెరుంగుసుజ్ఞానధనుడు । పర్వవేళలధరాగీర్వాణులకుమహా దానముల్ చేసినధర్మయుతుడు । ప్రతిదినంబులమహేశ్వరరమేశ్వరులసద్భక్తినర్చించిన భాగవతుడు । సార్వకాలంబుయాచకసంఘములనెల్లవిధముల బోషించువితరణుండు । రామచంద్రార్పితంబుగారామకోటి । వ్రాసిసంతర్పణాదుల...గామ । మహోత్సవంబులనేకంబులొనరజేసి । నట్టిపుణ్యుండురామచంద్రాధిపుండు॥—వ॥ మఱియును.

గీ॥ భారతముభాగవతమురామాయణంబు । నాదిగాగలయాంధ్రకావ్యములుజదివి । బుధులవలననుతాత్పర్యవిధములరసి । రసికుడైయుండురామచంద్రప్రభుండు॥—ఇదియునుంగాక.

క॥ ధీయుండుకార్యమందతి । శూరుండువిరోధులందు సుందరులందున్ । మారుండర్థులయందను । దారుండీఘనునిసాటిధన్యులుగలరే॥

వ॥ అని తన్నెల్లజనులుగొనియాడం బ్రవర్ధమానుండై యుండి॥

ద్వి॥ ఒకనాడతండు మహోత్సాహము మర - నకలంకమతికోలు
వై చెల్వుమీర - నను బిలపించి మన్నన జేసిపొగడి - ఘనతరంబగు వేడుకను
యాంధ్రకవిత-లక్ష్మీప్రసన్న నిర్మలధరణికోటి-లక్ష్మణాఖ్యాకృ-లక్ష్మాం
బికాసు- పుత్రసుబ్రహ్మణ్యపూతచరిత్ర- ధాత్రిగౌతమిపురందర విలా
సంబు- నాపేరుసంధించి నాటకంబొకటి. యేపునరచియించి యిలవాల
మేటి- శివునకర్పణముగా జేయుమటంచు- వివరంబుగా దెల్పి వీడియంబొస
గి- ననుగొనియతులితానందాబ్ధిదేలి- పనిబూనినియతస్వభావంబు మెరసీ॥

క॥ హరునకు గురునకు శ్రీశం । కరునకు శుభకరునకు త్రికన్యాసుమ
నో । హరునకు నిర్దళితాసమ । శరునకు శ్రీవాలమేటిచంద్రధరునకున్॥

వ॥ సమర్పితంబుగా నామొనర్పంబూనిన ఇంద్రాహల్యావిలా
సంబను గేయప్రబంధంబునకు గథా విధానం బెలాటిదనినా॥

——కథాప్రారంభము.——

(భటుడువచ్చుట.)

గీ॥ సజ్జనకదంబకంబులుసంభ్రమింప । కలుషచిత్తులుభీతిచే గళవ
ళింప । సాధువాదంబు వట్టుహా యనుజెలంగ । కటికశేఖరుడొకండు కదలివచ్చె

(నాటరాగము - అటతాళము.)

కటికవాడొక డొచ్చెనూ - హాయి యెమీర॥ కటిక॥ కటికవాడొ
కడొచ్చె పటుతరమైనయా । ప్పటుబచెలంగనెల్ల కుటిలులు భీతిల్ల॥ కటిక॥ ౧॥
కాశధట్టిగట్టుకొ । బెట్టుగపిడి । కత్తిచేతను బట్టుకొ । వాసిమీరకోరమీ
సమట్లైనడె । వేసిజనులకహదాసరిఎంవగ॥ కటిక॥ ౨॥ తలవరులను
జాయుచూ భద్రఘుజాగ్ర । తని హెచ్చరిక శేయుచూ । వలనొప్పగా
మీరుకులధర్మములబాయ । వలదనిఎల్లవారలకుబోధింపుచూ॥ కటిక॥ ౩॥
నీట్లుగానుపించుచూ । ప్రభురాజ్ఞబల్ । నేర్పునవివరించుచూ । ధాటిగ శ్రీ
వాలమేటిపురీందుకీ । ర్తులనుదినముమన్మతికి దలచుచూ॥ కటికవాడొక
డొచ్చె॥ ౪॥



వ॥ ఇట్లువచ్చి రాజమార్గంబునం బోవుచు పురజనులనుద్దేశించి
భటుండిట్లనియె.

సీ॥ వివిధశాస్త్రాగమవిద్యాప్రభావులై భాసిల్లు భూసురప్రవ
రులార । ధైర్యశౌర్యౌదార్యదాక్షిణ్యచిత్తులై సిరిమించు పార్థివశ్రే
ష్ఠులార । గోరక్షవాణిజ్యకృషికార్య నిపుణులై వృద్ధిజెందిన వైశ్యవీరు
లార । దేవాగ్రజన్మభక్తివివేకయుక్తులై విలసిల్లు వరశూద్రకులజులార॥
చారుభూషణధారులైన సపరివార । సహితముగ బ్రహ్మదేవుడాస్థానమున
కు । వచ్చుచున్నాడు నేడిదె వారివారి । మేరలనుయుండుడిందు తయా
రుగాను॥ — వ॥ అనినవిని పౌరులిట్లనిరి॥

క॥ వింతగ దెల్పెదవిప్పుడు । శాంతముననో పంతముననో సభ జే
రుటవా । కాంతుండా వృత్తాంతము । సంతసమున దెల్పుమయ్య సద్భ
టవర్యా॥ — వ॥ అనినపౌరులంగాంచి విరించి భృత్యుండిట్లనియె.

క॥ నరులారా వినుడీకథ । సురుచిరముగ ధరణికోటిసుబ్రహ్మణ్యుం ।
డురుధీజనసమ్మతముగ । కరమొప్పరచించె యక్షగానముగాగన్॥

(జాతిస్వరము - ఆదితాళము.)

భళిభళిరెనరులారా । పలికెదవినుడంతముమీర । ఇలాస్థలినిమా
తనమైరా । జిలెన్వలేవింతలు సైరా॥ మెల్ భళీ॥ ౧॥ ఇంద్రాహల్యావిలా
సంబు । ఇదివినదలగును దోసంబు । సాంద్రానందాభాసంబు । సత్యజ్ఞా
నోల్లాసంబు॥ మెల్ భళీ॥ ౨॥ సందకాడనిటు జేరండీ । సందడిలేకనుకూ
ర్చొండీ । పొందుగ యీకథనువినండీ । ప్రొద్దునలేచి ండ్లకుపోండీ॥ మెల్
భళీ॥ ౩॥ శ్రీమత్కవిజనసమ్మతము రామచంద్రనామాన్వితము । వామ
దేవనామాంకితము । వాలమేటిపురిలోసతము॥ మెల్ భళీ॥ ౪॥ అని వెండియు॥

ద్వి॥ నరవరులార యీనాటకంబునకు-కరమొప్పగానాదికారణుం
డైన - జలజాతభవుడు భాషాయుక్తుడగుచు - లలిమీర స్వపరివారములు
లక్షోప - లక్షలుతన్నుగొల్వగ రాజసమున - నక్షీణకరుణాకటాక్షుడై

భేరి - కాహళాదిధ్వనులకు-కుభాంతరముల - మోహరంబుగనుమూర్మో
రయుచు(మ్రోయ- కొలువుజేయదలంచి కుతుకంబుమించి- నలువందవచు
చున్నాడట్టివార్త - తేటంబుగామీకు తెలియజేయుటకు - నీటుగావచ్చి
నేనస్మహాత్మ్మ - కూరిమిభృత్యుండగురుతరకార్య - భారనిర్వాహకప్ర
భవోన్నతుడ - రహీనియన్నారెడ్డి రామచంద్రాఖ్యు - మహనీయకరు
ణిమ్మహినుద్ధరించు - శ్రీవాలమేటిపురీశునిమదిని - భావించిపతియాజ్ఞపద్ధ
తివెలయ-గాకార్యకారణాగతచర్యలెల్ల|జోకతోదెల్పితిసుమహితస్థితిని॥

(పౌరవాక్యము.)

క॥ ఎవరినోగూడితతా । నందుడు వేంచేయుకొలువునకునంటివి
వా । రందరిలోనేచందము । జెందినవాడోయెరుంగ జెప్పగుమతుగాక॥

(భటునిమాట.)

సీ॥ శ్వేతకేతుడుజీనిజేసినబంగారు రెకలల రాయంచపకిట-నెకిట-।
పరగవసిష్ఠాదిబ్రహ్మర్షులుపనిషద్వాకులల జేయుస్తోత్యములజిక్కి-। నా
రదప్రభృతిగానప్రవీణులుబలేధాటిగాబాడుగీతములసోకిట- । చెంగట
శారదాశీతాంశుబింబాస్యచెలిమిన్నొనర్చుచర్యలకుదకిట- ॥ నలుమొగంబు
లచిరినవ్వుదళుకులొత్త । కనకగాత్రంబు రవికోటి కాంతిదెలుప । దివ్య
భూషణధారియై తేజరిల్లు । దేవుడేబ్రహ్మయనిమీరుదెలియవలయు॥

(పురజనులవాక్యము.)

క॥ మనమలరగయాదేవుని। గనుగొనుప్రాప్తంబుమాకుగలదో లే
దో । వినయంబెనయవచింపుము।వనరుహభవభృత్యవర్యవరగుణధుర్యా॥

వ॥ అనినభటుండిట్లనియె.

(మారువరాగము-ఆదితాళము.)

అందరికినిదర్శనమియ్యడు।సంక్రందనాదినందితుడజుడూ।సందియ
మొందకసకలముబ్రహ్మ । నందమయంబనితెలియనివారల॥ కందరికి॥ ౧॥
వైరాగ్యముగైకొనిఘనమగుమమకారవికారంబులరోసి। దారాపుత్రాది
కసంసారని । వారణులైతగుధీసులకుఘగా॥ కందరికి॥ ౨॥ పంచభూత

మయమైన ప్రపంచమభావంబనుభావముతెలసీ । పంచాకాశాతీతమై
ప్రకాశించునిధానముగాఁ దనివారల॥ కందరికి॥ ౨॥ ప్రాణాయామప్ర
త్యాహారధ్యానధారణాద్యష్టాంగా । నూనసమాధినిధానజ్ఞానధురీణు
లైనపరిపూర్ణులకును గా॥ కందరికిని॥ ౩॥ శీలాచారమ్మునవ్రాంతముభాల
మేటపురాలయుధునీ । మాలిమిపూజించుచుబ్రార్థింపుచు। పాలందినభక్తా
ళికి గాకిక॥ నందరికి॥ ౪॥

వ॥ ఓపౌరజనులారసకలజగత్సృష్టికర్తయగు పరమేష్ఠినవలోకించ
దలంచిన పుణ్యులగణ్యసుకృతంబులాచరించి కల్మషంబులనిర్జించి నిర్మల
చిత్తులై బాహ్యప్రపంచంబు మిథ్యారూపంబుగాదలంచి నిరుపమ నిర్వికల్ప
ల్ప నిరంజన నిష్కళంక నిత్యానందమయంబైన పరమపదం బపేక్షించి
సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యంబులను చతుర్విధంబుల నమ్మ
హానియ్యమూర్తియందాత్మానుసంధానంబుచేసి స్వయంప్రకాశుఁడై
యుండురటుగాన మీరలు సమస్తవిషయంబులందాసక్తివదలి సుజ్ఞాన
బవలంబించి తదేకనిష్ఠ ననేకవిధంబులనతనిఁ గీర్తించుచు తత్కటాక్ష
వీక్షణంబులపేక్షించుచు నిందునిలువుండందరకు నయనానందకరంబు లిం
పొందబృందారకజ్యేష్ఠుండు వచోసుందరీసమేతంబుగా సాక్షాత్కరిం
చు ననిపలికి కొలువుకూటంబు శృంగారించె నాసమయంబున॥

(బ్రహ్మదేవుని తెరలో దరువు. ఆరభిరాగము - అటతాళము.)

శ్రీరుక్మిణీలోలా గోపాలకృష్ణా । శృంగారాకారా గోపాలా॥
సత్యామనోహరగోపాలాకృష్ణా । జగదేకశూరాగోపాలా॥ ౧॥ జాం
బవతీప్రియగోపాలకృష్ణా । శాంతస్వరూపగోపాలా॥౨॥ కాళిందీహృ
దయేశగోపాలకృష్ణా । కంజాతనేత్రాగోపాలా॥ ౩॥ మిత్రవిందానంద
గోపాలకృష్ణా । స్తోత్రపవిత్రాగోపాలా॥ ౪॥ భద్రాసహాయశ్రీగోపా
లకృష్ణా । భవభయదూరాగోపాలా॥౫॥ లక్షణాధీశ్వరగోపాలకృష్ణా।
లావణ్యచరితాగోపాలా॥ ౬॥ వరసుదంతాకాంతగోపాలకృష్ణా। వార్ధి
గంభీరాగోపాలా॥ ౭॥ వాలమేటీశాప్తగోపాలకృష్ణా । వసుదేవనంద
నగోపాలా॥ శ్రీరు॥ ౮॥

ద్వి॥ వరసత్యలోక నివాసుడానంద - భరితుడచ్యుతనాభి పద్మో దయుండు - నొకనాటివేళ కాలోచితక్రియలు - సకలంకముగదీర్చి యు త్యలంకార- సహితుడై రాజహంసతురంగమెక్కి - మహిమమేపార బ్రహ్మ ర్షి దేవర్షి - రాజర్షిగణము శాస్త్రచయోపనిషద - రాజితతర్క-పురాణ మీమాంస - వేత్తలౌ విద్యావివేకులుగొలువ - సత్తరిపంచమహాయజ్ఞనిర తు - లును యోగులును సిద్ధులును సాగి మ్రొక్క - సనకాదిసజమనస్సంభవు లొక్క - దిశనొంవిధాతాయతేన మోయనగ - విశదమైబుగ్యజు[illegible] ము[illegible] - వేదమధర్వణవేదంబు తెలమి - మోదంబుమీరగామూర్తిభ [illegible]ల్లజలను రాగవలు మొగంబులను - జిలుగు వెన్నెలరీతిచిరినవ్వదన [illegible] శేషాద్యుపబ్రహ్మలోలి-నురుసృష్టి కార్యమాలోచనల్ సేయ- [illegible]వనాదోపమప్రకటితధ్వనుల - ధణధణనఖిలవాద్యములు చెలంగ- సు [illegible]గజోగ గాసువసిద్ధసాధ్య - లిరవుగానగ్గింపనింపుదీపింప - చెలగియు న్నారెడ్డి శ్రీరామచంద్రు[illegible]పాలించు వరవాలమేటి - పురిపరిపా లుడా భూతనాయకుని - [illegible] చకదుసంభ్రమమున - దిగ్దేవతలు మెచ్చదివిరివిరించి - వాగ్వనిసహాయుడై వచ్చెనట్లని వా॥

(బ్రహ్మసభ-మధ్యమావతి- ఆదితాళము.)

కమలాసంభవుడు వెడలివచ్చె। హంసవాహనుడై॥ కమ॥ విమల కనకగాత్రముశోభిల్లగ। నమరులు దివిజసుమములు గురియగను॥ కమ॥ ౧ చండకరకోటి తేజముమరగ। సాంగాధ్యాపకులదండివాగ్గుంభనములు మీ రగ। మండితముగను కమండలునిజకర। పుండరీకమున పొందుగ వెలుగ గ॥ కమ॥ ౨॥ అష్టబ్రహ్మలను గాంచిగాంచి మించుచూ। కార్యాలోచనలు స్పష్టముగను జేసుకొంచూ। ఇష్టఫలంబులనిచ్చుచు యోగి। శ్రేష్ఠులనతిసం తుష్టిగనేలెడు॥ కమ॥ ౩॥ నలుమోములందు నగవులొలుకగా। చెలువుగ పలుకు। వెలది చెంగట ముద్దుగులుకగా। వలనొప్ప శ్రీవాలమేటిపురి। నిల యుడు లరదిక్కులు తెలివందగ॥ కమలాసంభవుడ॥ ౪॥



వ॥ ఇట్లఖిలజగజ్జయజేగీయమానుండును ఆదిమధ్యాంత శూన్యుం డును అనాదినిధనుండును అవాఙ్మానసగోచరుండును పురాణపురుషుండు ను భక్తవత్సలుండును పరంజ్యోతిస్స్వరూపుండును వేదవేదాంతప్రశస్తుం డును విశ్వాతీతుండును విశ్వోత్పత్తికారకుండును స్వప్రకాశుండును సమ స్తకళ్యాణగుణగణావహుండును దేవుండును దేవదేవుండును సచ్చిదా నందమయుండును సరస్వతీమనోహరుండును సహస్రకర సహస్రతేజో విరాజమాన దివ్యమంగళ మహారజితవిగ్రహుండును నానావిధనవరత్న [illegible]స్వర్ణాభరణభూషితుండును సర్వేశ్వరుండునునైన స్వయంభువుం డు స్వసాన్నిధ్యనివసితసత్య ప్రసాదోపలబ్ధానందకందళిత [illegible] వింపులగు సేవకబృందంబులందంద మొత్తంబుగ చిత్తానుసారం[illegible] తమతమవృత్తుల మేరమీరక పరిసేవించికొలువ నిరతిశయవిభవాభిరా[illegible] ములగు లోకేశ్వరచిహ్నంబు లనేకవిధ[illegible] ప్రకాశింప నిఖిలబ్రహ్మర్షి శ్వర యోగీశ్వర మునీశ్వర యతీశ్వర కవి[illegible]గ్గణింప నప్రమేయ శుద్ధ బుద్ధ ముక్త కేవలాఖండ సచ్చిదానంద[illegible]మైన నిజాస్థానమంట పంబుదరియంజొచ్చునవసరంబున తత్[illegible] సూత్ర[illegible] కుడద్దేవుడు దివ్యప్రభావంబల్ల[illegible] కొలుకపరుపంగోరి ఫాలతలన్య స్తహస్తయుగళులై యిట్లనియె.

క॥ తూరిమి వారాన్వితమగ[illegible] వెరందరు గొలువనిటకు వచ్చినమీ। లయోగేమో పేరేమో। తీరేమో జెప్పుడయ్య తెల్పుడంగ[illegible]॥

(బ్రహ్మవాక్యము- మధ్యమావతి- ఆదితాళము.)

మీరెవ్వరనుచుబల్కెదనన్నడిగెదు? [illegible] వినరా॥ సాగాసా త్తునినాభిజలజాతమందు నే। బుట్టినవాడరా। వి[illegible]॥ మీ రెవ్వ॥ ౧॥ వలనొప్పమనె మహాప్రాజ్ఞుల[illegible]నుబ్రాయగలనేర్పు [illegible]యుం డురా। లలితసమస్థలి తులౌభాసురులకు। ఫలమిచ్చు దేవుడరా ఏగా వారి॥ మీరెవ్వ॥ ౨॥ ముదముదీపింప మమ్మూర్తులలోన నే మొదటివాడ నౌదురా। సదమలమైనట్టి సత్యలోకంబున। పాదవనేలెడువాడరా ఏ రావారి॥ మీరెవ్వ॥ ౩॥ నాసిచరాచరభూతకోట్లను సృష్టిజేసినకర్తను

శా॥ భాసురముగను ఈపలుకుల వెలదికి । ప్రాణలోలుడను రా పరావో
రీ॥ మీరెవ్వ॥ ౪॥ వరవాల మేటేందుధరు వాజ్ఞగాని వేటకు జరియించువాడ
నురా । పరికింపనా పేరు బ్రహ్మదేవుడన ప్రఖ్యాతి జెందుదురా రావో
రీ॥ మీరెవ్వరు॥ ౫॥

వ॥ అనిమరియు నిట్లనియె॥

ద్వి॥ ప్రకటితంబుగ మత్ప్రభావంబు సేదు - నికకొంత దెల్పెద నిం
పుగా వినుము - రాజసగుణము చేరంజిల్లి జగము - లోజనిర్మించి మహి
స్మృతి గాంచి - కలిమియు లేమియు కష్టంబు సుఖము - బలము దుర్బలము పా
పంబు పుణ్యంబు - రోగమారోగ్య మారూఢ దౌర్భాగ్య - భోగాది కర్మ
సంభూతానుభవిత - ఫలములాయుష్య ముద్భవకాలమరసి - వలనొప్ప
గా వారివారి నొసళ్ల - బాయక బహువిధ పద్ధతి బేర్చి - వ్రాయుచుండుదును
కేవలశక్తి మెరసి - పను వేల్పుల పెద్ద నెవ్వరు నాస - మానులు గారీశమాధ
వుల్దక - మరియు నస్మత్ప్రతిమాణాబ్ద సంఖ్య - నరుదార వివరింతు నది
మెట్టులనిన - సరసపదేమ లక్షలు రెండు పదులు - నిరునాల్గు వేలేడు లిలకృత
యుగము - చాలపండ్రెండు లక్షలు తొంబదాఱు - వేలేండ్లు త్రేతయై వెల
యు ద్వాపరము - వరలక్షలెన్మిది ర్వది నాల్గు వేలు - కర ముప్పు వత్సర క్రమ
మనబరగి - యుండు నాలుగులక్షలోనర ముప్పదియు - రెండు వేలేండ్లై
కలియుగంబుదనరు - నొక్కటిగాగ నీయుగ చతుష్కంబు - నకలంబు
గగూర్పనగు మహాయుగము - యురువడి నమ్మహాయుగసహస్రంబు - పరి
కింపనాకొక్క పగలై రహించు - నట్టి కాలంబిబ్బడైనను దనకు - దిట్టంబుగా
నొక్క దినపూర్తి యగును - మొగి నిట్టి దివసముల్ మున్నూటయర్వ - దగు
లెక్క నొకొక్క హాయనంబగును - యారయనిట్టి దివ్యాబ్దశతంబు - భూరి
తరాయుః ప్రపూర్ణత్వమమరి - విశ్వేశ్వరుండనై వేటక సత్యమున - శాశ్వ
తంబుగనందు శారదగూడి - స్నానసంధ్యాద్యనుష్ఠాన దానాంచి - తానూ
నపంచ మహాయజ్ఞములను - ననుతృప్తినొందించు నందితపుణ్య - ఘనులకు
ధర్మార్థకామ మోక్షంబు - లంద జేయుచునుందు నతులపద్ధతుల - సంజే



హా మేల విశ్వమున వాచేత - నమర కల్పనగానిదణువైన లేదు - రమణనింత
టిసమర్థతగలిగినట్టి - ననుగన్న జనకుండు నళినోదరుండు - మును కొనియ
మ్మహాత్ముని దివ్యమహిమ - మెంచ శక్యంబుగాదిల రామచంద్రు - మింపు
గా నేల్వాల మేటేందుమౌళి - మది మెచ్చ దెల్పితి మామక స్థితిని - విదితంబు
గానింక వేమాట లేల - నిదినిక్కమని నమ్మి ఇహపర సుఖము - లొదవియుం
దురు పుణ్యులో ధీరవర్యా॥—వ॥ అని పల్కి.

ఉ॥ అంచ హుమాయు సిండిగి జయావిజయాభవదిగ్వి జైభవా
యంచని మాగధుల్ బొగడ నత్యనురాగము మీర శారదా । చంచలగాత్రి
హా స్తజలజంబొక కేల డెమల్చి శ్వేతప । ద్మాంచితపీఠినిండు కొలువుండె ।
విరించి జగంబులెంచగన్॥

వ॥ ఇవ్విధంబున కొలువుదీరి భృత్యునింగాంచి ఇట్లనియె. అహావో
రి భృత్యా మద్దర్శనార్థం బింద్రాష్టదిక్పాలకులును అష్టవసువులును ఏకాద
శరుద్రులును ద్వాదశాదిత్యులును త్రయోదశ విశ్వేదేవతలును చతుర్దశమ
నువులును షోడశ మహారాజులును చిత్రసేనాది గంధర్వులును సిద్ధసాధ్య వి
ద్యాధరాది ఖేచరులును ప్రహ్లాదాది పరమభాగవతోత్తములును మొదలగు
వారీయాస్థానంబునకు వచ్చియున్నారా జెప్పరా యోరి॥

(భృత్యుని మాట)

వ॥ ఓమహానుభావా దేవర వారానతిచ్చిన వారిలో కొందరు వచ్చియు
న్నారు కొందరు వచ్చుచున్నారు, మరికొందరు రాబోచున్నారయా స్వామీ.

(బ్రహ్మవాక్యము - సౌరాష్ట్ర రాగము - జంపె తాళం.)

జ్ఞానవైరాగ్య నిష్ఠాగరిష్ఠులు నిజా । త్మానుసంధానులై యమరి
యున్నారా॥ ౧॥ ఘనపదక్రమ జటాకలితముగ నిగమములు । పసిబూని
బ్రాహ్మణులు పఠన సేయుదురా॥ ౨॥ అతిరాత్ర పౌండరీకాశ్వమేధాది స
త్త్రితు క్రతాంచిత మహామతులు ధీయుతులా॥ ౩॥ తనతండ్రి నామకీర్తన
లెల్ల భాగవత । జనులు బాడుదురే సుస్వరయుక్తి మీరా॥ ౪॥ శ్రీవాలమే
టిగౌరీవరుని చరణాబ్జ । సేవబాయక పుణ్యశీలులున్నారా॥ ౫॥

(భటునివాక్యము కైవారము - పరాకులు.)

శ్రీమదనంతకల్యాణగుణాభిరామా బహుపరాక్ । దేవదేవోత్తమా దేవతాసార్వభౌమా బహుపరాక్ । సకలసురాసురధరాసుకనిరంతర ప్రపూజితపదారవిందా బహుపరాక్ । పరమతపోజనమనోరథ ఫల ప్రదాయకా బహుపరాక్ । నిత్యాశ్రితరక్షణాక్షీణకరుణాకటాక్షవీక్షణా బహుపరాక్ । చరాచరభూతసృష్టివిధాయకా బహుపరాక్ । వేదవేదాంతవేద్యా బహుపరాక్ । శ్వేతయజ్ఞోపవీతధారణా బహుపరాక్ । శ్వేతపక్షాధిరోహణా బహుపరాక్ । శ్వేతపద్మాసనాసీనా బహుపరాక్ । సత్యలోకాధీశ్వరా బహుపరాక్ । సరస్వతీమనోహరా బహుపరాక్ । శ్రీమన్నారాయణనాభీసరోరుహసంభవా బహుపరాక్ । చతురాననా బహుపరాక్ । బహుపరాకు॥ హేదేవా లోకమందుగల పుణ్యజనంబులు తమతమకులాచారవర్తనంబు లెడపడక నిత్యసుఖంబు లనుభవించుచున్నారయా స్వామీ.

వ॥ అనినభటునిమాట లంగీకరించి శారదం గాంచి చతుర్ముఖుం డిట్లనియె.

(బ్రహ్మసరస్వతీసంవాదము.)

(శుద్ధసావేరి - అటతాళము)

వినవే కోకిలవాణీ గీర్వాణి వికసితాంబుజపాణీ । మనుకొనిముల్లోకములజోటులకు మేటి। యనదగునొక్కకన్నెను నేబుట్టించితి॥ వినవె॥ ౧॥ బహుప్రయత్నమునను దానిని నేని । ర్మహి నేర్పరించినానూ । యహహా యహల్యాయంచను పేరుబెట్టినా । నహిరాజవేణి నీకది తెలుసునే కదా॥ వినవె॥ ౨॥ ఎంతవారైనగానీ తమనేర్పుతా । రెన్నగగూడదనీ కొంతదెల్పితి కుటిలకుంతలియాబాలా । కింతవరకు మెన్నిజాడ్ల ప్రాయమాయె॥ వినవె॥ ౩॥ పేశలాంగికి కసూ వేడుకమీర। పెండ్లిజేయువలెనూ భాసిల్లువాలమేటీశుడౌ కైలాస। వాసుడు మెచ్చ కేవలమోదమెదనుంచి॥ వినవే॥ ౪॥



(సరస్వతివాక్యము.)

క॥ పతులాచరించుపనులకు। క్షితినిపతివ్రతలు సంతసించుటయరుదే। కుతుకమువనన్ను నేడీ । స్థితినడుగుట కేమినీచిత్తము స్వామీ.

(బ్రహ్మవాక్యము.)

సీ॥ మానితవిశ్వనిర్మాణప్రభావంబు వేదవేదాంతార్థవేదితంబు। మనేకుప్రౌఢులనొసల్లునవ్రాయు నేర్పును మూర్తిత్రయీకృతముఖ్యశక్తి। నిగ్రహానుగ్రహాన్వితనైపుణత్వంబు సత్యలోకనివాససౌఖ్యపదవి । లోకేశ్వరత్వమూలోలచతుర్దశ భువనపూజితముసంపూర్ణమహిమ । మచ్యుతాభవసన్మానమమలకీర్తి యాదిగాగలచిహ్నంబులమరగలిగ । జీవితేశ్వరినేప్రకాశించుటెల్ల। నహహా వెయ్యేల నీసహాయమునగాదే॥

(సరస్వతీవాక్యము.)

క॥ దేవుడవుసృష్టికర్తవు । కోవిదపూజ్యుడవు లోకగురుడవు నేనీ। సేవకురాలను నను నే। డీవిధమున గారవింపనేల మహాత్మా॥

(బ్రహ్మవాక్యము.)

ద్వి॥ ఓభద్రగజయానయో ముద్దుచాన- ఓభవ్యచారిత్రి సౌపద్మనేత్రి - ఓనీలవేణియో హేమాంజువాణి - ఓనిత్యకల్యాణియో పువ్వుబోణి ఓమధురాధరియో సుకుమారి- ఓమానినీమణియో ఘనశ్రోణి- ఓకుందరదనయో హేచంద్రవదన - ఓకలకంఠి నేడొకర యోచించి - ప్రాకటంబుగ బుట్టిబాలికామణికి- జోకతో దీపైనసుగుణాఢ్యనొకని - నలువొప్పశ్రీమదన్నారెడ్డివంశ - జలధిచంద్రుని రామచంద్రుని నేను - వరవాలమేటిశర్వాణిసహాయు- డగుదండ దెల్పవే యబ్జాయతాక్షీ॥

(సరస్వతివాక్యము - ముఖారిరాగం - ఆదితాళము.)

నీయిష్టము కొలదిజేయు ప్రాణనాథా । మీకు నేమారు జెప్పగలనే ప్రాణనాథా॥ ౧॥ పతులనుబుట్టించిగాదె ప్రాణనాథా- క్షితిని- సతులనుత్పత్తిజేసితిరి ప్రాణనాథా॥ ౨॥ ఈచిన్నపనులకీలాగు ప్రాణనాథా- ఇంతాలోచనసేయనేలను ప్రాణనాథా॥ ౩॥ నైష్ఠికబ్రహ్మచారికి ప్రాణనాథా- యాబిం- బోష్ఠినొసగి పెండ్లిసేయు ప్రాణనాథా॥ ౪॥ వాలమేటీశుడు మెచ్చ ప్రాణనాథా- సత్య-వ్రతునిను ద్దేశింపుమయ్యా ప్రాణనాథా॥ ౫॥

బ్రహ్మవాక్యము - కందార్థము.

భూచరులునుఖేచరులును । బ్రాచుర్యముగానుతింపబలికితివహో । నీచిత్తమెనాభాగ్యం। బోచిలుకలకొలికికీయ॥ లోచనా చందమును నవీన లోచనా। నాచారసునిష్ఠాచరణునకే । నాచరింతుకన్యాదానము బల్॥ రోచనా॥

(సరస్వతివాక్యము-కందార్థము.)

సూనజను లెన్నగావ్యవ । హారార్థముగాకనారులనఘగవలెనా ఈరేడుజగములందున । స్త్రీరెరుగనిదొకటిగలదే॥ మెప్పుగా- ప్రాణేశద య- యొప్పగా- గొప్పజేయమదిగోరితిబల్కెద। రెప్పుడైనమీకెదురాడు దునే॥ మెప్పుగా॥

వ॥ అనియిట్లువాణీహిరణ్యగర్భులాలోచించుచుండిరట్టియెడ॥

( బాలాహల్యకథ- అహల్యాదేవివచ్చుట. )

ఉ॥ ఆరమణీలలామదివినచ్చరకామినులిచ్చమెచ్చతో । బ్లారుమెఱుంగుచందమునకాముని పుష్పశరంబురీతిబం । గారపుబొమ్మకైవడి జగజ్జనవిభ్రమసంభ్రమాద్భుతా । కారముమీరతోడిచెలికత్తెలుగొల్వవిలాసహాసయై॥— వ॥ వచ్చెనెట్లనినా॥

(కల్యాణిరాగము-అటతాళము.)

వెడలివచ్చెనహల్యా । వివధశృంగారనైర్మల్యా । యెడనెడతన యీడుకన్నె। పడుచులువెంబడినడువ॥ వెడలి॥ ౧॥ తళుకుచెక్కులకమ్మలు తళతళుక్కునమెరయగా । జిలిబిలికులుకులచిలుక । పలుకులతేనియలొలుక॥ వెడలి॥ ౨॥ చెండ్లనుకళుకుబంగారు । గిండ్లనుబోలుపాలిండ్లు। వింధ్లనేతెమకన్బొమలు । విలసిలుజవరాండ్లుగొలువ॥వెడలి॥ ౩॥ చుక్కల రాయనికేరు । చక్కనినగుమోముసొగరు । గ్రుక్కనగనిసురలుమునులు । మిక్కిలిబాళిచేనోలయ॥వెడలి॥ ౪॥ వాలమేటీశుడౌశివుడు । వారిజాక్షుడౌకేశవుడు మాలిమిబొమ్మలకెల్ల మేలుబంతిబాలాయనగా॥ వెడలివచ్చె॥ ౫॥



వ॥ ఇట్లువచ్చినచపలనేత్రికిసూత్రధారియిట్లనియె.

గీ॥ బాలనీవర్తమానంబుభావమలర । వినదలంచిరి ఇవ్వీటివెలదులెల్ల । తెలుపుదువుగానితడవేలతెరనుదీరి । త్వరితముగరాగదమ్మకుందనపుబొమ్మ॥

వ॥ అనినవినితెరతీరిముకురవాణిపౌరభామలనవలోకించియిట్లనియె.

ద్వి॥ జలజాక్షులార నాజన్మకారణము । తెలియజెప్పెదమీకుతేటగావినుడి । కనకచేలుడువేడ్కకడుపారగన్న । వనజగర్భుడుతండ్రివాణి మాతల్లి। యన్నదమ్ములుసనకాదులత్యున్న । తోన్నతంబగుసత్యలోకంబు నెలవు । తరుణితామరచూలితననేర్పుపెంపు । గురుతుగాదెలుపంగగోరి లావణ్య । కళలెల్లగూర్చిచక్కనియుక్తిజేసి । జిలుగైనయవయవశ్రీల నమర్చి । నరసురయక్షకిన్నరసిద్ధసాధ్య। గరుడగంధర్వాదికాంతలకెల్ల। మేటివిన్నాణంబుమిరుమిట్లుగొలుప । ధాటిగానన్నుద్భవమందజేసి । వాటమౌపుత్రికావాత్సల్యమమర । బోటిరోగారబంబునబెంచినట్టి। కన్నె నన్నాడెడ్డిఘనరామచంద్రు। వన్నెమీరగబ్రోచువాణ్మేటిపురవి। హరుసాక్షిగలోకులందరునాదు।పేరహల్యయటంచుబిలుతురోయమ్మ॥

వ॥ అనివెండియునిట్లనియె॥

(శంకరాభరణము-అటతాళము.)

కన్నెనోయమ్మ లలననేను॥ కన్నె॥ కన్నెనఖిలజను లెన్నగమిన్నగ - వన్నెమీరగవాణీవరుడేసృజించిన ॥ కన్నెనోయ॥ ౧॥ తలరుబోణిపలిదానానాలోచన- తెలియుదు తెలుసుకోవలసినచిన్నారి॥కన్నెనో॥ ౨॥ ఆటలపాటల తేటలమురిపెంపు - మాటలబోటులతోటికూటమిగల్గు॥ కన్నెనోయ॥ ౩॥ వరవాలమేటిసర్వజ్ఞునిసాక్షిగ-తరుణీలలామయీపరిణపెండ్లిగాని॥ కన్నె॥ ౪॥ *

(పౌరస్త్రీలమాట - కందార్థము.)

చెలిమిని నీవిపుడీచే డెలుగొలువగ । వేటకు నెచ్చటికిబోయెదవో। తెలియగబలుకుముచిలుకల । కొలికీమోదంబుమీర - గొబ్బునా - మృదువాక్యతతుల దబ్బునా । యబ్బురమునసరిప్రబ్బుబోటులి । ట్లుబ్బిగొలువ నీవును వెడలెదవె॥ గొబ్బునా ॥

ఉ॥ కానలజూడబోయెదవా కంజసమిశ్రసరస్సులందునీ । మానసముల్లసిల్లముదమారగ। గృంకులిడంగబోయెదో పూనికచిన్నకన్నెలను। పొల్పుగగూడుకనాడబోయెదో। మానినిమాకునిప్పుడను మానముమానివచింపుమింపుగన్॥

(అహల్యావాక్యము- ముఖారి- ఆదితాళము)

కొలువూకేగెదనమ్మలారా । పొందుగ మాతండ్రీ ॥ కొలువూ॥ చెలువుగులుకనలపలుకులచిలుకల - కొలకితోడనలువలరుచునుండే ॥ కొలువూ॥౧॥ హితులుమంత్రులునిత్యాశ్రితులూ - సమస్తదురిత- హతులుసువ్రతులుభాగవతులూ- యతులతులితక్షితిపత్నులంచితధీ- మతులుగొలువరాజితుడగుశతధృతి॥ కొలు॥ ౨॥ మంగళతూర్య ఘోషణములు - విద్వజ్జనప్రసంగవేదాంతభాషణములూ - రంగుగగాయకసంగీతములుపొసంగగనింగి చెలంగిమ్రోయునజు॥ కొలువు॥ ౩॥ వైకుంఠాధీశునిసేవకులూ - శ్రీవాలమేటి- వాసునిదివ్యపాదార్చకులూ - శ్రీకరపుణ్యశ్లోకులువిమలవి - వేకులుసంభావించమించువిధి॥ కొలువు॥ ౪॥

వ ॥ అనిపలికియాచేడెలపేరుకొల్పి బాలక్రీడావినోదంబులవిహరించ నపేక్షించితనచుట్టుముట్టిబరతెంచుచిట్టిపడుచులకిట్లనియే॥

(అహల్యావాక్యము.)

ద్వి॥ రాలోకసుందరరానీలవేణి । రాలక్షణావతీరాజయలక్ష్మి। రారుక్మిణీమణీరావెభాగ్యవతి। రారంగనాయకీరాచంద్రకాంత। రావెపద్మావతీరాభద్రదంతి । రావెరత్నావతీరాహేమరేఖ । రావేవిశాలాక్షి



రాచకోరాక్షి । రావెయోకామాక్షిరావెమీనాక్షి । రావమ్మజానకీరాజయలక్ష్మి। రావెలీలావతిరావెశృంగారి । రావెబాలామణిరాభ్రమరాంబ। రావెకులుకులకుందరామందయాన। రావెకాంచనవల్లిరాకోమలాంగి। రావెయోకల్యాణిరావెకాళింది । రావెమన్మథతిలకరావెకావేరి। రావెయోపార్వతిరాకీరవాణి ! రారమ్మనమలరంగనేడీడ । జేరియన్నాగెడ్డ శ్రీరామచంద్రు । వాలాయముగనేలువాలమేటిందు । మాళినిదలచుచుమనబోటిచిట్టి । పడుచులకింపెచ్చపౌరులుమెచ్చ । తడయకనాట్లాడుదామక్కలారా ॥

( చెలికత్తెలమాట—బాలక్రీడలు. )

క ॥ సుందరియాట్లాడనుము। మ్మందరచిలిచితివిమంచిదదియెట్లువలెనో। డెందముసంభ్రమమొందగ। పొందుగవాక్రుచ్చుమమ్మవుత్తడిబొమ్మా॥

అహల్యావాక్యము- మోహనరాగము- ఆదితాళము.

ఆటలాడుదామెపువ్వుబోటులారా । మంచి, పాటలుబాడుదమేయోభామలారా। నవ్వు, మాటలాడుదామమ్మయోమగువలారా। నెర, నీటులాగుల్కుచుపరిపాటిగధాటిగపూచెం॥ట్లాట॥౧॥ చందనగంధినీలోకసుందరితోడనువిద్యా। మందునటులజేయరేయోయమ్మలారా। బల్వ, సందుగనుద్దీర్చరెచానలారా అందు । కొందరిందుకొందరుండరేకొమ్మలారా। కమ్మగందవడులానెదురుకోవలందుచుసందడిమీర॥ఆట॥ ౨॥ రంగనుసమర్తబెట్టి రంగుగచిమ్మిరిదారికిక। యంగనలకుపంచిపెట్టిరెయకరలారా। మేల్జె, లంగపేరంటాండ్రుబిల్వరేలలవాలారా। చెంగు, చెంగువగాబ్బేడరేయోచేడెలారా। జయ, మంగళముగశోభనముప్పొంగుచుపొసంగజేసి॥ఆట॥౩॥పల్లవపాణికివాడపిల్లబుట్టినట్లుతోట్ల। నల్లపైడిబొమ్మనుంచరెయతివలారా, పిల్లతల్లులపురుడుదీర్చరెతరుణులారా। వారి, నెల్లవారూరడించరెయింతులారా। నేము, మొల్లముగదానిపేరుమోహనాంగియనుచుబిలచీ॥యాట॥౪॥ మేరమీరకనువాలమేటిపట్టణేశునివే। మారువిరులపూజించరెమగువలారా। యూప, చారములర్పించరెయోసఖియలారా। కొర్కె, దీరగప్రార్థించరమ్మతెరవలారా। వేట్క, పౌరకాంతలుగీర్తించబాలికామణులుమోదించ॥ నాటలాడుదామే॥— వెంకటీయు॥

క॥ నిబ్బరమున నెవనుబ్బుచు। బిబ్బోకవతులు జెలంగ పెంపుగ జూడన్। దబ్బున నంబరమిత్తరి। గొబ్బే డువమక్కలార కోరి కెలలరన్॥

సీ॥ వైలుకీల్జెడపైనివముసగా జుట్టినమల్లెపూదండలు పెల్లుగులుక। పచ్చరాపచ్చలబటువు పాపటబొట్టునిటలస్థలంబుననటనమాడ। కెంపుజంపు ఱసుబూకీల్ కమ్మగొలుసులు తళ్ళుచెక్కులయందు జెళ్ళుజూప। కాంచననవరత్నఖచితహారావళుల్గళముననట్టిట్టుగదలిచెదర। కరయుగంబునకంకణక్వాణనమెసగ। కాళ్లగందెలుగజ్జలుఘల్లుమనగ। నందమగురొత్తగానహల్యావధూటి। కోమలాంగులతో గూడిగొబ్బియాడె॥

(గొబ్బిపాట.)

గొబ్బియాళ్ళో। గొబ్బియనిపాడరమ్మ కోమలాంగులారా॥ గొబ్బి॥ కైలాసవాసుడుదివ్యకారుడుబహుశూరుడే॥ గొబ్బి॥ పార్వతీప్రాణేశ్వరుడు పన్నగభూషణుడే॥ గొబ్బి॥ వృషభవాహునకునిత్యోత్సవసమయమే॥ గొబ్బి॥ స్వామినీజూతమురారే చంద్రవదనలారా॥ గొబ్బి॥ సంపెంగనూనెతలలంటి జలకమాడారమ్మ॥ గొబ్బి॥ మల్లెమొగ్గలచీరెలు మెల్లగధరించరే॥ గొబ్బి॥ జవ్వనులారా తొడగరే గవ్వకుట్టిరవికెలు॥ గొబ్బి॥ పంకజాక్షులారా నుదుటకుంకుమబొట్టిడరే॥ గొబ్బి॥ తేటమైనకన్నుగవలకాటుకదిద్దరే॥ గొబ్బి॥ ఘమ్మనపరిమళించు శ్రీగంధమలదరమ్మ॥ గొబ్బి॥ కురులుదువ్విగొప్పకొంగకొప్పులొప్పబెట్టరే॥ గొబ్బి॥ మల్లెమొల్ల విరజాజి పూసల తెవండలుజుట్టరే॥ గొబ్బి॥ మెరుగుబంగారు సొమ్ములు మెయినిండ ధరించరే॥ గొబ్బి॥ అపరంజిరతనాయత మంగళహారతులు చేబూనరే॥ గొబ్బి॥ కలహంసగమనములమీరుఘల్లుఘల్లున వెడలరే॥ గొబ్బి॥ వాలమేటిశివునిపూజాద్వారమందు జేరరే॥ గొబ్బి॥ ఆటలపాటలపరమాత్ముని సేవించరే। గొబ్బి॥ మీనాక్షీసమేతుడు కామితఫలదాయుడే॥ గొబ్బి॥ చొక్కసాధునినమ్మినదకు ముక్తిలభించును॥ గొబ్బి॥ వ॥ అనిమరియు నిట్లనియె.

(బిల్హరిరాగము - అటతాళము.)

చెలియ బొమ్మల పెండ్లి చేయుదామా। అలబంతిపూబంతులాడుదామా। పాలుపైనయందముబూనుదామా। చెలిమిబాయక కలయమెల



గుదువలయు తావుల జేరవలగోని॥ చెలియ॥౧॥ మొల్లమాయుద్యానమునకేగుదామా। కొల్లగమల్లెలుకోసి తెత్తామా। చలువపొందరిండ్లసౌరుజూతామా। మెల్లగామనమెల్లగుజ్జనగూళ్ళువండుక మెక్కుదామా॥ చెలియ॥౨॥ కీరవారంబులగెలిచేతామా। చేరి కోవెలలతో చెర్చించుదామా। సారంగములగుంపుచదరతీతామా। నీరజాకరములనుబడలికదీర క్రీడలుసల్పుదామా॥ చెలియ॥౩॥ చాలగగౌరీపూజలుసల్పుదామా। మేలైనపాటలిమ్ముబాడుదామా। కేలుదమ్ములమోడ్చికీర్తించుదామా। వాలమేటివిహారునకు ముత్యాలహారతులెత్తుదామా॥ చెలియ॥ ౪॥

(చెలులమాట.)

ద్వి॥ పుండరీకదళాక్షిపురనారులెల్ల। నిండినప్రేమతో నెలతనీవెంట బోదొమవనిననుప్పొంగివారలకు। మాయయ్యసభకు నెమ్మదిబోదు మనుచు। బలికితివిప్పుడాపద్ధతిమరచి। యెలమిగ్రీడించుటలిదిబేలతనము। విరివిగానటకేగివేడుకలరసి। మరలివచ్చెడివేళమనకోరికలొలది। నాటలాడుదమహల్యామణీవాల। మేటిపురీశుడౌమునినాంబికాఖ్య। దీశునెమ్మనమువాగీశుసన్నిధికి। వాసిగావేగబోవలెపదవమ్మా॥

(అహల్యావాక్యము.)

క॥ అవునమ్మ మీరుచెప్పిన। సవరణగలమాటమదికిసమ్మతమయ్యెన్। భువనేశునిసముఖమునకు। ప్రవిమలముగపోదమింక పదరోయమ్మా॥

(కాంబోదిరాగము - ఆదితాళము.)

రాకేందువదనాలారా రారే పోదము నేడు। శ్రీకరకారుడైగంజిల్లునాతండ్రికడకూ॥ రాకే॥౧॥ సదహంసయానలయి దిమంచి సమయమే। యవహా, సదమలముగభాషాసహితుడై యున్నాడట॥ రాకే॥౨॥ పుత్రీరత్నమునుచుపిలచి బుజ్జగించునే। కనక, గాత్రీసద్గుణములింపుగా బోధించునే॥ రాకే॥౩॥ ననుజూచినంత తానానందమందునే। నెనరు, ననుకన్నతాయములుతినసొసంగునే॥ రాకే॥౪॥ వని తాశ్రీవాలమేటీశునిదలంచుచు। వినయ, మెనయఘనముగ చతురాననుకొల్వుకూటమునకు॥ రాకేందు॥ ౫॥

వ॥ అనిమహాల్లాసంబున.

(అహల్య—బ్రహ్మసభకువచ్చుట)

సీ॥ తననెమ్మొగంబుసుందరకాంతి సంపూర్ణ రాకాసుధాంశుని రాకరించ । తనవాలుచూపులతళ్కులురతిమనోహరుని కేతనములనపహసించ । తనతనూవిలసనత్వమ్ము సౌదామినీలతికల ధాళధళ్యముగ్రసించ । తనయానమై ఖరిదలకొని భారతీపతివాహనంబులపరిభవించ । తనమృదూక్తులకీరబృందముగలంచ । తనశుభాకారమఖిలమోహనతమునుంచ । తీవిదళుకొత్తశ్రీయహల్యావధూటి । కొమ్మలనుగూడితొలి వేల్పుకొలువుజొచ్చె॥

వ॥ ఇవ్విధమ్మున సభామంటపంబు ప్రవేశించి॥

(శంకరాభరణము - అటతాళము.)

వచ్చెనహల్యా బ్రహ్మనుజేరా॥ వచ్చె॥ వచ్చెనుముచ్చట, తెచ్చగ నచ్చపు పచ్చలుచెక్కినబలుహారములు మెరయా॥ వచ్చె॥ ౧॥ డంబుచనట్టుకరికుంభయుగంబుగనొప్పగ। కంబుకంధరినాసికంబుతిలప్రసూ। నంబు పూర్ణేందుబింబంబుముఖంబన॥ వచ్చె॥ ౨॥ నెఱులునీలాలుచెక్కిళ్లెన్న నిలువుటద్దాలు। అరవిందపత్రసుందరనేత్రయుగముకే। సరిమధ్యస్థలముచంచలగాత్రమింపొంద॥ వచ్చె॥ ౩॥ వెన్నెలబోలు లేనవ్వువాల్గన్నులుమీలు । తిన్ననినడలరటిగున్నలుతొడలుమేల్ । వన్నెలుచిన్నెలెన్నెన్నొ చెన్నొందగ॥ వచ్చె॥ ౪॥ గురుభక్తిమించీవాలమేటీ। శ్వరుందలంచీగరుడగంధర్వకిన్నెర నరసురవియ । చ్చర సిద్ధసాధ్యసుందరులందరరుదంద॥ వచ్చెనహల్యా॥ ౫॥

వ॥ ఇట్లరుగుదెంచివిరించినవలోకించికరంబులుముకుళించి యహల్యాదేవియిట్లనియె॥

సీ॥ నిఖిలభూతవ్రాతనిర్మితవిజ్ఞాతసద్గుణవిఖ్యాతశరణుశరణు। ప్రణవనాదవినోదభవబంధవిచ్ఛేద। భరితనిత్యాహ్లాదశరణుశరణు। తప్తకాంచనదేహ దారితాఖిలమోహ చక్రాంగపతివాహశరణుశరణు। స్మరసహస్రాకారమణిమయాంచితహార । వరయోగిమందారశరణుశరణు। సతతకృష్ణాసాంద్రవాగీంద్రశరణుశరణు। సత్యలోకనికేతనాశరణుశరణు। చంద్రసంకాశచతురాస్యశరణుశరణు। పరమపురుషశతానందశరణుశరణు॥



వ॥ అనిమ్రొక్కినచక్కరబొమ్మకకమలగర్భుండిట్లనియె॥

రేగుప్తిరాగము- ఆదితాళము.

వర్ధిల్లువర్ధిల్లుమమ్మా యోముద్దుగుమ్మా॥ వర్ధిల్లు॥ సార్థకమగుసంసారసుఖంబులనర్థులబ్రోచుచుదుర్ధరమతివై॥ వ॥ ౧॥ కోరినకోరికలెల్లనుకొదువలేకన। వారిగాసుల్లపిల్లను సారాచారవిశారదపుణ్యా। దారపరువకర్ధాంగలక్ష్మివై॥ వర్ధిల్లు॥ ౨॥ ప్రతిలేనిసుందరాకృతి నత్యంతమోహా। గతియైనధర్మపద్ధతి। సతతమువరపతివ్రతతతులతులిత । గతినుతించనెమ్మతిమెలసి॥ వర్ధిల్లు॥ ౩॥ యేలోపామును లేనీ నిర్మలకీర్తి। మేలుమీఱగబూనీ। వాలాయముశ్రీవాలమేటిపురి । పాలునిక్కపనోబాలికామణీ॥ వర్ధిల్లు॥ ౪॥

మ॥ అనిదీవించికరాంబుజద్వయమునహల్యాబాలికన్గ్రుచ్చియెత్తిని జాంకంబుంజేర్చి ముద్దుగొనిపూర్ణిమఘ్రాణముంజేసి హెచ్చినకూర్మిన్ । చుబుకంబునుంబుడికి యాచిన్నారిమోముపైకన్ । గొనివాణీరమణుండు బల్కెకరుణాకూపారుడై చెచ్చెరన్॥

(ముఖారిరాగము- జుల్వతాళము.)

కన్నెనీవుకోరినకోరికలన్నిదీర్తునోయమ్మా, చిన్ని॥ కన్నెనీవు॥ పన్నగవేణీపరభృతవాణీపంకజసన్నిభపాణీ। సద్గుణోన్నతపరమకల్యాణి, సైకతశ్రోణీ॥ కన్నె॥ ౧॥ మిన్నగభూచరఖేచరులెన్నగనిన్నుబుట్టించితినమ్మా। పలుకులుకన్నెలాడిమీయమ్మా, నేతండ్రినమ్మా॥ కన్నె॥ ౨॥ నిన్నుసృష్టించినందునునాదుబలునేర్పుకన్నెవాసికెక్కెబాలా। నా, వాంఛలీడేరనేచాలా, సందేహమేల॥ కన్నె॥ ౩॥ మేలుగశ్రీవాలమేటిపట్టణమేలునీలగ్రీవుడుసంభ్రమింప। తోడి, బాలికామణులామోదింప, మేలుల్లసింప॥ కన్నె॥ ౪॥

వ॥ అనియివ్విధంబునహంసగమనుండహల్యనుగారవించుచుండెనటస్వర్గలోకంబునా॥

(దేవేంద్రునికథ—కొలువుకూటమునకువచ్చుట.)

ద్వి॥ మహితత్రిలోకసాంబ్రాజ్యప్రధాన - సహితమైసజ్జనాశ్రయమైవిలాస బహుళమైవైభవాస్పదమైప్రశస్త - రహిమించుశ్రీయమరా

వతీపురము- నందొక్కనాడుదయమున మేల్కాంచి - పొందుకార్యంబులొప్ప
గజేయనెంచి-పన్నీటస్నానంబు బాగుగా గాంచి-పన్నెగల్గినజరీవస్త్రముల్
గట్టి- తిలకంబుచక్కగాదిద్ది శ్రీగంధ - మలదిదివ్యాన్నమింపార భుజించి-కన
కకిరీటంబుకల్కితురాయి-ఘనభుజకీర్తులు కర్ణకుండలము- లనుపమనవరత్న
హారంబులెల్ల- దినకరకుముదాప్తదీప్తులై మెరయ - ధరియించిమించుసుం
దరములుజింద- కరములవేతముల్ గైకొనివీర- భటులుముందుగ బరాబరు
లాచరింప-కుటిలులదరశతకోటిచేపట్టి- మెచ్చుగామాతలిమేజ్జీ చేసి- తెచ్చి
న తెలివన్నె తేజిపైనెక్కి-రమణులుపింజామరంబులువీవ-కొమరైనముత్యా
లగొడుగులనీడ- హితులాశ్రితులుపురోహితులుసామంత - తతులుభూప
తులుపద్ధతిని సేవించ-జ్వలనాంతకాశరశరధీశపవన - జ్వలనాక్షసఖులుచె
చ్చెరవెంటనడువ- చాయకభూసురుల్ ప్రబలిదీవింప- గాయకోత్తములు
పొంకంబుగాబాడ- రంభాతిలోత్తమోర్వశిమేనకాది - బంభరకచలుసం
భ్రమముగానాడ-గరుడకింపురుషాహిగంధర్వయక్షు - సురసిద్ధసాధ్యులె
చ్చుగతన్నుగొలువ- వందిమాగధులు కైవారంబుశేయ - నందందనిఖిలవా
ద్యంబులు మ్రోయ-క్షితినియన్నారెడ్డి శ్రీరామచంద్రు- నతిప్రేమబాలించు
నట్టివాల్మేటి- హరునుతించుచుసుధర్మాస్థానమునకు - విరివిగాసురరా
జువెంచేసెనపుడు॥

(నాటరాగము - త్రిపుటతాళము.)

అమరవిభుడరుదెంచెను॥సభ॥ కమితవిభవముమించను అమలకీర్తి
గంతరాళముల౦దునిండి వెలుంగగా॥నమర॥౧॥ ధాటిగామణిమయవిభూ
షణ। తతులురంబున మెరయశిరముల కోటిసూర్యుని కాంతిదనరుకి। రీటము
మరధరించుకా॥నమర॥౨॥కరయుగంబులకంకణశ్రేణి। కారరవముజెలంగకి
న్నర। తరుణులిరుగెలకులనుపింజా। మరలువీవగ రీవిగా॥నమర॥౩॥ పండితు
లుదీవించవేల్పు। తండములునలుగడలగొలువగ । దండిదైత్యులగుండెలగ
ల ప్రచండరాజసమొప్పగా॥నమర॥౪॥వందిమాగధబృందముగికై। వారము
లుసేయంగ డెందము। నందుశ్రీమన్వాలమేటిపు। రీందుమాళిని దలచుచు॥
నమ॥ ౫॥



వ॥ఇట్లువచ్చి మీరెవరనియడిగిన సూత్రధారికి సూత్రాముండిట్లనియె.

ద్వి॥ విలసిల్లునాదుసవిస్తారమెల్ల - తెలియజెప్పెదనేడు తేటగా
వినుము - పావనుండగుకశ్యపప్రజాపతికి - దేవీయుగంబందుదితి సిద్ధ
దసుర - జననిరెండవదినిర్జరమాతయదితి - యనుపుణ్యసాధ్విదానంద
రుచుండు - నామహాదేవిగర్భాబ్ధిని పూర్ణ - సోమునిగతినగ్రసుతుడనై బు
ట్టి - బాగుమీరగశచీభామనుదేవి - గాగొని త్రైలోక్యఘనరాజ్యపదవి
కనువొందనధికారినై శతాధ్వరము - లొనరించిసత్యాత్ములొనరించుయ
జ్ఞ - ములను హావిర్భాగములు ప్రీతిగొనుచు - దొలగకవారికతుల్యభోగము
లు - వరదుడనైయిచ్చి వజ్రాయుధమున - పరులనిగ్గించి ప్రాభవశక్తిమిం
చి - పాటింపనష్టదిక్పాలురలోన - మేటినై ప్రాగ్దిశన్మేలుగానిలచి - గు
రినిముప్పదిమూడుకోట్లు దేవతలు - కరమర్థిసేవించగాఘనఖ్యాతి - జెం
దియన్నారెడ్డిశ్రీరామచంద్రు-నందంబుగాగాచునట్టివాల్మేటి-శ్రీవామదేవు
నంచితకృపచే మెలగు- దేవేంద్రుడనినన్ను తెలియరాయోరీ॥ వ॥అని పలికి-

సీ॥ స్వస్తిరస్తైశ్వర్యమస్తుజయోస్తని చెలరేగివిప్రులాశీర్వదింప।
లాజాక్షతంబులుల్లాసంబుననుపుణ్య సతులు సేసలుజల్లి సంభ్రమింప। ఘన
వస్తునిచయంబు కానుకలుగొనితెచ్చి వరుసగానిడిధరావరులుమ్రొక్క। బి
రుదాంకితంబులు బెట్టుగానంకించి మాగధజనులువేమారుబొగడ। నొన
రిధనముండు కైదండయొసగ తెల్ల। తేజినటుడిగ్గి రవికోటితేజమమర। దై
త్యులడలంగనిర్జరతతిచెలంగ। నింద్రుకొలువుండెనెలమినాఖండలుండు॥

(మధ్యమావతిరాగము-ఆదితాళము.)

కొలువుజేసెనుస్వర్గాధిపుడుశృంగారమైన॥కొలువు॥౧॥ కలగిచెలగి
విచ్చలవిడి వేల్పులుజలజలపువ్వులజల్లులుగురియగ॥ కొలువు ॥౨॥ కుటిలుల
దరపటుభటతండముని స్ఫుటమతినతిబాహాటమునగొలువగ॥ కొలువు॥ ౩॥
ధణధణభేరీధ్వనులుజెలంగగ। మణిమయచింతామణిపీఠంబున॥కొలువు॥ ౪॥
మాలిమితో శ్రీవాలమేటిపురిపాలుడైనశశిమౌళినిదలచుచు॥ కొలువు॥ ౫॥

వ॥ ఇట్లుకొలువుండిభృత్యునిం గాంచిఇట్లనియె.

సీ॥ స్నానసంధ్యాద్యనుష్ఠానాదిషట్కర్మ విధిదప్పకుండు రే విప్రఘనులు। శిష్టరక్షణదుష్టశిక్షణాదిక కార్యవర్తులై యుందు రే వసుధపతులు। వరకృషిగోరక్షవాణిజ్యనిపుణత్వవైఖరినుందు రే వైశ్యవరులు। భూసురసేవ విశ్వాసవివేకాది సుగుణులై యుందు రే శూద్రజనులు। మరియుదక్కిన వారలేమార కెపుడు। వారివారికులాచారవర్తనలను। జాయకుందు రే మత్పరిపాలితత్రి। లోకములయందు భటవరా నాకు జెపుమా॥

వ॥ ఇదియునుంగాక సత్యవ్రతులును సద్వ్రతాచరితులును సర్వభూతదయాపరులును నిత్యాన్నదాతలును నిఖలపురాణపారాయణులును జపతపస్స్వాధ్యాయపరులును గోభూహిరణ్యాగ్రహారాశ్వచ్ఛత్రగజరజితకాంస్యాంశుకాభరణ గంధపుష్పతాంబూలాద్యనేకదానానూనవివేకులగుసుశ్లోకులును అగ్నిష్టోమాతిరాత్రసౌత్రామణివైశ్య దేవాధానవాజిపేయరాజసూయాశ్వమేధపౌండరీకాది యజ్ఞంబులొనరించిన విజ్ఞానులును పుణ్యతీర్థావగాహనంబు జేశినధన్యులును పుణ్యస్థలసంచారంబుగావించినపావనులును తక్కినపెక్కుసుకృతంబులార్జించిన మహాత్మలీలోకంబునకరుదెంచి హరిహరాజప్రసాదితాస్మచ్ఛాసనానుసారంబగు తీరునతీరనివేడుకలరంభాసంభోగాదితత్ఫలభోగంబులనుభవించుచునంతతానందకందళితహృదయారవిందులై యుందురుగదా తేటపడం దెల్పరా యోరిసుమతీ॥ (భటునిమాట)

గీ॥ సర్వసత్క్రియలందునసర్వజనులు। సర్వసమబుద్ధిదగిసత్యసంధులగుచు। స్వకులపద్ధతులెడపకసమ్మదమున। నున్నవారెల్లసౌఖ్యంబులొంది దేవా॥—ఇదియునుంగాక.

క॥ యేయేపుణ్యములేయే। శ్రేయుతులొనరించివాసి జెందిరొధరవా। రాయాఫలభోగంబులు। శ్రేయంబుననొందియుందు జెలగుదురధిపా॥

ఇంద్రవాక్యము. వ॥ ఓరిప్రధానసేవకా మంచిదిగాని నీవరిగి మద్గురువరుండగుబృహస్పతి నతిత్వరితంబుగబిలిచికొనిరారాయోరీ॥



(బృహస్పతివచ్చుట)

క॥ అనిపల్కినవాడింద్రాజ్ఞనుగొనిచనిత్రిదశగురునిగనియయ్యాఖ। మ్మనువుగబిలుమనినను బం। చెనుజిష్ణుదురమ్మురమ్మశీఘ్రంబటకున్॥

వ॥ అనిబిలచిన విబుధాచార్యుండు వెడలెనెట్లనినా॥

(బృహస్పతివచ్చుట.)

(మధ్యమావతిరాగము - అటతాళము.)

వరబృహస్పతివెడలివచ్చెనూ- దేవ। వరుకొల్వుకూటముజొచ్చెనూ। వెనువెంటశిష్యులుపెంపుగా-నాల్గు। వేదంబులమరపఠింపగా॥ ౧॥ కంఠమాలికెలుమేనొరయగా- నీరు। కావివస్త్రంబులుమెరయగా॥ ౨॥ ఘనులెల్లతనుగాంచిమించుగా-కనక। గర్భుడోయనుచుయోచించగా॥ ౩॥ ప్రముఖులవారలనుదీవించుచూ-వారి। కెకుకవనీతిబోధించుచూ॥ ౪॥ ధరవాలమేటికేనెంచుచూ-నట్టి। తనలోనతానానందించుచూ॥ వరబృహ॥

వ॥ ఇట్లరుదెంచిన గురువరునకెదురరిగి పూజించి దోడ్తెచ్చి యుచితాసనాసీనుంగావించి కరంబులుముకుళించి సంక్రందనుండిట్లనియె॥

గీ॥ వేదశాస్త్రవిచక్షణ విమలహృదయ। సత్యకార్యధురంధర శాంతసుగుణ। భక్తినర్పింతుమీపాదపద్మములకు। గొనుమువేవేలదండములు గురువరేణ్యా॥

వ॥ అనినమస్కరించిన పురుహూతునకు బృహస్పతియిట్లనియె.

గీ॥ ఆయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి। సకలసామ్రాజ్యలక్ష్మిప్రసన్నవృద్ధి। ధనకనకవస్తువుల గేహతతిసమృద్ధి। బడసివర్ధిల్లుమోశచీప్రాణనాథా॥ (ఇంద్రునిమాట)

క॥ మాలిమికరుణాలోకన। జాలంబులశిష్యజనుల సకలాఘంబుల్। మాలించినిర్మలులగురు। లోలిన్గావింతురతిమనోజ్ఞస్థితులన్॥

కావున—క॥ మేలుగమాకెయ్యెడమీ। యాలోచన కొలదినడచుటర్హంబుగదా। కాలోచితకృత్యములిపు। డేలాగునజరుపవలెనొ యెరిగింపుతగన్॥

గురు-ద్వి॥ సురరాజవినుధర్మసూక్ష్మవర్తనలు- పరికింపగాబహు భంగులైయుండు - నీవవియెరుంగవే నేజెప్ప నేల - నేవేళ కేపనులేటు జేయవలెనో - యెరిగియుందుప్రమాద మెనయకపూని - గురువుదైవము గొప్పకొంచెంబుల నెడు- తారతమ్యములుపద్ధతీనేర్పరించి - వాఢిక వర్తింపవలెన దెట్లనినా॥

సీ॥ కొందరుకొందరిగురువులైయుండురు గురులకుకొందరు గురువులగుదు । రరయశిష్యులుకొందరగుదురాశిష్యుల శిష్యులై కొందరు చెలగియుందు । రధిపులు కొందరికగుదురయ్యధిపుల కునుకొందరధికులైఘనత గాంతు । రాశ్రితుల్కొందరయ్యాశ్రితులకుకొంద రాశ్రితులైయుందురట్లుగాన । ప్రభుడవీవుర్విపాలదిక్పాలకులకు । నీకధీశుడుగాడె వాణీవరుండు । నమ్మహామహుధర్మనార్థమ్మునెమ్మి । నరగసముయమ్మ జనిరమ్ము మమరనాధా॥

వ॥ అనినవాచస్పతివాక్యంబు లాకర్ణించి వాస్తోష్పతి యొకభృత్యుంజీరి ఇట్లనియె॥

క॥ వినరాయోరిభటోత్తమ । పనిగొని నేడబ్జభవునిపట్టణమునకున్ । జనవలెబ్రశస్తవస్తువు । లనువుగగొని తెమ్ముకానకాలజునకొసంగన్॥

వ॥ అనిపలికితత్క్షణంబ-



(ఇంద్రుండు బ్రహ్మపురికరుగుట)

సీ॥ శ్రీశర్వభర్గాభ్రకేశశంభోయంచు పూజలొనర్చినపుణ్యమత్తులు । రామగోవిందహరేముకుందాయని భక్తిగీర్తించినభాగవతులు । బ్రహ్మార్పణంబుగాబలిషోడశమహా దానముల్జేసిన ధర్మయుతులు । నిరతంబుపితృమాతృగురుపూజనాసక్త కలితాంతరంగులౌ కలుషహతులు । ఘోరరణరంగమృతులుపకారరతులు । సోమయాజులయాచకులాన్నదులయ । హింసకులుసర్వసములార్యహితసుకృతులు । వెంటరాబ్రహ్మపురికేగెవిబుధవరుడూ॥



(నాదనామక్రియ - అటతాళము.)

వెడలెను దేవేంద్రుడపుడు॥ వెడ॥ వెడలేపుడమిజలింపగాకడు । వత్తినివిధిసన్నిధికిముదమ్మున॥ వెడ॥ ౧॥ విరివిగాదుందుభులూ మ్రోయా- వేశ్యలూ నాట్యంబు శేయాసురగరుడకింపురుషకిన్నర । ఖర్పులువిద్యాధరులుగొలువగ॥ వెడ॥ ౨॥ కాంచనహారము లెల్లాకంధర । మునరాజిల్లా పంచశరశతసుందరాకృతిమించనంచితవైభవంబున॥ వెడ॥ ౩॥ పురజను లెల్లహ్లాదింప భూసురులాశీర్వదింపా । పరులకునుమిత్రులకుభయసంభ్రమములొందెడు బిరుదులమరగ॥ వెడ॥ ౪॥ కరమ్ములుగీలించీఘించీ - గురుతరభావముగాంచీ । పరమభక్తినివాలమేటీ । శ్వరునిముమ్మాటికిదలంచుచు॥ వెడ॥ ౫॥

వ॥ ఇట్లుగదలి మహర్లోక జనోలోక తపోలోకంబు లతిక్రమించి సత్యలోకంబు బ్రవేశించి బ్రహ్మపదంబుజేరి సభామంటపంబు దరియంజొచ్చి యుండూ॥

సీ॥ గర్గభార్గవకుత్సకపిలమార్కండేయు - లొకవైపు దేసనచ్చరికలు దెలుప । నారదసనకసనందనాత్రివసిష్ఠు - లొకవైపు కడతలలొగ్గిమ్రొక్క । వ్యాసదూర్వాసపరాశరశుకభృగు- లొకవైపు దీవనకేల్మోడ్చిపొగడ । కాశ్యపాపస్తంబకణ్వకుత్సాగస్త్యు- లొకవైపు దిశవేద మెంగిబఠింప । వారికెల్ల బ్రసన్నుడై వాణితోడి- రంబుగాగూడిమికిలి రాజసమున । నొనర తెలిదమ్మిగద్దెపైనున్నధార - తీశ్వరునిగాంచె విబుధలోకేశ్వరుండూ॥

వ॥ ఇట్లుగాంచికృతాంజలియై పాకశాసనుండు పంకజాసనున కిట్లనియె.

(సంవాదము-భైరవిరాగము-ఝంపతాళము.)

దండము శ్రీభారతీశ్వరా ధర్మప్రచార॥ దండము॥ పండితగుతెనిమ్ము దుపద పుండరీకంబులకునిందుభక్తినొనర్తు॥ దండము॥ బ్రహ్మవాక్యము॥ శుభము శుభము శ్రీశచీశ్వరా సువిహితవిచార॥ శుభము॥ అభయుడవైయ

నవరతము త్రిభువనంబులయందువిభవమునచెన్నొందు॥ శుభము॥ ఇంద్రప్రముఖభక్తులను సుఖంబుగా పాలించెదు ॥ దంపతులను నయనోత్సవంబుగా గురిమీరగ గాంచినాడు దురితపుంజముబాసి నిరతపుణ్యులనై॥ దం॥ బ్ర॥ అనఘులకెందెండులనైనా మేల్గాకలోప మమ్మునెయోచించిచూచినా॥ ఘనముగ శ్రీపాలమేటి మనసిజాంతకుని నెమ్మదినమ్మునీకెవ్వరు॥ శుభము॥

(ఇంద్రునివాక్యము-బ్రహ్మదేవునినుతించుట.)

సీ ॥ భాస్వరహేమాంగపరిపంథిగణభంగ హంసతురంగదయాంతరంగ। గురుతరగ్రహరాజకోటిసన్నిభతేజ భక్తసమాజకల్పకమహీజ। యార్యసన్నుతపాత్ర హైర్యహాటకగోత్ర జలరుహాయతనేత్రసచ్చరిత్ర। సనకాదికసమస్తమునిజనాభయహస్త కలుషవిధ్వస్తలోకప్రశస్త। సరసదరహాసమహితచంచద్విలాస। విశ్వవిశ్రాణగీర్వాణవినుతచరణ। శ్వేతపద్మాసనాసీనకృతినిధాన। భవ్యగుణజాలశారదాప్రాణలోల॥—ఓ దేవా.

చ ॥ అనుపమసుస్వరూపశరణాగతవత్సలభక్తలోకపా। వనకరుణాకటాక్షబుధవందితపాదపయోజశ్రీజనా। ఘనఘననాభిపద్మభవధర్మవివర్ధనరాణ్మరాళవా। హానిగమప్రచారచతురాననసర్వజగజ్జనావనా॥ హేమహానుభావా॥ ఉ ॥ పన్నగనిష్టశంకమగుభావమునొందియ శ్రీనశక్తియుక్తిన్నొకలక్షవర్గములుదీప్తవహించిభవద్గుణంబుల। న్నెన్నియుటంచునెంచనగు శేషణిరాజుకునైననోమహా। పన్నశరణ్యఘోర భవభంజనవాక్సతిచిత్తరంజనా.—హేమహాప్రభో॥

ఉ ॥ శంబరజోద్భవాఖ్యునరజంబునజీవులనెల్లగాంచుచున్। శంబరజాంబకాఖ్యనగిసత్త్వమునన్ దగవారిబెంచుచున్। శంబరజిజ్ఞయాఖ్యదమ్మంబునవారలద్రోచుచున్। యథార్థంబుగనీవెమూడగువిధంబులమించిజరింతువబ్జజా.—ఓస్వామీ॥

క ॥ వీక్షించితివాణీప। సాక్షీహితమైప్రసిద్ధమైభాసురమై। యక్షీణమైనరుమీ। సాక్షాత్కారంబుజన్మసాఫల్యముగాన్॥

వ ॥ అనిప్రార్థించుశతక్రతునకుబ్రసన్నుండై శతధృతియిట్లనియె॥



(అరభిరాగము-ఆదితాళము.)

అంతాక్షేమంబైయున్నారా। యమరగణాధారా॥ స్వాంతములనుసంశయములేకన। శ్రాంతముబహువిధసంతోషంబుల॥ నంతా॥ ౧॥ గురుడుబృహస్పతికులసతియగుశచీ। యతయగసుతులుజయంతాదులుమీ॥ రంతా॥ ౨॥ హితులుమంత్రులాశ్రితులువరపురో। హితులంగనలతులితచతురంగము॥ లంతా ౩॥ అమరగరుడవిద్యాధరఖేచరు। లమరావతిపురమందునగలవా॥ రంతా॥ ౪॥ కాలోచితసంగతులమెలంగుచు। వాలమేటిసర్వజ్ఞునిసత్కృప॥ నంతాక్షేమంబై.— అనిననింద్రుండిట్లనియె.

గీ ॥ సార్వకాలమఖిలసౌఖ్యసంపదలెల్లలేశమైనకొదువలేకపొందిమీయనుగ్రహమునమేమందరములెస్స యున్నవారమోహయోజగర్భ॥

వ॥ అనిపలికి-తదనంతరంబునా.

ఇంద్రుండహల్యనుజూచిమోహించుట.

సీ ॥ జవికలిముకాటులలసరిదైన నెఱికురులలదానివిభులచెన్నలరుదాని। సోమునిగేరునెమ్మోముగల్గినదానిరమణీయ్యమీననేత్రములదాని। కంబుసుందరమైనకంఠంబుగలదాని విమలమృణాళహస్తములదాని। పూలబంతులబోలుపాలిండ్లుగలదాని। హరినోడుపరచుమధ్యంబుదాని। నిడుదమోచలసాటిపిందొడలదాని। కమఠసన్నిభమైనపాదములదాని। నజునిచెంగటగ్రీడించునట్టిదాని। నయ్యహల్యనుజూచె వజ్రాయుధుండు

వ॥ ఇట్లవలోకించిమహామోహపరవశుండైతనమనంబునా॥

(నాదనామక్రియరాగము-ఆదితాళము.)

కన్నులపండుచైయున్నాదీ। యీకన్నెసొగసు॥ కన్నుల॥ మున్నెన్నడుయీముజ్జగములలో। కన్నదివిన్నదిగాకున్నదిభళి॥ కన్ను॥ నరసురవిద్యాధరగరుడోరగ। తరుణీమణులనునిరసించుచుభళి॥ కన్ను॥ రతికన్నసుభారతికన్నను శ్రీ। సతికన్నను పార్వతికన్నను॥ భళి॥ కన్ను॥ ౪॥ తళుకులబెళుకులనెలపాయపుజిగి। వలపులమురువులుగులుకుచుమేల్భళి॥ కన్ను॥ ౫॥ మాలిమితోశ్రీవాలమేటిపురి। పాలునినైనను భ్రమియించుచుభళి॥ కన్ను॥ ఓ॥—వెండియు॥

ద్వి॥ కిసలయాధరకప్పుకీలొప్పుజూడ - కసరైనమోహాంధకా
ంబుముంచె - కాంతబల్చెళుకువాలుకనుదోయిగన్న - స్వాంతమంతంచె
ంచెంచలంబొదవె - వనజాక్షికెమ్మోవి వగవిలోకింప - ననురాగవల్లికల
ుకొనల్సాగె - సతిలేతనునుగౌను వందమీక్షింప - ధృతికిబ్రాపించెనదృ
శ్యభావంబు-తమిమించియుట్లోక దారిజలారి - రమణిలావణ్యవారాశిలో
ోల - లాడుచుకుసుమసాయకునితాపంబు - వేడిమిజికిలయవ్వేలదివర్ణిం
చె - కలికిగుబ్బలబోలగానిమ్మపండ్లు - చెలువొప్పదొరలకు చేకానకలి
మ్యో - కులుకుమిటారిచెకులెడాలుగుల్క - దక్షుటద్దముజూడదగినదై
మొప్పె - చెలువనెన్నొసలిమిళిమివసల్గాంచ - మొలకక్రొన్నెలజనుశ్
మొక్కబెంపేక్కె - నిత్త్వమైతావికెనగాగపువ్వు - లెత్తులుశిరసావహిం
వనైమించె - వాహాహువాయిట్లుండవలదెసౌందర్య - మూహింప నీమగ
రోష్ఠినిమూర్తి - దగబెండ్లియాడినధన్యుండుఃకృ - ముగసర్వలోకైక వ
ర్ధన్యుడగుట - కరుదేయటంచుపేరాశవహించి - నరలోకవినతునవా
డ్డిరాము - చంద్రాధిపుని మహైశ్వర్యసంపదల - సాంద్రకృపాకటాక్షి
నబాలించు - ధరవాలమేటి చంద్రకిరీటునెంచి - పరమేష్ఠిగని సుర్ప్ర
డిట్లులనిమో॥

(కందార్థద్వయము.)

మంగళకరలోకేశ్వర । శృంగారయొయారకళలు జిందమేటు
చుక । బంగారుబొమ్మవలెమీ। చెంగటనటియించెదుయా-చిన్నా।౹
యమెవరు-గన్నా । సుకుమారిసొగసై-యున్నా । దెటిగింపుసుప్ర-స
న్నా।కిన్నరపన్నగకింపురుషాప్సర।కన్నెలకన్నసుమిన్నైయున్నది-చిన్నా

(బ్రహ్మేంద్రసంవాదం.)

యిలగలయెలనాగలకీ । తలిరాకులబోణినెలమి దలమానికమై
వెలయగకలిగించితిమీ। చెలువముగొనియాడశర్మమె-శీలా । సమధికగ
ణ-జాలా। సచ్ఛాస్త్రాగమ-మూల।శారదప్రాణ-లోలా । పాలితసుజన
కృపాలవాలకీ! లాలజాతభవలాలితఘనసంశీలా॥



(బ్రహ్మవాక్యము- కందార్థము.)

ఎవ్వరుగనిపెంచగలే । దివ్వికసితపద్మగంధినిలలోపలనే। డవ్విధ
మింతయుదెల్పెద । నవ్వడిగావినుము, పాకశాసనా॥శతకోట దివ్యసా
ధనా। భాసురముగనొకప్రతినకొరకునే । నీసతిసృష్టనజేసితి, పాకశా
సనా॥—వ॥ అదియెట్లంటేని॥

ద్వి॥ దివిజాధినాథనే దెల్పెదవినుము - నవమోహనాంగి జన్మక్ర
మంబెల్ల - మునురమాపతి జగన్మోహనాకృతిని - ఘనమొప్పభ్రమియుం
గాద్రిలోచనుడు - సురలుదైత్యులుబలేదుల్కగాబల్కి - రరయనేసృ
ష్టించినట్టిమానినుల - నంతమీదటను నేనతి పౌరుషమున - నంతకన్నను
మిక్కవగుచక్కదనము - గలుగుదానిగదీనిగల్పించగోరి - జలజవికాసం
బుచంద్రోన్నతంబు - నిలువుటద్దము తేటనెమ్మోముజేసి - కలికిబేడిసబెళ్లు
బ్బ్యరేకంద - మలరుఖంజనదీప్తినత్తులదీర్చి - తలిరుపల్బనకెంపుతళ్లు
గు - యలసుధామధురత్వమధరంబమర్చి - కనకకుంభచ్ఛాయగట్టు
తన - మునుబంతిసోయగంబునుచనుల్గూర్చి- మించుబల్మించుసంపెగ
ంచుతావి - కొంచకస్త్రైరీషకుసుమమార్దవము - భాసురాంగకమేరు
చిమేల్వన్నె- వాసిదేలంగకేవలయుక్తినఖిల - లోకమోహనముగా
ధినిర్మించి - జోకనహల్యయంచునునామమిడితి - రమణనన్నారెడ్డి
మచంద్రాఖ్య - ప్రమదంబునిండారబరపిపాలించు - మహీవాలమేటి
మాపతియాన - నహివేణిచందమియ్యదిశచీలోలా॥

వ॥ అనినవిని ఇంద్రుండు తనమనంబునా.

(మత్తకోకిలాద్వయము.)

కొమ్మకొజ్జగిరెమ్మముద్దులగుమ్మ బంగరుబొమ్మనా। కిమ్మటందు
నువేడసత్త్రపనిచ్చునో ద్రుహిణుండుదా । సమ్మతించకనీవటంచునుచొక
గానెడబలుకునో । యెమ్మెమీరగదీనికేనిక నేమి యోచనసేయుదుక॥ ౧॥
మించిదాయెనైనైన నీయనుమానమేలతలోదరిక । గాంచినప్పటినుండె
వ్విలుకాడుబల్విరిములుకులక । ముంచసాగెనుచల్లకుంజనిముంతదాచి
నపోలెటసూ । హించిసంశయముంచగాదగదెచ్చరింతువిధాత్రనిక॥౨॥

వ॥ అనివృథనిశ్చయుండై యిట్లనియె॥

(ఇంద్రవాక్యము-సౌరాష్ట్రరాగము- అటతాళము.)

సారస, సంభవ దేవదేవ, సజ్జన । సన్నుతసుస్వభావా । ఘోర
కలుషవిదూరమునిహృద । యారవిందసహస్రకరసమ॥ సారస॥ ౧॥ నిరత
మాశ్రితతతికికల్పక। తరువనుచుమిమునమ్మికొల్చిన । నరులుబొందెడుది
వ్యలాభము । లివవుగాగణుతింపశక్యమె॥ సారస॥ ౨॥ కూరిమిని నేనొక్క
కోరిక।గోరెదనునది వేరుసేయక। భూరిసత్కరుణారసంబె। పారగా చే
కూరజేయుము॥ సారస॥ ౩॥ ఇమ్మహిశ్రీవాలమేటివు। రమ్మునేలెడుశివ్వు
డు మెచ్చది। రమ్యగానీచిన్నిముద్దుల। గుమ్మనెమ్మినినాకొసంగుము॥ సార॥

వ॥ అని వేడియు॥

ద్వి॥ ఓ దేవదేవయో హేయాదివ్యభావ - యో దాసజనపోష యో
మంజుభాష - ఓ జగదాధారయో నిర్వికార - యో జంతునిర్మాణ యో
రాజసగుణ - ఓ వేదవేద్యయో హాబుధారాధ్య - యో వారిజాసన
యో సత్యభవన- ఓ చతురాస్య యో హేమృదుహాస్య- యో చారుతర
గాత్ర యో సచ్చరిత్ర - ఓ పుణ్యపురుష యో హేజితకలుష - యో పరం
ధామ యో హానామహోద్దామ - ఓ కమండలుహస్త యో సుప్రశస్త-
యో కంధిగంభీర యో మేరుధీర - యీ మధురాధరి నీ సుకుమారి - నీ మాని
నీ మణి నీ కంజపాణి - నీ యిందుబింబాస్య నీ మండలాస్య - నీ యళికులవేణి
నీ ఘనశ్రోణి - నీ కుటిలాలక నీ జాజిమొలక - నీ కోమలసుగాత్రి నీ మీననేత్రి-
నీ కంబుకంధరి నీ బల్మిశారి - నీ కుందనపుబొమ్మ నీ ముద్దుగుమ్మ - నీ చిలకల
కొలికి నీ మరుముల్కి - నీ చిత్రముల వాంఛ నీ మేలుబంతి - నీ నిత్యకళ్యాణి నీ
పువ్వుబోణి - నీ నూత్నయౌవ్వని నీ తలోదరిని - నా మీద దయయుంచి నయ
ముగ్గడించి - శ్రీమీరగాదయ శేయుమీపదుచు - నతులితభోగ సామ్రా
జ్యసౌఖ్యముల - సితకరాననను శచీభామకన్న- మిన్నగాకల్మి చెల్మి నినేలు
కొంను - వన్నెనన్నారెడ్డివర రామచంద్రు - మేలుగా నేల్వాలమేటీశు
న్న - పాలితాశ్రితయూధభారతీనాధా॥



వ॥ అనినంబకపకనగి శతానందుండు పురందరునకిట్లనియె॥

(కురంజిరాగము - రూపకతాళము.)

యేలనీలాటిమాట।లికమానుసురేశ్వరా। బేలతనముగాదెధర్మ।
మూలమెరుగకిటుబలుకుట॥ లేల॥ ౧॥ కల్పించితిబహువిధసం। కల్పములమర
సీనీ। వేల్పులదొరవట్టిభ్రమలు- నిల్పుమునీకివ్వదగదు॥ యేల॥ ౨॥ యేపతి
కేసతియో మరి- యేసతికేపతియో యాపద్ధతిగాకనువే- రేపోహణలేమి
ఫలము॥ లే॥ ౩॥ శ్రీలవాలమేటినగర-శూలపాణిసాక్షిగా।చాలనమ్మవా
వాక్యము - సత్యముసంశయములేదు॥ యేలనీలాటిమాట॥ ౪॥

వ॥ అనిబల్కి మరియును॥

ద్వి॥ యేల దేవేంద్రనీకిటువంటిమమత - కాలంబు దేశంబు కార్య
కారణము - లెరుగనిచందాననిటులబల్కెదవు - తరుణులకెల్లను తలకట్టు
గాగ - నానేర్పుకొలదినీనవమోహనాంగి - ఘనిసమస్తసంపూర్ణసత్క
ళల - సమకూర్చిబేర్చిసృష్టనజేసినాడ-కమలాయతాక్షినస్ఖలితసుబ్రహ్మ-
చారికొసంగినసార్థకంబగను - దారాత్మజాదివిస్తారసంసార - బంధను
లకునివ్వఫలమేమిగలదు - బంధురశౌర్యంబుబాహువిక్రమము - దిగధీశ
త్వంబు తేజంబుకీర్తి - యగణితభోగభాగ్యములునమ్రియము - ననుపమ
వైభవంబమరసామ్రాజ్య - మనిమిషస్థితియునిత్యానందపదవి- గలవాడ
నేనంచుఘనతవహించి - బలికితివీవుస్వభావంబుకొలది - ననఘులౌవార
లర్థాశవర్జించి - యనవరతంబుమోక్షాపేక్షులగుచు - నవనిసద్వటులనై
య్యమునదోడ్తెచ్చి - యవిరళంబుగనుమర్యాదలొనర్చి - గౌరవంబుగతమ
కన్యపదుచులను - యారూఢిపరమేశ్వరార్పణంబనుచు - సాలంకృతంబు
గాసరగనర్పించి - పోలింపస్వకులసంఘాతులముందు - పదితరంబులు
వెన్క పదితరంబులును - సదమలంబగుతనసంతతియొకటి- విదితమౌనీయే
కవింశత్తులజుల - విదళితాఘులజేసివివిధమౌవరక - ములబాపిశాశ్వతం
బుమదియ్యలోక - నిలయులజేయుటనీవ్వగన్గొనవె - యీవెట్టితనమునీకె
టులబ్రాప్తించె - హావృథాభిప్రాయముని మొంచవైతి - వారయన్నారె

డ్డియన్వయాంబుధికు - పారంతుడగురామచంద్రభూవరుని - చెన్నుమీ
వంగబ్రోచెడివాలమేటి - పన్నగాభరణుడీపద్ధతిమెచ్చ - డీలాలితాస్యని
శివ్వనియ్యాశ - చాలించుచాలించుశతకోటిహస్తా॥

వ॥ అనిపలికిన బ్రహ్మదేవుని ఖండితవాక్యంబులాకర్ణించి గుండె గఖిల్లని బిడౌజుండు తనమనంబునసిట్లని వితర్కించె.

(యదుకులకాంభోది - జంపె.)

రామరామా బ్రహ్మనామదినిగలమోహ॥ మేమాత్రమైనదానెఱు
గలేదయ్యో॥ ౧॥ పుండరీకాక్షినీబోలదంచనిబలికె । ఖండితంబుగబలికె గుండె
ఝల్లు నెనూ ॥ ౨ ॥ కృపగల్గువాడంచుగురినెంచితీవిధిని । కపటాత్ముడని తె
లియగానైతినకటా॥ ౩॥ యీసుధామధురోష్ఠి నాసొమ్ముగానమ్మి। మో
సపోతినివృధాయాసంబుగానూ॥ ౪॥ దిట్టముగనేజగజ్జట్టికిట్టిమిఠారి । ప
ట్టింపుదేవిగాబ్రాప్తించునదియో ॥ ౫ ॥ వరవాలమేటిశంకరుడెట్లుశేయు
నో। మరలకున్నదినాకుతరుణిపైమమతా॥ రామరామా॥ ౬॥

వ॥ అనివగచితనకుముఖ్యాప్తుండగునొక్కనింజీరిజంభారియిట్లనియె.

ద్వి॥ ఓచెలికాడనేడొకవింతబుట్టె - నీచోద్యమునకునింకేమనవ
చ్చు - వింటివేగదపల్కు - వెలదిమగండు - బంటింపకాడినపరిహాసోక్తులను -
ఇలనొక్కపురుషునకెందరిల్లాండ్లు - గలరునాకొక్కయక్రమముగాదో
చె - ప్రేమచేబిలువనిపేరంటమునకు - ధీమసంబునబోవుతీరుగావచ్చి - నట్టి
వాడనువచ్చినటులోకబుద్ధి - మట్టైవిధాత్ర్నిమగువనిమ్మనుచు - నందరువి
నగనేయాచించనేల - నందుకాబ్రహ్మసమాధానమెంద - కబలనీకిడుట
చేసనట్లైనకట - ప్రబలమోహాంధకారమునమన్మథుని - వలజిక్కితలడిల్లి
ఎలనైనాబ్రతుకు - కలికిచక్కదనంబుకలకాలమెదను - దలచుచు మోహబం
ధనుడనై యుండ - గలనైనాప్రాప్తమీగతిసంభవించె - నలువకింతటికఠిన
ముగల్గునంచు - దెలియకమూఢవృత్తినిజెంచితైన - కానిమ్మునాకన్నఘను
డెవ్వడని - దీనికిమగడౌనొవివిరిచూచెదను - వలనొప్పగాబలవంతులతో



డ- పలుమాటలాడుటభావ్యంబుగాదు - సిరులనన్నారెడ్డిశ్రీరామచంద్రు-
కరుణారసంబుల్లోల్లగలీలనేలు - శ్రీవాలమేటిగౌరీవల్లభునికృ - పావీక్ష
ణంబునాపాలగల్గినను - తనుదానెయోచించితగవిశ్వసించి - వనితనాకీక
నెవ్వరికిచ్చునజుడూ॥ వ॥ అనివెండియు.

(మధ్యమావతి- అటతాళము.)

యెంతమాటనెనూ- యీపరమేష్ఠి॥ యెంత॥ యెంతమాటనెనిం
తలోనె। వ్యంతతడవిడకంతసభవిన॥ నెంత॥ ౧ ॥ చంచలమునొందితీ
యూరకేవట్టి। వాంఛనేశెందితీ॥ ౨॥ కొంచెకానిగనెంచినమ్మవి । రించి
ఖళితలవంచుకొనజేసి॥ యెంత॥ ౩॥ ఐననేమాయలే। యింకెన్నాళ్ళకైన
చూతాములే ॥ పూనియీపువ్వుబోణికెలమినా । కైననధికునెవ్వానిగూ
ర్చునో॥ యెంత॥ ౪॥ వాసిమీరగనూ- శ్రీవాలమే, టీశుసాక్షిగనూ- లేశ
మునూకృపలేకనాదుఘ। నాశలెల్లనిరాశలైపోవ॥ యెంత॥ ౫॥

వ। అనియిట్లుడోలాయమానమానసుండయ్యును కొండొకధైర్యంబవలంబించి బిగిమానంబువహించి సపరివారసహితంబుగా నమరవల్లభుండమరావతీపట్టణంబుజేరి యహల్యాసుందరీసౌందర్యావలోకనకుతూహలచేతస్కుండైయుండె నిటచతుర్ముఖుండొకపరిచారకుంజీరియిట్లనియె.

గీ॥ నైష్ఠికబ్రహ్మచర్యంబునునుతపంబు । నలుపుచున్నాడుగౌతమ
సంయమీంద్రు। డమ్మహామహునిపాలికీవరిగివేగ । బిలచికొనిరమ్మనచ్చట
తెలియపరచి॥

వ॥ అనియాజ్ఞాపించిన నజ్జనయోగియాజ్ఞశిరసావహించి శీఘ్రగామియైచని గౌతమాశ్రమంబుజేరి యందత్యంతనిష్ఠాగరిష్ఠుండై ఘోరతపంబుసేయుచున్న గౌతమమహర్షింగాంచి నమస్కరించి విరించికంపుమనుండ గుసుమతియిట్లనియె.

గీ॥ ఓమునీంద్రచంద్రయోభవ్యగుణసాంద్ర । మిమ్ముబిల్వమనుచు
వన్మిచూలి । బంచివాడునన్నువేంచేయుడచటికి । మీతపఃఫలంబుమేలు
జెందూ॥

వ॥ అనినంబరమానందంబుననత్తపస్విసంక్రందనుండు॥

సీ॥ మొలయందుదగనైదుమూరలుగలపంచ । గోచిపైమురుచచుంగులుగగట్టి । మోదుగదండంబుమూపునబెట్టి బిచ్చపుగిండిదాకేలచక్కబట్టి । విరివందుజింకతోల్విభూతిసంచియుసవరించిచుట్టిబుజానవేసి । గురుతుగామెడలోనగొప్పరుద్రాక్షలతావళంబొకటిదగుల్చి । ముంజియును ప్రేళ్ళకుశదర్భముడులనుదుట । బూతియును వెల్లిజన్నిదంబునుపొసంగ । నప్పైతోలిమిన్నకెలెసగ ధన్యోస్మియనుచు । బ్రహ్మసభకేగెగౌతమబ్రహ్మచారి । నేలాగనినా॥

గౌతముడువచ్చుట-శంకరాభరణం- ఝంపతాళం.

గౌతమమౌనివచ్చెకమలగర్భునిసభకు । పూతాత్ముడమలగుణోపేతుడుజితపాతకుడగు॥ గౌతమ॥ ౧॥ అక్షీణకరంబగాశుశుక్షణితేజంబుమీర । శాక్షణమునసభాసదులు । సాక్షాన్నిటలాక్షుడనగ॥ గౌతమ॥ ౨॥ శతక్రతువుచకుబ్రాప్తించనియతివకుబతియ్యానటయీ । యతిసుతపోమహిమెంతని । యంగనలుచెలంగిపలుక॥ గౌతమ॥ ౩॥ హరగౌరీవరపన్నగధరకరుణాకరశంకర । పరమేశ్వరవాలమేటి । పురనిలయనమామియనుచు॥ గౌతమ॥ ౪॥

వ॥ ఇట్లువచ్చి గీర్వాణీసమేతుండైనెందుకొల్వున్న పద్మాసనునారాధించి కరంబులుముకుళించి దృక్చరణుండిట్లనియె॥

సీ॥ దండంబుదండంబుదండంబువాఙ్మనోమండితాబ్జాతమార్తాండ నీకు । జోహారుజోహారుజోహారుభక్తసందోహపోషణమహాత్మా నీకు । జేజేలుజేజేలుజేజేలుయోగిసమాజపూజితపదాంభోజనీకు । కైమోడ్పుకైమోడ్పుకైమోడ్పుకల్మషోద్దామసామజమృగస్వామినీకు । మంగళాకరలోకేశమాదృశులకు । నిన్నుగానియాడునంతటినేర్పుగలదె । దురితసంహారశ్రీహరివరకుమార । చిన్మయాకారశారదాచిత్తచోర॥

వ॥ అనినమస్కరించినజటివల్లభునింగటాక్షించి విరించిఇట్లనియె.

గీ॥ శ్రీఘ్నతిర్మతితుష్టిపుష్టిప్రదోస్తు । బ్రహ్మచర్యవ్రతోత్ఫలప్రాప్తిరస్తు । శీఘ్రమేవవివాహసంసిద్ధిరస్తు । సతతశుభమస్తుగౌతమసంయమీంద్ర॥



(గౌతమవాక్యము- సురటరాగము - ఝంపతాళము.)

భారతీశ్వరా- పరమ, పావనధర్మప్రచార॥ భారతీ॥ సారసభవభవనికరవి । దారశుభకరా॥ భార॥ ౧॥ మోదముగాను । మీ, పాదసేవనూ॥ నాదగుజన్మంబుపావ । నంబయ్యెయథార్థముగను॥ భారతీ॥ ౨॥ పన్నెమీరగా । కృప, బన్నితీరుగా । నన్నిటబిలపించుకార । ణంబేమోశలవాసగుము॥ భారతీ॥ ౩॥ అతిసునీతిని । భవ, దాజ్ఞరీతిని । క్షితిలోశ్రీవాలమేటి । శివునిసాక్షిగానటింతు॥ భారతీ॥ ౪-

(బ్రహ్మవాక్యము- కందార్థము.)

శ్రీకరముగనుచతుర్దశ । లోకములలరంగజటిలలోకేశ్వరనీ । వీకన్యధర్మపత్నిగ । జేకొనిసకలార్థసిద్ధి జెందుమా॥ వంశాభివృద్ధి నందుమ - హెందమునందానందమమీరగ । నిందుముఖిసనీకిచ్చెదమేలు॥ జెందుమా॥

(గౌతమునికందార్థము.)

దేవామారాడితననిబి । భావింపకవినుమువిన్నపంబొక్కటినే । నీవెలదివకరూదనమున । కేవిధమునదీటుజెంపు॥ దింపుగా - యోచింపదగు॥ పెంపుగా- చంపకగంధికిసర్వసమముగల । సంపత్పురునకొసంగినమేలొసంపుగా॥

(బ్రహ్మవాక్యము.)

ద్వి॥ ఓమౌనికులచంద్రయోపుణ్యసాంద్ర - నీమనోభీష్టంబునేనెఱుంగుదును- బ్రహ్మచర్యంబునబరమపదంబు - బ్రహ్మాగ్నులెన్నంగబడయనున్నాడ- వైననందుకుసందియంబేమిలేదు - మౌనుగానచలసమాధినిష్ఠాని- చిరకాలమతినిష్ఠచేఘోరతపము - కరమగ్గిరీవలెగావించినట్టి- వారలులేరిదివరకెవ్వరైన- నాయూఢబ్రహ్మచర్యవ్రతంబింక - చాలించిమద్వాక్య- స్వాంతమందుంచి- యీలోలలోచనవెలమువరించి- యనుపమమైనగృహస్థధర్మంబు - ననుభవింపుముప్రీతినందుధర్మార్థ - కామమోక్షములుశీఘ్రముగలభించు - ధీమంతులకుగలదేదుర్లభంబు - యేలసంపదరూపమేలభోగంబు - లేలసతంబెయిట్టేలవచింప- నీవుతపోధననిధివిదిగాక- పావనచరితసప్తమహర్షులందు - నైదవవాడవైయశ్రాంతకీర్తి-చేదగియుం

దువీచిగురాకుబోడి - కమనియ్యముగపంచ కన్నెలలోన - నమలాత్మ మొదలిటదైయుండగలదు - నాదుసంకల్పమెన్నటికైనరిత్త - గాదమోఘమునమ్ముకాంతనీసొమ్ము - చెలగియన్నారెడ్డి(శ్రీరామచంద్రు) - సులలితంబుగనేలుచొక్కనాథుండు - ప్రాకటంబుగమెచ్చబరిపూర్ణమతిని నైకొమ్ము నెమ్మికరంజాక్షీనఘా॥

(గౌతమవాక్యము - హేదేవా.)

శా॥ శ్రీకళ్యాణదమైనిరంతరజగజ్జేగీయమానంబునై । పాకారి ప్రముఖామర ప్రణుతమైభాసిల్లుమీయాజ్ఞనేం - తేకూర్మిన్శిరసావహించియనురక్తింబత్నిగాగొందునీ । రాకాచంద్రముఖిన్సుకీర్తిదనరన్ బ్రాహ్మీమనోనాయకా॥

సంధి-చ॥ అనవినిశారదేశుడుదయామతియై సుముహూర్తమందహ । ల్యనువరయత్నపాదునకు నాదరమొప్పనొసంగిసత్యలో । కనిలయులెల్లసైయనిదగన్ గొనియాడ మహర్షిదంపతుల్ । వనరుగమేలుమేలన వివాహమొనర్చెమహోత్సవంబుగన్॥—మరియునెట్లనినా॥

(అహల్యా వివాహము.)

(సావేరిరాగము-ఆదితాళము.)

శ్రీమదహల్యాదేవివివాహము జేసెనుకమలజుడూ । ప్రేమనుగౌతమనామమహానిహిమ ధామునకును సార్థకముగనొసగియు॥ శ్రీమద॥ మానుగావధూవరులకుమంగళ స్నానము జేయించీ । మానవతినివస్త్రాభరణాదుల చేనలంకరించీ । మానులఖిలక్రియలను వేదోక్తవి । ధానంబుగనొనరించగమించుగ॥ శ్రీమ॥ ౧॥ విరివిగసువలంబరముననురువడి । విరులవానగురియా । పరిపరివిధములబహువాద్యంబులు । బాగుమీరమొరయా॥ గరిమనుపుణ్యాంగనలులాజల అక్షతలుజల్లిమురియగబెంపారయగ॥ శ్రీమ॥ ౨॥ శతక్రతువనుబ్రార్థించనియాతివకు పతినునిపతియయ్యె నితనితపోమహిమేమో తెలియదు । యిదియగణ్యమయ్యే॥ మతినెన్నగశతధృతికృతమతియు ద్భుతమః క్రతుభుజసతులనుకొనగను॥ శ్రీమ॥ ౩॥ పనిగొనికానరులు



బహుకట్నంబులు । గొనివేడుకమించా । జనుదెంచియుసత్యలోకనివసిత జనులిడిగీర్తించా । ఘనమొప్పగశ్రీవాలమేటిపురి । మనసిజాంతకుడుమదిమెచ్చగతగ॥ శ్రీమదహల్యాదేవివివాహము జేసెనుకమలజుడూ॥౪॥

వ॥ ఈవిధంబుననహల్యాపరిణయంబుగావించి యెల్లవారలబహూకరించిబంచి దంపతులదీవించి యాశ్రమంబునకుబోవనాజ్ఞాపించి శారదాసమేతంబుగాయధాస్థానంబుబ్రవేశించి విరించిపరమానందకందళిత హృదయారవిందుండైయుండెనట॥

క॥ అనిధరణికోటకులపా ।
వనసుబ్రహ్మణ్యసుకవివర్యుడుసంక్రం ।
దనగౌతమీవిలాస
మ్మునదగప్రథమప్రకరణమునువిరచించెన్॥

శ్రీమదింద్రాహల్యావిలాసంబను నాటకంబునందు
ప్రథమదినముకథ- సంపూర్ణము.

శ్రీ



శ్రీరస్తు.

ఇంద్రాహల్యావిలాసము
రెండవదినముకథ.

శ్రీలోకేశుననుజ్ఞరీతినిబుధశ్రేణుల్ నుతింపన్నహ । ల్యాలోలాక్షుని బెండ్లియాడియుమహోల్లాసంబుదీపింపసం । శీలుండైదగుయత్నపాదుడెలమిన్ శీతాంశుబింబాస్యతో । వాలాయంబుగస్వాశ్రమంబునకుబోవన్ బైనమైచేచ్చెరన్॥

క॥ వనితామణులన్గూర్చుక । తనతావుకురమ్మటంచు తరుణిమణితో । ననుమతియొసగిమునీంద్రుడు । ఘనముగహరిహారియటంచు గదలెముదమునన్॥

(*)గౌతముఁడు తపోవనంబుకరుగుట.(*)

(శహనరాగము-చాపుతాళము.)

దామోదర దామోదర దామోదర దామోదర । దామోదర దామోదర దామోదర దామోదర॥ దామో॥౧॥ శ్యామలాభ్రసమకోమలాంగవర। సామజార్తిహరసరసిజనాభా॥ దామో॥ ౨॥ శేషతల్పబుషిపోషకల్పతరు । వేషవిరాజితభూషభరితశ్రీ॥ దామో॥౩॥ శక్రామరనుతవక్రాసురహత । చక్రహస్తభూచక్రవిచక్షణ॥ దామో॥ ౪॥ శంబరరిపుజనకాంబరకనకవి । జృంభితసరసిజసంభవనుతశ్రీ॥ దామో॥ ౫॥ మందరధరగోవిందవాలమే । టేందుమౌళిహితయిందిరేశశ్రీ॥ దామో॥ ౬॥

వ॥ అనియిట్లు గరుడధ్వజుని భజనంబుసేయుచుంజనిచని చందనమందారమాకంద పిచుమందజంబూనిం బకదంబజంబీరఖర్జూర కోవిదారాశోక క్రముక పనసభల్లాతకేతకీతమాల తాలహింతాలలుంగలవంగకరవీరామలకబిల్వబదరీ నారికేళాదిమహీరుహరేఖా విరాజితంబును నిరంతరపల్లవ ఫలశలాటుకుసుమాలంకృతంబును తత్తన్మిళితపుష్పితలలితలతావితానంబును శరభకంఠీరవనాగభూదారశల్యచమరి భల్ల లులాయాద్యన్యోన్యవైరవిరహితానేక మృగానీకసంకులంబును శుకకోకిల శిఖావల శారికాముఖరనిఖిలపత్త్రినిచయప్రచురనినాదంబును చక్రాంగచకోరచక్రవాక బకక్రౌంచకారండవ జలకుక్కుట విహారణామలవారిపూరితారవిందకుముద కైరవమిళిందాస్వాదనేందిందిరసంగీతాభిరామరమణీయ్యజలజాకరమిళితంబును సకలజగదవనంబును పరమమునిజనపావనంబునునగు తనతపోవనంబుప్రవేశించి గౌతమమహర్షివరుండుస్వైరవృత్తి నవలంబించియుండెనంతనిచ్చట॥

(అహల్యాదేవి గౌతమునికడకువెడలుట.)

ద్వి॥ శ్రీకరచారిత్రిశృంగారగాత్రి- లోకేశవరపుత్రిలోలాబ్జనేత్రి- కలహంసగమనరాకాచంద్రవదన - వలరాజుమదదంతివజ్రాలదొంతి- చెలువచక్కనికల్కిచిల్కలకొలికి- యలరులబోటియహల్యావధూటి- లా



లితభోగవిలాససంపదల దేలుచుమణిమయదేదీప్యమాన కాంచనసౌధసంకలితగేహమున నంచయానలుగొల్వనధికసౌఖ్యమున నుండితానవ్వేళనుల్లాసమలర నిండినవేడ్కచే నెలతసంపెంగ- తైలంబుతలనంటితగినసల్గంది చాలగాపన్నీటజలకంబులాడి చెంగావిపేటంచుచీరధరించి - రంగుజరీపట్టురైకనుదొడిగి- పున్నమజాబిల్లిబోలుఫాలమున - సున్నితంబగుచాదుచుక్కనుబెట్టి- కొమరుగులాబుకుంకుమనుపైనద్ది- కోమలసందునతళ్కుబొట్టుగీల్కొలిపి- కలికివాల్గన్నులకాటుకదీర్చి- కలపంబులమరుశ్రీగంధంబలంది - యరుదైనరుచులపక్వాన్నంబు మెక్కి- విరివిగాకమ్మనివిడియంబుచేసి- నెరులుచిక్కుడలించినీరునారించి - విరిసరుల్పొందించివేణిఘటించి ఘటుతరాలంకారభవనంబుజేరి - తటుకుననిల్వుటద్దముకెదుర్నిలచి - మెప్పైనరాణికిమేల్పవరంపు- కుప్పెమొగల్రేకుచ్చులుసూర్య- చంద్రవంకలుజిల్గుశామంతిబిళ్ల- లింద్రనీలపుసరాలికరావిరేక - పరగగజ్జలబిళ్లపాపటబొట్టు- వరుసగాశిరమునవైఖరిదెలుప- తళుకులపుటకముత్యాలొప్పుగునత్తు - లలితంపువికిలిబులాకుబేసరియు - ముక్కునచక్కనిమురువులుజింప- చెక్కిళ్లుమెరయంగచెవులరత్నాల- గుత్తంపుకమ్మలుగూబవాళీలు- కత్తెరబావిలుకాసుబావిలు- బుగడలుకెంపుజంపులునుజూకీలు - తగవైనగొలుసులందముగజెన్నొంద - దరకంధరమునకుందనపుహారంబు- లురుజీవమణికాంతులొరశిరంజిల్ల- సందిళ్లగవలుపచ్చలునిగన్నిగలు- జిందువంకీలుబాజీబందులమర- కరకంకణాలుచాకట్లుంగరాలు - కరమొప్పునీలంపుగాజులుదనర- జవచిరిమువ్వలచ్చపుయపరంజి - రవగుల్లుబిళ్లలొడ్డాణంబునలతి నడుమునఁగ్రీవిజెందగపదంబులను - కడియాలుపాడగాల్గజ్జెగొలుసులును- చిడికెనబొద్దులుజిల్గుపిల్లాండ్లు- కడుబెళ్కుగాఘల్లుఘల్లనిమోవ- ఘోలుపొందతంగేసుబూచినయట్లు- లలితసౌదామినీలతికచందమున- చెలగివెన్నారెడ్డి శ్రీరామచంద్రు - వలనొప్పపాలించువాలమేటీశు - వినుతిజేయుచునున్నోవిభునియాశ్రమము- వనజాక్షిజేరగావచ్చెనెట్లనినా॥

(రేగుప్తిరాగము. అదితాళము.)

వెకలేనహల్యామోహనాంగీ। అమ్మవోయమ్మలారా॥ వెడలే॥విడువకజవరాండ్లెడనెడనడువగ । కడువేట్టనుతనకాంతునిచెంతకు॥ వెడ॥ ౧॥ ఎలచందమామగేరుమోమూ । పవడంపుబాయ। గలిగిచెన్నొందుబింబాధరమూ । కలువరేకులనగలవాల్గన్నులు । తళుకుచెక్కులద్దములనదగిత గ॥ వెడ॥ ౨॥ వెలలేనిసొమ్ములెల్లాబెట్టి । కీల్జడనుమల్లె। విరులదండలునిండ జుట్టి॥ బలుక్రొన్నెలవెన్నెలవన్నెలచి । న్నెలసన్ననినవ్వులుతెలివాలయగ॥ వెడ॥ ౩॥ వాటమైనట్టిసొగసుమీరా। మాటమాటకు। తేటకమ్మనితేనెలూరా। నీటులసొగసగుబాటలనచ్చర । బోటులనవరవధూటులదెగడుచు॥ వెడ॥ ౪॥ పేశలాంగులుతన్నుగాంచీ । సౌందర్యమెంచీ। బిగిమూనిసిగ్గునొందుగామించీ॥ వాసిమీరవరవాలమెటిపుర । వాసుడైనపరమేశునిదలచుచు॥ వెడలే॥ ౫॥

వ॥ ఈవిధంబునజనియమ్మహాకాననంబుప్రవేశించి తోడిచేడియలంగాంచి ఇట్లనియె॥

(అహల్యవాక్యము)

ద్వి॥ ఓచంద్రముఖులారయొప్పగామీరు- చూచితిరేమనసుతపోవనంబు - పల్లవసుమగుచ్ఛఫలశలాటువుల - సల్లలితంబులౌజగతీరుహాములు- విటపమూలములందువివిధవాసనల - దిటముగానల్లుపూదీగెజొంపంబు - లకలంకవిమలసుమాంచితమధుర - మకరందమునుగ్రోలిమలయుతుమ్మెదలు- రసఫలఖాదితరాజకీరములు - కిసలయంబులుమెక్కికేరుకోవెలలు- మించినాట్యముసేయుమేటికేకులును - సంచుగాకవగూయుశారికావళులు- మహనీయతరజీవమణిగణమిళిత - బహుళంబులైచరద్భవ్యజనాను- గుణ్యంబులైయొప్పుకృతకశైలంబు - లన్యోన్యమైత్రినొప్పారుమెకములు- కుముదకల్హారరక్తోత్పలకైర- వములభాసిలుసరోవరసుందరంబు-లందోలలాడువిహంగోత్తమములు - మందంబుగావీచుమలయానిలములు - శిరివిగాజెలగెడివేదనాదములు - పరమపావనులైన బ్రహ్మర్షిఘనులు వారలకనుకూలవతులైనసతులు. నారూఢిగనగమహాద్భుతంబయ్యె. వ॥



తయన్నారెడ్డివరరామచంద్రఘనునిరక్షించుశ్రీకరవాలమేటి. గరకసాక్షినిక్కపుజగంబునకు . సరిబోలెనింతటిసత్ప్రభావంబు. కాంతారసీమకుగల్గుటనాదు. కాంతుతపశ్శక్తిగాబోలునమ్మా॥

(ఆరభిరాగము - అటతాళము.)

ఎంతశృంగారమోయమ్మా। గహన, మరయమహానందమాయెనేకొమ్మా॥ చైత్రవైశాఖమాసములూ। గాన, చిత్రవిచిత్రములైజెలగువృక్షములూ॥ ౧॥ పొన్నలుపొగడలాడాడా। బలే, పుంజీకరించిపెంపుగగల్గెనీడా॥ ౨॥ కొమ్మలనొంచెనేపండ్లూ। కుటిల, కుంతలిగనుమవి। గోపాదరిండ్లూ॥ ౩॥ భళిభళిచూడుమచ్చోటా। యోహో, కలికీసువాసనగలపూలతోటా॥ ౪॥ హృదయేశుడడుగోనేబాలా। అదియే, మదినెన్నగాబోలుమనపర్ణశాలా॥ ౫॥ వరవాలమేటిశంకరుకరుణ। వర్ధిల్లుచున్నదీవనభూమితరుణీ॥ ౬॥

(చెలులమాట.)

గీ॥ ప్రేమతోనీవుజూపిచెప్పినవిధమున । ఘనతరారామశివనుగలప్రభావ । మెల్లకనులారచెవులారనుల్లమలర । గనివినిప్రియంబుగొంటిమికంబుకంఠీ॥

వ॥ అనిబలుకుచున్నచెలులమాటలకలరుచుపరమోల్లాసంబుననిజవల్లభుసన్నిధిం జేరికరంబులుమొగిచి యచ్చిగురుబోడియిట్లనియె॥

(శ్రీకరవృత్తములు.)

శరణుశరణుశమాదిషడ్గుణజాలపరమఋషీశ్వరా । శరణుశరణుతదేకవ్రతనిష్ఠాగరిష్ఠనిరంతరా ॥ శరణుశరణువిశిష్టకర్మాచరణనిర్మలతత్పరా। శరణుశరణుయశోధురంధరశరణుమద్హృదయేశ్వరా॥ ౧।

(గౌతమవాక్యము - శ్రీకరవృత్తము.)

శుభముశుభముశశాంకజితముఖిశోభనాంగితలోదరీ । శుభముశుభమళినీలకుంతలి । సూరిహితసుగుణాకరీ । శుభముశుభముసరోజలోచనిసుస్తనీదరకంధరీ। శుభముశుభముత్రిలోకసుందరిశుభముమద్హృదయేశ్వరీ॥

(అహల్యావాక్యము.)

క॥ కాలోచితమగుపద్ధతు । లోలిం దెల్పుచును తప్పులొప్పులు మ
న్నిం । చాలోలకరుణదగిసం । శీలా నన్నేలుకొమ్ము చిరసౌఖ్యములన్॥

(గౌతమవాక్యము- నీతులు దెలుపుట.)

సీ॥ వినవె యోభామినీ వివరింతు పతివ్రతాంగనల ధర్మంబు సాంగము
గనిపుడు । పతియు దైవంబుగా భావించి కడుభక్తి చాయక పరిచర్య సేయుత
లయు । కలకొద్ది వన్నోదకములిడి విశ్వాసమున సాధు పేదలదనుపవలయు।
వృద్ధుల పుణ్యసమృద్ధుల నధిక సంశీలత మించి పూజించవలయు । విద్యమాధ
రి మాటలు వివిధముల । జెప్ప నేటికి దుర్వ్యాంఛ జెంద కెలమి । సఖిలగుణము
ల సఖిల కార్యములయందు । నిహపరంబులకీర్తి వహింపవలయు॥ కావున॥

(గౌతమవాక్యం- శంకరాభరణము - ఆదితాళము- సంవాదం.)

కలికీ- నేను బల్కినట్టి పలుకు- లాలకించి మంచీ । మెలుకువగ నెల్లపనుల
మెప్పందవే॥ అహల్య ॥ మీరానతిచ్చిన మేరమీరక వర్తించుదాన। నారూఢి
గశలవిమ్మ మహానుభావా॥ గౌత ॥ నళినసంభవుడు నిన్ను వనభోణి హా కొసం
గీ। బలువైన సతీ కీర్తి గలుగ జేసె నే॥ అ ॥ నీధర్మపత్నినై నే నెగడినందు
వప్రాణ । నాధా నాజన్మ పావనం బాయనూ॥ గౌ॥ పతిదైవమనుచు నెం
చిభయభక్తి నుపచరించి । క్షితి పుణ్యసతులు మేలున్నతి గాంతురే ॥ అ॥
దేవా నీపాదముల సేవ కన్నను నాకు । భావింప వేరెపనులేవయ్యా॥ గౌ॥
సర్వసను బుద్ధి కలిగి సాధుల పేదల నేలి । పర్వేందువదనము క్తిబడయవచ్చు
నే ॥ అ ॥ పొందుగ శ్రీవాల మేటిపురి పరిపాలుడానంద। మొందగ నాలాగ
నడుచుకొందునో స్వామీ॥

(గౌతమవాక్యము.)

ద్వి ॥ కమలాక్షి నేను షఃకాలంబునందు - కొమరొప్ప మేల్కాంచి
గురుని ధ్యానించి- మానుగా నదికి నీమంబున నేగి- స్నానసంధ్యాదికృత్యము
లొప్పదీర్చి - సరగున మన పర్ణశాలకు మరల- నరుదెంచుచుం మధ్యాహ్న
వేళమును - విరిబోణి నీవు నా వెంట నే లేచి - పరువడి నింటిలో పను లెల్ల దీర్చి-



శీలంబు నను వనశీమకేతెంచి- చాలగా దేవతార్చనకు పుష్పములు - ఫలి
లుదర్భలు పర్ణేంధనములు - నెలమితో దుత సంగ్రహించి వే వచ్చి - హో
మకుండ ప్రదేశోర్వి స్థలంబు - శ్రీమీర పరిశుద్ధి జేసి యాపిదప - సరమరలేని
ముఖ్యాచారము లాని - సరసపదార్థములు సమకూర్చి పార - మార్థికమ్ము
నను వభ్యాగతులతిథు- లర్థులై వచ్చిన నార్యుల ప్రీతి- వెలయగా నుపచార వి
ధుల బూజించి- కలకొద్ది నన్నోదకములు సర్వేశ్వ - రార్పణంబని వారి కమ
రనొసంగి - నేర్పు నోర్పును గల్గి నిత్యమేమరక - నిటుల వర్తించిన నియ్యిహ
మందు- పటుతర సతీ కీర్తి పరమందు ముక్తి - జెందు దన్నా రెడ్డి శ్రీరామచం
ద్ర - వందిత చరణుడౌ వాలమేటీశు - డానంద మొంద సత్యాత్ములింపొంద-
గానిది సత్యంబుగా నెన్నుమబలా॥

వ ॥ అని బోధించిన వినియత్తొయ్యలి నెయ్యంబున నయ్యతి శేఖరున
కిట్లనియె ॥

(మధ్యమావతి రాగము - త్రిపుట తాళము.)

నా ప్రాణలోలా। నయగుణజాలా॥ నా ప్రాణ ॥ యీ ప్రకారమే
నూ। యికనటించేదనూ॥ నా ప్రాణ॥ ౧॥ వెలయ మంచి బోధా । విశదప
రచి మేధా। గలుగ జేసినారూ। కరుణయుంచి మీరూ॥ నాప్రాణ॥ ౨॥ వ్రత
ములందుగన్నా । శృతులయందు విన్నా । పతుల సేవకన్నా । సతులకేది
మిన్నా॥ నాప్రాణ॥ 3॥ వాలమేటిగౌరీ! వరుని ప్రేమగోరి । కాల మొక్క
రీతి॥ గడుపుచుందు ప్రీతి ॥ నాప్రాణ॥ ౪॥

ద్వి ॥ అనియహల్యాదేవి యాత్మేశ్వరునకు- ననుకూలమొప్పదాన
ప్పటనుండి - చిత్తంబులో భక్తి జెదరనియ్యకను - మత్తకాశిని బలే మర్యాద
లెరిగి- మొలకచన్నులు గులుకు మోవి తేనియలు - జిలుక మాటలు మారుచిలు
కలు బలుక - రమణ క్రొందళుకు మేకరహిమించు దొళుక - కొమరు దో
ర్మాలముల్ కుందనంబొలుక - గరిమవాల్జూపులు గందుమీల్బెళుక - విరివి
గా మాని పూవింటికి నళుక్క- నతిజాగ్రతగను హోమాదులం దెల్ల - సతతం
బు పరిచర్య సలుపుచువాల- మేటిపురీశుందు మేలు మేలనగ- ఖ్యాతిగా వర్తిం
చె తరుణీలలామా ॥

వ॥ ఇట్లమ్మహాదంపతులన్యోన్యానుబంధంబునసుఖంబుండిరంతనట
యమరాతీపట్టణంబునా॥

(దేవేంద్రుడుకొల్వుజేయుట.)

సీ॥ భూరిత్రిలోకాధికారసంప్రాప్తత పోధనుండుశతారసాధ
నుండు। యాగభాగనిమిత్తయాజకోత్తమసమారాధనుండుశతారసాధ
నుండు। సర్వంసహాభృద్విసరఘోరపక్షవిచ్ఛేదనుండుశతారసాధనుం
డు। సమరోగ్రదైతేయసముదయామితగర్వ భేదనుండుశతారసాధ
నుండు। నవ్యరత్నాంకితాభరణములురమున దగధగద్ధగమెరయచౌదం
తినెక్కి। దిశలువెలుగంగనసదృశస్థితినికొల్వు। కూటమునకొచ్చెగీర్వా
ణకోటిగొలువ॥

(ఇంద్రుని రండవళలువు.)

(పంతువరాళి రాగము- ఆదితాళము-)

వచ్చెనుదేవేంద్రుడప్పుడూ। రాజసభకూ॥ వచ్చెను॥ వచ్చెనుది
క్పాలురెల్లమచ్చికెచ్చివెంటనడువ। ముచ్చటమీరిసజ్జనులచ్చరువొందచె
చ్చెర॥ వచ్చె॥ ౧॥ గంభీరభావలుమించగా। భూసురులుసో॥ రంభమెప్ప
గాదీవించగా॥ అంభోరుహపత్రనేత్రులాలవట్టములుబట్టి। దంభోచేప
ట్టిశ్వేతకుంభిపైనెక్కిగ్రక్కున॥ వచ్చె॥ ౨॥ వందిమాగధులునింపుగా।
నల్దిక్కులబెం, పొందిసొంపుగానగ్గింపగా। పొందైనజీవమణులుపసందుగ
దాపినమంచి। కుందనంపుసరములురమునందునెరయమాళిమెఱయ॥ వచ్చె
ను॥ ౩॥ గురుతరోద్దండముమీరగా। గనుగొనిబెదరి। పరిబంధిజనులెల్లబా
రగా। గరుడగంధర్వకింపురుషవరులుసురలుచారణకి। న్నరులువిద్యాధ
రులుహరులువిరివిగసేవించికొలువ॥ వచ్చె॥ ౪॥ వారకాంతలునటింపగా। శ్రీ
వాలమేటి। వామదేవుడుమోదింపగా॥ భేరికాహళాదిధ్వనులుభోరున
మ్రోవకూరిమి। మీరిపౌరనారీవారమారూఢిసేసలుజల్ల॥ వచ్చె॥ ౫॥

వ॥ ఇట్లరుదెంచిచింతామణిపీఠంబునశచీకాంతుండునిండోలగం
బునకొల్వుండెనట్టియెడభటుండుకైవారంబుజేసెనెట్లనినా॥

ఇంద్రాహల్యావిలాసము.

(పరాకులు.)

శ్రీమదఖండితత్రైలోక్యరాజ్యలక్ష్మీప్రసన్నవిభవాతిశయాబహు
పరాక్॥ ౧॥ బృందారకబృందశేవితానందకందళితహృదయారవిందా
బహుపరాక్॥ ౨॥ కశ్యపప్రసాదితాదితీగర్భపయఃపారావారరాకాసు
ధాకరాబహుపరాక్॥ ౩॥ మందారపారిజాతకల్పకహరిచందన సంతా
నాద్యగణితఫలపరిమళసుమభరితానేక తరువిరాజితానందననందనో
ద్యానవిహారాబహుపరాక్॥ ౪॥ అయిరావణమహానాగసమారోహణా
నవరతస్వేచ్ఛావిహారకౌతూహలా బహుపరాక్॥ ౫॥ జంభాసుర జంభ
దంభగుంభనవిస్రంభవిజృంభితదంభోళిధరాబహుపరాక్॥ ౬॥ దినమణి
శతప్రభానిభానర్ఘ్యమణిగణస్తగితతప్తజాంబూనదాభరణాన్విత కం
దర్పనిహసితసుందరాకారాబహుపరాక్॥ ౭॥ నిరంతరనిష్కళంకాత్యం
తవైభవాంచితచింతామణీపీఠకాంతరాసీనాబహుపరాక్॥ ౮॥ అమ
రావతీపట్టణాధీశ్వరా బహుపరాక్॥ ౯॥ పౌలోమీ మనోరంజనాబహు
పరాక్॥ ౧౦॥ పూర్వదిక్పాలకాబహుపరాక్॥ ౧౧॥ హేమహాప్రభో బ
హుపరాక్॥ ౧౨॥ బహుపరాక్ బహుపరాక్॥ ౧౩॥

వ॥ అనిభటుండు కైవారంబు శేయుచుండెనా సమయంబునా॥

(రంభాదులువచ్చుట.)

క॥ ముద్దులుమురుపులుజిందగ। మద్దెలలునుతాళములును మరి
ముఖవీణల్। వద్దికతోగొనివేడుక।గ్రద్దనజనుదెంచిరపుడుగణికారమణుల్॥

(నాదనామక్రియరాగము- ఆదితాళము.)

వెడలివచ్చిరీ నర్తనస్త్రీలు॥ వెడలి॥ పడతులడుగడుగుశిడిముడివడ
వడి। నడలనలువత్తడులనుమించి॥ వెడలి॥ ౧॥ సుందరాంగులూ, విక
శితారవిందనేత్రులూ, పొందుగబంగారందెలుపాదము। లందుపసం
దుజెలంగిమ్రోయగా॥ వెడలి॥ ౨॥ నాణెమంచినా, వల్లవసమ। పాణులం
దునా, వీణెలుతాళములూనుకకోకిల। వాణులుబోణులుజాణతనమునా॥
వెడలి॥ ౩॥ సిరులదేలినా, శ్రీవాలమేటి। పురమునేలినా, హరిహితుకీర్త
నలిరవుగబాడుచు। విరివిగతొలకరిమెఱుగులసరిగా॥ వెడలి॥

వ॥ ఇట్లవ్వేళయాంగ్లవ్వ్రజాయుధుని సభాస్థానంబుజేరి కేల్దమ్ము
లుమొగిచి యిట్లనిరి.

క॥ జోహారుమేఘవాహన । జోహరహితాళిహరణసురగణశర
ణా । జోహారుహిమకరానన । జోహారుశితేభగమనసుకృతాధీనా॥

వ॥ అనిమ్రొక్కి యనంతరంబునా॥

గీ॥ ధాత్రిశతకోటిధరకొల్వుకూటమందు । మేటిగలవారిమెప్పించు
చువాటమెఱిగి । నీటుతేటలసంయ్యాటభాటలొదవి । రాటపాటలవెల్లాట
బోటులపుడు॥

(దేశియ్యంరాగము-ఆదితాళము.)

తాత్తైయుతైందకతాత్తైయుతైందక । తాత్తరికిటధాం,ధణాంత
కిటతోంగిటనంగిటక॥ తాత్తై॥ ౧॥ నారాయణహరినాగశయనవణి । హ
రాసురహర, యదుకులసంభవ సరసిజలోచన॥ నారా॥ ౨॥ తఝుంతక
ఝుంతాహాతఝుంతధి। తాదిమితధిమిత, కిటతకిటతత్తళాంగుతత్తరి॥
తాత్తై॥ ౩॥ శరణాగతపోషణబిరుదాంకిత। భరణామరనుత, పరమపురు
షమందరధరసిరిధర॥ నారా॥ ౪॥ ఝుంకుకుఝుణకిణజగణత్తదిగిణ। ధణేకు
హాతధిమి। తకధిగ్గదుధాకిటదధిగిణథోం॥ తాత్తెయుతై॥ ౫॥ కలుషహనన
కరకలితసుదర్శన। కులిశధరార్చితలలితచరితవాల మేటిశివహిత॥ నారా॥౬॥

క॥ జాతిస్వరచర్యలునే । డీతీరుననెల్లవారలెఱిగెదరనుచున్ ।
జాతిస్వరములుగణికా । నాతులుదగబాడిరమరనాధునిసభలోన్॥

(ఖమాస్ రాగము-ధృవతాళము.)

శ్రీలక్ష్మీలోలాఘాఘనిర్మాల । బాలాగోపాలా కాంచనచేలా
గమయూలాశీలా॥ శ్రీలక్ష్మీ॥ ౧॥ పారావార-భూరిగంభీరమారా । కా
రాపైరివిదారాసుగుణో- దారామేఘశరీరాధీరా॥ శ్రీలక్ష్మీ॥ ౨॥ ధరణీ
ధరజా-వరవాగ్వరనత । గురుకుండలమండితగండస్థల-కరిరాజమహా
వారాద్యుతహా॥ శ్రీలక్ష్మీ॥ ౩॥

వ॥ అనియిట్లతిమనోహరగాన నృత్యంబులుసేయుచున్న రంభా
దులమెచ్చుచు వియచ్చరశేఖరుండు యథేచ్ఛనుండెనయ్యెడ॥



(నారదుండు వచ్చుట.)

సీ॥ కమలోద్భవోద్భవుండమలప్రభావుండు వేదాంతసంవేదివిది
తబోధి। హరిపదాంభోజచింతాసక్తచేతసుం డఘమహారణ్యదవానలుం
డు। కామాదిషడ్వర్గఖండితానర్గళ సుతపోధనుండువాక్పూతుండు।
సతతత్రిలోకసంచారప్రశస్తుండు మధురవీణాగానమహితయశుడు। త
న్మయత్వంబుగౌదిమాధవునినామ। కీర్తనలుబాడుచానందలహర్తనమున। ది
క్కులందుతనుప్రభల్ తేజరిల్ల। మఖభుసభజేరనారదమౌనివచ్చె॥

(పంతువరాళి రాగము-అటతాళము.)

నారదమునివచ్చెనూ ఇంద్రునిసభకు॥ నారద॥ నారదమునివేట్క
ధీరనోరూరశ్శం । గారముమీరగగానముశేయుచు॥ నారద॥ ౧॥ రం
నవనమాలలెల్లనూ, కంధ। రంబుననోరసిరాజిల్లనూ, నింగినిసురలు గ
నుంగొనితన్నున। నగహారుండోయనంగ జెలంగుచు॥ నారద॥ ౨॥ అచ్చ
గమోమునగొప్పగా, పొంక। మగుగోపిచందనమొప్పగా, వచ్చెనేమిద
చ్చదెచ్చెనోమునియని। చెచ్చెరపురజనులుచ్చరించగనట్టే॥ నారద॥ ౩॥
అమగదుగునకునిల్వబడుచునూ, యచ్యు। తానంతగోవిందాయనుచునూ,
పుడమివాలమెటిభూతేశమిత్రుని। విధువనిభక్తిచేకదువడిదలచుచు॥ నా॥౪॥

వ॥ ఇట్లువచ్చిన మునిచంద్రునకు సూత్రధారియిట్లనెను.

క. మీగెవ్వరిచ్చటికిరా। గారణమేమోమెరుంగగాజెప్పవయా।
మారాజ్ఞనుగొనకహ। జారముదాటంగశక్తిజాలదెవరికిన్॥

(నారదవాక్యము.)

క॥ సారసభవునితనూజుడ శ్రీమణాంఘ్రుద్వయాబ్జచిత్తస్థితుడన్।
ధీరుడనారదమునియని। ధారుణిగలజనులుబలుకతగియుండుదురా॥

(సూత్రధారునివాక్యము.)

క॥ పరవన్నసేయవచ్చితో। నారదుడనదెలసెనీదునడవడినిలుబాల్।
ఖూరిమిగలతావులబలు। పోరులుగల్పంతువంద్రభునినెల్లజనుల్॥

(నారద వాక్యము.)

గీ॥ ఓరిమాటలేలనూరారునాతోడ । కోరినట్టియెడలకొంతలేక। సంచరింపుచుమ్ముసరకుశేయనుమెంత । వారికైనజెల్లదీరతెరవు॥

(సూత్రధారుని వాక్యము.)

క॥ ఏచ్చులవల్లసుఫలమే । మిచ్చటగలపనులుదెల్పకితచ్చనలన్ । చొచ్చగనివ్వనువాకిలి। కచ్చకుకొల్లవ్వనీతిగాదుమునీంద్రా॥

(నారదుని వాక్యము.)

క॥ మునులకుదొర్జన్యులతో । ఘనపౌరుషమేలనేను క్రతుభుగ్విభునిన్ । గనుగొనిదర్శనమొసగియు। జనుదేరగవచ్చినాడచయ్యానిటకున్॥

(సూత్రధారుని వాక్యము.)

క॥ అట్లాగైననునేని । ప్పట్లవొలంగెదను ప్రభువుపాలికరిగియే । పోట్లాటలేనిసవ్వడి । మాట్లాడితక్షణంబులో నెమరలుమునీంద్రా॥

వ॥ అనితొలంగిన వానింగడచి కలహప్రియుండు హరిభజనంబు శేయుచు హరిహయునిం జేరవచ్చి నెట్లనినా,

(పంచచామరములు.)

నమోస్తుచంద్రసూర్యలోచనాభవౌఘమోచనా । నమఃపతంగరాజవాహనాజగద్విమోహనా । నమఃసమస్తలోకపావనా సుధీజనావనా। నమోస్తుఘోరదైత్యమర్దనాహరేజనార్దనా॥౧॥ నమఃకరీంద్రదుఃఖశోషణాచిరత్నభూషణా । నమోస్తుతేమునీంద్రరక్షణాకటాక్షవీక్షణా । నమోస్తుశంఖచక్రసాధనాఘనాయశోధనా । నమోస్తుఘోరదైత్యమర్దనా హరేజనార్దనా॥—వ॥ అనిమరియునూ॥

(యమునాకళ్యాణరాగము-చాపుతాళము.)

గోవిందగోవింద। గోవిందాహరేముకుందా॥ గోవింద॥ ౧॥ దేవ... నారాయణశౌరీ। దీనజనావనవైరివిదారీ- పావనబృందావనసంచారీ । పరమపురుషమాంపాహిమురారీ॥ గోవింద॥ ౨॥ కనకాంబరశుభకరభవభంగా । ఘనసన్నిభభాసురశ్యామాంగా - వనజాలయహృద్వాస



శుహాభృంగా । వాసుదేవఖగరాజతురంగా॥ గోవింద॥ ౩॥ అమరస... యధరణీధరధీరా- యంభోనిధిసన్నిభగంభీరా । విమలచరితవసుదేవకుమారా - విశ్వంభరవేదాంతవిహారా॥ గోవింద॥ ౪॥ కరుణాకరసారసదళనేత్రా - కామకోటిసుందరతరగాత్రా । వరకిన్నరనరసురనతపాత్రా-వాలమేటిపరమేశ్వరమిత్రా॥ గోవింద॥ ౫॥

వ॥ అనిచతుర్భుజు భజనంబు శేయుచు తనకడకువచ్చుచున్న పోరుదిండికెదురుజని కృతాంజలియై పురందరుడిట్లనియె.

(ఇంద్రవాక్యము.)

క॥ సారాచారవిశారద । నారదలోకాధినాధవందనమీకే। నారూఢము గాగనమ । సారమలర్పింతుగొనుముసంయమిచంద్రా॥

(నారదవాక్యము.)

క॥ హాయినిసిరిసంపదలన్। చాయనిభువనత్రియాధిపత్యంబునదీర్ఘాయువున్మంతుడవైయన। పాయంబునవృద్ధిజెందుమాయమరేంద్రా॥

(ఇంద్రునివాక్యము-కందార్థము-రేగుప్తి.)

ఏందెందుకిరిగిమీరిపు। డిందరుదెంచితిరివింతలేమోకృపజే-న్మొందగశలవిమ్మశతా । నందాత్మజవిమలహృదయ-నారదా॥ గానవిద్యావిశారదా ॥ కారుణ్యామృతధారలాలరభువి । నారూఢిగగనిసంతయుదెల్పు॥ నారదా॥ (నారద వాక్యము.)

ద్వి॥ ఓపాకశాసనయోపాపహరణ- పపుదీపింపనేనిప్వేళకదలి - కైలాసగిరికేగిగౌరిసహాయు - డైలీలదేలుమహాదేవుగాంచి - వలనొప్పపూజించివారిశల్వంది - వలగొనివెండియువైకుంఠమునకు - రయమునజనిఇందిరామనోహరుని - భయభక్తిప్రార్థించిపద్మాక్షునాజ్ఞ - గైకొనిసత్యలోకముప్రవేశించి- ప్రాకటంబుగనుసరస్వతీసహితు-డగువిధాతృనిప్రీతినర్చించియుందు - నగణితంబుగనహల్యా వివాహంబు - ప్రాచుర్యమంగళప్రదమైరహింప - జూచినీకీటికిదచ్చుగవచ్చినాడ - వసుధనన్నారద్వైతంశవారాశి - శశధరుండగురామచంద్రభూవరుని - గరిమపాలించు శ్రీకరవాలమేటి - పురిపాలుసాత్త్విస్వర్భువనాధినాధా॥

క॥ అనవినిగుండెగభిల్లని । వనరుచుహాపిదుగువంటివార్తవినిబ
శ్శోక।యనితనవుమరచిచురిమెల్లన।ధృతిగొనిమునికిసురలలాముండనియెన్॥

(ఇంద్రునికందార్థము-తోడిరాగం.)

నారదయెన్నైట్లాయీ। సారివచింపుమువిరించిసదనస్థితినో। రా
రానేగోరినసతి । నేరశికుడుబెండ్లియాడే-నింతగా॥నమ్మితినెంతో-భ్రాం
తిగా॥ వింతలునేటికివింటిని-వాణీక్రాంతుడెవనికాకాంతనొసంగే॥ నింత

(మునివాక్యము-కందార్థము-రేగుప్తిరాగము.)

అతులితనియమవ్రతుడై । సతతముహరిగూర్చిబ్రహ్మచర్యంబున
ను । స్థితిదపముశేయగౌతమ । యతికిచ్చెనజుండహల్య । నదితితనూ
జా॥ భాసురసదృ-శామలతేజా॥ సదమలచరితుడసురలీతుడాఘనుడని
ముదలోనెంచివిరించియిచ్చెనచ్చపలాక్షీ॥ నదితితనూజా॥

వ॥ అనినసిర్వీణ్యుండై సుత్రాముండిట్లనియె.

(ఇంద్రవిరహము.)

(కాంభోదిరాగము-ఆటతాళము.)

అక్కటాయింకేమిశేతునహల్యమునిపాలాయగా యోగీశ్వరా
తేజో-భాస్వరా॥ ౧॥ తారతమ్యమెఱుంగకేటుజడహారికా శృంగారవ
తిసతిజేసెనూ।దార-బోసెనూ॥ ౨॥ తనకుతానేకోరిచేశినదానికెన్నికలేద
నుచువిధిమించెనో । మదినూ-హించెనో॥ ౩॥ కోమ్మనెన్నటికైననాకే
గూర్చునజుడనిబెట్టుగానెనుంటినీ । ఫలమిది-వింటినీ॥ ౪॥ మేటిగలబంగారు
మేడలనాటలాడెడుబోటియటవింజేరెనా । సుఖమె-మారెనా॥ ౫॥ వా
లమేటిప్రరీశుసాక్షిగ బాలపైగలబాళిమానక-జాలనూ। పరువింకేలనూ॥

ద్వి॥ కటకటాపంకజగర్భుండుశేయు - కటిలంపుపనులుబేరోల
ననద్భుతములు - ధనికునకిడడుసంతతికొంకొలది - ధనహీనునకువెక్కు
తనయులనొసగు - కష్టలోభికవర్చుఘనతనైశ్వర్య - మష్టకష్టము లిచ్చు
నత్యుదారునకు - క్షితిదీర్ఘరోగినిజేయుసంపన్ను - నతిఘధాతురునకు
నారోగ్యమొసగు - స్వల్పాయువులజేయు సద్గుణాఢ్యులను - నిల్పునునూ



రేండ్లునీచాత్మకులను - పాపిష్టితాసిట్టిపక్షపాతంబు - లీపద్ధతినొనర్పనిం
దునసేమి - యాదాయమోనిర్దయాళుండుగాక - లేదువివేకంబులేశాం
శమైన - యెట్టుగాభ్రతికెనో యున్నినాళ్లులజు - పట్టంబుగట్టుకభవకర్త
యగుచు - వేయువిధంబులేవేడిననివ్వ- బోయనికాననంబుననాకులలము-
మెసవుతాపసికేమిమేలనియొసగె - నసదృశలలితాంగి నగుపుష్పగంధి -
నోమునిశేఖరాయోచించిచూడ - నామీదచలపట్టిరాడబ్జభవుడు - కాకు
న్ననింతవెకలిసళ్లుకార్యంబు - తాకోరిచేయునేదగవెఱుంగకను- ప్రేమ
నన్నారెడ్డిశ్రీరామచంద్రు - నామోదమునవేలునట్టివాల్మీకి - పాలుని
కృపననుబాశిగౌతముని - పాలాయెనేమరుపాలైతినసఘా॥

వ॥ అనివగచుపురందరునకు శతానందనందనుండిట్లనియె.

క॥ ఒకనాలోకరర్థమువే । రొకనికిరాదనుజనోక్రినోష్వగ బృం
దా। రకనాయకవినవేచెలి । కకటావగువంగవలవదజ్ఞానిపోలిక॥

వ॥అనిపలికి-కలహప్రియుండంతర్ధానంబునొందె తదనంతరంబు నా॥

సీ॥ తామరసాక్షి సౌందర్యమెట్టిదోగాని యబ్బైకన్నులగట్టినట్టు
లాయె । మదిరాక్షిపై మోహమదియెట్టిదోగాని మదిగల్గువపలంబుమా
నదాయె । లావణ్యవతిగన్నలగ్నమెట్టిదోగాని మరపురవ్వంత్తైనబారయు
దాయె । తనకుజెందినకాలదశయెట్టిదోగాని రాజచిహ్నంబులురహిత
మాయె । మరుడుదాయాయెగుణములుమాంద్యమాయె।మరులుబలమా
యెనీదైవమాయకింక । నేమిశేయుదునంచుసురేంద్రుడపుడు।హాసఖీయని
మూర్ఛిల్లి యంతదెలసీ॥—వ॥ వితర్కించెనెట్లనినా.

(పున్నాగరాగము-అటతాళము.)

హరిహరియెట్లోర్తుసూ। యీవిరహసా । గరమెట్లీడగనేర్తునూ॥
అరవిందముఖియందమదియెట్టిదోగాని । స్థిరమైనమనసు స్వాధీనమువ
ప్పెను॥ హరి॥ ౧॥ కొలువుజేయనుమనసూ। సైసదిదేమో। విలయమెవరి
కిదెలసూ ॥ నలువునుజూచినపలుచేదనంబని । తెలియరాదెంతవింతలుబు

స్తైనా పాల॥ హరి॥ ౨॥ గౌతమమునిభాగ్యము । యేమనవచ్చు । గణుతింపబహుయోగ్యము॥ ప్రీతిగతనుదానేబిలచిపడుచునిచ్చె । ధాతనాయెడ పక్షపాతముజేశెహా॥ హరి॥ ౩॥ వలపులుతలకెక్కెనూ । మన్మధునికా । కలుషదేహముస్పృశించెనూ॥ యిలవాలమేటిమహేశా యాచకుని । కలకంఠిమోమెపుడుకనులారజూతునో॥ హరి॥ ౪॥

ద్వి॥ దైవమాయీమోహతాపంబునింక - నేవిధిజల్లార్తునేనెట్టులోర్తు - మానికెల్లాలామెమదవతియనుచు - నానారదుడుజెప్పినప్పటనుండి । మిన్నగామిన్నొచ్చిమీదబడ్డట్టు - లున్నదింకేమిశేయుదుధృతిమాలి - చిందరవందరైచెదరెనిచిత్తంబు - గృందగాజేసెచకోరవింటివాడు - మెప్పుగానూరశ్వమేధయాగములు - తప్పులేకుండసార్థకముగాజేసి - గైకొనిదగత్రిలోకప్రభుత్వంబు - వీకతోడుతపాలవెల్లినిదరచి - యంబుద్భవిల్లినయమృతంబుగ్రోలి - బృందారకులుగొల్వ పెంపొందివృత్ర - బలపాకనముచిజంభప్రముఖోగ్ర - బలనిశాటులబట్టిభంజించిమించి - యతిసాహసమునసూరంచులవాలు - ధృతిచేపట్టిపృథ్వీధరపక్ష - విసరముల్ తెగగొట్టివిశ్వంబునందు - నసమయశశ్శాలినైయున్ననేను - లలితాంగియగునహల్యానిమిత్తమున - చిలుకతేజీరౌతుచేజిక్కితలగి - మెలగు సామర్థ్యమేమియులేకనుండ - వలశెగాయింతయువనజాసనుండు - చలమెంచి యీలాగుసాధించిచెయు - దానికేమనవచ్చుతనకేమియుపక్ష పాతమా నా కీర్తినాసర్వేశ్వరాయింద్ర - పదవినాకేలనా భామలేకున్న - నా వేల్పుకల్లగానిటగానుపించె - సిరులనన్నారెడ్డిశ్రీరామచంద్రు - కరుణకుపాత్రుడు శ్రీకరవాలమేటి - పట్టణాధీశనీ పాదంబులాన - నిక్కైనయేకక్షణంబ్నోర్వజాలా ॥ వ॥ అనిబ్రలాపించుబలారికిప్రియుండగుయొకభృత్యుండిట్లనియె.

క॥ మగువ ముని జేరినందుకు । వగచినఫలమేమి దైవవశమునగాదే । మిగిలినపనిదలచుటలె । న్నగగతజలశేతుబంధనంబగునధిపా॥

వ॥ అనిననింద్రుం డిట్లనియె॥



(శ్రీరాగము - ఆదితాళము.)

మనసేమోనిలువదురా । యింకొకక్షణమైననా॥ మనసేమో॥ ఉసికైననుజలవనజశాక్షిని । కనులారగగనుగొనకున్ననునా ॥ మన॥ ౧॥ చకోరనికోమలిరా । దానికిసరిపోలిన । చానలెవరులేరురా॥ మకురవదన గపకనుజేరియు । చకోరమోవిచుఱుకునొక్కకనా॥ మనసే॥ ౨॥ ముద్దులుగావువినరా । నాప్రాప్తమవనినీ । పద్ధతివెలశెనురా॥ పద్మజుడాని చెలినిద్దపుచెకురులు । తద్దయుప్రియమునముద్దుగొనకనా॥ మనసే॥ ౩॥ అబ్బబ్బాబిల్వలేచురా । పూవింటివానిబలు । దెబ్బలతిశయమాయెరా॥ నిబ్బరమెనయగప్రబ్బుబోటిబిగి । గబ్బిగుబ్బలనుకానకగొనకనా॥ మనసే॥ ౪ ॥ ఫలముల్విఫలమాయెరా । శ్రీవాలమేటిపురి । పాలుడదయుడాయెరా॥ కలగి చెలగివిచ్చలవిడియలయళి । కులవేణినిరతిగలయకున్ననా ॥ మనసేమోనిలువదురా ॥ ౫॥

వ॥ అనియివ్విధంబున సంక్రందనుండు గౌతమాశ్రమగమనోన్ముఖుండైయుండెనక్కడమునివరుండు తనభామామణితోనిట్లనియె॥

(కాంభోదిరాగము - అటతాళము.)

వెలదిరోమనయింటగలపనులెల్లని । ర్వేర్చినావలే । నేను, చెలిపుగనిందుకావలయువస్తువులెల్ల । జేర్చినావలే॥ ౧॥ వాశిగామడికిధోవతులాయుతికియార । వేశినావలే । పర, మేశునిపూజకునింపైన పువ్వులు । గ...నావలే॥ ౨॥ భామామణిరో పంచపాత్రయుద్ధరిణే । తోమినావలే॥ గడు...మిళ్ళశాకపాకములమర్చుట కేదువేమిలే ॥ ౩ ॥ వోసతీపూ...మ్మప్రదేశముపరిశుద్ధి । జేసినావలే । మత్త, కాశినీగంధమక్షతలెల్లజా । గ్రత్త, పోశినావలే॥ ౪॥ వంచనలేకింమవచ్చి నర్థులనాద । రించినావలే । భక్తి, మించగశ్రీవాలమేటీశుసతినిపూ । జించినావలే॥

వ॥ అనినమగనికిమగువయిట్లనియె.

ఉ॥ తీర్చితినింటిలోపనులుదీసితిగంధముజేసితక్షతల్ । గూర్చితినెల్లవస్తువులుకొంకకవస్త్రములారవేసితిన్ । జేర్చితిపత్రపుష్పఫలశీతలవారిసుశేంధనంబులన్ । నేర్చినయంతనాయెడలనెక్కువ...వేదువల్లభా॥

సంధి ॥క॥ అనిపలికి-ననిజవనితా । వినయోక్తులకలరియోగివిభు డాహ్నికముల్ । మనమునువాక్కునుకాయం । బును చెడరకొనర్చుచుం డెమోదంబెసఁగన్ ॥

(ఇంద్రుడు గౌతమవనంబునకు వచ్చుట.)

ద్వి ॥ అత్తరిశతమఖుండంగనాదత్త - చిత్తుడైవిభ్రాంతిచేసన్నైతే ది- భృత్యులందు వెంట రాబిరబిరగదలి - యత్యంతమైనయాయానంబుబూ ని- మరుదూపులకుజిక్కి-మరిమరిస్రుక్కి - యురుధైర్యమునుదక్కి-యుస్సు స్సురనుచు - చందనమందారసరళమాకంద- కుందకురంటకకురువకాశో క - తాలతక్కోలహింతాలజంబీర- సాలరసాలాదిసాలావళీల - తా లోలఫలకుసుమావృతంబగుచు - రాజిల్లుగౌతమాశ్రమమతివిభవ - శ్రీశె లంగఁబ్రవేశించామహాత్ము - చెంతకుజనిరెండుచేతులుమోడ్చి - యెంత యుభక్తితోనిట్లనిబలికె॥ (ఇంద్రవాక్యం)

(నాదనామక్రియరాగము - ఆదితాళము.)

శరణుశరణూ । సోమానిచంద్రా ॥ శరణు ॥ శరణుశరణుతవ । చరణకమలములు । కురుతరదురితనికరపరిహారా ॥ శరణు ॥ ౧ ॥ పరమపు రుషనిరుపమదివ్యతప । శ్చరణయశశ్రీకరబుధసేవ్యా ॥ శరణు ॥ ౨ ॥ హరిని భతేజముదారిసమన్విత । గుణమానససద్గుణపరివారా ॥ శరణు ॥ ౩ ॥ శీల జాలకరుణాలవాలవర । వాలమేటిశశిమౌళిసమాన ॥ శరణు ॥ ౪ ॥

(గౌతమవాక్యము.)

క ॥ స్థిరమాయెనైశ్వర్యము । లిరవుగఁగైకొనిసుకీర్తినిరవుదలి ర్పన్ । పరమప్రమదంబుననీ । ద్ధరణిన్వర్ధిల్లునముచిదానవహరణా ॥

(ఇంద్రునివాక్యము.)

ద్వి ॥ తాపసలోకశతరణిప్రకాశ - పాపసంఘవిదారభవ్యాప్ర చార- యమలచారిత్రబుధావళీస్తోత్ర- సమధికగుణజాలసనయాలవాల- నిర్మలమితభాషనిత్యసంతోష - దుర్మదపరిహారదుర్వాదాధార - స్థిరము గామిమ్ముదర్శించినకతన - పరువడినేజేయుపాపంబులెల్ల- దలగిమికట్టి



మైనధన్యతగంటి - కులపావనంబయ్యెకొదువలుదీరె- మానితతేజక్షేమ మేకదామీకు- దీనమందారుడౌదేవుసన్నిధికి- గురుసముఖంబునకును రాజ కడకు- తరళాయతాక్షిచెంతకుచిన్నశిశువు- చెంగటకేనివట్టిచేతులబోవ- సంగతిగాదందుశాస్త్రములుల్లలుకు - కావునమీకిదేకానుక గానిప్డు- మా వనంబునగల్గుమహితపుష్పములు - వరగృహస్థాశ్రమవాసులుగాన- స్వర ములుగూర్పించిసంప్రీతిదెచ్చి - నానుగ్రహించియున్నారెడ్డికులజు - దైవ శ్రీరామచంద్రాధిపునవని - సేతేమువాలమేటిశుడుమెచ్చ - మాలిమిధరి యించుమామానివర్యా ॥

వ॥ అనిసమర్పించినంగ్రహించి యాహల్యనీక్షించి తపోధనుండిట్ల నియె ॥

క ॥ రావేరావేభామా । దేవప్రభుడొసగినాడిదేసుమదామం । బో వెలదిరో నాకేటికి । నీవేతురుమందుదురుమునీటు [illegible]రయఁగన్ ॥

వ॥ అనియొసంగినా॥

క॥ కౌతుకంబునరతికేళికి । క్రతుభుజపతియిడినసంచకారమొయన గా । పతిచేపువ్వులదండను । సతిగానిశిరసావహించెసంభ్రమమొదవన్ ॥

వ॥ ఇట్లుధరించినసింద్రుండవలోకించి తనమనంబునా ॥

క ॥ విరివిగనేదెచ్చినయర । విరులన్నియరిబోణిసొంపువెలయధరిం చెన్ । సురభూసురులెన్నగనే । నరయఁగృతార్థుండనైతినికడువేడ్కన్ ॥

వ॥ వర్ణించెనేలాగనినా ॥

(ఆనందభైరవిరాగము-ఆదితాళము.)

వాహవ్వాయిట్లుండవలదేవైయారీసొగసూ । మోహనాంగిని జూచితినీ । యాహాహాధన్యుడనైతినీ ॥ వాహవ్వా ॥ కన్నులుమీనంబులరటే । గున్నలుచిరిదొండలుమెరుపు । వన్నెలుమైకాంతులులే । చన్నులుకోకంబు లిసుక । దిన్నెలుబల్పిరుదులిట్టె । వన్నెలాడినెన్నదరమేపన్నగకులేంద్రునకై న॥ వాహవ్వా॥ ౧॥ నీటులుసొగసైనముద్దు । మాటలుచిలుకలగేరు । తేటు [illegible]ంగురులజిగి । పాటలుశింగారమైన । యాటలుహొయలైనపువ్వు

బోటులీవధూటికాలిగోటికీదిబోదురెమెల్॥ వాహు॥ ౨ ॥ వల్లగారాదీసి దీసి। చల్లగాసరసంబులాడి। మెల్లగాచనుఁగనువుపరచి। కొల్లగాకౌగిట జేర్చి। పల్లవబాణునికేళీ। నుల్లమురంజిల్లగలశేవల్లనాకేవల్లగల్గునో॥ వాహువా॥ ౩ ॥ ధీరుడుసమస్తలోకా। ధారుడునిత్యాశ్రితమం। దారుడువాలమేటివి। హీరుడుమీసాక్షిమనో। హారుడుసతతరుణాపారా। వారుడైనాకోరికనుమేతీరుగాకడతేంజేయనో॥ వాహువా॥ ౪॥

వ॥ అనిబల్లులేఖర్షభువకుభృత్యుండిట్లనియే॥

క ॥ మునివరుడులేనిసమయము। గనివచ్చిలతాంగిమనసుగనవచ్చునునిం। కమజాలిమానిమనపురి। కనువుగనేడరిగివత్తమసురాధీశా॥

వ ॥ అనినభబునిమాటలంగీకరించి సురవల్లభుండమరావతికరిగెనిటమురువాడరుణోదయంబునమేల్కని మునీంద్రుండహల్యాదేవికిట్లనియె॥

సీ ॥ శ్రీశివారాధనసేయగావలయును। శరదిందుముఖిప్రదోషంబునేడు। వన్యలకేగినేవత్తునీవింతలో। పలపర్ణశాలనుగలుగుపనులు। సమకూర్చిపాత్రలుచక్కగాపరిశుద్ధి। జేసితోయములాడిచేలగిశుభ్ర। చేలంబుధరియించిశీలంబుసనుమించి। ఘృతసూపవ్యంజనాన్వితరసాన్న। మెలమిసైనపుపిండివంటలుతయారు। పరచియుంచుమువిమలస్వభావవృత్తి। గలిగిమెలగివధర్మార్థకామమోక్ష। ములులభించునుదీవనోకలువకరి।

సంధి ॥ద్వి॥ అనియిట్లుశలవిచ్చియామహాత్ముండు-జపిమ్మటకడుశ్రద్ధవహించి - జెప్పినపనులెల్లశీఘ్రంబుగాను - తప్పకయొనరించిధన్యాత్మయగుచు - తనసుందరమునకుదగినసద్గుణము - ఉనువంశమునికాంతలాశ్చర్యమందగ - చలనంబులేనినిశ్చలవృత్తిబూని - పాలతిమహానందపూర్ణయైయుండే ॥

క॥ ఆలోనసునాశీరుండాలోలవిమోహపరవశాత్ముండగుచుఁ। నేలామంచముఁబట్టక। జాలింబడిలేచితపసిసదనముఁ జేరెఁ॥

(ఇంద్రుండు రెండవసారిగౌతమాశ్రమమునకుబోవుట.)

వ ॥ ఇట్లునిజాశ్రమంబుజొచ్చివచ్చుచున్నవి యచ్చరశేఖరునికనతిదూరంబునందిలకించిపులకించివయస్యారత్నంబునకిట్లనియే॥



(అహల్యవాక్యము.)

(ముఖారిరాగము - ఆదితాళము.)

ఓచెలియాయిటురావే। కా, లోచితమేమోగదవే॥ ఖేచరనాథుండడెవచ్చెనుమన। గేహమునకుగనుగొనవే ॥ ౧॥ మునివరుడింటనులేడూ। ఈ, యనఘుండుమహామహుడూ॥ వనజాక్షిరామర్యాదెటుశేయగ। వశెనోదెలియదెనేడూ॥ ౨ ॥ సిగ్గగుచున్నదెబాలా। కడు, శృంగారుడేవిరిగోలా ॥ యెగ్గుదలంచునోయేమనుకొనునో। యెదుటనిలతునేలీలా॥౩ ॥ పాలితసుజనుడుగానా। సం, భావించుటమేల్ చానా। వాలమేటినిలయునిబాధించుచు। వచ్చునుపతియీలోనా॥ ఓచెలి॥ ౪॥

వ॥ అనితలంచియుండెనంతనింద్రుండుతనమనంబునా॥

ఉ ॥ పన్నగవేణిచెంగటతపస్విపరేణ్యుడులేనిచందమై। యున్నదిమంచికాలముపయోజభవుండికనేమిసేయునో। తిన్నగనేడుకొంతతమిదీరగదావగలాడిముచ్చట। ల్విన్నసులజ్జబాపికడువేడుకతోమరుమాటలాడినన్ ॥— అని॥

చ ॥ శరదమృతాంశుబింబజితచారుతరాస్యవనేరుహంబునన్। జిరినగవంకురింపసురశేఖరుడత్యనురాగమగ్నుడై। యరవిరికందుకంబుకరమందుజెలంగననంగభంగసుం। దరమునపర్ణశాలకుముదంబునజేరితాంగికిట్లనున్॥

(శంకరాభరణము - ఆదితాళము - సంవాదము.)

క్షేమమేకదామీకిపుడుఓమందయానా। యేమేమీకొదువలుగలవీవనంబునా ॥ అహల్యమాట ॥ త్రిభువనంబులేపునమీరేపాలింపగా। శుభముగాదేమాబోటికిసురలోకనాథా॥ ఇం ॥ సందడిలేనట్టిపర్ణశాలనిన్నుంచీ। మందయానాసిప్రాణేశుడెందుబాయెనే ॥ అ ॥ ఘనముగఫలపుష్పములుగొనివచ్చుకొరకూ। వనమునకిపుడేగినాడూవజ్రసాధనా ॥ ఇం ॥ ఆమహాత్ముడిచటికెప్పుడరుగుదెంచునో। వామనేత్రీనేనుపోయివత్తునానేడూ ॥ అ ॥ సమయమూయెవత్తురిందునిమిషమునిలచీ। యా

మునాథా యటంచు పూజలందితివయ్యా ॥ ఇం ॥ అంతవరకాలస్యమేలసంగనామణీ। యింతటిదీనివేమొసగి పంపరాదటే ॥ అ ॥ శ్రీలవాలమేటిగా లోలుసాక్షిగా। బాలనునాకేమి దెలుసు పాకశాసనా॥

(పూలదండసంవాదము.)

(ఇంద్రునిమాట - కందార్థము - రేగుప్తి - అట.) ॥౧॥

లలనాసిగ్గేలనునీ। వలనీబుస్యాశ్రమంబునర్థితవిబుధా। వలినై అమరావతిపురి। చెలువమునిరసించెనహహా। చిలుకలకొలికీ ॥ వలరాయనీ॥ యలరులములికీ ॥ చెలగినీవిచ్చటజేరియున్నావని। యళుకుజెందుచుమిందురానీ తెలివిమే పెద్దలకుగలనో ॥ చిలుకలకొలికీ॥

(అహల్యావాక్యము - కందార్థము - రేగుప్తి - అటతాళము.) ॥౨॥

త్రైలోక్యరాజ్యలక్ష్మీ। లోలుడవైయున్న చోటులోపముగలదే। మాతిమీరుండినవగ। కాలాగేహోచునీమ॥ సారాచసీమా। ఘోరారిపి। దాశసుత్రామా॥ భూరివైభవములింపుగ జెందిభాసిల్లు। వారుమీరరుదేరక నాశ్యంగార మైజిగిమీరునెయా। యారాచసీమా॥

వ॥ అనిపలికిన సకలకంఠిమధురవాక్యంబులకలరిబలారియిట్లనియె॥

(ఇంద్రునివాక్యము - శంకరాభరణము - రేగుప్తి - అట.) ॥౩॥

సురకిన్నరగంధర్వా। ప్సరకాంతలకన్ననధికసౌందర్యమునన్। పొనయోమువనిమందారవు। విరిసయలం దెచ్చితివిగో। వెలదిగై కొనుమా। చెలువుగదీని। వలపులుగనుమా॥ సలలితమైననీజడనుధరించిన। గలదుమాకివిగన్నివందుకుఫలమిదె కేవలముదంబున। వెలదిగైకొనుమా॥

(అహల్యావాక్యము - కందార్థము - రేగుప్తి - అట.) ॥౪॥

పరమానురాగమునవిరి। సరములుమీరిడ మహాప్రసాదంబని నే। శిరమునధరించుటకు నే। మరమరదయ శేయుమయ్యా। హరిసమతేజా। యాచకకోటి। వరకల్పభూజా॥ సురలభూసురలసుస్థిరముగనేలుమేల్। దాతలుమీకిచ్చినపదార్థముపరమపావనమాటకరుదే॥ హరిసమతేజా॥

వ ॥ అనిబలికి పూవండనుబుచ్చుకొనిన నిచ్చితన్నుదామెచ్చుకొన్న తెరగుమటిదారశాల్గంటికిట్లనియె॥



[ఇంద్రవాక్యం.]

క॥ ఏలనాగాతడవిక్కడ। నిలుచుటకిది వేళగాదు నేపురిజేరన్। వలనొప్పపోతువచ్చెద। శలవుకటాక్షించవలయు శాశ్వతకరుణన్॥

(అహల్యాదేవివాక్యము - సంవాదము.)

[సాదరామక్రియరాగము - ఆదితాళము.

శ్రీశచీప్రాణలోలా। శీలసద్గుణజాలా। వాశిగానేడిందు। జేసిపోదగునువిందూ॥ శ్రీశచీ॥ ఇం॥ ఓజగన్మోహినీ। యుల్లమలరనీ। పూజలొల్లైకొంటా। పూర్ణానందముగందూ॥ నోజగ॥ అ॥ పేదవారంచుచాలా। భేదమెంచకే వేళా। సాదరంబునబ్రోవా। జాలియుందువుదేవా॥ శ్రీశచీ॥ ఇం॥ అరమరలేనిక। టాక్షముబూనుకా। పరువడినీవుబల్కే। పలుకులమృతముజిలేకే॥ నోజగ॥ అ॥ గొప్పవారలుగానా। కొదువలెన్నియుండినా। తప్పకమన్నించి। దయజూపుడీమేలెంచి॥ శ్రీశచీ॥ ఇం॥ సిరిమించువాలమేటి। శివుడెన్నగానీపాటి। పరువెరింగినవారూ। తరుణులెవ్వరులేరూ॥ యోజగన్మోహినీ॥

వ॥ అని యీప్రకారంబున శక్రుండాచక్రకుచవలన నతిథిసత్కారంబులం బరితుష్టహృదయుండై ప్రత్యహంబువచ్చుచుంబోవుచుండె తన్నిమిత్తంబునా॥

(శచీదేవికథాప్రారంభము.)

ద్వి॥ అంతశచీకాంతయతులితస్వాంత - కంతునిపిరిగోలకమనీయశీల - వదననిర్జితసోమవరుగుణధామ - సదమలచారిత్రి చంచలగాత్రి - విభవంబులకుసాటివెలదులమేటి - ఇభరాజయానమహేంద్రునిచాన - పనిబూనిజలకంబుపన్నీటనార్చి - ఘనమైనమల్లెమొగ్గలచీరగట్టి - రంగుజల్తారుపట్టురవికెనుదొడగి - శృంగారమొనర కస్తురిబొట్టుబెట్టి - మేపుమీరినసొమ్ములెల్లధరించి - సొంపడిమృగమదచందనంబలది - విరివిగాగస్మునివిడియంబుజేసి - శిరిగులుకపడకిల్లుజేరినెచ్చెలులు - మచ్చికలెచ్చమేమూరకనిచ్చ - వచ్చినరీతిగొల్వగనెయ్యమూని - పరమానురా[illegible]రితాత్మ

యగుచు - విరులశయ్యనువనోవిభుఁ చెంగటను - పలవునబండి సేవలు సే
యుచుండి - పలుకరించినమారుబలుకకుండుటకు - పలుదెరంగులు బూ
నితిమాలిచాలి - తళుకుబెళ్కులకొంతతనతీవిజూపి- వగచిమైమరచిరవ్వం
తలోదెలసి - మగనిపూబాన్పుపైమఱిగానలేక - కళవళంబంది యకట
చిత్తచోరు - దలిగనోతాలగనోయని యుట్టిలేచి - యతనునిశరములకళి
కిచందురుని - లితతమావెన్నెలవేడిమికులికి - చిలుకపలుకులద్రోసిచెలగు
కోవెలల - కలకలధ్వనిరోసికడులజ్జబాసి- లలినియన్నారెడ్డిరామచంద్రా
ఖ్యు - నెలమినేలెడువాలమేటీశునెంచి - తనపాటుచెలులతోదలపోయు
కొరకు - కనకాంగికేళికాగారంబువెడలె॥

(మధ్యమావతిరాగము - ఆదితాళము.)

ఇంద్రాసుందరీవచ్చేనమ్మా। అమ్మాఓయమ్మలార ॥ ఇంద్రా॥ ౧॥
సాంద్రానందస్వాంతలగుచుసుర । చంద్రముఖులుమెచ్చట లాడగతగ ॥
ఇంద్రా॥ ౨॥ సురసిద్ధసాధ్యులుభూషింపా। చరణాంబుజములక్ । దురు
మంజీరాదులుఘోషింపా॥ వరమణిమయసుందరహారంబులు । కురుకుచ
ములపైనెరసిమెరయగను॥ ఇంద్రా॥ ౩॥ కడుమందమందయానమునా । గ
రుడగంధర్వ । యుడురాజముఖులుహాయలుతోనా । అడుగడుగునకిడు
మడుపులుమెట్టుచు । నడలకుపిడికెడునడుమువడకగను॥ ఇంద్రా॥ ౪॥ ఆన
నంబునచిరినవ్వొలుకా । కీల్కొప్పునప్ర । సూనపంక్తులుసొంపుగులుకా।
మానుగపురిగలచానలెల్లదొరసానివచ్చేననిపూనివచింపగ॥ ఇంద్రా॥ ౫॥
నీలంపుగాజులునెన్నొందా॥ చాకళ్లుకంక।ణాలుపాటీలుమెరుపుజెందా।
కేలుదమ్ములనుగీలుకొల్పివర। వాలమేటిశశిమౌళినిదలచుచు॥ ఇంద్రా॥ ౬॥

వ॥ ఇట్లువచ్చినసుందరాంగికి సూత్రధారిఇట్లనియె.

క॥ ఎలనాగానీపేచే। దెలుగోలువ హాయెల్లనిచ్చటికివచ్చితివా।
నెలమినసభవారువిననీ । కలతెరగును తేటపడగక్రమమునజెపుమా॥



(శచీదేవివాక్యము- .)

ద్విపద॥ చెప్పెదవినవమ్మచెలులారమీకు - తప్పకనాసవిస్తారంబు
నెల్ల - ఘనుడుమామామయాకశ్యపబ్రహ్మ - యనువొందవదితి మాయ
త్తగారమ్మ - యలజయంతుడుపుత్రుడమరులుమరదు- లలివేణి దేవేంద్రు
డాత్మేశ్వరుండు - బాగైనసంపదల్ప్రబలిసంతతము- భోగభాగ్యములకు
పుట్టిల్లనంగ - రంజిల్లుశ్రీయమరావతీపురము - మంజులవాణిరోమాకుకా
పురము - పొసగపులోముని పుత్రినై పుట్టి - వెసముజ్జగంబులు వినిపగా నే
లు - నట్టిమహారాజుకజ్జాక్షినేను - పట్టంపురాణినైప్రఖ్యాతిగాంచి- పల
సిల్లుచుందునీవిశ్వంబులోన - సలలితంబుగరామచంద్రధీవరుని - మెలపు
ననేల్వాలమేటీశుసాక్షి - తెలయజెప్పెదశచీదేవినాపేరు॥

(సూత్రధారునిమాట.)

గీ॥ పాకశాసనునకుపట్టంపురాణివ । టంచుబల్కితివిగృహాంతర
మున । వాశిమీరరాణివాసంబువదలినే । డిందుగాబనేమియిందువదనా॥

(*) శచీదేవివిరహము. (*)

(శుద్ధసావేరిరాగము-ఆదితాళము.)

బోటీయేనెట్లోర్తునే। యీవిరహమే। పాటిగనీడేర్తునే॥ పాటలగం
ధీనాతోటికూటముబాళి। ధాటిగబోయినాధవుడిందురాడాయె॥బోటీ॥౧॥
యెంతపనికైజనినా। సురనాయకు । డింత[illegible]ండువా ॥ అంతరంగ
మునన్నీవింతదలంచగ । పంతముజేసినపద్ధ[illegible]॥ బోటీ॥ ౨॥ యేకాంత
వలపించెనో। దాసితోగలశ్రీ। యేకాంత[illegible]॥ ధీకొనినుదసుతిదే
కాలమనిచిగు । రాకుదూపులనెదచీ[illegible]॥ బోటీ॥ ౩॥ క్షణమొ
కయేడాయెనే। చందురుడుమా। యనకుజలికాడాయెనే॥ వనితావాలమే
టీశునిపదభక్తినై । మ్తనమునదలచునాఘనునిపొందెడబాసి॥ బోటీ॥ ౪॥

(చెలిమాట.)

క॥ వరుడింతనెనరులేకను।విరహంబుననిన్నుద్రోచివిడివడిపోవక్।
నెరజాణతనంబుననో । గరితానీతప్పుడైనకలహించితివా॥

(శచీదేవివాక్యము-కందార్థము- రేగుప్తిరాగము-అటతాళము.)

పలుకులకుమారుబలుకక । వలపునభయభక్తిగలిగివర్తించెడినా। న్నలయించితోలగెసింతటి। కలతకుకారణమదేమో। గదవేవో చెలియా॥ నానేర।మొకటిలేదే తెలియా॥ మదగజయానసీపదపంకజములాన । కడురగపతికనుకూలముగానుంటి॥ గదవేవో చెలియా॥ ౧॥

అళివేణులలోపలనను। తలవంచుకొనంగజేశి తానరిగినవిం । తలనవ్వులకేమనవలె । తలిరాకులబోణియింకా । తాళలేనమ్మా ॥ సదయునకిది । మేలౌనటమ్మా॥ జాళిదీరగపంచబాణుని కేళిని । వ్వేళనుత్రైలోక్యపాలుని గలయక ॥ తాళలేనమ్మా ॥ ౨॥

మదనుండిదెసమయంబని । గుదిగొనగురిచేశికులుకు గుబ్బలమొనలణ । పదనుగలచిగురుములుకులు । చెదరకసంధించెనేమి । శేయుదునమ్మా ॥ మరులెఱ్ఱ్వ । లాడమేనెకొమ్మా ॥ హాయినితనపొందుబాయనినన్నింత। రాయిడిజేశితానీమొడజనెనేమి। శేయుదునమ్మా॥ ౩॥

ఓశమ్మా॥— సీ॥ మన్నించితొడలపైనన్నుంచుకొనితళ్లు చెక్కిళ్లు గొనగోట జీరునమ్మ । కడుతమిమీరనాకమ్మనివాతెర గ్రక్కునమోనపంటనొక్కునమ్మ। గురుతుగానాగబ్బిగుబ్బచన్నులమీద వలపునసెలరేఖ నిలుపునమ్మ। మరులుబుట్టించినెమ్మదిమించిలాలించి సంభ్రమంబునక్రీడసల్పునమ్మ। యామురుపులావిలాసములాసరసము। లావినోదములామోదమా। సుఖంబు । లెన్నిదలంచిజాళికెటుదరింతు । నెపుడునాకాంతుగాంతు రాకేందువదనా॥ వ॥ అనిమఱియును.

(కలాంబరి రాగము-ఆదితాళము.)

ఏమిశేతూ నేటులాసైతూ। నీమోహమెంతనిదాతూ। నామోహనాంగునిదయ! నామీదలేదాయె నేవో। భామలారా। నేతాళనే॥ ౧॥ కన్నులజూడలేకాను । మున్నెవ్వరిపొందికలనూ। పన్నుగనెడబాపితినో । మిన్నగనాకదిభ్రాంతించె ॥ కన్నెలారా ॥ నేతాళనే ॥ ౨ ॥ ఏకరసముగానున్నాడూ । నిక్కచన్నులమొనలమీద । చకోరవింటివాడుఖ । చిక్కననన్నులేశేనే॥ యకటాలారా । నేతాళలేనే॥ ౩॥ నూట్నిగ్గా శ్రీవాలమేటి। చాకనాధీశ్వరునిమాటి । మాటికిదలంచునట్టి । మేటినేజూహరిఫవు॥ బోటులారా॥ నేతాళలేనే॥ ౪॥



క॥ మఱువనేలెమసతఱ్ఱప ; గ్రక్కునవిడవాడిచాలకఠినంబునవో । శకారవాచక్కనిదొర । చిక్కులుబెట్టెగ ఎందుజేరెనోగదవే॥

(చెలిమాట-అమ్మయ్యా.)

గీ॥ తప్పులేదటంచుమెప్పుగానీవాడు । కైపుమాట నమ్మకంబుగాదు । తప్పులేకయున్నధవుడేలవిడవాడు| నిజముబలుకవమ్మనీలవేణీ॥

(శచీదేవిమాట.)

ద్వి॥ ఓశమ్మవినవమ్మయోప్పైడిబొమ్మ - యాశించిమేలెంచి యతనినామోహ - రాశియానియేమరకదోశిలొగ్గి - లేశంబునెడబాటులేకొక్కరీతి - నుందునేమందునేయువిదనావిభుడు - పొందుగాపక్క నొప్పగబవ్వళించి - పదిమాటలకుమారుపలుకొక్కటైన- ముదముగాబలుకకమోమరవంచి - యుస్సుస్సురనుచునిట్టూర్పుజెలంగ - నిస్సారమునబలేసిర్విణ్ణ్యావృత్తి- గొనుగుచుదిగ్గుదిగ్గునలేచిలేచి- తనలోనతానపైతలయూచియూచి - కొంతసంతాపంబుకొంతసంతసము - వింతగాబెనగొనవివశాత్ముడగుచు - భావమేమాత్రంబుబట్టీకనిటుల - నోవారిజాననా యుండినట్లుండి - ననుమన్మథునివేదనకునొప్పగించి - కనుమూర్చిపోవుట గానలేనైతి - నేకాంతకడజేరియేకాంతకేళి - నాకాంతుడున్నాడో నావల్లనేర - మేమిలేదకటాయదేమిబోధనయో - నామాటనిక్కమెన్నడు కల్లలాడ - వనితయన్నారెడ్డివరరామచంద్ర - ఘనునిపాలించుశ్రీకరవాలమేటి - గరకంఠు నెంచిశీఘ్రముగనీవేగి - వరుని దెమ్మన్నవోర్వగలేనెకొమ్మా॥

(కాంభోదిరాగము - ఆదితాళము.)

ఓశమ్మా నేనొక్కాతినె। మోహార్వలేనేయక్కా॥ ఆశదీరగానునాసి। జశుని మోమునుజూడక॥ నోశమ్మా॥ ౧॥ యెవ్వరాకుందూ, రే। నెవరివేడుకుందూ। పువ్వుబోంట్లలోనచాలా॥ నవ్వుబాట్లాయెనీలీలా॥ నోశమ్మా॥ ౨॥ మరునిదంతపోరేనా మగకేళిలీలే । మెరుగుబోణి యెంతనియుల। విరహముభరియింతునకటా॥ యోశమ్మా॥ ౩॥ పడతియాడిక్కన్యాపా। ల్పడెగదేనా ప్రభువుకూ। [illegible] శ్రీనాలమేటి । భూతేతునిసాక్షిగానే॥ యోశమ్మా॥ ౪॥

(చెలి మాట.)

క॥ కనకాంగి దేనియందున । ననుమానము నీకుగలదు యదియుండిన తా । పున నాకు దెల్పినను నే । జనిమేవగనై ననీదు సదయుని దెత్తున్॥

(శచీవాక్యము.)

సీ॥ చెలియమే చెలియందు చెందెనో చిత్తంబు మట్టెరుంగకయున్న మనువులందు । కాంతయే కాంతపైగల మోహమోయొద్ద బవళింపపక్క కుదివియకుండు । రామయే రామవిరాళి రోబిగువుగా కౌగిలించిన జబ్బ కౌగిలిప్ప । బోటియే బోటిదుర్బోధనలో గాని యురకే చెర్చునను మోముంచుకొనును । కొమ్మ నేనయి బలిమి పైకొన్నచాల । బరవశము జెందనే మందుపడతులందు । చిన్నతనముగ నను జేశి చెలగి మొందు । బోమ్మనో ప్రాణనాథుండు పుష్పగంధీ॥

(ఓశమ్మా-కందార్థత్రయము-)

బాయని విరహము భారం । బాయెను నాకేమిదోచ దాయెను వయలే । దాయెను నా నాథునికిది । న్యాయముగాదోచెనే మో । నవమోహనాంగీ॥ చల మెంచనే । నాపై నిభ్భంగీ॥ ధవులను బాయని తరుణులందరుగూడి । సవరణగా నవ్వసాగిరిగద వెవో॥ నవమోహనాంగీ॥ ౧॥

బంగారు మేడలోపల । చెంగలువల పాన్పుపైని చెలువుదు పక్కన్ । రంగలర జేరి నెరపెడి । సంగతులిన్నును దెప్ప॥ జాలనే బాలా । మిక్కిలి మాట । లేలనే చాలా । మేలెంచి సామి సలాలించి రతికేళి । జేలించు వగలెల్ల జాలించి తుణమోర్వ॥ జాలా నే బాలా॥ ౨॥

సామ్మిని ప్రాణేశ్వరు సము । ఖమ్మున వర్తింపలేకే కాంతుకు శ్యాలగా । రమ్మేల మేరుగు బంగరు । సొమ్మేలను జూపవేయో । శమ్మా నావతువీ । చిత్తము నిల్వ । దమ్మయి త్తరిని గ్రీష్మన మోహ తాపమ్మున కోర్వవ । శమ్ము గోదిక్కు రారమ్మ నిబిల చితే॥ వమ్మ్మనా నా యసిత॥ ౩॥

ఓ చెలియా॥ ... సీ॥ వలపువల్లభులు గావా తెరయాన నేనా మాతు నా ప్రియవల్లభుండు । యలుక్కగబ్బి గుబ్బలు కేల వంచు నేనవమోహనాంగి నా నాయకుండు । సరసోక్తులకు పదు తరమిష్య్యకుందునే యింతి



రోనా జీవితేశ్వరుండు । చూపులేకమెకల్ల చూపులు జూచునే యోమానినీ నామనోహరుండు । యేమి దెల్పుదు నీచేష్ట లెంచిచూడ । చంచలాక్షి బలారిమే చంద్రముఖి కౌదక్కెగా బోలు నిక్కమే నొక్క నిమిష । మైన తాళగజాలనే యక్కలారా॥

(మత్తకోకిలావృత్తములు.)

వాని పాదములొత్తు చేతులు వన్నెలాడెటు దాతునే । వానిగోటులకాటు గుబ్బలు వాలుగంటెటు జూతునే । వాని కేలను జీరు చెక్కులు వామనే త్రెటు శేతునే । వానిరతి బెనగొన్న తనువిక వారిజాక్షెటు సైతునే ॥ ౧॥

గండుమీరి మదుండు పై సుమకాండములు సంధించెనే । దండుగూడి పికాళి కేకీధ్వనులు రొకమైమించెనే । దండబాశియ ఖండలుండీ । ధాటిచలము వహించెనే । పుండరీకదళాక్షి నేనెటు బోదు మదిశలడించెనే॥ ౨॥

గీ॥ లోలు నెడబాశి నే తాళజాలనింక । తేనెలో చక్కెరను గల్పి తెమ్మురొ యొక్క । పలము ద్రావియు జీవంబు బాపుకుందు । వానికెక్కిన ప్రీతి గావనజనేత్రీ॥

గీ॥ పువ్వుబోటులలోన నువ్వు బాటు । లాయె నా బ్రతుకేలసాహసము బూని । మొగలి పూబాకు కొననురొమ్మున నుగ్రమ్ము । కొనియసువు బాతు తాళ వేకుందరదనా॥ ౨॥ — ఓశమ్మా॥

గీ॥ మగని నెనరంద లేని జన్మంబు నిలుప । బోలదిత్తరి కెందమ్మి సూలు కేల । బట్టుకొని ఘట్టిగా నురి బెట్టుకుందు । నడ్డమిక రాకుపోవె మత్తాళివేణీ॥ ౩॥

(తరళవృత్తము.)

కలికి కల్వల గేని వెన్నెల కాకలకు మైగందెనే । యెలమి చిలుకల పలుకులకు నా హృదయమే మొక్కలంగెనే । మొలకమీసము దిద్దుచును కాముండు పగసాధించెనే । కలుకు గుబ్బలు బొంగనే విరిగోల తాళంజాలనే॥

(సఖీమణి వాక్యము.)

గీ॥ యెంత విరహతాపమింతేనిమదినన్న । దాచుకొన్న గొప్పతనము దక్కు । బయలు పరచుకొన్న కుల్కు లోచిన్న । తనము మనవి వినుము తాల్మిగను పూ॥

(శచీదేవివాక్యము - పున్నాగవరాళిరాగము - ఆదితాళము.)

అమ్మయ్యో॥ — తాళజాలానే వోయమ్మా। పలుమాటలింక। కేలా చాల్ చాలు పోవమ్మా। పూలశయ్యపై పొరలి రతీశుని। కేళిలోన పల్లవులనిగ లయక॥ తా॥౧॥ వలపు మిక్కుటమాయెనే। అతనికి వేరే। తలపు మించినట్లాయెనే। నెలతా। నేనేమి శేయనే। ధరలోన నాదు। తలవ్రాలీ చందమాయనే॥ ఏల మంజీర బిబ్బోకములరుల వలపుల। సొలపాలయల మలవలి బలు వీవగ॥ తా॥౨॥ గురుకుచములు పొంగెనే। చిత్తమే మోహిత। త్తగము జెందికలంగెనే। తరుణీ ధైర్యము గుంగెనే। పండువెన్నెల॥ నెరపి రాజు చెలంగెనే॥ కరుకొని శరవిరి శరములు మరుమరు। తరము గకుచములదరమురి బరపెను॥ తా॥ ౩॥ లల నా యోచనలేలనె। యీ భోగభాగ్యాదులతో పొందిక చాలునే। తెలియా నై తెంత బేలనే। నోచిననోము। ఫలమీలాగున దేలెనే॥ వలనొప్ప గ్రీవా లమటి పురిసిల యునితో డల సొలువున కెడబడి॥ తా॥ ౪॥

ఓసఖీ — క॥ కరుకుగల మరుశరంబులు। చురుకు చురుక్కనుచు మేనుస్రుక్కగ నా పై। గురుకుచగిరులదరెను రా। తరమా దెస చేడికలం గ తామరసాక్షీ॥

ఓయక్క — సీ॥ నంబోణి రమ్మంచు నను చేరదీసునే తీసు నేప య్యెదతిన్నగాను। గుబ్బచన్నులమీద కొనగోరులుంచునే యుంచనే చుం ట్టులుంచొ ప్పుగులుక। నా సక్తి పీరతియ్యని మోవియానునె యాను నేపకట న స్తనులొంయ। అలిమీరతళ్కు చెక్కులు ముద్దులాడునే యాడు నేసరసంబు లతి ముదమున। సట్టిభర్త్రను లెందు మరచెనో యమ్మ చెల్లి। చెల్ల దిట్లాడుదా నిని చెట్ట శేయు। ననిదలంచక విడనాడి యుబ్బైచనెని। దేమి మోసమె నా సా మి దింపువదనా॥—ఓశమ్మా॥

(కందార్ధములు - రేగుప్తి - ఆదితాళము.

జిగిబగలనగవునిగుడగ। దగినటునమ్మకము బలిక్కితమపనిత్తైనక। మొగమాటమెదిగవేతురు। మగవారలనమ్మగాదె। మానినీ॥ అపురానా వంటి। భామినీ। మానుగ నీత్వర్పమాసిట్టులేచుట। నా హృద్భవకేదినడవమీ యటవే॥ మానినీ॥ ౧॥



కలకాలము బలుకూరిమి। గలమమకారంబు నెరపికడకీగతిన। న్నల యించి యసమశరుపూ। ముఖుకులకర్పించెనెంత। మోసమే॥ నామీద నేమో। యాసమే॥ ఆశించిన యిల్లాలినివంచన। జేశిచనిన హృదయేశుని కెంత॥ మోసమే॥ ౨॥

(సఖీమణిమాట.)

గీ॥ ఆలు మొగనికి గల్గుపో పాలుపై। మారిరచ్చకు దెచ్చెడిగోలగాల దె। చాలు లేవమ్మ నీ విచిత్రాలు తాళు। తాళు మొక రెప్పపాటు శంపాలతాంగీ॥

(శచీవాక్యము.)

క॥ మగువా యొకక్షణమొకయుగ। ముగదో చెనుసతటటాక్షమున నీవికనా। మగనికడకేగ శీఘ్రం॥ బుగదోట్కొనిరా వెపో వెఫల్యము గనవే॥

(దేవగాంధారిరాగము - అటతాళము.)

వెలదిరో మొక్కెదనమ్మా। నా సామినీ। వేగతోడుకరావమ్మా॥ కలువలరేని వెన్నెలకాకలకు దేహ। మలశినా మనసు చంచలమొందెనిత్తరీ॥ వెలదీ॥ ౧॥ యీ మేలుమరువనమ్మా। ప్రత్యుపకారం। మేమైన శేతునమ్మా॥ సామాన్యముగా నిజాలి మాలిబుట్టె। నామీద నెనరుంచి నన్నుద్ధరించవే॥ వెలదీ॥ ౨॥ రమ్మని ప్రార్థించవే। నీనేర్పుచ। నమ్మందు గాన్పించవే। కమ్మవి లాకడు నారోమ్ములచిగురుటా। కమ్ములని దెసమయమ్మని క్రమ్మేను॥ వెలదీ॥ ౩॥ శ్రీవాలమేటీశునీ। సాక్షిగనోర్వ। జెల్లదింతటి గాశినీ॥ యేవిధమున నైన నీవిశ్వమున శచీ। దేవియనెడు నామధేయము నిల్పరే॥ వెలదీ॥ ౪॥

[చెలికత్తెమాట.]

క॥ పల్లవపాణిప్పహ్రా। ద్వల్లభుడెటువంటి రూపవంతుడతని కే మొల్ల మగుగురుతులున్నవి। తెల్లముగా దెల్పువెదకి తెత్తునె పైదీ॥

[శచీదేవివాక్యము.]

వ॥ వినవే వయస్యామణీ॥

సీ॥ తప్తకాంచనశోభోద్యచ్ఛరీరము వాడు। సోమునిసాటి నెమ్మొ మువాడు। కంజాతముల గేరు కన్నులుగలవాడు। కరబుసుందరమైనగళము

వాడు। యసదృశరాజచిహ్నములుగల్గినవాడు । గరిమవిశాలవక్షంబువాడు । కరితుండములబోలుకరములుగలవాడు । తలిరులవంటిపాదములవాడు । వలపుగలవాడుచిరినవ్వులొలుకువాడు । పలుకుపలుకుననమృతంబుజిలుకువాడు। యఖిలభూషణభూషితుండైనవాడు। ఎందునున్నాఁడో చూడుపూర్ణేందువదనా॥ [చెలిమాట]

వ॥ ఓశచీదేవియటువంటివన్నెచిన్నెలుగలమగవారలెందరోకలిగియుందురిందున నాడెందంబున సందియంబుదీరదింకేమైనాబిరుదులుగలవాసవరణగావివరింపవమ్మామధురవాణీ॥

[శచీదేవివాక్యము]

ద్వి॥ తరుణిరోవినవమ్మత్రైలోక్యములను - వరమతిపాలించువాడునామగడు - మేలుగానూరశ్వమేధయాగములు - వాలిమెఁనర్చినవాడునామగడు- ప్రాభవంబమరస్వర్గప్రభుత్వాతి- వైభవంబునుగొన్నవాడునామగడు- భాసురంబగుయాగభాగంబులెల్ల - వాశిమీరగ్రహించువాడునామగడు - నవమేఘములమహోన్నతినిబంధించి - స్వవశంబుజేసినవాడునామగడు - మెలమితోడుతతెల్లయేనుగనెక్కి - వలనొప్పతిరిగెడువాడునామగడు - యాలోలముగనునూరంచులుగల్గు - వాలుచేబూనినవాడునామగడు - కడుబల్మినచలకర్కశపక్షములను- వడినిజకాఁడినవాడునామగడు - ధీజనుల్గొనియాడ తెలిచాయదనరు - వాజినొక్కెడనెక్కువాడునామగడు - దురమునజంభాదిదుష్టదానవుల - వరగర్వమణచినవాడునామగడు - కలశాబ్ధిమథియించికమనియ్యసుధను- వలపునగ్రోలినవాడునామగడు - కోరిముప్పదిమూడుకోట్లగీర్వాణ - వారంబులనునేలువాడునామగడు - యిట్టిచిహ్నంబులింకెన్నెన్నొగలవు - యట్టివెల్లనుజెప్పనలవిగాదబల - యాచిన్నెలావన్నెలాసొరునొరు - లాచక్కఁదనమునేమనవచ్చునహహ - నాపాలిభాగ్యంబునావోముపంట - నాపట్టభద్రుఁడీనాటికేబోటి- కిలబాప్తమాయెనోయెఱుఁగంగరాదు- లలినియన్నారెడ్డిరామచంద్రాఖ్య - వసుమతీశ్వరునేలువరవాలమేటి - యసమలోచనునిపాదాబ్జంబులెంచి - వేగనీవేగనావిభునిదోడ్తెచ్చి- బాగైనసత్కీర్తిబడయవేభామా॥ [చెలులమాట.]

వ॥ ఓయింద్రసుందరి । నీప్రాణనాథునిసర్వలక్షణంబులువింటిమిగానియతనిపేరేమోజెప్పవమ్మాముద్దులగుమ్మా॥

[శచీదేవివాక్యము.]

గీ॥ అమ్మచెల్లనన్నిటాగడంబునగేలి । శేయుటింతెగాక నీగ్గువిడిచి। మగనిపేరుజెప్పమగువలుగలరవే। కొమ్మలారముద్దుగుమ్మలార॥

చెలి॥ వ॥ ఓయమ్మాపేరు దెలియకపోబడిదీయట కష్టంబుగానస్పష్టంబుగాజెప్పవమ్మా బంగరుబొమ్మా॥

[శచీదేవివాక్యము.]

గీ॥ వేటకఁజెందిమీరువినగోరియడిగిన। దాచనేలనింకధాటిగాను। జెప్పెదనువినుండుచెలువునినామధే। యంబువాసవుండెయకఁలార॥

చెలి॥ వ॥ బళాబళాబాగాజెప్పితివి ఇంకొకశంకగలదేపంకజాననా॥

శచీ॥ అదియేమోదెల్పవేసఖీమణీ॥

చెలి॥ క॥ మేలోర్చిపతినిదెమ్మని । చాలావేడెదవేపైనసాధించియునీ। లోలునిదెచ్చిచ్చినమా । కేలాభముగల్గునమ్మయింద్రపురంధ్రీ॥

[వోశమ్మా॥]

శచీ॥ క॥ మీరిట్లుబలుకనేటికి। నారమణునిబిలిచితెచ్చినాకిచ్చినసే। మీరుణముదీర్చుకోకను। యూరకెబంపుదునపేపయోరుహనేత్రీ॥

[యమునాకల్యాణిరాగము- జుల్వతాళము.]

చానలారరారే। నా, జాలిమాన్పగదరే । నానాధునిగనుపరచిన। దానికినిబహుమానమేమానకొసగెదను ॥ చాన॥ ౧ ॥ అలవానిటుదెచ్చి । బలు, హాయిగనేనరేచ్చి। చెలిమినినాపకఁనిడిన । కలికికీజడనున్నజిలుగుసొమ్మలనిత్తు॥ చాన॥ ౨॥ కొంకకనావరునీ । నా, గుబ్బలనిత్తరినీ। పొంకమమరగృమ్మించిన । పంకజాక్షికీకంకణాలర్పింతు॥ చాన॥ ౩॥ సందియంబుమానీ। నీ, సదయుదువచ్చెననీ। ముందుమేలువార్తదెల్పిన। సుందరాంగికినాదుసందిబొందులనిత్తు॥ చాన॥ ౪ ॥ సమ్మతమ్మగానూ।

నా, సఖునిముచ్చటలనూ । నెమ్మినివినజేశినట్టి । కొమ్మకీరత్నాలకమ్మలిచ్చెదనమ్మా॥ చాన॥ ౫॥ పలుమాటలతోటేమి, ఫలమికవామ్మేటి। నిలయుతోడెపతెదెచ్చిన। నెలతకీనగలెల్లనిలువుదోపాసగెదను॥ చానలారా ॥ ౬॥

ఓయకారా——సీ॥ సకలకుజేర్చినాప్రాణనాథునిమోము। కనులార నీక్షింపగలుగునటవె । ఇంపుగానాజీవితేశుచెక్కిలిముద్దు । బెట్టనునాకు ప్రాప్తించునటవె । గ్రక్కుననావన్నెకానిచక్కెరమోవి । వలపుదీరగ నాకలగలుగునటవె । మదికోర్కెదీరనామగనితోక్రీడించ । నెంచునావాంఛలభించునటవె । యిట్టివెల్లనుజేకూరునట్టులైన । నింతకరినంబునాసామి కేలగల్గు । వనజభవువ్రాతఫలితమెవ్వారికైన । దప్పునటవమ్మధరణికుంత నవుబోమ్మా ॥

[సఖీమణిమాట.]

ద్వి॥ ఇంతిరోయీలాగునేలనీమదిని - చింతిల్లెదవునీదుజీవితేశ్వరుడు - త్రిభువనంబులనుసు స్థితినేలునట్టి - ప్రభుడుగావునధరాప్రజలబాలింప- నరిగెనోగాకున్ననవనిదేవతలు- కరవృద్ధిజేయుయాగములసంప్రీతి- భాసిల్లగాహవిర్భాగముల్గొనగ - వాశిగాజనెనోకేవలవిలాసమున- మందారపనసతమాలతక్కోలల - చందనవటపారిజాతఖర్జూర - సంతానకల్పకాశ్వద్ధాదితరుల - సంతతానందమైసరణిజెన్నొందు - నందనోద్యానంబుననువిహరింప - బొందుగానరిగెనోపొలతినావెంట - చెలువుగారమ్మునచ్చికమీరియచట - పొలుపుగానల్లినపూపొదలందు - నిధులందుసురపొన్ననీడలయందు - సదమలంబైనప్రస్తరములయందు- వేవేలభంగుల వెలదులగూడి - లీవిగావెదకిపోదైవచ్చునమ్మ - వగవంగవలదెల్లవనితలువిన్న - నగుమరునామాటనమ్మిశ్రీవాల - మేటీశుడలచుచుమేలుగాపు బోటిరోపదవమ్మపోయివత్తాము

వ ॥ అనిపల్కినవయస్యారత్నంబులపలుకులకలరి కులిశధరునికలికియిట్లనియె ॥

(*) శచీదేవివనవిహారమునకు బోవుట. (*)

(మధ్యమావతిరాగము-అట్టతాళము.)

సుందరీపోదముపదవే। యెల్ల, మ్మందయానలనూరమ్మనేవే॥ పొందికలెడబాశిపోయిననాసామి। నందనవననియున్నాడేమోవెదుకనో॥ సుం॥



గురుకుచములుపొంగెగదరే । నాదు, గుండెజల్ఝల్లునియెదరే । శరదిందుబింబసుందరదివ్యకళలను । నిరశించుశక్రునినెమ్మోముగనుగొన॥ సుందరీ॥ ౨॥ ఆలస్యమేలనురావే। ఇంక, తాళజాలనుమనివివినవే॥ పూలవిల్తునిశరజాలములకునిల్వ। జాలనుచాపతిజాడలుజూడను॥ సుందరీ॥ ౩॥ యీమోహవార్ధినోకొమ్మా। నే, నెంతనియీదుదునమ్మా॥ శ్రీమన్నాలమేటిధాముసిదలచుచు। కోమలాధరులనుగూడివేడుకమీర॥సుందరీ॥౪॥

వ॥ అనిబలుకుచుచందనగంధులంగూడి మందగమనంబులంజని నందనవనంబుదరియంజొచ్చి యందుబెంపొందుహరిచందన మందారాదిమహీరుహంబుల నుద్దేశించి యవ్వరారోహయిట్లనియె॥

సీ॥ మందారతరులారమన్మనోనాథుని। సుందరాకారంబుజూపలేర। కల్పవృక్షములారకరుణించినేడునా। ప్రియుడున్నజాడగాన్పింపలేర। హరిచందనములార హరిహయుగొనితెచ్చి । నేర్పుననాచెంతనిలుపలేర। పారిజాతములారపాకారిచెంగట। క్షేమంబుగానన్నుజేర్చలేర । తాలతక్కోలసాలహింతాలవకుళ । జంబుజంబీరనింబకదంబపనస । నారికేళాదిభూజంబులారనన్ను। పన్నుగానేలిసత్కీర్తిబడయలేరా॥

(ఆరభిరాగము- ఆదితాళము)

శుకములారా। కిం, శుకములారా॥ యోహో॥ శుకము ॥ ప్రకటితముగసురపతియగువానా। యకునిజూపిపుణ్యముగైకొనరే॥శుకము॥౧॥ పోదలారా। పూ, పొదలారా ॥ యోహో। పొద ॥ సదమలచరితుడుసత్యసంధుకిపు। డదయుండైననువదలెగదరెపూ॥పొద॥ ౨॥నగములారా । ప, న్నగములారా ॥ యోహో॥ నగ॥ వగమీరగనావన్నెకానిజిగి। నగుమొగ్గమగణితముగగనజేయరే॥ నగము॥ ౩॥విరులారా। సుం, దరులారా॥ యోహో॥ విరు॥ ఘోరముమ్మారమునశరములుబైపై। బరపెగదరేభాసురముకబూచిన॥విరు॥౪॥ లతలారా। జే, వతలారా॥ యోహో॥లత॥హితమతివాస్మేటిశునెప్పుడుస।న్నుతిజేయుశక్రతుననుగూర్చరే॥లత॥౫॥

అరీ— క॥ ఇటుబలుకుచుకుటిలాలక । చెటులతనొకపొన్నగున్న చెంగటకొలువై । స్ఫుటమతినున్నమర్యున్గని । మెటుదోచకసఖియఖాటు శేగిల్లనియెన్॥

ఓసఖియా— సీ॥ వివిధభంగులచాలవిరివందుహాయలుచే । పిట్ట వీగుచుచిల్కగుబ్బమెకిల్ । బెట్టుగాదిట్టమాపిడిబాకువలెనొకర్ । గేదంగి రేకునుకేలబట్టి । సొంపుగానింపుగాసొక్కుచునొకచేత । కలుకైనచెలు కుశింగాణిబూని । గురుతుగాతళతళస్మేరశెడివిరిమల్లె పువ్వులమొలుకులు పొసగదాల్చి । తుమ్మెదలుమోయుకేకులుదొమ్మిశేయు । పికములాగిడాయు నెల్లమిశారికలుగూయు । పటహభేర్యాదివాద్యరవంబులెగయ । నెడనెవం డెవ్వడోచూడవేమృగాక్షీ॥

వ॥ అనిమరియును ॥

(దరువు- మధ్యమావతిరాగము - ఆదితాళము.

చూడవెచూడవెకొమ్మా।యల, సుందరాంగుడెవడమ్మా॥౧॥ చక్క నివారల్లలోనా।బహు, చక్కనివాడేచానా॥౨॥యింతీచిలుకలదండె।ఇది యేమొయింత్రపదండే॥ ౩॥అక్కాకేకులకేకా।విను, మహాహాయదిబలుఘా క్శా॥౪॥అదెకోకిలలబిడారూ। తు, మ్మెదలరొదలెబలుబోరూ॥ ౫॥అందము నొందరదంబూ।నం,దమరెనెమకరశిఖంబ్బూ॥౬॥సురవరునందనవనమూ। ధృతి, జొమ్పటకితడేఘనమూ॥౭॥ శ్రీవాల్మేటీశ్వరునీ। సా, టీగజెప్పవె యోతరుణీ॥౮॥

(చెలికత్తెమాట.)

క॥ కొమ్మాధైర్యంబికనై। కొమ్మాయటుజూడకమ్మగుట్టుగనిటురా వమ్మా నేడెల్పెదవిన। వమ్మావాడేననంగుడమరేంద్రసతీ॥

వ॥ అనివినులిక్కిపడియక్కలువకంటి యిట్లనియె॥

గీ॥ దంధణాందంధణాంధణధణయటంచు । కదలెవడెతేరువారు డుస్రాక్రందన్నుండు। సకియనను శాశిపోఘునసందుజూచి । ఇషుములనుబె ట్టవచ్చెవింకెట్లనమ్మా॥



(*) మన్మథదూషణ. (*)

[నాటరాగము - ఆదితాళము.]

వచ్చెనుమన్మధుడూ। చూడరె।వాడెమహాహాన్మదుడూ। పచ్చవి ల్లుచేపట్టిదళంబులు। విచ్చలవిడితనవెంటరాగనిదో॥వచ్చెను॥౧॥బలుమగటి మిడక్కీ। నికుట్టాకు। చిలుకమావునెక్కీ । కలకలమనిపికములువడిగూయ గ। థళథళపువ్వులములుకులుమెరయగ॥ వచ్చెను ॥ ౨॥ చందురుండుడా యా। నెలమిం, దిందిరములుమోయియా । కందువజెందొకకలువరేకుకర। మందునపిడిబాకందముగాగొని॥ వచ్చెను॥ ౩॥ వాలమేటిశివునీ। కలుకుచు వనితలనిత్రతిశీ॥ కాలమెరిగిచీకాకుజేయు। దు, శ్శీలుడగుచునాచిత్తముదొ ల్లన॥ వచ్చెనుమన్మధుడూ॥ ౪॥

వ॥ అనియప్పల్లవాధరిరతీవల్లభునక్షిముఖినాడీకొనియిట్లనియె॥

(పంచచామరములు.)

శుకంబునెక్కిపిట్టపీగుచుక్ । హుటాహుటీగరా। ట్సుకాళికోకి లాదులెల్లదట్టుముట్టికొల్వగా।చకోరనేత్రులందుసాహసంబుజూప నిత్తు కార్ముకంబుబూనివచ్చుటొకొ మోహారంబెదర్పకా॥ ౧॥

నిరాపరాధులైనపద్మనేత్రులంగలంచకా। వరంబుమీరిపొంగిదా డవారితోడబుట్టవా। సరేవరేవరుండులేనిసంధిరింగినీదుబల్ । చిరాకుజూ పపాటిగాదుభీదొలంగుమన్మధా॥ ౨॥

విరానలేచిపచ్చవిల్లుబెట్టుగాధరించిచం । చరీకముల్ధ్వనించమా ర్విచక్కనెక్కుబెట్టిహా। యురోజకుంభముల్గలంగనుక్కుమీరియేయనా । తరం బుగాదునిబ్బరింపతాళుమీనకేతనా॥ ౩॥ — వెండియు॥

(కందార్థత్రయము-నాటరాగము-ఆదితాళము.)

నిక్కుచుచిల్కహుమాయిక్ । గ్రక్కునధుమికించిమదమరాళంబుల్ల నల్। దిక్కులకురేపిపడితా। చక్కికిగాకురపంచ । సాయకా॥ పోపోరరతీ। నాయకా॥ నాయడకరినముబాయకపైపై। డాయగనేమాదాయముపం చ॥ సాయకా॥ ౧॥

భాతిగనొక్కతియ్యనివిలు। చేతఁ గసవరించి హృష్టచేతస్కుడవై । నాతొ అనుగ్గాడుటప్ర। ఖ్యాతనిదలచితివోమీన। కేతనా॥ పడలేనురాయీ। యాతనా॥ పాతక మెంచక ప్రసవశరంబుల। నీతరిబర పుటనీతి శమీనకేతనా॥ ౨॥

మించియువిలువొంచియుజను, డెంచియుగమకించిపొంచి తెంపరివై సం- ధించెదవయ యోసికిది- మంచిదిగాదోచెనటరా- మన్మధా॥ నీపోతరమేనిక- దున్మదా॥ సన్మానముతోశమైనలేనిమ । దోన్మత్తుడనీజన్మమేఖరా॥ మన్మధా॥ ౩॥

సీ॥ గబ్బిగుబ్బలదరగా సుమబాణముల్। ధిమసమున నేశే దేమిచేటు। యాడవారినిట్టులారడి జేయుట। మేర గాదు పోకీరవాహ॥

[నాదరామక్రియ రాగము - ఆదితాళము.]

కీరవాహ । యోగోరిద్రోహ ॥ కీర ॥ కీరవాహ సుకుమార దేహ శృంగారవతులపైపోరేలనురా॥ కీర॥ ౧॥ తాళజాలరా । నాతోనీమందే। మేళమేలరా ॥ పూలమ్ములు వెసబూని వేయధృతి ।సోలెనింకదయజూడరమేరా॥ కీర॥ ౨॥ పద్దులేలరా। బాల్ చాలునీము।ర్బుద్ధిమానరా॥ గద్దరితనమునముద్దుగుమ్మలను। తద్దయునేచుటతగదుతగదురా॥ కీర॥ ౩॥ దోసమెంప్పురా। యీభూమిలోని। వాశిదప్పరా - వాశిమీరుశ్రీవాలమేటిపుర- వాసుడునీగర్వముబాపునురా॥ కీర॥ ౪॥

(కందార్ధములు-నాటరాగము-అటతాళము.

అమరేంద్రుడు లేకుండిన। సమయముగనివచ్చి నన్ను సాధించుటయా। క్రమమతనియందునీవి। క్రమముపయోగింపజేయు। రాశంబరారి॥ చాలులేదుట। దోసమోరోరీ॥ వాశిగపూర్వదిగీశునినన్నొంద। జేశిసత్కీర్తిసుస్థిరముగనైకొన। రాశంబరారీ॥ ౧॥

మగవాడవైననీదగు। మగటిమిమగవారియందు మరిజూపవలెన్। మగలనుబాశినమగువల। పొగరున వేధింపరాదు। పోరయోమారా। కలోవవి। కారవిహారా॥ శూరుడవై వగమీరిననారుల। తారుమారుజేశి కారాడదగదుపో పోరాయోమారా॥ ౨॥



ద్వి॥ హృదయేశుడెడశిపోయునసందుబూచి-మదననన్నే చెదిమర్యాదగాదు - పాకారినాశయ్యపైనున్ననాడు- నీకేతనంబెందు నీటిలోగలశే- నాసామికౌగిటనను జేర్చునపుడు - నీసాయకంబు లేనీరాశిజొచ్చె - పెనగి నాపతిముద్దుబెట్టినయెడల - ఘనతనీవిల్లుమొక్కడగొట్టుపడియె - కేరలి నాధవుడు చెక్కిలినొక్కుతఱిని - గరిమనీదండుమేగమనంబు జేశె- నొంటరిగానుసేసుండగాగదిశి - కంటకంబునసింతగాశిజేశెదవు - యోరోరి పలుగాకియోదోసకారి - యోరికర్దయశాలియోరినీచాత్మ - సిరులనన్నారెడ్డిశ్రీరామచంద్ర - వరుసుడై చెన్నొందువాలమేటీశు - డెరిగిననీపొంగు నిలగ్నంగజేసు_ తరమెరింగికవేగదలగరామారా॥

(నాటకురంజిరాగము - జుల్వతాళము.)

మారాయిదిమేరాగామూపోరానీరూపమార॥ మారా॥ సారెకు బతిమాలినవిన। వేరాకడతేరనీర॥ మారా॥ ౧॥ పొంగిచెలంగి యిభ్బంగి నేచగడంగి। యంగనామణులపైకి। ఛెంగళించెదవేర॥ మారా॥ ౨॥ పొంచీ గర్వించిచలమెంచీగమకించిమించి। యెంచిపంచశరములేయ। నేలానీతాశజాలా॥ మారా॥ ౩॥ ఠీకాబలుధాకాపరాకా। పోకిరివిగాక। శ్రీకరముగ వాలమేటిశివ్రుడేనిమధూళిజేయు॥ మారా॥ ౪॥

(పంచచామరములు.)

కిరాతకుండవై మదించి కేక వేశియీసునన్। పరాకుజేశెదాడవారిపైనిదేమిపర్వరా। మురారినందనుండవిట్టితూగవృత్తిమేరగా। దురాయశంబునిల్వబోదురా సరోజసాయకా॥ ౧॥

దురాగ్రహంబుబూనిమున్నదొమ్మిజేయడాయనిన్। పురారికంటిమంటలన్విభూతిజేసియంతనీ। పురంధ్రివేడనంగుడౌనుబోయటన్నమాటసు। స్థిరంబుగాదలంచవేమిచేటురారతీపతీ॥ ౨॥

కరంబులెత్తిమ్రొక్కినన్వగం దొలంగకౌర ధీ। కరంబెగొప్పజేశెదొరికర్కశాత్మవాలమే। ట్పురీశునిన్స్మరించినీదుపొంగుగ్నంగజేతుపో। కిరాటసాగదింకపోరకేరకన్మనోభవా॥ ౩॥

వ॥ అని మోహావికారంబున వేమారుమారునిందూరుచు కీరాది పరివారంబుల నుద్దేశించి యానారీలలామంబు ఇట్లనియె.

(కందార్థపంచకము-రేగుప్తిరాగము-ఆదితాళము.)

తియ్యని పండ్లరసంబును । నెయ్యముమీరంగ మెసవి నెరవాదితనం బియ్యెడజూపగవచ్చితో । ఛియ్యికచాల్చాలుపోవే ॥ చిలుకా ॥ కిలకిల వగలుజిలుకా। టలికెదవింత। చులుకా। నామీదనా, సీ।యలుకా॥ వలపున పతినసుగలశి మెలగకను । తలగినతరినన్నలయించెదవో॥ చిలుకా॥ ౧॥

మంచియొయ్యారముగల చెలులంచితముగ గొలువవనమునం దాత్మే శుక్। గాంచనరుదెంచునన్నుగ। లంచుట చాలించ వేరా, యంచా। నీనుపా లేర్ప, రించా। నేర్పరి దానంనంచా। బింగేపుసరిగా, దెంచా । మించివగల వర్తించిచాలన।మ్మించి నేమవంచించే నెవిభుడో॥ యంచా॥ ౨॥

అరవిరులకమ్మ దేనియ। సారదిగవడి ద్రావి త్రావిఝుంఝుమ్మనిబ। ల్విగివిగ మొరబెట్టుచుని। త్తెరగువపైకురికెవేమే, తేటీ। లేరెవ్వరునా, పాటీ। గానము చేశే, మేటి। యనిజూపేవునీ, ధాటీ ॥ నీటుగ నేపతికూటమ్మేనళిన। నాటికివచ్చిరవాటించుదుపో॥ తేటీ॥ ౩॥

మలయజమృగమదకుసుమం । బులతావులుగొనుచుకైపు బూనియునామీక్ ।జలుఝల్లుఝల్లుఝల్లని।కలగగవీవకెచల్ల, గాలీ । ప్రాణే శుడునా,జోలీ। మానినాడని, గేలీ। జేశేవుపైపైసోలీ॥ మాలిమిపతులేమా రనిపుణ్య। స్త్రీలహాళిజెందించుపోవేవలి॥ గాలీ॥ ౪॥

మగలకేడమైనపడతులు । దిగులొందగరెక్కలెత్తిదిమ్మరియాటల్। మంగులరసియుత్సహించుచు। నెగడుచునాటాడెవేమే, నెమలీ। మేటిచిలువల,నమలీ। మాటిమాటికి, తెమలీ। కేరకేకుతికె,కమలీ॥ సుమబాణుండిదె సమయమనుచున। క్రమమునననుబలుగాశిపరచెనే॥ నెమలీ॥ ౫॥

వ॥ అనిబల్కుచున్నయెడా॥

గీ॥ విరహిణులపాలివిషపాలవిత్తుకడలి । వెన్నవెన్నలదొంగడా కన్నుమహని । నూమచుక్కలదొరచందమామపాడుపు । కొండగనుపట్టె ననుగాంచికొమ్మబలికె॥



(*) చంద్రదూషణం. (*)

[శంకరాభరణరాగము- అటతాళము.]

చందమామా।చందమామ।యోచందమామా॥నీ కందువలింకొందు కేపో।చందమామా॥చందమామా॥౧॥ నామొరాలాలించరా।నందము గొం దించరా,నా। సామినిరావించరాయో। చందమామా॥ చంద॥ ౨॥ ఆర డేలమానరా॥ యకటతాళలేనురా,నీ। సౌరుచాలుమానరాయో। చంద మామా॥ చంద॥ ౩॥ కల్లగావీక్షించరా। కాయముచెలించెగా,సక్। చ ల్లగాకరుణించరా। యోచందమామా॥ చంద॥ ౪॥ వాలమేటిపురవరా। వాసుడుమీక్షేసురా। చాలగనన్నేలరా। యోచందమామా॥చంద॥ ౫॥

సీ॥ గురువధూగమనంబుకోరి చేసియులోక నిందనుబొందినపంద వీవు । కేరితోబుట్టువు గేహంబునకుకీడు కొంకకొనర్చినకుమతివీవు । కూడియుండినయట్టికొమ్మలపురుషులకవబాపుదుష్టవిగ్రహుడవీవు । విరహిణీ చిత్తాటవీతతిగాల్పను వనధిలోబుట్టినవహ్నివీవు । నిన్నుచల్లనివాడనినిఖిల జనులు । బలుకుచుండుదురజ్ఞానభావములను। కటకటాయింతయన్యాయ కారివనుచు । దెలిసెగానాకునేటికి నళినవైరీ॥

వ॥ అని బల్కి మరియునిట్లనియె.

(ఆరభిరాగము - అటతాళము,.)

పంతమేలను రాకళానిధీ,నీ। కెంతచిరాకుకళానిధీ॥ ౧॥ ఢాకచాలించుకళానిధీ,బలే।కాకలారించుకళానిధీ॥ ౨॥ కోపమువద్దుకళానిధి,యిందు। పాపముగద్దుకళానిధీ॥ ౩॥ కనరింకజాలుకళానిధీ, నన్ను । నెనరుననేలుకళానిధీ॥ ౪॥ వాత్మేటీశునకుకళానిధీ,మూళి । వైలీలదేలుకళానిధీ॥ ౫॥

వ॥ వెండియూ.

సీ॥ త్రిదశాళికళలెల్లదినియెడుయెడనైన కమలిపోవైతివినళినవైరి। ప్రబలిగురుండుశాపంబిచ్చినప్పుడైన కమలిపోవైతివికమలవైరి । శ్రీకంఠ రుడుబండిజేసిననాడైన కమలిపోవైతివికమలవైరి । పొంగిస్వర్భానుండు మ్రింగినతరినైన కమలిపోవైతివికమలవైరి । యట్టియెడగిట్టనలోకమం

దుచెలులు । హాయిగానుందురింతయన్యాయకారి । కంబుజోద్భవుడేల చిరాయువొసగె । నింకనైనసుబుద్ధివహించుచంద్ర॥

వ॥ అనియీచందంబున నిందునిం దిరస్కరించి చెలులంగాంచి శచీదేవి ఇట్లనియె.

ఓశమ్మా — క॥ ఈచిలుకలునీకో వెల । లీచందురుడీసమీర మీమరుడీతేం । ట్లీచందంబుననాకపరి । యేచన్నైకొన్ననోర్చు టేలాగసఖీ॥

మత్తకోకిల॥ ఎల్లతావులజూచినన్ హృదయేశుజాడలుగాంచుటల్ । గల్లలయ్యెనిమేషమొక్కయుగంబుగామదిదోచెను । త్ఫుల్లనీరజసాయకుండదెపొంచిపొంచిసుమేషువుల్ । కొల్లగావెదజల్లెనే యీకొమ్మయేమనజెల్లునే॥

(చెలులమాట.)

గీ॥ వనమునదుమజేరివలరాజుదాడికి । జిక్కివగువనేలశీఘ్రముగను । చూడదగినయెల్లచోట్లనీవిత్తేశు । వరసిపోదమింటికబ్జనేత్రి॥

(శచీవాక్యము-మధ్యమావతిరాగము-ఆదితాళము.)

యెందున్నాడో। వెదకరమ్మా॥నామగ॥డెందున్నాడో॥ ౧॥ చందనగంధిరోనాపై । చలముజేశితొలగినవా॥ డెందు॥ ౨॥ అరుదైనమెరుగుబంగారుహారాలుధళధళమెఱయ । సరులదరులతరులగిరులవిరివిగా విహరించుచునే॥ డెందు॥ ౩॥ సదమలమైపట్టిపట్టుశాల్వముంగులుజారపూ। పొదలనదులనిధులచెదలముదముగదురదిరుగుచునే॥ డెందు॥ ౪॥ మురుపుమందహాసముజెంపారయగ శ్రీవాలమేటీ । శ్వరునిహరినిగురునిగురినిబరపిసంస్మరించుచునే॥ డెందున్నాడో॥ ౫॥

వ॥ అనిబల్కుచు సఖీజనసమేతంబుగా నందనవనంబెల్లగలయ నన్వేషించి యెందునుపురందరుంగానక నగ్గలంబగు విరహతాపంబునంబెగ్గడిలి యగ్గజగామినితోడిచేడెల కిట్లనియె,

(సౌరాష్ట్రరాగము - ఝంపెతాళము.)

వెదకిచూచితిమన్నిచోట్లా, నామనో । విభుడుగనరాడు యింకేట్లా॥ ౧॥ కోకిలలుకలకలనుగూశే, మరికేకి। ఘాకలనుధైర్యంబుబాశే॥ ౨॥



తెమ్మెరలనామేన్పైలించె దొమ్మిగా। తుమ్మెదలరొదలతిశయించే॥ ౩॥ చిలుకలెల్లనుకేరిపలికే, జాబిల్లి। బలువెన్నెలలమెపైజిలికే॥ ౪॥ అంతకంతకు భ్రాంతిమిరె, నలరతీ। కాంతుండుచాలగడిదీరె॥ ౫॥ మాటాడదోచదోయమ్మా, శ్రీవాల। మేటీశుడెటుబ్రోచునమ్మా॥

—(*) శచీదేవి మూర్ఛిల్లుట. (*)—

(పంచచామరద్వయము.)

ఝణంఝణంఝణానుభేరిఝాంకృతుల్ఘణంఘణా । ఘణానుఘంటికారవంబుగ్రాలగాఢణంఢణా । ఢణాధ్వనుల్చెలంగ గారథంబుసాగెనేసఖీ । మణీరణంబుజేయవచ్చెమారుడెంతక్రూరుడే॥ ౧॥

పతాణిచిలుకల్ యదల్చిపగ్గముల్బిగించిరా। జతీవిమించి పొంచి పంచసాయకంబులన్ పెరీల్ । పెరీలుమంచుకంచుకంబుపెల్లిపోవునట్లుహా। కఠోరమొప్పనేశనింతికంతుడంతకోగ్రుడై॥ ౨॥

వ॥ అనిచెలించి నిలజాలక నుస్సురంచు నొకపాదపంబుక్రింద సైమరచి బరుండిన నితంబిని కివయస్యామణు లుపచారంబులు శేయుచుండిరయ్యెడా.

గీ॥ దివిజవల్లభుడారేయితికరబట్టి। నట్టివాని తెఱంగుననడవులెల్ల। మరలునవహాల్యదలచుచుదిరిగితిరిగి। యేమియనువల్లగానకనిల్లుజేరె॥

వ॥ అట్టిసంగతినెరింగి యొకకురంగనేత్రి యయ్యంగనారత్నంబు చెంగటంజేరి మెల్లమెల్లన సేదదేర్చుచు నిట్లనియె.

ఓతల్లీ — క॥ ఈలాగు గాశిజెందగ । నేలానీజీవితేశుడింటికివచ్చెన్ । చాలాధైర్యంబుననో। బాలా యికలెమ్మురమ్ముభవనంబునకున్॥

వ॥ అనినవినిదిగ్గునలేచిశచీసతియిట్లనియె. అహాహావో మధురవాణీ.

ఉ॥ వల్లభుపొందుబాశిసరివారలు గేలియొనర్పగారతీ। వల్లభుపల్లవేషదవవహ్నికిలోగిదలంకునట్టినా । యుల్లముపల్లవింప నమరోత్తముడాగతుడయ్యెనంచుమేల్ । చల్లనివార్తదెల్పితివి సామజయానవరమ్మునంబునన్॥

(*) ఇంద్రశచీ సంవాదము. (*)

వ॥ అనిమహోత్సాహంబున వయస్యారత్నంబులంగూడి రయంబుననిజనికేతనంబు జేరి యందుత్రిభువనాధీశ్వరుండగు తన ప్రాణేశ్వరుని నేత్రోత్సవంబుగాదిలకించి పులకించి కరపల్లవంబులుగీలించి యయ్యింతుబోడి యిటనియే.

క॥ భవహరప్రాచీదిగ్వర । పవిధరశాత్రవవిదారభవ్యవిచారా। యవిరళభద్రగుణాకర । కవిజనమందారప్రముఖ్యుగై కొమ్మువరా॥

(ఇంద్రవాక్యము.)

క॥ ఇభరాడ్గామినిపన్నగ । నిభవేణికురంగలోచనీశుకవాణీ। త్రిభువనమోహినిసంతత । శుభమస్తుమృణాళపాణిశుభవగురాణీ॥

(శచీవాక్యము.)

(దేశీయరాగము-రూపక తాళము.)

యెందుబోతివిర నాసామీ యెందుబోతివీ॥ కందర్పునియరవిరిశరబృందంబులపాలుగా । యిందునన్నుబాయనెటునీడెందమోర్చెరా । నాసామీ॥ యెందు॥ ౧॥ లేశమైనభ్రమనాపైలేనట్లుగనోచెరా । నాసరివారెల్లగూడినవ్వనామెరా। నాసామీ॥ యెందు॥ ౨॥ గొప్పకొంచెమెంచడు తలకొట్లమారివారుడూ। యెప్పడెరుగనట్టిబాములిపుడుబెట్టెరా। నాసామీ॥ యెందు॥ ౩॥ యేమిమాయయో తెలియదు యెంతనివివరింతురా। సామాన్యముగానిబలేజాలిబుట్టెరా। నాసామీ॥ యెందు॥ ౪॥ హేళనగాదేపునన్నేలిబాళిదీర్చరా। వాలమేటిశివునితోడె తాళజాలరా। నాసామీ॥ యెం॥

(ఇంద్రవాక్యము.)

ఓప్రాణనాయకీ॥ —— గీ॥ హరిహరబ్రహ్మలొసగిన యాజ్ఞకొలది। త్రిభువనంబులుపాలించ ప్రభుడగాన। లోకపాలనమునకునే ప్రాకటముగ । బోయివచ్చితిగదవెరయోపువ్వుబోణి॥

వ॥ అనియొడబడంబలికి పత్నీసహితుండై యంతఃపురంబుజొచ్చి గౌతమీదత్తచిత్తుండయ్యును నిమిత్తమాత్రంబారేయిగడపి మరునాడరుణోదయంబునలేచి యథోచితకాల్యకృత్యంబులుదీర్చి యొక విజనస్థలంబునంజేరి భృత్యునింజీరి పాకారి ఇట్లనియే.



క॥ వినయంబునశిల్పాచా । ర్యునికూర్మికుమారియగుమనోరంజనినే। ఘనఘనమగుయొకపనిగల । దనివోట్లానిరమ్ము" పొమ్ము॥ మతిశీఘ్రమునన్ ॥

(*) మనోరంజనీకథాప్రారంభము. (*)

వ॥ అనినవినివాడమందగమనంబున నతిసుందరంబగు విశ్వకర్మమందిరంబునకరిగి యందుకొందరూపసందగుకుందరదనలుగొలువ చెలువొందుమనోరంజనిందిలకించి సమయంబెరింగి కులిశధరునిపలుకు మెలుపవగా దెలిపవనియెనయ్యవసరంబునా॥

సీ॥ జరతాంబుపనిమీరు మెఱుగుకుచ్చెళ్లపై । చెన్నుగులెక్కడుచల్వచీరగట్టి । జిగిమించుగుజరాతిశిస్తుగోట్లనుదాపి । రాణించుపైరిణీరవికదొడిగి। తళథళత్ కాంతులందముగజిలెక్కడుజాతి। మణిమయాభరణముల్ మతదాల్చి । ఘుమ్మఘుమ్మరటంచుకమ్మనివాసనల్ । గలకలపంబుచొక్కముగనలది। యందములుజిందకడుమందయానమొనర । నీటుమీరిమనోరంజనీవధూటి। నయమునుభయంబుప్రియముబెనంగొనంగ। వాజిసముఖంబుజేరగావచ్చెనపుడూ॥

(ఆనందభైరవిరాగము - ఆదితాళము,)

వచ్చెచూడరేమనోరంజనీ। కామ,వర్జితసుజనచిత్తభంజనీ। యట్టేముచ్చటమీరిపోర। మచ్చకంటులుమెచ్చ॥ వచ్చె॥ ౧ ॥ సరిగేచీరచుంగులుజారగా। గట్టి, జంటీముగ్గలరవికేమీరగా। తొడిగి - మెరుగుబంగారుసొమ్ము। లురుతరముగమెరయ॥ వచ్చె॥ ౨॥ నళినారిగేరుఫాలతలమునా। సొగసు, తిలకముదిద్దినిందుచెలువునా। నెలమి, జిలుగువెన్నెలరీతి। చిరినవ్వునివ్వటిల్ల॥ వచ్చె॥ ౩ ॥ మేతైనచిన్నెలెన్నోమించగా । నేర్పు, శాలియుంచసి॥ ఘనులెంచగా । ధాత్రి, వాలమేటీశుడైన । శూలపాణినెంచుచు॥ వచ్చెచూడరే॥ ౪॥

వ॥ ఇట్లువచ్చినమనోరంజనికొకకుంజరయానయిట్లనియే॥

క॥ తేటగలమాటలాడుచు । నీటుగులుకవచ్చితిపుడు నీవెవ్వతవో। థాటిగదెల్పుముదాచగ । నేటికినీవర్తమానమెల్లలతాంగీ॥

(మనోరంజని మాట.)

ద్వి॥ చిత్తంబురంజిల్ల జెప్పెదనాదు - వృత్తాంతమెల్లనువినుమంద యాన- భావింపదేవశిల్పాచార్యుడైన- యావిశ్వకర్మ కుననుగుకూతురను- రాజీవముఖిమనోరంజనియనగ - నేజెలంగుదునుక్షోణీతలమందు - పౌలోమిచెంత నేర్పరిశాలినగుచు - మేలైనపనులందు మేటినైయుందు - చాతుర్యమునకునాసరిబోలునట్టి- నాతులెవ్వరులేరునారీలలామ- తగుయుక్తిదనరియెంతటికార్యమైన - తెగువమీరంగసాధించగాగలను - కాంతలపురుషులకలహముల్బాపి - యంతలోనతిమైత్రినందించగలను - మానుగాలాలించిమగువలమనసు - లోనిమర్మముసుంతలోదీయగలను - రమణతోమదద్దొడ్డరాచకార్యములు- క్రమముగాసర్వేర్చగలనాడుదాని - నైబుట్టి [illegible]నియతులితంబుగను - నాబుద్ధికుశలతనాజాణతనము - నాశక్తినాయుక్తినామనోరక్తి - నాసాహసంబునునాయోపుణ్యనేర్పు - కులిశాయుధుండెరుగునుసాంగముగను - నలువొప్పశ్రీమదన్నారెడ్డిరామ- చంద్రునిపాలించుజగతివాణ్మేటి- చంద్రకిరీటుడేసాక్షిసద్మాక్షి॥

(సూత్రధారిమాట.)

వ॥ అయితేనీవిప్పుడెందుబోయెదవేసుందరవదనా॥

మనో॥ క॥ వనితాసురవిభుడేమో । పనికైననుబిలువనంపెపరువడినేడా । యనఘునిసముఖమునకునే । జనియెదనటగలుగుపనులుసమకూర్చుటకున్ ॥

వ। అనిపలికి మేఘవాహనునిసన్నిధిం జేరి కేల్దమ్ములు మొగిచిమనోరంజనియిట్లనియె॥

క॥ దండముసురలోకేశ్వర । దండముచౌదంతిగమనదారితకుజనా। దండముశచీమనోహర। దండముదంభోళిహస్తదండముస్వామీ॥

(శహానరాగము — చాపుతాళము.)

రాజాధిరాజమహారాజరాజజోహారు । రాజవదనసీనరాజతేజాజోహారు॥ రాజాధి॥ ౧॥ భూరిత్రిలోకాధికారాశూరాజోహారుమా



మారసుందరసమానాకారజోహారు॥ రాజాధి ॥ ౨ ॥ ఐరావణవారణారోహణజోహారు ॥ ఘోరారిగర్వవిదారాధీరజోహారు ॥ రాజాధి॥ ౩ ॥ లాలితసద్గుణజాలామలజోహారు । శైలాళిపక్షనిర్మూలహేలజోహారు॥ రాజాధి॥ ౪॥ పౌలోమిలోలకృపాలవాలజోహారు । వాలమేటీశానుకూలశీలజోహారు ॥రాజాధిరాజా॥౫॥

వెండియు॥— హేమహారాజా॥

(ఉత్పలార్థద్వయము - రేగుప్తి - ఆదితాళము.)

భూసురవర్గపోషమణిభూషయరాతిజిగీషనిర్మలా । ద్భాసితసత్యభాషఘనతాపసమాన్యయశేషదేవతా। ధీశా- కందర్పప్రతీ। కాశా- యమరావతీని। వేశా- పౌలోమీహృద। యేశా॥ వాశిగసత్కృపవాటిగనే। శేషితిమనవినిచిత్తగించుదే॥ వేశా॥ ౧॥

యాజికకల్పభూజసదయాకరధీజనపూజితాంఘ్రిపం ; కేజసురాహయక్షనరకిన్నరశేవితభానుకోటిస । త్తేజా - ముఖనిర్జితరా। రాజా- రాజారాజాధి। రాజా- రాజితాదిది। గ్గాజా॥ రాజానన్నిటురప్పించినపని। శ్రీజెలంగగనుజెప్పుమయ్యారవీ॥ తేజా॥౨॥

హేమహాప్రభో,

ఉ॥ చెకిటచేయిజేర్చిమదిచింతవహించియనుస్మరంచున। ద్భిక్షులుజూచిచూచిబహుదీనతచేతలయాచియాచిబ । ల్వోకసమెందులెల్లకడువింతగదోచెనిదేమిసామియే । చకోరబొమ్మబాళియొనిజంబుగదెల్పుముదాచనేటికిన్॥ ఓదేవా॥

గీ ॥ మహితరాజసంబుమానిదైన్యముబూని । జాలిజెందవలదు సాహసమున । నెంతకార్యమైననేసమకూర్చెద । ధృతినిబలుకుమయ్య దివిజనాథా ॥

వ ॥ అనినవిధువదనమధురవాక్యంబులకుత్సహించి నిలింపప్రభుండిట్లనియె ॥

——(*)ఇంద్రమనోరంజనీ సంవాదము(*)——

(దేవగాంధారి- ధృవతాళము.)

ఓమనోరంజనీ మాటవినవే॥ యోమనో॥ నామనోరంజనము శేయగదవే॥ యోమనో ॥ కంటినరుదుగనొక్కవాల్గంటి। నటు, వంటిచక్కగ్గంటు లెవ్వరు లేరీ యిలలోనో ॥ హోమనో ॥౧॥ అలదానిపైని యింతంతన రానీ। మరు, తెలమిమించెనిందుకేమియుపాయమో ॥ హోమనో॥౨॥ నీకుసరిబోలిన నెరజాణయే లేదు । నాకెన్నడింతకన్నాపని రాబోదో ॥ హోమనో ॥౩॥ ఆలోలలోచన కేళి నాకొనగూర్చి। మేలందుమువాలమేటీశు డెంచనో॥ హోమనోరంజనీ॥౪॥

ద్వి॥ కామినీమణిరో సాంగంబుగానిపుడు - ప్రేమమీరంగ జెప్పెద నాదభీష్ట - మాలించుమబ్జజుండాసక్తిదనరి - లాలితంబుగనహల్యాయను దాని- నుత్పత్తిజేసె మహోన్నతినట్టి - యుత్పలగంధికినొగి సాటిబోల్ప- కిన్నరామరసాధ్యకింపురుషసిద్ధ - పన్నగదానవాప్సరయక్షగరుడ- గంధర్వసతులందుగలుగ రేమందు- గందేభయానని కుముదానిజూచి- నప్పటనుండి నాకధికమోహంబు - ముప్పిరిగొనితలమునుకలై యున్న - దచ్చకోరాక్షినయ్యతపోమునకు- నిచ్చె వాడింపుగా నీరజాసనుడు - లోలాక్షి మేఘంబులో తీగె మెరుముబోలి యామౌనితపోవనంబునను - జేరియున్నది నీవు చెలువుగా దాని- చేరుచమునిలేనిస్థితివిచారించి - వద్దికిజనిబలేవై ఖరిదనరు ముద్దుమాటలచాలముచ్చటదీర్చి - భామినినను మనోభవుకేళిలోన - నామోదమున నేలుసట్లొడంబడిక - జేసుకనిందువచ్చితివేని నేడు- వాశిగా నీకు కావలశినయన్ని- చీరెలు రవికెలు చెలువైన నగలు- కోరినయర్థంబు కొరతలేకనిడుదు - రమణి యన్నారెడ్డి రామచంద్రేంద్రుడు - ప్రమదంబునిండార పాలించువాల- మేటీశు డెంచనీ మేల్ పనిదీర్చి - ధాటిగా కీర్తిజెందవేమందయానా ॥

వ॥ అనిన సంక్రందనునకు శిల్పవరనందని యిట్లనియె॥

క॥ తాపససతికామోహం । బీపగిదిని జేసిబడలుటేటికి శలవి। మ్మాపాటియందగత్తెయు । నేపోయి భ్రమించి వత్తునిమిషములోనన్॥



(ఇంద్రవాక్యం.)

[వసంతభైరవి- జుల్వతాళము ]

అంగన నేనేమి జెప్పుదూ। యహల్యసొగసు॥ నంగన॥ ౧॥ అంగజు సమసాయకమున । కన్నామిన్నమైయున్నది॥ యంగన॥ ౨॥ మొంతపాంకమైపరూపమే। యవయవములసొబ। గింతనియనరాదలోపమే॥ యింతవరకుజూడగలే। దీరేడుజగంబులందు॥ నంగన॥ ౩॥ అపనినిగలయందములెల్లా। చెలికాలివేల। కైననుసరిబోలుటకల్లా॥ కువలయాక్షిదలచిననిః। గోకనులమెదలుచున్నది॥ యంగన॥ ౪॥ మాటలతడవిచట నేటికీ। కడుశీఘ్రముగను। బోటినికవగూర్చనేటికీ॥ ధాటిగశ్రీవాలమేటి। హాటకగిరిధరుసాక్షిగ॥ నంగన॥ ౫॥ —— వెండియు.

ద్వి॥ ఓమనోరంజనీ యోనీలవేణి - యేమనిజెప్పను మెలనాగసొగసు - జూచితీరును గాని సుదతి నే దెల్ప - నేచందమున నీకు నెఱుగంగవచ్చు- నైనగుర్తించుటకై కొంతవరకు - బూనివాక్రుత్తునింపుగ నాలకించు - తరుణిమోము సుధాకరుగీము - గరితపాలిండ్లు బంగరుసిమ్మపండ్లు - నెలత చెక్కులద్దాలు నిల్వుటద్దాలు - మెలతమేని మెఱుంగు మెఱుపులరంగు - లలనమ్మునుంగురులు నీలంబులసరులు - చెలువపెన్నెరికొప్పు చీకటియొప్పు- కన్నె కంధరము శంఖంబు సుందరము - చిన్నారినూగారు చీమలబారు - భామిని కెమ్మోవి పగడంపుదీవి - కోమలిమీగాళ్లు కొమరు తాబేళ్లు - మదవతివేళ్లు లేమావిచిగుళ్లు - సుదతి చొక్కపుగోళ్లు చుక్కలజోళ్లు - యామొగంబా చన్నులా తళ్లుకళ్లు - లామెయి యాకురులా కప్పుకొప్పు - యాకంఠమా యూరుయామోవిసొగసు - యాకాళ్లుయావేళ్లు యామెుప్పుగోళ్లు - దానికే చెల్లునంతయనువర్ణింప - గానెవ్వరికిని శక్యంబుగాదబల - తగునేర్పు మెరశిచిత్తముగట్టిపరచి - మొగిచక్కదనములుముల్లైగా సంత - రించిచేశెనో యావిరించిగాకున్న - నంచయానయొయ్యారమంతయు శతాంశ - మైన జొప్పడదెయి యాయవనిలోగల్గు - మానవతీలలామలకొవ్వగాక - వేమాటలింకేల వేగనీ వేగి - ప్రేమనన్నారెడ్డి శ్రీరామచంద్ర- ధీమంతు నెలదీవర్ధి

లజేయుభక్త - కామదుండైనశ్రీకరవాలమేటి - నందివాహనునెంచినన్నా
యహల్య - పొందజేశియశంబుబొందవే భామా॥

వ॥ అనినమనోరంజని యిట్లనియె. హే మహారాజా॥

[సంవాదము.]

(నీలాంబరి రాగము-ఆదితాళము.)

మునికాంతనుబోలినకాంతలులే । రనిబల్కితిరిపుడమరేంద్రా। కనుగొంటిరొయొకరనగావింటిరో।వినవినచోద్యముయమరేంద్రా॥౧॥ఇంద్ర॥ నీకన్నపుజగమునసేనేజూచితి। చక్కెరబొమ్మనుమెలనాగా।యెక్కువగాదిపుడేదెల్పుటలిక। మిక్కిలిగలదేమెలనాగా॥౨॥మనో॥అనుపమలావణ్యముగలలలనను । తనుగైకొనుటకునమరేంద్రా। మునియెంతటిచక్కనివాడోన్నెమ్మనమునదలపగనమరేంద్రా॥౩॥ఇంద్ర॥పసచెడియడవులకాయగసరులను। మెసవుకృశాంగుడేమెలనాగా। కుసుమగంధికాముసలితపసీగజ్ఞమేశకాంతరమేమెలనాగా॥౪॥మనో॥ ఘనులువయశ్రీకరులసఘులుభువిననేకులుండగనమరేంద్రా।వనజభవుండిటువంటివియ్యామె। ట్లనుకూలించేనుయమరేంద్రా॥ ౫॥ఇంద్ర॥ ఆలోకేశుడొనర్చెటికార్యము।లీలాటివిగదామెలనాగా। వాలమేటిపురిపాలుడలరనా। బాళిదీర్చవేమెలనాగా॥౬॥

ఓభామా॥ —— ఉ॥ దానిముఖంబుకాంతియును దాని బెడంగగువాలుచూపులున్ । దానికపోలసత్కళలు దానిచనుంగవజెందుపొంకమున్ । దానిమనోహరాంగరుచి దానిమృదూక్తులయుక్తులెల్లనో । మానినియేమిజెప్పుదుసమానములేదిలసాటిశేయగన్॥

ఓలలనా॥ —— క॥ కులుకుబిగిగబ్బిగుబ్బలు । లలితగనిగమెరయుకురులులలితాధరమున్ । బెళుకుగలకన్నుగవయును । దళుకీనెదునగుమొగంబుదానికెచెల్లున్॥

గావున॥ —— గీ॥ పొలతిసుందరంబు పూర్తిగావర్ణింప । సురగవరునకైనదరముగాదు । సఖిదలంపసొక్కుజల్లినట్లున్నది। యాలశింపనేలధరుగుబాలా॥



[మనోరంజనిమాట.]

[ముఖారి రాగము-ఝంపతాళము.]

సురవరనాజాణతనమిక । జూపుమువగవుమీదుమూ । గురుకుచనెటులైనమిమ్ము। గూర్తుచుతమిదీర్తుచూ॥ సురువర॥౧॥ యెంతపత్రాజైనముర। వ్వంతలోవలవేయునా । యింతటిపనికైయోవన। తేలనుచాల్ చాలుమా ॥ సురవర ॥౨॥ మంచితెల్యనిమాటలచెలి। మనసునగరగించి। పంచాస్త్రునికేళికినా। ప్పించెద మెప్పించెదా॥ సురవర॥౩॥ దేవానామాటకుపం। దేహమేమితేదూ। శ్రీవెలయగనమ్మకంబు । జెందుముముదమందుము॥ సురవర॥౪॥వరమతిశ్రీవాలమేటి।వాసునిబ్రార్థించుచూ। స్థిరమొప్పగమేలువార్త । దెచ్చెదజనివచ్చెదా॥ సురవర॥౫॥ —— మరియును.

ద్వి॥ సితహస్తిగమనమీచిత్తంబులోన - మతకంబుమాని నెమ్మదిమందుమిపుడు - పరిబోణిచెంతకువేగనేనేగి - సరసోక్తులనుకొంతచనువుగల్పించి - నెలతుకనెరినొక్కనిమిషంబులోన- వలపుమీయందునివ్వటిల్లంగజేతు- నందుకుపతిభీతినయ్యెంచుబోడి- సందేహమునమాటసరిజెప్పనోడి - మునుకొనిబిగిమానమునునుండెనేని - ఘనతరోపాయముల్ కలలుసామెతలు - మదివాటబోధించిమర్మముల్దెలిపి- మదగజయానసమ్మతినిరాదీతు - నందుకొప్పకయున్నఁ బతివ్రతయగ్గు - మందులచేనైనమమతజెందింతు - నిన్నుసంగతులేలనేలినవార - టన్నమాతోనసేనధికమోదముప - నుప్పరంబందిమహోల్లాసముననుఁ - యొప్పులకుప్పదానుప్పొంగకున్నె - యోయయ్యనేబోయియొయ్యారకేవత్తు - నాయిట్టిచిటిపనుల్నాకులక్ష్యంబె - రాయివంటిదిరైననరమణతోగరగ - దీయనేహృదయంబుతియ్యమాటలను - యీపనినెరవేర్చకిటవచ్చితేని - నాపేరుమార్చ మోనముచిదైత్యారి-వరవాలమేటిసర్వజ్ఞునిదలచి-సరగునశలవిమ్ముస్వర్గాధినాథా॥

వ॥ అని విజృంభించిపలికిన కుంభస్తనికి జంభారియిట్లనియె.

[నాదనామక్రియ రాగము-ఆదితాళము.]

పోయిరావే । వోరాజవదనా. పోయిరావే ॥ నాయెడనెనరును బాయకనల్పియు। నీయెడగాతమునింతిచెంతకూ। పోయి॥౧॥ మేలుమీద

గా। పలుకుపలుకవ। పాలుగారగా॥ లాలనమున నేలాగైననుయా। లో
లనేత్రికాలోచవదేల్వా॥ పో॥ ౨॥ నీటుగులుకవే । నామాటలందు ।
నాటబలుకవే॥ ఘాటమైనయేకాంతస్థలమున । బోటిమనసుగనివాటము
నెరపా॥ పో॥ ౩॥ గురిని గాంచవే। శ్రీవాలమేటీశ్వరునుతించవే॥ ధర
నేనుండినవరకునునీమేల్।మరువనురుయశసహరము స్థిరంబో॥ పో॥ ౪॥

వ॥ అని పలుకననిలింపపతి శలవుగైకొని నిజనిలయంబునకుం జను దెంచి గౌతమీసంధాన పరియాణాలోచనంబు శేయుచు మనోరంజని సుఖంబుండెనట॥

క॥ అనిధరణికోటకులపా ।
వనసుబ్రహ్మణ్యసుకవివర్యుడుసంక్రం ।
దనగౌతమీవిలాస ।
మ్మునను ద్వితీయప్రకరణముసువిరచించెన్॥

శ్రీమదింద్రాహల్యావిలాసంబను నాటకంబునందు
రెండవదినముకథ - సంపూర్ణము.

శ్రీ

## ఇంద్రాహల్యావిలాసము

### మూడవదినముకథ.

శ్రీరమణీమనోహరాం। భోరుహముదలమచునుతపోవనిసిసదా।
కారుండగువృక్షరంబు । డారూఢిజరించెదానహల్యాన్వితుడై॥

(శ్రీరాగము - త్రిపుట తాళము.)

యిందిరా।మానసజలజేం। దిందిర॥ ఇందుబింబనిభాననామృదు। కుందసుమరదనాజనార్దనా॥ యిందిరా॥ ౧॥ వారణా । ఘోరదుఃఖని। వారణా॥ మారజనకవిరించినతచర।ణారవిందముకుందమురహర॥ యిందిరా॥ ౨॥ భండన। ధీరాభియాతి। ఖండనా॥ పండితప్రియభక్తమందిర ।



పారిజాతసుపర్ణవాహన॥యిందిరా॥ ౩॥ వాసవ। వందితానంత। కేశవా॥ వాసుదేవపురాణపూరుష । వాలమేటిశివాప్తశుభకర॥ యిందిరా॥ ౪॥

వ॥ అని శ్రీమన్నారాయణునినామకీర్తనంబు శేయుచు నరుణోదయంబున మునివరుండనుష్ఠానార్థంబేటికరిగిన నహల్యాదేవిగృహకృత్యంబులుదీర్చి యొకసఖీమణిం గాంచి యిట్లనియె॥

(*) అహల్యాదేవిపూదోటకుబోవుట (*)

గీ॥ బోటిరో జటీంద్రుడేటిస్నానంబుశే । యంగబోయెవచ్చునంతలోన । దర్భలిందనములుదగు ఫలంబులువిరుల్ । దేవనంబుకెలమిబోవవలయు॥

(శుద్ధకాంభోజిరాగము-అటతాళము.)

పో దాముపదవేయోబాలా । యెల, పూదోటకీవేళప్రొద్దాయెచాలా॥ పో దాము॥ ౧॥ సన్నజాజులుమొల్లవిరులూ । సుర, పొన్నలేర్పరచితెత్తమునత్థలములూ॥ పో దాము॥ ౨॥ పత్రములుశలింధనములూ। నగ్ని, హోత్రకృత్యమునకువలెనీవస్తువులూ॥ పో దాము॥ ౩॥ శ్రీవాలమేటిశంకరునీ। మదిని, భావించుచును వేటకబూనియు త్తతినీ॥ పో దా॥ ౪॥

వ॥ అని బలుకుచునచ్చెలుకలకోలికి నెచ్చెలింగలశి యెలదోటకుం జని సుమాపచయంబు సేయుచుండెనట్టియెడ॥

[*]మనోరంజని అహల్యాదేవికడకువచ్చుట.[*]

క॥ శ్రీవెలయుమనోరంజని । దేవేంద్రునియాజ్ఞ కొలవితెరగొప్పన హల్యావనితకడకుసంధికి।బోవన్ పయనముయొక్కపాలతుకకనియెన్॥

ఓశమ్మా॥— ఉ॥ ధాతయహల్యయన్ యొకసుధామధురాధరి సృష్టిజేశెయా। గౌతమమౌనికిచ్చెనటకామినిచక్కదనంబుధాత్రినే । నాతులయుండులేదటయనంగరతిన్। తను దానిగూర్పగా । నీతరినాదిభారముటయుంతిసురేంద్రునియాజ్ఞవింటివే॥ గావున.

ఉ॥ అక్కరగల్గువేళలప్రయాసకునోర్చిస్వశక్తిదాపకన్ । మొకుకవశ్రద్ధతో ప్రభులకే పనినైననునిర్వహించియున్ । మిక్కిలిమెప్పుగాంచుటలుమేదినిలో గడుకీర్తిగాననే। నక్కలకంఠిగూర్చికులిశాయుధునొద్ద ప్రసిద్ధిగాంచెదన్॥

వ॥ అదియెట్లంటేని.

ఉ॥ తామరసాక్షి తాపసిల తాగృహమందున లేనివేళయా। భామిని చెంత కేగసదుపాయముగా మదినబ్బజేసిసు। త్రామునికోర్కె దెల్పుము వరాణియొకంబడికిందివచ్చి వా। ధీయుస మెల్ల వారలకు దెల్పని దేసమయంబు రాగదే॥ —— వ॥ అని పల్కి దానిం గూర్చి కోసి॥

(*) మనోరంజని అహల్యకడకు బోవుట. (*)

(జాతిస్వరము - మట్యతాళము.)

వెడలె నో రంజనీ। విశ్వకర్మనందనీ వడి వెడలె॥ కడుయుక్తిని గౌతమకులు। కాంతను బేలింతునందు। వెడలె॥ ౧॥ పాకవైరికేపనీ। జేకూర్చక పోసనీ। నాకన్నను నేర్పరులు త్రి। లోకంబుల లేరని వడి॥ వెడలె॥ ౨॥ నీటుగ నొకవిధము నా। నెగడి వియత్పథము నా। ధాటిమీరగా నచ్చర। బోటులా పైరాయన వడి॥ వెడలె॥ ౩॥ వాలమేటి నూలినీ। వరభక్తకృపాళునీ। చాల గమని పేమ చూ। సఖియతో ముచ్చటాడుచు వడి॥ వెడలె॥ ౪॥

వ॥ ఇట్లు పయనంబై జనిచని గౌతముని తపోవనంబు దరియం జొచ్చి మొలదోటం బూలు గోయుచున్న యహల్యాదేవిం గొంత దూరంబునం దిలకించి విస్మయంబంది మెచ్చుచు నెచ్చెలిం గాంచి మనోరంజని యిట్లనియె॥

ద్వి॥ సురరాజు జెప్పిన సుందరీతిలక- మరవిందముఖి చూడుమిదియా కాబోలు- నెంత చక్కనిదమ్మ యీ ముద్దుగుమ్మ- యీతియే మోహమని యెంచితినమ్మ - ముఖమున గెలిచెనీ ముదిత చందురుని - నఖముల గెలిచెను నక్షత్రములను- నడుమున గెలిచెనీ నాతి సింహ్వముల- నడలచే గెల్చెను నలువ తేజీల- కచముల గెలిచెనీ కలికి తుమ్మెదల - కుచముల గెలిచెనీ కొమ్మ జక్కవల- వేణిచే గెలిచెనీ వెలది వ్యాళముల। పాణులచే గెల్చె బలు మృణాళముల- నగవుచే గెలిచెనీ నారి చంద్రికల- తగవుచే గెలిచెను ధర్మశాస్త్రముల- పడతి చూడ్కుల గెల్చె భావజాస్త్రముల- మెడయొప్పుచే గెల్చె మెలత శంఖముల - వళుల గెలిచెనీ వనిత సంపెగల- పలుకుల గెలిచెను బాలకీరముల - నొడలకాంతిని గెల్చెను విదచంచలల- తొడలచే గెల్చె వధూటి యరంట్లు- ముక్కున గెలిచెనీ ముదిత నూబూల- చెక్కిళ్ల గెలిచెను చేడె యద్దాల- రదముల గెలిచెనీ రమణి మ



ల్లియల- పదముల గెలిచెను భామ తాబేళ్ల - చెవులచే గెలిచెను శ్రీకారములను- యపురయే చనవచ్చు నబ్జాక్షి శౌరు- వ్రాని వర్ణన జేయబోయిన గాని- వాణీశ్వరునకైన వ్యాళకులేంద్రు- నకునైన సురగురునకునైన దరమె - యకలంకమూర్తి చంద్రోత్తసకీర్తి- యైనట్టి ప్రభునకీయ్యకపితామహుడు- మాని కెట్లిచ్చెనో మదినెంచి చూడ - మనరాజు కేతగు నగు వయందంబు - మన రాజు యందమీ మగువకే తగును - తగుదునే వీరి నిద్దరికవ గూర్ప - దగునంతటికి సాక్షి దర్పకుండెల్లది - నేను బూనిన పని నెరవేరకున్నె - నాకేర్పచూడుమన్నా రెడ్డి రాను - చంద్రుని పాలించు జగతి వాళ్ళేటి - చంద్రకిరీటుడే పద్మాక్షీ ॥

వ॥ అని పల్కి మరియు నిట్లనియె॥

(మధ్యమావతిరాగము - అటతాళము.)

ఎంతశృంగారమమ్మా। యీ చెలి పుట్టు। కెంచటం గాకుబోమ్మా। ఎంతశృం॥ గారమో యీ ముద్దువదన పూబాల। బంతులబోలు నీ బాల పాలిండ్ల హా॥ ఎంత॥ ౧॥ ఘనతరజఘనముతో। మృదుపదములో। యీవిద పల్లవసమములో। మెరుపైన ముత్యాల నిరశించు నఖములు। తరుణి మధ్యంబు కేసరి గేరునమ్మ వమ్మా॥ ఎంత॥ ౨॥ తిలపుష్పసమ నాసమే। యీ తనుములు। వలరాజు శరభాసమే॥ నెలకెనయగు ఫాలతలము చెన్నలరును। కులుకులు తళుకులు కోటి శేయుగదమ్మా॥ ఎంత॥ ౩॥ కురులళి పత్రములో। అందిడిన ప్పా। సరుతెంత చిత్రములో॥ విరిబోణి వర్ణింప। ధరవాలమేటి శం। కరునకు గాక నితరులకు దరమా నే॥ ఎంతశృంగార॥ ౪॥ —— ఓసఖీ.

సీ॥ ఈ చెలికి కల పార్వతీ చెలి నొకగుణం। బున సాటియన వచ్చు వనజగంధి। యీ భామకల భార్గవీ భామ నొక మార్గమున దీటనగవచ్చు మోహనాంగి। యీ కాంతకల శారదా కాంత నొకవైలు। చేజోడనగవచ్చు రాజవదన। యీ తరుణీమణి కెనయానరుంధతీ। యనసూయ లోకట్టనలరు బోడి। వీనుదప్పగ నెవ్వరికీరవాణి। సమము గారు జగంబున సాటిలేరు। యిట్టులుండగ నేనిజ్జరేశ్వరుండు। నంతవిభ్రాంతి జెందుటదంతిగమనా॥

వ॥ అనివిస్మయంబుగాబలికి యక్కలికినొక్కరుమెడఁ గలిపి తానొక్క
తె మెలుకువగా జేరబోయినం జూచి యహల్యాదేవి మృదుమధురవాక్యంబు
లమ్మనోరంజనికిట్లనియె॥

(*) అహల్యామనోరంజనుల సంవాదము. (*)

(కందార్థములు.)

పరభృతవాణీనీవె। వ్వరునీ పేరేమి నేఁడు వనమార్గమునన్ । సరగు
న నెందరిగెదవో। మరి దాపక చెప్పవమ్మా। మదగజయానా । సంఫుల్లాబ్జ
వదనాభిరామా॥ వదలని సకలసంపదలొందవిన దేవ। ముదితగదోచుచున్నది
నిన్నుఁజూడగ॥ మదగజయానా॥ ౧॥

[మనోరంజని కందార్థము.]

భంజితకల్మషుడన వే। టర్ంజగతిజరించు విశ్వకర్మ తనూజన్ । రం
జిలు నాపేరు మనో। రంజని యను దానవమ్మ । మంజుళవాణీ ॥ మానితమ
త్తే। మధుకరవేణీ ॥ కంజజుసృష్టికిఘనమ నీవనవిని । నెంజలిదీరగ నేజూడ
వచ్చితి॥ మంజుళవాణీ॥ ౨॥

[అహల్యకందార్థము.]

సుందరివిశ్వాసము బెం। పొందగ నీవిపుడుమా తపోవనమునకీ । చం
దముగా జూడగనా। డెందముకడువిస్మయంబు। జెందెనూ॥ నీదర్శనమునే।
డందెనూ ॥ కందర్పునిశరసుందరమునని । విందేగుట నాకిపుడద్భుత
ము జెందెనూ॥ ౩॥

[మనోరంజని కందార్థము.]

ఓవనజాక్షియహల్యవు । నీవే గాగాకనితర నెలతలకీరే । భావైభ
వంబులెల్లను। భావింపగగలవే పరమ। పావనీ, జిగిమీరిన మే । ల్తావినీ॥ శ్రీవి
లశిలునిన్నీ కని జేప్పిన । యావిధి నేమనగా వచ్చునెయో। పావనీ॥ ౪॥

వ॥ అనిబలికి మరియునిట్లనియే॥

ద్వి॥ భామినీవినవమ్మ బంగారుబొమ్మ - నీమోహనాకృతినిమ్మృగా
క్షులును - నీయందచందముల్నీ చతురత్వ - మేమెడధీమతులెల్లనచ్చెత మా-
గాజెప్పగావినికడు వేటరబూని - మోజుగా నినుజూడ మొగివచ్చితిట మ-



చకోరభామ్మ మజ్జగములలోన - నకరంబునీపాటి నెలతలులేరు - దీనచకో
రాళితృష్ణలుదీర్చు - చానరో నీముఖచంద్రామృతంబు - ఘనదరిద్రమయూ
రగణముల నేలు - కనకాంగి నీవేణికా మేఘపంక్తి - పేదజక్కవలసంప్రీతి
గాబ్రోచు - సాదరంబుగనునీ[illegible]మొగ్గ - అతిబీదపికసమూహము
నాదరించు - నతివనీచిగురుటాకధరంబుడంబు - బహురిక్తమధుకరవ్రత
తులదనుపు - రహినీవచోమకరందనిర్ఝరము - భళిభళీపద్మసంభవు సృష్టి
మేధ - నెలతరో గణుతింపనీవై రహించె - నీ[illegible]శికత్వంబునీనీటుతేట - నీ
రూపపటిమయునీసద్గుణంబు - లెంచదరంబెఫణీంద్రునకైన - పంచాస్య
మధ్యనీభద్రచిహ్నాంబు - లరసినదెలసెనహల్య[illegible]ధరశాలగెలసుం
దరులుపెకరంద్రు - నారీలలామయన్నారెడ్డివంశ - వారధిచంద్రుడౌవర
రామచంద్ర - మనుజేంద్రు నేలుశ్రీమన్నావలమేటి - కనకాద్రిధరునిసతో-
గుణచేనిందు - కనులపండువుగాగ కనగల్గెముదము - ననునీదు [illegible]కరదనం
బు బింబోష్ఠీ॥

వ॥ అనిమెప్పులాడుచు యొప్పులాడికహల్యాదేవి ఇట్లనియె.

క॥ కలికీయహల్యమెచ్చగ। వలెనా మునికాంత దేటవై ఖరిమఖవున్ ।
గలశిరమింపగజాల్నచి । నెలతుకగౌరవము నెన్న నేర్పరివై నన్॥

వ॥ అనివచించిన చిగురుబోడిమాటల స్వారస్యంబునకలరి సవ
రణగా నింద్రదూతికయిట్లనియె.

(మధ్యమావతిరాగము - అటతాళము.)

మనవివినవమ్మా। నీభాగ్యమే। మనవచ్చునమ్మా॥ ఘనముగమూడు
లోకములుపాలించుపా। వనచరిత్రుడఖండలుడు నెమ్మనమునను నినుగోరి
నాడు॥ మనవి॥ ౧॥ రారాజవదనా। దాడిమబీజ। రదనధీసదనా॥ కోరి
ముప్పదిమూడుకోట్లగీర్వాణాధి । కారుడైనశచీశ్వరుడు నీకరుణకునుపా
త్రుడైనాడు ॥ మనవి ॥ ౨ ॥ పరమపవిత్రీ । సుందరగాత్రి । పంకజనే
త్రి॥ కరమొప్పయిందిరభోగంబెంతవారికి । దొరకునీసుకృతంబువలని ।
కరుణసంప్రాప్తించెనహహా॥ మనవి॥ ౩॥ పరభృతవాణీ। బంభరవేణీ।
పల్లవపాణీ॥ ధరవాలమేటిశంకరునిసాక్షిగసుర । వరుమనోవాంఛాకరుయ
ములునీవశంబయ్యె నిజంబుగానా॥ మనవి॥ ౪॥

సీ॥ తగస్వర్గమర్త్యపాతాళలోకంబులు మేలుగా సత్కీర్తి నేలు
చునుమా। యంభోజనేత్రి పాదాంభోజయుగళసమర్పితదివ్యచిత్తాంబుజుం
డు । కరుణాకటాక్షవీక్షణలుల్లసిల్లగా విబుధులబ్రోచుసద్వితరణుండు ।
ఖురధరామరయక్షగరుడగంధర్వాది । పరిసేవితాశ్రాంతభవ్యచరితు। డ
మ్మహారాజరాజునిజాంతరంగ । మంతనిను జేర్చియున్నవాడమ్మనీకు। మేల
గుగదమ్మనీకీర్తి మెరయునమ్మ । కోరికీడేర్చవమ్మబంగారుబొమ్మా॥

వ॥ ఇదియునుంగాక॥

(కందార్థములు.)

సకలదిశాధిశులువణి । మకుటంబులుసోకమ్రొక్కి మరియెవ్వారిది।
వ్యకటాక్షము గోరుదురు । య్యాకలంకుడుగాచెనీక । టాక్షేక్షణలకూ ।
నీమహిమెన్న । నలవెవ్వారలకూ॥ వక్షోజనిహాశితవారణకుంభయా । ర
క్షోపరోధియపేక్షించెనీదుక। టాక్షేక్షణలకూ॥ ౧॥

అచలములపత్రములురా। లిచినబలేదూరువోవలికుచకుచానీ। కు
చగరులనుపత్రంబులు । రచియింపగనున్నవాడు। రాకేందువదనా।కుంద
సుమని। రాకారరదనా॥ పాకారియత్నముఫలియింపజేసిన। శ్రీకరమైన
కోరికలునీకొనగూడు । రాకేందువదనా॥ ౨॥

వ॥ అనినవిని మందస్మితవదనారవిందయై సుందరాంగి పురందర
దూతికకిట్లనియె,

(శంకరాభరణము - ఆదితాళము.)

చాలుచాల్ చాలించవెకోమ్మా। యిందు।జాణమాటలేమిటికమ్మా॥
లాలనమునచిత్రాలమారివై । గేలిశేయవెలయాలనటేబళా॥చాలు॥౧॥జల
జాక్షిరోవేల్పులదొరతనకిది । పలుచదనంబనిడలచవలదెబళా॥చాలు॥ ౨॥
సకియానావంటి కులాంగనామణి । కకటాయిది న్యాయంబటవేబళా॥
చాలు॥ ౩॥ నానాథుడువిన్ననుయిరువురకవ । మానమునూనముహానిగ
ల్గదెబళా॥ చాలు॥ ౪॥ వాలనేటిపురిపాలుడుమెచ్చడీ । వేళవిన్ననవ్వేరె
వరైనను॥ చాలుచాల్॥ ౫॥



ఓమనోరంజనీ। — ద్వి॥ తగునషేవాల్గింటితనవంటివాడు- సు
గుణమెంచకపరసుదతులగోర - సామాన్యుడెమాడుజగములయందు -
శ్రీమీరసన్నుతిజెందినవాడు - మేలుమీరశతాశ్వమేధముల్జేసి -వాలిమిసత్కీ
ర్తివడశినవాడు- యమ్మనేజెల్లయిట్లారడిపనికి- సమ్మోదమొందుటచొక్క
గాదటవె- యాగభాగంబులకతిప్రీతిదన్ను - బాగుగేబిలతురే బ్రాహ్మణో
త్తములు - తనతోటిసురలువింతగగూడినగరె - యనువొందగానుమహా
త్ములచెంత - గౌరవంబబ్బునేకనకాంగితనకు - మేరగాదనిజ్ఞాలమేటిశంక
రుని- సాక్షిగానీవేగిశక్రునితోడ - నీక్షణంబునదెల్పుమిందీవరాక్షీ॥

వ॥ ఇదియునుంగాక. — ఓశమ్మా॥

(కందార్థములు - రేగుప్తిరాగం.)

మిక్కిలిరాజసమునమేల్। దకగగముజ్జగములేలుతానెక్కడనో।
యక్కతపోధనసతినే। నెక్కడనిటువంటవార్త । లెవరైనవిన్ననవ్వరే।
సరిసాటగాని। సవరణయౌనుచునోవ్వరే। పవిసాధనుడు న్యాయపద్ధతిదప్పి
విప్ర । కువలయాక్షినిరతిగోరి నాడనినవార్త॥ లెవరైనవిన్న నవ్వరే॥ ౧॥

చానానేమగనాలను । గానాయీపనిడలంచగాతనకగునా।ఫ్రా
సీసురేంద్రుడుబోగము। దానిగనన్నెంచెనేమో ।తగదుతగదనిదెల్పవే।
ఔనెబళానీ। వగమాటలిందునిల్పవే॥ మగువాపరకాంతలపైమనసునిల్పు
టదోస। మగునంచుశాస్త్రవేత్తలమరబల్కుదురుగానా॥ తగదుతగదని
దెల్పవే॥ ౨॥

(మనోరంజనివాక్యము.)

(రేగుప్తిరాగము-ఆదితాళము.)

సీసీతకములుమానవమ్మా । రోషముద్దుగుమ్మా ॥ సీసీత ॥ యీనా
టికిగలమేవురేవుబెం । ఫ్రానియొండకీపోహణలేలను॥ సీసీత॥ ౧॥ కనుల
కింపైనవానిగలశీ। రతికేళిలోన। బెనగవలెనుమేలుదెలశీ॥ ఘనమగుజవ్వన
మొనరినవనితల। కనయముధర్మంబంతకుతేదిక॥సీసీత॥౨॥ అగణితమైనమో
హాముచ్చి। మగవాడురేయు। బగలొక్కరీతిసిచ్చమెచ్చి॥ జిగిబిగిసొగనగు
మగువకౌగిటక్। దగిలిరమించందగునయమగునిది॥ సీసీత॥ ౩॥ న్యాయశా

స్త్రంబులునమ్మకుమూ । పెద్దలాపుచ్చ । కాయలామాటలు నెన్నకుమూ॥
వేయన నేలనువియ్యము నెయ్యం। బోయింతిరో తగియుండినబాగా॥నీసీత॥ ౪॥
వలశివచ్చిన వేడుకలనూ । కడద్రోచితలగి । మెలగుట మేలు గాదీయిలనూ।
వలనొప్పగ శ్రీవాలమేటిపుర। నిలయుడు మెచ్చుండళ్ళకుంతలియిక॥నీసీత॥ ౫॥

ద్వి॥ కాంతరో యేలమ్మ కాసంతపనికి - నింత యోచన జేసెదీలాగు
మదిని- మించుగా వేటలు మేలిమినసుభ - వించుటయొకటియుర్విని దక్క
[illegible] - పుణ్యపాపము లెన్న బోయినమనకె - గణ్యంబుగాద పే కలహంస
యాన - దారుకాటవిలోని తరుణులపొందు - కోరియొనర్పడాకుం దేందు
మౌళి - ఘనతరంబగుమా కారంబుబూని - తనపుత్రినంటడా తామర
చూలి - వాశిమీరంగ కేవలకూర్మి మించి - దాశినొంద డెతపోధనుడు వ్యా
సుండు - పర్వేందుబింబాస్యబాళి పెంపెక్కి - యూర్వశిగలయడా యు
గికౌశికుండు - ననురాగ మొప్ప దానగ్రజుభార్య - నొనరరమింపడాయు
వీదగురుండు- చిత్తంబురంజిల్ల చెలరేగిమేన- యత్తతో గ్రీడింపడావనమా
లి - నెనరునతనవది నెను గైకొనడె - సునయవిధేయుడౌ సుగ్రీవుడెలమి
తారశికత్వంబుదారశిలంగ - తారనుగూడలేదాచందురుండు - వారిట్టి
శాస్త్రసవ్వడులను వెదుక - నేరకయుండిరో నీవంతకన్న - నేరుపుశాలి
వౌనీటు కేకాని- వారికన్ననుతగవరివిగాదమ్మ - నామాటవినవమ్మ నాకా
ధిపతిని- కాముని కేళిలోగరగించవమ్మ- బాయనిసౌఖ్యంబుభావింపవమ్మ-
న్యాయశాస్త్రంబులునమ్మకుమమ్మ- విరిబోణి సురరాజు నీడనీ వెప్రుడు- కర
మర్థిజూడవుగాక దేవతలు-లలిని పరాంగనలను గూడిగాక- కులకాంతలందు
గన్గొని రెనందనుల- నీలాటి చెన్నబోయినననేకములు - బాలగాగలవుసిచా
[illegible]వమ్మ - వింతలేసినువంటవెట్టి చేకొనిన - యింతులుపుడమిలో నెందరు
[illegible]రు - వారలనెల్ల నేవంతుకు దేను - తారెనా మనసుకు తగినట్టిజాణ -
మేలొప్పయెటులైన మేఘవాహనుని - బాళిదీర్చినమంచిఫలము నీకమరు -
నారీలలామయన్నారెడ్డివంశ - వారిధిచంద్రుడౌ వరరామచంద్రు - నా
[illegible]దముగనేలునట్టివాల్మేట్టి- గౌరీశ్వరునిసాక్షిగాచకోరాక్షి॥ పెంపెయు



(కళ్యాణిరాగము - అటతాళము.)

లోలాక్షి హేలనాలోచనదేటయని। బేలవయ్యెదవు । మ టాలిం
చవమ్మా॥ ౧॥ కోటగోడలమైనమీటుగ నెగబ్రాకి। దాటనేరనిదది బోటిగాద
మ్మా॥ ౨॥ వారిపూరితమహాప్రవాహంబులనుయీద । నేరనిదదియొకనెల
తగాదమ్మా॥ ౩॥ తనమీదితప్పులోకనిమీదనిక్కము। గనుబెట్టలేనిదికాం
తగాదమ్మా॥ ౪ ॥ ధవుడైనతనజాడతగగనిపట్టిన। సవరించలేనిదిజాణగా
దమ్మా॥ ౫॥ కల్లనిక్కంబునిక్కంబుకల్లగజేయు । వల్లదెలియనిదదివనిత
గాదమ్మా॥ ౬ ॥ రేయుంబవళ్లొక్కరీతిజారరతి । హాయిజెందనిదదియి
తివగాదమ్మా॥ ౭॥ వాలమేటిపురిపాలుడౌనవగమేల్ । కాలోచితంబుచ
క్కగనెంచవమ్మా॥ ౮॥ వ॥ ఇదియునుంగాక.

సీ॥ కోమలినీగబ్బిగుబ్బచన్నులునౌని । బిరుసుచేతులబట్టిపిసుకద
గునె । కామినీనీతావికావిమోవితపస్వి । గొక్కిపన్నులబట్టినొక్కదగు
నె। నాతినీజిగిగుల్కునగుమోముయతిపతి। పొట్టనోరునముద్దుబెట్టదగునె।
వెలదినీకుందనంబొలయుమేనుజటీశు । గడుసుదేహమునొత్తగలయదగునె
మెరుగుబంగారుకీల్బొమ్మసరణినీటు । గులుకుదానవునీవుహాకొయ్యబొమ్మ।
వంటివాడగునీపతితుంటవిల్తు। కేళినేలిలమేలగుదు వేలతాంగి॥

ఓయమ్మా. —క॥ నీవంటిసుందరాంగికి। నీవంటిమనోహరాంగు
నింగూర్పకహా।ఈవాచంయమికిచ్చిన।యావిధినేమనగవచ్చునమ్మ మృగాక్షీ॥

వ॥ అనిచాతుర్యంబుగాబల్కు మనోరంజనిరవరతనంబునకువిస్మ
యంబంది యహల్యాదేవియిట్లనియె॥

(తోడిరాగము- రూపకతాళము.)

యెంతబాగా జెప్పినావమ్మా। యికనిల్పవమ్మా॥ యెంత.॥ [illegible]
రోయిటువంటిసామ్యము। లెవ్వరెరుగరనుకుంటివా॥ యెంత ॥ ౧ ॥ [illegible]
మానసమర్థులతోటి। సరిబోల్పనగునె। యణుమాత్రంబైననాబోటి॥ కుసు
మగంధినీనేర్పులు। పొసగించెదవమ్మచల్లా॥ యెంత॥ ౨ ॥ వనకాంతదిక్కం
తటిసౌరూ। రంభాదివార । వనితలుతనకెందరో గలరూ ॥ సునయముగు

ప్రతముకైడిన। సుఖమై వ్రాధకలగావలదా॥ యెంత ॥ ౩॥ వాగ్దోషములింక నిలుపుముా। శ్రీవాలమేటి। తాపసునిమదిలోనదలపుముా ॥ దిగ్దేవునకిదిమన విగ। తీవ్రంబుగ దెలుపుముపో॥ యెంతబాగా॥ ౪॥

వ॥ అనిఖచితంబుగాబలికినలికుచకుచ కాభ్రమరకచయిట్లనియె॥

ద్వి ॥ అతివరో పతిగాకనన్యపురుషుల - రతిగూడధర్మమార్గము గాదటంచు - దలచితేనిందుగంధర్వకృశాను - లలివేణివివరింపనన్యులుగా రె- వారువేలుపులన్నవారలకధిపు-డౌరుఘుకుండుకొంచెమటెచంచలాక్షి- యరివేదచోదితంబనియంటివేని- సుదతిగంధర్వుండుశుభవాణియఖిల- పావనంబుహుతాశిపద్మారిశుద్ధి - కేవలంబౌసగపంకేరుహాముఖులు - వల నొప్పపరమపావనములువారలకు - దొలగునువ్యభిచారదోషంబుబుతువు- వలసనుయనుచుసవ్వడిమనుస్మృతియు- దెలుపగావినవెసందియమింది కేల- నైదలోనవదలుమయిదియునుగాక- మదవతీనీమదిముక్కువవలన - చిత్త జాస్త్రములకుజిక్కినవిబుధ - సత్తమువెతలునిజంబుగాకొన్ని - కొప్పెద వాల్మేటిశివునిసాక్షిగను - యొప్పుగావినవమ్మమోహపైడిబొమ్మా॥

వ॥ అదియెట్లంటెని.

(కేదారగౌళరాగము- అటతాళము.)

వినవినకడుచోద్యమే। సఖియెంతని। వివరించుదుఃసాధ్యమే॥ మన సిజునిశరజాలములజి। కిక్కినశచీనాయకునివెతలూ॥ విననిన ॥ ౧॥ త్రైలో క్యపాలనముా। సుంతయులేదే। వేళవిదేధ్యానముా ॥ బాలనీబిగిగుబ్బచ నులనిపూలబంతులు కేలనుబుమను । వీలనీచెక్కిళ్ళటనిలవలీదళంబులుముద్దు గొనుసఖీ॥ విన॥ ౨ ॥ నీటునీతొడలంచూ। కదళీతరుల। గోటికాటులనుం టా॥ హాటకాంగిరొనీదువాతెరయనుచుభ్రమతవహించికద్దరి। పాటుతో చిగురాకులను మొనపంటనొక్కుచురుకనుభళీ॥ విన॥ ౩ ॥ వనితరోనీ సాక్షిగా। వాలమేటి। వామదేవునిసాక్షిగా॥ ఘనముగారంభాదికాంతలు గాంచివిస్మయమొందనందన । వనవిహారముజేయుసమయంబునను తాన్ని వరించుచెల్మెబు॥ వినవిన॥ ౪॥ వ॥ ఇదియునుంగాక.



ద్వి ॥ కలకంఠినునుపాలకాయలయెట్లు - పాలుపొందనీలాలవో సలైయొప్ప- నిమ్ముగానెమ్మెననేలమినెలరదు - కమ్మగంధపుపూతకస్తూరి గాగ - తనచేతగలనూరుదారులవాలు - వసజాక్షికరచిల్కవై ఖరిదెలుప- కళమందుగలకల్పకప్రసూనముఖు- పాలతినీలోత్పలంబులడాలుగురియు- త స్తయుకళలీనుతలపుమానికపు- గద్దెసద్దంపుతోగల్పగదాయ - రాకైవడిశే లంగరహితగవసము - గాకదిక్కాంతులుకళవళంబంద - నకటకొల్యుందున య్యాఖండలుండు- మకరధ్వజజ్వరోన్మాద్యంబువలన - నింకటి సంతాప మేలశక్రునకు- వింత గావచ్చెనావిరివితానేడ - గనెనంత్రివైనికరముగ్గద ల్పెదను- వినుమజుపీటసిన్వీక్షించెవేట్ల - నదిమొదల్మనసునీయందునదగిలె. నైదనెన్నడీవుతన్నెనయుదనెంచు- నిచకరదనమెపర్ణించునక్రాంత - మో చకోరాక్షి రేయుంబవల్నిద్ర- రమణగానదు- వలరాజుచేజిక్కె - నమ్మతిం బుపైసైతమరుచిజవింకా - నినుగూర్చుఘనివేదునెమ్మిలిసఖుల - నను రాగ మొప్పబయల్కౌగిలించు - మూర్ఛిల్లునీమదిమోహంబువలన - కొచ్చిచ్చె వంటిమిక్కిటమైనయట్టి- కాకవసంబుగాకనుపడునిట్టి - యేకాదశావస్థ లింద్రుండుజెంద- నీరీతిమాన్పగానెవ్వరితరము - నారీలలామయన్నాకెడ్డి రాము - చంద్రభూపాలరక్షకునివాల్మేటి- చంద్రశేఖరునెంచి - చనువుల హించి - దయ్యనకరుణమించగనేలకున్న - నియ్యానసురరాజునిలువ లేడమ్మా ॥

వ ॥ అనినవినిచిరినవ్వొవ్వటిల్ల గౌతమసతిపురుహూతదూతిక కిట్లనియె ॥ —— ఆహాహా వామనోరంజనీ.

గీ॥ విబుధనాథుడెంత వెఱ్ఱివాడీపట్ల। పరులసొమ్ముకాశపడిననేమి లాభమగునెయోమదేభకుంభస్తని। తనకువలనుమానుచనగదమ్మా॥

(కాంభోదిరాగము- ఆదితాళము.)

మానినిమణిమానుమనియనవే। తగదికపోపోవే॥ మాని ॥ పూనిదే వతాధిపునకీలేనిపోనివిరహమేల ॥ మాని॥ ౧ ॥ మంచిపున్నమునాటిచంద మామనుజూచుటేకాని। యంచితముగబట్టిముద్దులాడవశమే ॥ మంచియం

దమైనపరచంచలాత్ముల మోములే। తించిసంభ్రమించిభ్రమయించినఫల మేమిగలదు॥ మాని॥ ౨ ॥ వ్రూరకేచూచిమాచునోరూరుటింతెగాకయంద। గారాని మానీపండ్లందగాతిరంబలే ॥ తీరైనశృంగారవతులతియ్యని మోవి తేనియ। గోరియంగలార్చినట్టివారికేమిలాభమగునూ॥ మాని॥ ౩॥ గొబ్బ నకనకాచలశృంగోన్నతిజూడనేగాని । యబ్బురమునచెట్టబట్టనలవియాన లే ॥ బిబ్బోకవతులగబ్బిగుబ్బలపొంకముజూచి । తబ్బిబ్బులాడిననేమాదా యమగునేమాయనింక ॥ మాని ॥ ౪ ॥ తళుకుతళుక్కునమించుతొలకరిమెరు మును గాంచ। గలుగుగానికౌగిలించగానుశక్యమే ॥ చెలువుగులుకుయలరు బోండ్లజిలుగుమేనిబెళుకుకన్ను । లలరగదిలకించిమిగులసొలసిననాదాయ మేమి॥ మాని॥ ౫॥ ఫేశలాంగిచెంతజేరిలేశమైనవాసవునకా। యాసములే కుండమనవిజేసితిననవే॥ వాశిగాశ్రీవాలమేటివాసునిసాక్షిగాచాలా। దో సమందునెంచకదురాశజేశిగాసిల్లిట॥ మాని ॥ ౬॥ — ఓయంగనామణీ.

(కందార్థములు — రేగుప్తి - ఆదితాళము.)

చీమచిటుక్కనియన్నను। దామదివెతజెందువిటుడుతగజారిణితో। సేమసుఖంబునుగాంచును। వేమిటికీలాటిభ్రమత। వింతిరో- బాగాయ తేవే। కాంతరో॥ స్వాంతమునెంచగవట్టిపాతకం । బింతేగానిమరేమిలే దుపో॥ యింతిరో॥ ౧॥ — ఓమధురవాణీ.

భావంబునపొరతెరవల । బోవుటగాదలచునెమొవొలతిగనామా। రీవందువిన్నవించుము । స్రావీణ్యంబొనరమనో । రంజనీ, కవిజనచేతో। భంజనీ॥ నెంజలిదీరనినిందలిడేలని । కుంజరగమనువకుంజెప్పుమనో॥కం॥౨॥

ఓభామామణి॥ గీ॥ వాంఛితముదీర్చకెదురాడితంచుమదిద। లంచు నేమొశచీకాంతుడంచయాన । మంచిగానేనుమనవిగావించినటువ। చించి సంపూర్ణవిశ్వాసముంచుమనుమా॥ వ॥ అనిబల్కిదిగ్గునలేచి.

క॥ మాటలసంవడిమరచితి। బోటినేజెల్ల నెంతప్రొద్దరిగినది। చ్చో టికినేవచ్చియుతడ। వేటికినికబోయివత్తునింపలరంగా॥

క॥ అనిశతమఖుదూతికతో। వినయంబునబల్కికొన్నివిరులుగొనిము బొనరకడుశీఘ్రమునకాం। చనగర్భునిపుత్రిపర్ణశాలకుజనియెన్॥



⟶ { మనోరంజని అహల్యాదేవితో మాటలాడి తిరిగివచ్చి ఇంద్రునితో సంభాషించుట. } ⟵

వ ॥ తదనంతరంబాచంద్రముఖియచ్చోటువాసి సఖీమణింగూర్చు గొనిమరలివచ్చుచుండెనిట సుధాశనకటకేంద్రుండుతనలో నాలోచించె నెట్లనినా ॥

సీ॥ తరుణిచెంగటికిసంధానమంపినమనో రంజనియింతకురాకపో చెు । పోవుచున్నదోలేకపోయియహల్యను మెల్లనగనుగొనిమేలువార్త। లాడుచునున్నదోవేడుకగావగ్గి వచ్చుచున్నదోఋషీశ్వరుడుపర్ణ । శాల లోపలనుండుసమయమోకార్యాను కూలమామెనోలేక కొరతగలదో। కాసిపనికింతతడవేలగలుగువెలది। దక్కగాబోలువర్ణింప దైవయత్న। మెటులనున్నదో తెలియగానెవరివశము । యొక్కక్షణమొక్కయుగమా యెనోర్చుటెట్లూ॥ — అయిననూ.

గీ॥ తరుణమెఱుగను మాటమాత్రంబుదూతి। నంపుటయేగానినాక న్నతిశయముగ। చేడెకువిరాళిలేదెయోచించనేల। వార్తవినగోరుటొక వె తీవ్రంబునేడూ॥

వ॥ అసితనరాకకెదురుజూచు శచిమనోరంజనుని సముఖంబుజేరి కృతాంజలియై మనోరంజనియిట్లనియె. — ఓమహాప్రభో.

క॥ మదవతిచెంగటికేగితి। ముదమున మీకోరికెల్ల మునిభామిని తో । విదితముగదెల్పియాబిడ । మదిదెలశిటువచ్చితి నియమర్త్యాధీశా॥

వ॥ అనినమహోత్సాహంబున నింద్రుండిట్లనియె.

(శుద్ధకాంబోదరాగము - ఆదితాళము.)

ముదితారోపోయివచ్చితివా। మోహనాంగినిజూచితివా । వదల తనావాంఛలెల్ల।వరుసగావివరించినావా॥ ముదితా॥ ౧॥ వరపర్ణశాలలో మానీశ్వరుడులేనిసమయమేనా।మురుపునమనసిచ్చినీతో। విరివిగముచ్చ టాడెనా॥ ముదితా॥ ౨॥ మెలమితోమన్మథకేళి। కేదిక్కునతావుజూపే। కలువకంటినేడోరేపో । గ్రక్కునతెలియబల్కవే॥ ముదితా॥ ౩॥ ననబో ణికింతకుమున్నే। నాపైగలదునెనరుకొంత। అనుమానమేమిలేదదినా। మ

నసుకే తెలశియున్నాదీ॥ ముదితా॥ ౪॥ బోటికిదోచకున్ననీ। మాటల తేట అశల్ల। నాటీయుండకెటులబోవు। ధాటిగా నాపై మోహాము॥ ముదితా॥ ౫॥ ధారుణీశ్రీవాలమేటి। ధాముడునాకో రెక్కదీర్చ। గోరిసంధానంబు శేయు। కూరిమిఁ నుజూపెనహాహా॥ ముదితా॥ ౬॥ — ఓభామా॥

గీ॥ అలచకో రాక్షినోటిమాటలపసందు। కంటిచూపులహొయలుపొంకంబులెల్ల। గన్నమాత్రానముసు పెనిక్కముగ భ్రాంతి। నన్నుజెందినచందంబు నాకె తెలసూ॥ — ఓమనోరంజనీ॥

క॥ కడువేట్కపడతినినుదా। నడిగెనె దేవేంద్రుడంపెనాయనినన్న। కొండికెప్పుడురమ్మన్నది। తడవేటికి వేగదెల్పు తామరసాక్షీ॥

వ॥ అనియిక్కైవడివాచకొరబొమ్మ తనకుదక్కినట్లుగా బలికినకులిశధరునిపలుకులాలించిచిరునవ్వునివ్వటిల్ల నప్పువ్వుబోణియిట్లనియె.

క॥ సుందరునీక్షించినసతి। కిందగనాచోటుచెమ్మగిలకుండదుమీ। యందముగనినహల్యా। సుందరికినినెనరులేదెసురసికరవరా॥ కావున.

గీ॥ కలికిపలుకులచాకచక్యంబునడత। లరయమీయందెభ్రమయించినట్టులున్న। దిదినిజంబికసందేహమేలభావ। మీయదాత్మేశ్వరునిభీతినింతెకానీ॥

వ॥ అనిజెప్పి యప్పల్లవాధరి మెల్లమెల్లన నిజనికేతనంబునకరిగియుండె తదనంతరంబునా.

{ ఇంద్రుండు గౌతమీమోహ వశుండై
అమరావతివిడిచి కాననంబు జేరుట. }

గీ॥ బింకములుదీశిపోయినపంకజాక్షి। శంకదీరనివార్తలు పొంకముగను। జెప్పిపోయెనుయింకేమి శేయువాడ। ననివగచె నుస్సురనుచు జంభాంతకుఁడు॥

(యదుకులకాంబోదిరాగము - ధ్రువతాళము.)

యేమీ శేతు దైవమాయా। యీవిధాట తెలియదాయా॥౧॥ మనసు రాయి జేసుకొనీ। మదనుడే చెపద్దుబూనీ॥౨॥ కలికీ చెలువమే మోచిందీ। కనులగట్టినట్టులుందీ॥౩॥ యింతగానే జేయు శేతా। నిటుల జశెగా విధాతా॥ ౪॥ మోహవాంగివలపుతెల్లా। మోసమాయెనయయోచెల్లా॥ ౫॥ యీసుశేంద్రపదవింకేలా। యిందుముఖినిమానజాలా॥ ౬॥ యికనునిలుపలేనీబాళీ। యెపుడుగలుగహల్యాకేళీ॥ ౭॥ ధీరవాలమేటివాసా। దిక్కునీవే శ్రీసర్వేశా॥ ౮॥ — అనివరియించును.

ద్వి॥ ఇకనేటికలప్రనేనిన్నాళ్లనుంచి - శుకవాణిమూర్తి మించుగగోరుటెల్ల - పరికింపబూరుగపండుపైయాశ - స్థిరముగా జేసియాచెట్టునుగాచి - విడువకుండినచిలుక విధమాయెనకట - కడుబేర్మివలచినగౌతమపత్ని - సందుబట్టివ్వకసాధింపసాగె - సంధికై బంపినసామజయాన - సందేహమెడలనిసంగతుల్కొన్ని - పొందికమీరనేర్పునబలికిపోయె - కలిబోయనుట్లవంకనూగనుగొన్న - ఫలమెకాబోలునాప్రాప్తమింకిటను - వలరాజుములుకులవడికోర్వజాల - తలవ్రాలుదప్పదెంతటివారికైన - తనువుబాయుదునన్న ధాతయమర్త్య - గనుసృష్టిజేశెనుకలనైనలలన - చెలువంబుగాంచి రాజీవాస్త్రకేళి - గలయగానెంచినకనులకునిదుర - లేశమాత్రంబైనలేకుండునటుల - జేసియెంటనువెంటజేరిచి నాడెల్ల - వంకలజెరిచానావాసవునజుడు - పొంకమాసురరాజ్యభోగంబులింక - జాలునాకెందుకేచందానసైన - లీలనహల్యకేళిని జెందిగాని - తిరిగిరాననికమదీక్షవహించి - ధరవాలమేటీందుధరునానబెట్టి - తానొక్కడరిగిమందాకినీతీరకాననంబునప్రొద్దుగడపుచునుండే. — ఆలోనా.

క॥ మునికామినిమోహంబున। తనుజన్మశరాగ్నిజిక్కి తలడిల్లుశచీ। శునిబాములుగనజాలక। వనరుహబాంధవుడుచరమవారిధిగ్రంకెన్॥

అంత॥ ... గీ॥ కనకకాంతులసాంధ్యరాగంబుమించె। నంతకంతకుచీకటులతిశయించె। గగనమండలమున తారకలురహించె। చంద్రుడుదయించెమరుడువాసవునిపొంచే॥ వ॥ ఆసమయంబునా.

క॥ ఆవెన్నెలవేడికిఁకినీ। భావజుడోడికెనిసృక్కిభ్రమజెందియహల్యానితనస్టైదలచుచు। దావగచెనిలింపభర్తధాతీగతుడై॥

(కాంబోది రాగము - జంపె తాళము.)

కటకటా నేనికను। యెటులోర్వగాగలను। హటముసాధించెనా। యిజుడు నాయెడనూ॥ ౧॥ యెలచిలుక పలుకులకు। వలరాజు ములుకులకు। లలి పండు వెన్నెలకు। వలపైకైశలకూ॥ ౨॥ గరితనామంగలను। గనుపరచు రంగులను। మరిమరిచలంచగను। తరమెతాళగనూ॥ ౩॥ మదిబాంగినా చెంత। మమతగుప్తైమకాంత। హృదయమియదురవంత। యిదియేమివింతా॥ ౪॥ వాలమేటీశ్వరుడు। వ్యాళేంద్రభూషణుడు। యీలీలనన్నగడు। పాలుజేశినాడూ॥ ౫॥ వ॥ అనివితర్కించి మరియును.

ద్వి॥ హాసఖీహా యింతిహా పూలబంతి - హా సరోరుహగంధిహా హంసయాన - హా మనోహరగాత్రిహా మధురోష్ఠి - హా ముద్దుగుమ్మ నిన్నాశించినదాను - కీదశగనగ్లైనీ రాత్రి - నేదారిగడపుదు నేననిచాల - నిటు తల్లడిలికొంత ధృతినబ్బైలేచి - పటుగతినొక్క యుపాయంబుబన్ని - కడు సంభ్రమంబునగ్రక్కునగదలి - సడిలేకగౌతమాశ్రమముపైజొచ్చి - యను వుగాకొంతప్రొద్దాడాడగడపి - మనమునభ్రమవిభ్రమములు జెన్గొనగ - మదనుండుతత్వరశేయమమతలుడాయ - సదమలంబగుపర్ణశాలచెంగటికి - జను దెంచియొక్క నిజంబుపైనెక్కి - ముని దంపతులు బల్కుముఖ్యవార్తలను॥ ఘ్రాలిమివినుచు శ్రీమవ్వాల మేటి - పాలునెంచుచుదివస్పృతిపొంచియుండె

క॥ ఆ రేయినహల్యామణి। గౌరవభావంబుదనరి కాంతునిపాదాం భోరుహములార్తిసద్యుప చారంబులువరుసనెరపె సమ్మోదమునన్॥

వ॥ మరియు నేలాగనిన.

(❀) అహల్యాదేవి తనపతికి పాదసేవ సేయుట. (❀)

(బిలహరి రాగము - ఆదితాళము.)

సుందరాంగియహల్యామణిశుశ్రూషలు జేశెనిజేశునకూ। అందము చెందముజిందము నీంద్రుని। డెందముపరమానందమునొందగ॥ సుంద॥ ౧॥ నీరజారిని గేరెడువదనాంభోరుహమతిజిగిమీరగనూ। కీర్యంబుల పరివారంబులసరి। మీగుమృదూక్తులసౌరుగబలుకుచు॥ సుంద॥ ౨॥ మా క్తికేదిమారాలంబుగదాయని ముఖ్యముగామదిలోనెంచి। భక్తిని శ్రీయుతనుర క్తినియు



క్తిని। వ్యక్తినిమహదాసక్తినిజెలగుచు॥ సుంద॥ ౩॥ జాళువాకీల్బొమ్మవలె కళలొదేలుచుకులుకు బెళుకులమరా। మేలుగభక్తులనోలి నేలువరవాలమేటిపు రపాలుండలరగ॥ సుందరాంగి॥ ౪॥

గీ॥ శీలమొప్పనిటులసేవలు గావించి। కాంతుమదికితృప్తిగలుగజేశి। బాళిమీరనొద్దబవళింపబోయిన। మునివరుండునగుచుముదితకనియే.

(కాంబోదిరాగము - అటతాళము.) సంవాదము.

చేడెకోపర్వముసేశల్లాపనిజేయ। గూడదుచాలించవే, చాలా। వేడుకమిరరేపాడి నీకోరికచే। కూడునిదానించవే॥ ౧॥ అహా॥ శ్రీతాపసేశనేనాపనిగోరిమీ। చెంతకురాలేదులే, కదా। నీశ్రీమీపాదసేవ కువచ్చితినిపర్వ। మైతేమరేమాయెలే॥ ౨॥ గా॥ వద్దికతోడనావద్దజేరిన నీదు। నైఖరిగనుగొనగా, యోహో। ముద్దులగుమ్మయీలాగుననేనాదు। బుద్ధికిపోచెనుగా॥ ౩॥ అ॥ వింతలాడెదరుబళౌకంటికూర్కుప్ర। వేశింపపాల్మాలికా, నిసు। మంతనీచెంతనిద్రింతుగాకనిపండి। తింతేమనోనాయకా॥ ౪॥ గా॥ వసుధవాలమేటివాసుడౌననగకే। వలశాస్త్రపద్ధతినీ, నీవు। పసిదానవనిబోధపరచితిగానవె। కలసముజెందకే కామినీ॥ ౫॥

వ॥ ఇవియునుంగాక.

ద్వి॥ హరిమఖ్యాదినుముగృహస్థధర్మంబు - వరమతితోడనే వాక్రుత్తునిపుడు - షష్ఠియుపాడ్యమిచవితిప్రదోష - మష్టమినవమిమహాలయంబులును - శశిరవిగ్రహణముల్ సంక్రమణములు - దశమియేకాదశిద్వాదశివర్గ - పౌర్ణమాస్యాలువ్యతీపాచ్చతుర్దశియు - నిర్ణయపితృతిథుల్ నెరవ్రతదినము - లింగనారతిదేలనర్హంబుగాదు - సంగతిదెలియగాజాలని మూఢు - లనవరతంబు కామాంధులై స్వేచ్ఛ - ననుసరించిజరింతురక్షమనీయెంచ - కట్టివారికలంచనదియేలమనకు - గట్టిగాకైవల్యకారణంబులైన - ఘనులిట్టితుచ్ఛభోగముగోరరందు - ఘనవేణిమేషసంక్రాంతియాగాన - కులసతికూటంబుగ్రాహ్యదునేదు - మేలపుశ్రీవాలమేటీశుడెంచ - కొమరొప్పనీవుమోక్షుపరేప్పుదీర్తు - ప్రమదంబుజెందవేడాలెందు వదనా॥

వ॥ అనినసహల్యాదేవియిట్లనియె॥

గీ॥ఇన్నివిధముల జెప్పగా నేలమీరు। కూడదన్నట్టిపని కెదురాడగలనె। యనుచు మోమునచిరునగవంకురింప। బలికియటువర్ణి పవళించి పల్లవోష్ఠి॥

క॥ పూరుని వేసనకునుదా। నోరువజాలక కురంగలోచనికడు నిట్టూర్పుని గుడించుచు మది। నారాటంబుప్పతిల్ల హాయని వగచెన్॥

(*) అహల్యాదేవివిరహము. (*)

(అసావేరి రాగము - అట తాళము.)

కలకాల మెంచు కెకరు నిబ్రతుకా యెనా। కర్మమేమనవచ్చునూ। వలపుగలతరివరుని కూటముగలయు ప్రాప్తము లేని దానిగ। జలజసంభవుడెంతనిర్దయశాలియై పుట్టించెనోనను॥ కలకాల ॥ ౧ ॥ యేమూనిసౌఖ్యమెనయు భాగ్యవతు। లేమినోములునోచిరో। యేమి శేయుదు నాదు జవ్వనమెల్ల కాముని ప్రసవబాణ। స్తోమమునుపాల్ జేయుటకునె। నీమనీంద్రుని పాలబడితినో॥ కల॥ ౨॥ మూడు నెలలకొకరు నాథుడైన లగ్నను। కూడిరాడీతసకీ। గోడుగోడనియాడ విటులల్లాడు జాడలెరింగి సమయ। క్రీడ దేల్చక నీతులాడుచు। వీడగలమగవాడుగలడే ॥ కల॥ ౩ ॥ పరీకింపనాచక్కదనము కానలోగాచు। పండువెన్నెలాయనూ। వరదయాకర వాలమేటీశ్వర పరాత్పర విరహార్తా। తెరముదరిదాపెరుగకనుమే। కరణినీదంగలను నేనిక॥ కల॥ ౪॥

ద్వి॥ హరిహరీవన్నింతయన్యాయకారి - తరుణిగా నేలవిధాత బుట్టించె- నేనిట్టివిధికి మున్నేమేమిపగలు - బూనిచేసితినో నాపూర్వకృతంబు- నిత్తరిబాధింపెసెట్లాడుజన్మ- మెత్తుటకన్న నీయిలనొకరు పక్షి- యై బుట్టినను మేలుయాత్మేశుప్రేమ - ప్రాబల్యముగను సంపాదించిమించి- రతి యుప్పరతిసమరతులు చాతుర్య- గతులనితాంతసౌఖ్యము జెందనతివ - పుడమిలో పడతిగా బుట్టుటకంటె - నడవిలోనొకరు చెట్టైననుతెస్స- మగనిచేత నుబతిమాలించుకొంచు- బిగిమానమువహించి ప్రియుమీరెట్టించి- కౌగిట జేరిబొకరు పు వేటరుమీరి - భోగింపజాలనిభాగ్యాన - నెర్వమై నెమ్మి వర్తించుటకంటె - నుర్విపటాయియై యుండిన మేలు - వెంతోపాపపు



పుట్టువియ్యాడుపుట్టు- వింత తాపంబు నేనెన్నాళ్లుగట్టు- గాసయిరింతునేగ తినిబ్బరింతు- వాసవప్రముఖదేవస్తుతవాల- మేటిపురీశ కామితభక్తపోష- ధాటిమీర గనన్నుదయనేలుమీశా॥

వ॥ అనివగచియాచిగురుబోణియొక పాటిసుజ్ఞానంబవలంబించి మగనిసమీపంబున శయనించి నిద్రించియుండెనట్టియెడ॥

[*] ఇంద్రుండు కోడియైకూయుట [*]

(ద్విజావంతిరాగము - ఝంపతాళము.)

కోడియైకూత వేసెనూ। దేవేంద్రుడపుడు॥ కోడియై॥ చేడెయిటుల గాసితనకు చిక్కదకరు దనుచు మరుని। వాడిమిగలవిరిగోలల- కోడి కొక్కరోకోయని॥ కోడియై॥ ౧॥ స్ఫుటముగ కాయంబు బెంచుచూ। సరిసగము రాత్రి। పోద్దనిసమయముగడించుచూ। జటినాధుని పర్ణశాలకుటజంబున జేరి కేరి। తటతటతటరెక్కలెత్తి। తట్టికుతికబిగియబట్టి॥ కోడియై॥ ౨॥ తడవాయెనేమునిదలంకుచూ। సతిపతులు మేలరు। పడిన సందడాలకించుచూ। జడదారిసమాధిజేయ। జనజూచిబిరాన లేచి। పడుచుపకరు జేరతీవ్రపడుచు పడకకేకారుచు॥ కోడియై॥ ౩॥ నేటికిగాకున్నపోసగదూ। యెన్నాళ్లకైన। బోటిధాటికూట ముసగదూ। వాటమిదేయనుచు వాలమేటిపట్టణేశునిము। న్మాటికి ప్రార్థించుచుశత। కోటిధారిసీటుమీరి॥ కోడియై॥ ౪॥

ద్వి॥ కుక్కుటంబిటులేయుకూతలాలించి- గ్రక్కునసిద్రమెల్లనిగాతముండు - తడలేకలేచియుదర్భాసనంబు - మడిసంచిహరిణచర్మముగాగి చెంబు- భాసురంబగు పంచపాత్రయుద్ధరిణె - వాశిగాగొనితనవల్లభిచెంత- కరిగినిద్రనులేపిహరినీలవేణి- తెరగొప్పవినుముయదేకోళ్లుకూసె- తెలవారవచ్చెనదీస్నానమునకు - సలలితంబుగబోవు సమయంబుగాన - నేనేగి వచ్చెదనీవిందుపనులు- మానుగానిర్వర్చుమాయానిజాగ్ర - తలుకొన్నదెల్పి పద్ధతిమీరగదలి - లలినియన్నారెడ్డి రామచంద్రేంద్రు - నేలెడువాలమేటీశ్వరసఖుని- మాలిమిదలచుచుమౌనివెంచేసె॥

(సౌరాష్ట్రరాగము - ఆదితాళము.)

హరినారాయణనమోస్తుతే। కరి, వరదజనార్దననమోస్తుతే। గు

ధుతరకారణకుజనవిదారణ। నరసుతచరణానమోస్తుతే ॥ శ్రీ॥ హరి॥ ౧॥ వారిజలోచననమోస్తుతే। గో, వర్ధనగిరిధరనమోస్తుతే । పారావారగభీరమురాంతక। నారసింహాచ్యుతనమోస్తుతే॥శ్రీ ॥ హరి॥౨॥ కవిజనపూజితనమోస్తుతే। వర, కౌస్తుభశోభితనమోస్తుతే। భవభంజనగోపాలనిరంజన। నవనీతాశననమోస్తుతే ॥ శ్రీ॥ హరి ॥ ౩॥ కామితఫలదాననమోస్తుతే। శుభ, కరసుగుణాకరనమోస్తుతే । స్వామిపరాత్పరవాలమెటిపుర, వామదేవహితనమోస్తుతే॥ శ్రీ॥ హరినారా॥౪॥

ద్వి ॥ శ్రీయాదవాన్వయాశ్రితసద్విధేయ - ప్రాయశస్సత్యాయపరిపాలనాయ- శాశ్వితకళ్యాణసమధికత్రాణ- శశ్వత్ప్రభావకౌశలసుస్వభావ-శక్తిహితాస్తోకసంభృతాలోక- నక్తకాలవిహారనాశనశూర- ధరధరధరకరధర్మప్రచార- సురసంఘపూజితసుమహితఖ్యాత - యఖిలబుధారాధ్యయఘరోగవైద్య - మఖఫలదాయకమంగళశ్లోక - రుక్మిణీహృల్లోలలోకాలవాల - రుక్మవర్ణసుచేలరోచిర్విశాల - సత్యాత్మనీరజసవితృవిరాజ - నిత్యనిర్మలభాజనేత్రసరోజ - రాధాంగనోల్లాసరమణీయహాస - మాధవాఖిలవేషమణిమయభూష - కాళిందిహృత్తోషఖండితదోష కాళీయమదభంగగరుడతురంగ - జాంబవతీసంగసాహసోత్తుంగ - గాంభీర్యభూపాగగజపీడహార - త్రిగుణసంగాతీతస్థిరకార్యనేత - జగదుపక్రమకామసంతతోద్దామ-విశ్వామిత్రజితమిత్రవిందాకళత్ర- యశ్వామరద్వేషహుంకారశోష-పరమపావనభద్రపడతిసద్భద్ర- పురుషోత్తమసుదంతపూబోణికాంత- లక్షణాంగనవరలాలితోదార- భక్షితనవనీతభక్తప్రపూత- జీమూతదేహానిర్జితరిపువ్యూహ- రామచంద్రనృపాలరక్షితవాల- మేటిపురీశసమేతలోకేశ- ధాటిగానేలుమాధవపరంధామా॥

వ॥ అనియిట్లఖిలలోకశరణ్యుండగు సర్వేశ్వరునినామకీర్తనంబుశేయుచుగౌతమమహర్షిపుంగవుండు గంగావగాహనార్థంబరిగెనంతనిచ్చట॥

గీ॥ కోడిరూపంబుజాలించికుటిలగౌత । మాకృతివహించిశ్రీహరిహరిహరియని । స్మరణశేయుచుమునిపర్ణశాలకడకు। వచ్చెనువిబుచ్చరేంద్రుండునిచ్చనలరి॥

వ॥తత్ప్రకారంబేలాగనినా॥



## (*)మాయాగౌతమునికథాప్రారంభము.(*)

(ధన్యాసిరాగము - ఆదితాళము.)

పాహిమాంవైకుంఠనివాసాభక్తవత్సలాహరీహరి । పాహిపాహిఘనదేహాఖగోత్తమ। వాహకలుషసందోహవినిహసిత ॥ పాహి ॥ ౧॥ కమలావిమలహృదయనీరజభాస్కరమందరధరహరీహరీ । సుమశరజనకవిశుద్ధసత్వగుణ। సముదయావ్యయాశంఖచక్రధ ॥ పాహిమాం॥ ౨॥ నిరుపమనిర్మలనిత్యనిరంజననిరాకారశ్రీహరిహరీ । శరణాగతరక్షణకరుణాసా। గరకరివరదామరనరవందిత॥ పాహిమాం॥ ౩॥ గోలంబజితశిరోరుహహాటకచేలమురాంతకహరీహరీ ॥ వాలమేటిపురిపాలమిత్రగో । పాలసత్యసంశీలపరాత్పర॥ పాహిమాం॥ ౪॥

వ ॥ అనికపటనాటకసూత్రధారియగుశౌరిందలంచుచు జటికుటీరంబుడగ్గరి హర్షపులకాంకితవిగ్రహుండై యాఖండలుండుతనమనంబునా॥

ద్వి॥ ఆకుందరదనయహల్యాబ్జవదన- కేకాంతసరసంబులింపుగాదెలిపి- రసికత్వమునవిద్దరముప్రేమగదియ - కుసుమతల్పంబునకూర్చుండిమదన- తంత్రంబులెంచిస్వతంత్రంబుగాంచి-జంత్రాలకైవడిసరిసరిబెనగి- కోమలైనపూలుకీల్గొప్పునదురిమి - రవణీమరత్నహారములెల్లబూన్చి - తిలకంబుసొంపుగాదిద్దినిద్దంపు- దళ్కొత్తమేనగంధముచాలనలది - బరవుసతొడలానిపవళించిమించి - తెరగొప్పకెంపువాతెరబంటనొక్కి- కడుచొక్కిమీరగాకౌగిటజేర్చి- విడెమిచ్చిమితిలేనివేడుకలెచ్చి - గురుతుగాతళ్కుచెక్కులుగోరజీరి - మరులుబుట్టించినెమ్మదికరగించి - బటువైనగబ్బిగుబ్బలుకేలనలమి- తటుకునపైప్రాలితగముద్దులాడె - మురియుచుబిగిపోకముడిసడలించి. బరువడిచౌశీతిబంధాదిరతుల - గతులుదప్పకమేలుకళలంటిగాఢ- రతిసల్పిమరియుపరతిక్రేరేపి - నాకోర్కెదీరయీనాడుగుడెదన్కగాకథనరాత్రియుగ్మలిచెంతతపసి - లేనట్టుజేస్తిబలేసదుపాయ - మేనాటికినీవాటమింతకుదొరకు - నిలవాలమేటిగౌరీశునికరుణ వెలశెనినాళకువేట్కచేనహహా॥

వ॥ అనియువ్విాంగుచు సమయోచితకైతవంబునా.

## ఇంద్రుండుగౌతమవేషధారియై అహల్యకడకువచ్చుట.

క॥ సీడిముడిగనుసడుగులుతడ । బడనెడనెడనిలచినిలచి బజలికెంచెపె। న్నొడలువశంకగమాయా। జడదారియహల్యకడకుజనెనయ్యెడలన్॥

వ॥ ఇట్లరుగుదెంచు మాయామునికంఠధ్వనినాలకించి యంతటా.

సీ॥ వ్రాలినబర్హిభావంబాప్పకొప్పులో మరిమినయరవిరుల్ పరిమళించ । లలితాబ్జసన్నిభోల్లసితాననంబున మృగనాభితిలకంబు మురువుమెరప। కులుకుమితారిలికుచకుచంబులమీద రత్నహారంబులురక్తిగులుకనపరంజివన్నెచెన్నలరుకాయంబున కమ్మగంధవుతావిఘుమ్మనగ। దిగ్గననుపూలపానుపుడిగ్గి మగడు । యింతలోవచ్చెనిదియేమొవింతయనుచు। హంసయానంబులనునహల్యాలతాంగి । కైతవమునీంద్రుకెదురుగా బ్రీతినరిగె॥ — వ॥ నమస్కరించి యిట్లనియె.

### —(*)అహల్యా మాయా గౌతమ సంవాదము.(*)—

గీ॥ ఏటిస్నానానకనిపోయియింతలోన । మరలివచ్చితిరేమిందు మరచినారు । చూడనామదికిదికడుచోద్యమయ్యె । పరమసంప్రీతి దెల్పుమో ప్రాణనాథా॥

వ॥ అనిననాసతీతిలకంబునకు కైతవగౌతమముని పురుహూతుండిట్లనియె.

(హిందుస్తానికాపీ - ఆదితాళము.)

వినగదవేభామినీ॥ విన॥ నెమ్మనమలరగనేవచ్చినపనియిక॥విన॥ ౧॥ లలనానీజిగిచెలువముమనమున । దలపనిలుపదగనివలపుగలిగె॥ విన॥ ౨॥ మారుడుననుజడదారనకనుసడి। దారినికడుతార్మారుజేసె॥ విన॥ ౩॥ తరుణీనిపైమరులనైష్ఠికము। జరుపలేకత్వరనురలితినిటు॥విన॥ ౪॥ నాలమేటిపురిపాలుడలరరతి। కేళికిరమ్ముసుశీలజాల॥ వినగదవే॥౫॥ ఓకాంతామణీ.



సీ॥ ముదిచందురుని చందముననందమునుజెంది చెలువొందునీదు। పెంపొలయు మోము । దొలకారుమెరుగారులలిగేరుబలుసొంపుగలచారుసురుచిరాంగంబుబాగు । తగుజక్కవలకెమరుపగబెకురుకవనికిర్। బలుపెక్కు గుబ్బచన్నులబెడంగు। ధరతేటగమిధాటిసరిసాటి గనుమేటి । దగువాటమైనకుంతలములొప్పు। దలచితలచియులోలోనగ్గలగిచెలగి । మనసుకడుసొక్కికాకచేతనువుజికిర్ । మరునకుదలంకితిరిగినన్మతగూడ । వేట్లవచ్చితిరాగదవే మృగాక్షీ॥

వ॥ అనినదరహాసవదనయై యవ్విలాసినివనవాసి కిట్లనియె.

(కందార్థములు.)

అనుపమచరితుడవుతపో। ధనుడవువిజితేంద్రియుడవు । తత్వజ్ఞుడవై । వసునీకన్నటికైనను । మనసిజతాపంబుగలదె । మానివరేణ్యా । ధాత్రీసుర।మానితపుణ్యా॥ యీనాటికీవార్తతేమోవింతగదోచె । వైనకానీతెనిదానముబూనుము॥ మానివరేణ్యా॥

(నాయకుని వాక్యము.)

సీ॥ కలువరేకులవంటికందోయిపరికించి సోముగోముప్పనమ్మాముజూచి । సుధజిల్లుపవడంపుయధరంబుపిలకించి వజ్రాలవంటిపల్వరుసనరసి। పైడిగిండ్లహసించుపాలిండ్లనీక్షించి చిగురుటాకులవంటి చేతులుగని। నాగారిడెగడులేనడుమువిలోకించిమించులజెనకుమైమెరుపు గాం[illegible]మత్తకాసినిసీమీదక్రొత్తవలపు హత్తుకొనెనిప్పుడదియే మొత్తరమునరిత్తగాదిదిమన్మథప్రవృత్తిదెలసి । పొత్తుగూడనెనీపూలమెత్తజేర్చి।

సంధిద్విపద॥ అనియిట్లువిస్మయంబగువేషయూని ఘనమైనమోహంబుగద్గదస్వరము - భయమునుప్రేమగంపముదొట్రుపాటు - నయమునులజ్జానామధురోక్తి - గలకుహనామునిక్రమము గాజూచి - విలసిల్లుదేవతావిభుగానెరింగి - వాహువాయనికీరవాహునిమెచ్చి - మోహంబుమోదంబుమురుపుగంభీర - భావంబునిపుణతప్రౌఢతనంబు- కీవిదళ[illegible]

త్తఘాటిగపర్ణశాల - వాటికక్రీడాళువాబొమ్మరీతి - ప్రాకటంబుగనిల్వ బడియొడల్పొంగ - నార్తెంచి గ్నారిసగవంకురింప - జారినను పైటసవ రించుకొంచు - నీలోత్పలంబులనీటువాటిల్లు - వాలారుచూపులు వద్రిసై సిలిపి - వసుధనన్నారెడ్డివర రామచంద్ర - రసికునికరుణసంరక్షించువా లీ- మేటిపురీశునెమ్మదలంచితి యా- మాటలచతురత మగువయిట్లనియే.

(సంవాదము.)

(నాదనామక్రియ రాగము- పాట- ఆది తాళము)

యింతటిమోహంబిప్రుడుగల్గుటకు। హృదయేశ్వర నేరంభనా, యో। హృదయేశ్వర॥ ౧॥ నాయకునివాక్యము॥ నిమ్ముదులోరుసారంభ ముబూచిన। లోమెతువంద దెరంభా, భామా। లోమెతు॥ ౨॥ నాయకి మాట॥ వురుతరమగుమమకారము జెందను। యూర్వశి నాయిది యేమీ, స్వామి। యూర్వశినా॥ ౩॥ పురుషవాక్యము॥ ఆయూర్వసినీమైజిగి గాంచిన। ఛాయలు జేరకయుందునా, చానా। చాయలు॥ ౪॥ స్త్రీ॥ మరులునత్వర పడిమరలుకొనుటకే। నరయగహరిణినటయ్యా, నే। నరయగహరిణి॥ ౫॥ పు॥ తీరగునీకనులందమీక్షించిన। పూరిగరువజేవహరిణీ, బాలా। పూరి గరువదే॥ ౬॥ స్త్రీ॥ మెప్పుమాటలనుగొప్పజేయనే। యొప్పగుశశి రేఖనా, నే। యొప్పగులుక॥ ౭॥ పు॥ వనజాననసీఫాలముగననొక। వంకబోదెశశిరేఖా, యొక। వంకబోదే॥ ౮॥ స్త్రీ॥ మేనకగానుతిలోత్తమగా సిటు। మెచ్చినలాభంబేమి, సను। మెచ్చినలాభం॥ ౯॥ పు॥ వారినసూయ తజేసికాదేసను। కోరెనుమున్నుబలారీ, సిను। కోరెనుమున్ను॥ ౧౦॥ స్త్రీ॥ నతిజేయగనేనొకరూపరినే। క్షితినిర్జరలోకేశా, [illegible]। క్షితినిర్జర॥ ౧౧॥ పు॥ లలనానాసుకృతమున సన్నొసగెను। నలువబుఙమెటుల్ల దీర్తా, చెలియా। నలువ॥ ౧౨॥ స్త్రీ॥ పర్వమటంటిరిపర్వమాయనే। ప్రసవశరాసనుచేతా, దేవా। ప్రసవశరా॥ ౧౩॥ పు॥ మాటలతడవింకేటికి సమరతి। కూటమొసంగవెబాలా, రతి। కూటమొసంగవె॥ ౧౪॥ స్త్రీ॥ సుంతైనసుదయజూడకుగామరు। డెంతటిపెద్దలనైనా, మరు। డెంతటి॥ ౧౫॥



పు॥ వాలమేటిపురిపాలుడలరనా। బాళిదీర్పవేభామా, నా। బాళిదీర్చవే॥ ౧౬॥ స్త్రీ॥ బాళిదీర్చుటకువేళగాదుమది। తాళిమిబూనగదయ్యా, మది। తాళిమిబూనగదయ్యా॥ ౧౭॥

(మాయాముని వాక్యము - సీసార్థము.)

భామినీమత్తేభగామినీమాటలప్రొద్దుబుచ్చకనునావద్దజేరి। కలికి మిటారిగుబ్బలునాయురంబునగదియించిగట్టిగాకౌగిలించి। మోముమో మునజేర్చిముద్దిచ్చినీతళ్లు। చెక్కిళ్లునొక్కనియ్యవే। కెమ్మోవితేనె। గ్రుక్కె డుగ్రోలనియ్యవే॥ చక్కరవింటివానిచికురులకొర్వజాల। నక్కట తెలవా రీనవక్కనగాదుతళ్లు। చెక్కిళ్లునొక్కనియ్యవే॥ వ॥అని వెండియు.

చ॥ కటకటమీనకేతనుని గాశికినేనిలజాలవేగినన్। కుటిలవినీలవాల రతికూటమువాటముగాదటంచుచెం। గటగదియంగబోయిసుర కాంతుడు కాంతకరంబుబట్టిప। య్యాటవొలగించిగుబ్బచనులంటుచుకౌగిట దార్చ బైకొనన్॥

నిలువెల్ల జెమర్చెనుతో। య్యాలిమోహమొగాకభయమొయనిమిష విభుమై। బులకించిపరవశత్వము। గలిగించెమనోజుడాత్మ గలగించుటచేన్॥

గీ॥ లేశమైననుయొడబాటులేకతనకు। చెల్లగాకనిపరకాంతచేయి బట్టి। కౌగిటికిదీశియద్వృత్తిగలయదలచె। శతముఖుండొడలేరుంగనిసా హసమునా॥

వ॥ ఇట్టులతనకరంబుబట్టి పట్టిశతనంబున నిట్టట్టులాగి బలవంతపె ట్టు నమరపట్టభద్రునకెడంబుగాదొలంగి దిట్టతనంబున నక్కుటిలకుంతలి యిట్లనియే॥

(సీసార్థము.)

మునిచంద్రమీకింతనెనరు నాయందునగలుగుటమంచిదేగానిచూ డు। తెలవారవచ్చెనదేసంధ్యవేళాయెగానవేగమెనిత్యకర్మ విధులు। మానకతీర్చినెమ్మదిజెందుడటమిను। కోరెనకోరెరీతిని। మన్నించినన్ను। కూరిమినేలుబ్రీతిని॥ మారునకళికిశిలాచారముచేమారుట। మేరామాపట్టి డనుకసైరించుడంతమీరు॥ కోరిన కోర్కెరీతిని॥

వ॥ అనినకుంభస్తనికిదంభమునిజంభారియిట్లనియె॥

ద్వి॥ ఓప్రాణనాయకీయోముద్దుగుమ్మ - యీప్రమేయంబు నేనికనో
ర్వలేను। నీప్రేమనాయందు నెన్నడిబూని - నాప్రేమదిర్చకున్నను మోహ
వార్ధి - దరిదాపెరుంగకెంతనియీదదరము - తరుణినీవేమి తాళి తాళుము
శైవ - కంతునిసమయకరకళబాధవలన - కాంతనిమేషంబుకల్పమైతోచె -
నొకకడిస్నానమొంకొకకడిసంధ్య - యొక్కడిజపము నే డెక్కడితపము -
యొకకటానీవిప్పుడవుచేసినను - నిక్కముప్రాణముల్నిలువవేకొమ్మ -
యూపిరిగలిగినను పైవనమ్మి - బ్రాపుగానవనిలో బ్రతుకంగవచ్చు - మో
క్షేచ్ఛగంగలోమునిగిన మొసలి - యాతుణంబుననీప్పుకరిగిన భంగి - నియ్యెడ
నినుజూని మేటిలోమునుగ - చయ్యనజనిపుష్పశరుసాయకాగ్ని - గ్రాలక
గడచుటకెల్లనేమారు - హేళనశేయకుమింతీయటంచు - నే వేడుటయునీవు
నీతులాడుటయు - భావింపనెలకకు ప్రాణసంకటము - చెలువారపిల్లికిచె
ల్లాటమనెదు - పలుకనిజంబమ్మెపతివ్రతవయ్యు - నాతోడవాదాడనాయ
మానీకు - నాతినీచిత్తంబునాభాగ్యమట్లు - గాననన్నారెడ్డిఘనరామచంద్ర
మనుజేంద్రునేలు శ్రీమన్నాలమేటిపట్టణేశ్వరుసాక్షిభమనిల్వదింతరిక్తై
లనుగూడరాగదే భామా॥ (సంవాదము.)

(వసంతరాగము - ఆదితాళము.)

రావే గ్రక్కునకౌగిలీవేయోహంసయానా॥ రావే॥ భావజుడాడికి
నే। నీవేళతాళజాలా॥ రావే॥ ౧। అహల్య॥ లోలామీకింతతొందరేలా
సాగెనీలీలా। వేళగానివేళలో బాళిజెందుటమేలా॥ లోలా॥ ౨॥ మాయాముని॥
కంబుకంధరియీక్షణంబునీమోవిపాన। కంబుగ్రోలక[illegible]। పంబుదీర
దువేట్టు॥ రావే॥ ౩॥ అహల్య॥ ఇప్పుడీమాటమీరేచెప్పనబలెక్కడరో। గొ
ప్పచోద్యముగాక। నిప్పుచెదలంటగలదే॥ లోలా॥ ౪॥ మాయాముని॥ కల
కంఠకంఠిమనసునిలువదేమాత్రమైన। పలువార్తలాడనేల। తెలవారవచ్చె
వేగ॥ రావే॥ ౫॥ అహల్య॥ మొలుకలబాధకోరకుములుచిచ్చుబెట్టినట్లు లా
వలరాజుకళికిభిల్యా। వ్రతముచెడజూచెరయయో॥ లోలా॥ ౬॥ మాయా॥



కన్నెరో నాకుదెలియకున్ననీతులులేవా। నన్నుమీరివిరాళి। మిన్నందెనే
మిశేతు॥ రావే॥ అహల్య॥ ౭॥ నీతివిడనేనూతనీళ్లు వెల్లువకుబోనే। భాతి
గవాలమేటి। పాలుడలరనిపనికీ॥ లోలామీకింత॥ ౮॥

(మాయామునివాక్యము.)

గీ॥ పడతిపెడవాదమునప్రొద్దుగడుపగడగి।
ననిన్నుమాన। తగుపుమానిమనంబునతగవుబూని। చెలిమినావాంఛదీర్పు
ముచలమువలదు॥

వ॥ అనిబల్కుచు మదనతీవ్రంపుశరపరంపరాకంపితహృదయుండై
పెంపుగలప్రేమదీపింపంబైకొనిరమింపుతలంపున గదియవచ్చు నలింపపతి
తెంపునెరింగి చంపకగంధియులికిపడి కలగితలగినిలువక లోపలినికేతనం
బునకరిగిసంగసికళవళంబంది కులిశధరుంజూచిలుకలకొలికి వెంటనటి
యిట్లనియె॥

గీ॥ అక్కటా నాదుమాటలనొక్కకాసు। సైనకొరగామిగాజేసి
మానశమున। కిట్టులొప్పించినట్టేటపుట్టిముంచి। పోవదింకేమిశేతునేపు
ష్పగంధీ॥ — వ॥ అనిపెండియు.

సీ॥ కలికికాయజుదాడికి కైకసటుమ్మకౌగిలికివచ్చినన్నులుకకశే
య। నాయమాదీననాదాయమా మోడెడబాయుమాకడభారమాయె
మమత। ఊరకాకోర్కెబెంపారగాచాలమేలూరగావివిధశృంగారగరిమ।
మింపుగా బెంపుగానింపగా కాంక్షఫలింపగాజేయకతెంపుగదుర। కన్నుల
కునింపుగానసినన్ను రోశి। దలగనీవంటికులకాంతధర్మమగునె। యోహో
హోవంటమరుమువేరొక్కటైన। దురితముగుపోకుసిల్వవేహరిణనయనా॥

వ॥ అనిపల్కియంతట॥

(మాయాగౌతముండు అహల్యాదేవి
జడనుచేపట్టినిర్బంధపెట్టుట.)

క॥ కడుసామమైననుడువుల। జెడనుమనోరధముతడవుజెల్లదనుచు
వెం। బడివడిజనిపడతుకపెక్। జడపిడికిటబట్టినిలిపిశక్రుండనియెన్॥

సీ॥ గాఢమౌ మోహాంధకారంబునీనవ్వువెన్నెలబాపవేవిధుమౌష్టి। పన్నినమదనుతాపమ్మువాతెరపానకమ్మునవార్చవేయెమ్మెలాడి। తనుబంధురుజఘనస్తనలికుచాలింగనంబునమాపవేకంబుకంఠి। కడముట్టనేరనికామాతురముబంధరతిదృష్టిపరచవేరాజవదన। కామిగాకనుధర మోక్షకామిగాదు। యనుజనోక్తినివినవెవేయాడనేల। చాలనాలస్యమమృతంపుషంబుగాన। శీఘ్రముగనన్నుగూడవేచిగురుబోణి॥

వ॥ అనిననతనిసాహసంబునకచ్చెరువందుచు మందహాససుందరవదనారవిందమైకుందరదనపురందరునకిట్లనియె॥

ఉ॥ ఇదిసమయంబుగాదనుచునెన్నివిధంబులజాటిజెప్పినన్। మదిసవరించనేరనిప్రమాదవశంబునసాధువర్తనల్। వదలిబళాబళాపుడమివారలుహేళనశేయక్రొమ్ముడిక! జెదరగఁబట్టిలాగెదవుచెల్లయికేమనజెల్లునిన్నిటన్॥ [మాయామునివాక్యము.]

(కేదారగౌళరాగము-ఝుల్వతాళము.)

చలముబలముశేయకేసఖి। సంపూర్ణచంద్ర। సంకాశోల్లసితసన్ముఖి। తళుకుబెళుకులకలికిచిలుకల। కొలికితేనియలొలుకలలిమృదు। పలుకులనుబలువలపులమునుల। కులమురతినసుగలసిమెలగక॥ చలము॥౧॥

(అహల్యావాక్యము.)

ఉత్పలార్థము॥ సారెకుసారెకిట్లులెకసక్కెపువెక్కసమూనినామెడన్। నేరములేలబెట్టెదరునిర్మలభావముమానిహీనమా। కోరికెగోరిచారశిలగూడనటంటిచలంబుగాదుగా। మీరూ, తెలియనివారు। కారూ, శిక్షమకజెంది। నారూ, ధీవరులెన్న। బోరూ॥ యారడిపనికిట్లాడుదానితో। ఘోరాధర్మవిచారులుగారా॥ మీరూ॥ ౨॥

(మాయామునివాక్యము.)

దరువు॥ పెక్కుగుణములింకమానవే। నాయిందుననే। డొక్కతీరునైనముబూనవే। టక్కులనుటెక్కులనునొక్కుల। సొక్కులనునిక్కులనుచిక్కని। చిక్కులనుసక్కిలపుచక్కని। మక్కువనుచేజిక్కిదక్కక॥ చలము॥౨॥



(అహల్యావాక్యము ఉత్పలార్థము.)

సద్ధర్మనిత్యకర్మములుబాగుగదీర్చకబేలపోలికన్। పెద్దరికంబుబోవిడచిపెక్కుగుణంబులుబన్నినన్నుబల్। గద్దరిపాటుతోనెపముగాకలినోక్తులుబల్కనేలమీ, కద్దూ। మీరిననేమి। గద్దూ, దుర్వృత్తిజెంద। వద్దూ, నామనవీవినుమీ। ప్రొద్దూ॥ పద్దుగాదుమీపదపద్మములకు। తద్దయు। మొక్కెదధర్మహితంబగు॥ హద్దూ॥ ౩॥

(మాయామునివాక్యము - దరువు.)

బోటిరోషాలయులుకనించకే। మచ్చరమునతో। టోటునేరములుగడించకే। ఆటలనునీటులనుమాటల। తేటలనుధాటులనుగోటుల। కాటులనుజడవ్రేటులనునగ। పాటులనుకూటమ్మొసంగక॥ చలము॥ ౩॥

(అహల్యావాక్యము - ఉత్పలార్థము.)

నాదుగ్రియోక్తులన్నినుమునాయకమీమదివచ్చునట్టులా। ప్లోవముమీరరాతిరికిహాయిగనుందము గాకయించనన్। భేదముగాదలంచివెతబెట్టుచుపట్టినపట్టుమీడవే, వాదా। సత్పుణ్యహాని, గాదా। సమయమింతకు, లేదా। సవరణశేయ, రాదా॥ సేదజెందియరుణోదయమగుతరి। చీవరగోట్టుముశిగబట్టిడ్చెద॥ వాదా॥ ౪॥

(మాయామునివాక్యము.)

క॥ మాటకుమాటేతెగులను। మాటవినవేబోటిచీటిమాటికిదరచే। వేటికినేటి[illegible]యూ। రాటముదీర్చుటకువేట్ల రారమ్మందయన్॥

వ॥ అనియనంగసంగరోద్రేకంబునంబైబడి పెనంగినంగసిమసంగి విసువుచు భిదురపాణి పాణి విదళించి ఛెంగళించి వేణివిడుపించుకొని తొలంగినిలువంబడి శంకింపకబింకంబగు జంకెనవాడిచూడ్కులు నిగుడించుచు కపటజటికికుటిలాలక యిట్లనియె.

గీ॥ రమణియదిగాంచి మోహామౌరాయటంచు । ముద్దుగారెడు చిన్నారిమోముద్రిప్పి । శయ్యపైజేర్చి సమకట్టిచెయ్యిబట్టి । నెయ్యమున బల్కె దేరగంటి నేతతోడ॥ (సంవాదము.)

(కాంభోదిరాగము - ఆటతాళము.)

పూలశయ్యకు రావయ్యా, శచీ । లోలామరుకేళిననేలు కోవయ్యా॥ పూల ॥ ౧ ॥ఇం ॥ పదవేవచ్చెద చంచలాక్షీ, నేను । ముదముననీ పొందువదలనీ సాక్షీ॥ పదవే॥ ౨॥ అ ॥ భవదీయ్యాదివ్యభోగంబూ, స్వామీ । ప్రాప్తించుటనాసౌభాగ్యయోగంబూ॥ పూల ॥ ౩॥ఇం॥ చకోరబోమ్మయిగావేళా, నీకు । దక్కితిచేపట్టి తడిదీర్చ చాలా॥ పదవే ॥ ౪॥ అ ॥ నిర్మలసత్యసంసీలా, నేను । నీదాననైతికానియోచనేలా ॥ పూ॥ ౫॥ ఇం॥ తరుణీనీమాటలసొగసూ, లమృత । ధారలై పరమానందము జెందెమనసూ॥ పదవే॥ ౬॥ అ ॥ సత్యసంకల్పుడవుగావా, సీద్ధ। సంకల్పము నకుసంశయ మేది దేవా॥ పూ॥ ౭॥ఇం॥ బోటివెయ్యేలనా పాలా, వాల। మేటీశుకరుణనెమ్మినిగల్గెచాలా॥ పదవెవచ్చె॥ ౮॥

వ॥ అనియిట్లన్యోన్యానుబంధంబునం బడకటింటి కరిగిరప్పుడన్నచ్చకంటి వియచ్చరేంద్రునకిట్లనియె.

(*) శయ్యాసంవాదము. (*)

(కందార్థము.)

బృందారకబృందాధిప । సుందరజితపంచబాణ సువహితవిభవా॥ నందితమలయజపరిమళ । చందనమునలందుకొమ్మా, చక్కగా। పన్నీరుజిలికా। చికరగా॥ మిక్కిలిమక్కువలకొజముగపెం । పెక్కివేడుకలుదకగ నేలూ॥ చక్కగా॥ ౧॥

(ఇంద్రవాక్యము- కందార్థము.)

పొందుగనీదుశరీరసు । గంధమునకు సాటియగునెకమలేక్షణశ్రీ । గంధసువాసనలివిరు । లందముగానీకిజ్జడ, యందునా। జుట్టియొకముద్దు। గొందునా॥ డెందముసంభ్రమ మొందపసందుగ । కుందనవాల్నీగుల్లుతగుజడ । యందునా॥ ౨॥



(సంవాదము.)

[అహల్యవాక్యము-కురంజిరాగము-ఆదితాళము.]

కపురంపు మడుపులు । గైకొనరా నాసామీ॥ కపుర॥
అపరిమితానురాగ। మందుసందియమేమీ॥ కపుర॥ ౧॥
ఇంద్ర॥ కొమ్మరో నన్నుగదియ। రమ్మబాగాలందమ్ము । నెమ్మికమ్మనివిడె। యమ్మగొమ్మువేగమ్మా కొమ్మరో॥ ౨॥
అ॥ మక్కువదీరచే । జిక్కితినీకీవేళా । పక్కఛాయకసుఖము । దక్కనన్నేలుచాలా॥ కపుర॥ ౩॥
ఇంద్ర॥ వారిజాననాయింతె। వరకునేగాననెందూ। నూరేండ్లకైనతపివి। దీరునేనీపొందూ॥ కొమ్మరో॥ ౪॥
అ ॥ మేలుగశ్రీవాల।మేటిశంకరుడుమన। పాలసత్కరుణాల। వాలుడైనాడుగాన॥ కపురంపు॥ ౫॥

వ॥ అసివెండియు పుండరీకాక్షి యాఖండలునకిట్లనియె.

సీ॥ మొనపంటనొక్కనంచనియాన బెట్టక నధరబింబామృతంబాననియ్య। నగవుసేయనటంచునభయమియ్యక చెక్కుటద్దములద్రిప్పి ముద్దాడనియ్య । నాటుశేయనటంచునమ్మకంబియ్యక భటువుపాలిండ్లు చేపట్టనియ్య । గానిబెట్టనటంచుబాసశేయకబాళి దీరగా రతికేళి దేలనియ్య। గొప్పవాడనినీమాటచెప్పినంత। లోనెనేవారకాంతను గాను నెనరు। బూనునెరజాణమగనాలగానసిందు । కొడబడిసఖాననన్నేలుకోసురేంద్ర॥

(ఇంద్రునివాక్యము.)

సీ॥ రాచిలకబింబఫలంబుజేసెనభంగి । తీవిగాకెంపుకెమ్మోవినొక్కి। దొరనివ్వసంగ్ర చేవోయిబూనినయాట్లు । చెండ్లనుబోలు పాలిండ్లుబట్టి। తుమ్మెదకొదమపద్మమ్ముపైనొదిగిన । పగిదిసుందరముఖపద్మమూని। రూఢిగానలకూబరుడురంభనొంచిన । రీతిగామన్మథక్రీడసల్పి । నెమ్మినేల్గాందుకొమ్మసత్యమ్మసమ్మ। తమ్మనసునమ్మభీడియమ్మజిమ్మసంతె । సమ్మదైకొమ్మకుసుమతల్పమ్మపైకి। రమ్మశీఘ్రమ్మబిగికౌగిలిమ్మలేమ్మా॥

[సంవ్వాదం - యాలలు- అటతాళము.]

సారఘానవాయింకొకకు । సారైనరమింపకవి। స్థారమానాతవి
డీశదే॥ మన్నించినను। దానముగనేలుకోరాదే॥ ౧॥

అ॥ నీతమిదిరకయున్న। నీతమిదిరెనింకేమి । శేతామాజెప్పరా
నాసామి। కల్లగాదుప్ర। భాతకాలమాయె- జూడుమీ ॥ ౨॥

ఇం॥ చెలియరోరవ్వంతలోనె । చెల్లుజెట్టిచీరగట్టి । పొలుపుగ
పొవ్యేదిన్యాయమా । యిపుడైతొలగి । పొమ్మనిప్రీడపోద్రోయుమా॥

అ॥ బలవంతమేలనెజెల్లా । పనులకుబోవలయుగానా । బలహా
రా చేలమువీడరా । నీకుమ్రొక్కెనా। పతివచ్చేవేళచేకూడేరా ॥ ౪॥

ఇం॥ చేలావిడుమంటివాలాగే। చేసెగానీపదరకనా। జాలిమా
న్పిబాళిదీర్చవే। తెలవారనొక్క । జాముగలదుమేలుగూర్చవే॥ ౫

అ॥ సందేహమెందుకువృద్ధ। శ్రవుడనొటవినవోభ్రమత। జెంది
నానొకొడిగూశెరా। లేకున్నసేసి। పొందువిడతుసేసుశేశ్వరా॥ ౬॥

ఇం॥ పాటలాధరీనేనొకకు । నాటికైనభ్రమయవాల । మేటిశివు
నిసాక్షిశెళనూ । జెప్పెదనిజమీ । మాటనమ్మవేవాదేలనూ॥ ౭॥

వ॥ అదిమెట్లంటని.

(కందార్థము.)

నీచ్ఛాధాకృతిగైకొని । నేనిటవచ్చుటకుతొలుతనేకుక్కుటమైనీ
వాథునేటికంపితి । నానేరుపుమెచ్చవానె। నళినాయతాక్షీ । నిజమివిశ
తా। నందునిసాక్షి ॥ నిలుపతరముగానీనీమీదిమోహము । వలసనీలాటిచే
ష్టలుచేయవలసెగ॥ నలినాయతాక్షీ॥ ౧॥

[అహల్యకందార్థము.]

మదివెరగందెనువినుమీ । పిదినిజమోకొడిగమొసురేశ్వరనాతో।
డిదినికకుమైవచానా। విధములకావలశినంత । వేడుకగనమే । కదునిర్భయా।
వృత్తిగైకొనమే । పొడిమినీకకొంతపొద్దుంబెనువిడ । నాడుదునాశచీ
నాథ కావలసిన। వేడుకగనమే॥ ౨॥



(ఇంద్రుని కందార్థము.)

వినుకూనీయానగనే । నవమార్గముకల్లగాదిదంతయునిజమా ।
ననుమానముమానియునె । మ్మనమారగనన్నుగూడు । మాకంజపాణీ।
తందరజెంద । కేకీరవాణీ । పైకొనికులుకుగుబ్బలునాపెన్నురమున । సో
కగఢీకొనినీకౌగిటనుజేర్చు। మాకంజపాణీ॥ ౩॥

[అహల్య కందార్థము.]

మహితాత్మకయుట్లైవను। మహానినేర్పరితనంబుమానసమందున్।
బహువిధములమెచ్చందగు। శహబాసికరాగదయ్య । చక్కనిసామీ । మీ
బోటికి । తకుకువలేమి। గ్రకుకుసపూలపాన్పెక్కిపక్కకునన్ని । వుక్కునవీ
శితటుకుకునగూడరా। చక్కనిసామీ॥ ౪॥ — వ॥ అసినవిని.

(ఇంద్రవాక్యం.)

గీ॥ మచ్చకంటిరో యావట్టిమెచ్చులేల । నీవియిమ్మంచు బెనగుచే
వేం। ముజూలి । వలసినను రెండుచక్రముల్గలవొసంగు । దింతకికనొక్కటె
య్యాదియీవియనుచు॥ — వ॥ తదవసరంబున.

(*) పునారతము. (*)

చ॥ అరవిరిమజ్జనం బతనివారయొనర్చి దుకూలచేలము । ల్సరగున
ట్టిమేసఘనసారసుగంధము ంది క్రొత్తపూ । సరులుకచాళిజొన్పియుపొ
సందగుచందములతాపునారతం । బురువడిజేయుదారసిలిరొప్పుగ నాయక
నాయకీ మణుల్॥ —వ॥ మరియునెట్లనినా.

(సావేరిరాగం.)

ద్వి॥ పతికప్పురపుతాంబూలగొనిన-సతిబ్రేమనొసగునుసగమా
కుమడుపు - లదితీతనూజుడాయ్యనకౌగిలింప - ముదితగుబ్బలనురొమ్మున
గృమ్మిక్రమ్ము- బలశాసనుడుమోవిపైగంటిశేయ- నళివేణిపారవశ్యంబు
నబొందు - కనుకూర్కువిధమునకాంతుడూర్పిడగ - తనుమధ్యచెవిమొ
గ్గిదగనాలకించు - కడిమిపల్లభుడుపోకముడిసడల్ప - పడతితోడగు చిత్రి

బంధంబులకును - రమణుండు యొకకొంతరతిసల్పియలయు - రమణిబైకొనియుపరతిబ్రీతిశేయు - నంతకంతకు మోహమధికంబుగాగ - కంతునాహవజయకాంక్షితులగుచు - లకుముకులట్లసర్పములకై వడిని - కృకవాకయుగముభంగిని పావురముల - వైఖరిభైరవాశ్వములచందమున - శాఖామృగంబుల చాడ్పున ఛేను - కములలాగుననుపికంబులరీతి - క్రమముగాసింహముల్గ్మమువీక ఝెళ్లు- పోలికనలసటబొందక పాలు - మాలకమూలకమాంద్యంబుగొనక - తొలగకతలగకతొట్రుపాటునను - గలగకసుంత వికారంబులేక - నాలశించకనసహ్యగుణంబుగొనక - కాలమూహింపకకై పెక్కునటుల - చలముననిరువురుసరిసరిబెనగి - గలుగునేయుంతకుఘనభోగవనుచు - చెలగియన్నారెడ్డిశ్రీరామచంద్రు - వలనొప్పపాలించు వరవాలమేటి - నిలయునిదలచుచు నిర్మలానంద - జలధిదేలి రహల్యాశక్రులవ్వేళా॥ —— ఆసనుయంబునా.

గీ॥ పవిధరుడుకొంతరతిసల్పిబడలియున్న । కొమ్మచెలరేగిదాను పైకొనిరమించి । యాలసటనుజెంది సొలపుననప్పళించి। యట్టెప్రాలెను ప్రాణనాయకుని మెదనూ॥ —— వ॥ ఈవిధంబునా.

గీ॥ పెన్నురమునప్రాలియున్నదినాన్నరిపై । యున్నతంబుగాంచి యుత్సహించి । కన్నెయిన్నిచిన్నెలెన్నడునేర్చెనో। రారయనుచుబోగ [illegible]విభుడూ॥ ...వ॥ తదనంతరంబునా॥

గీ॥ బోటిచీరనుగొనిలేచిపొంకమమర । గట్టిగట్టిగకొమ్ముడిబెట్టి చన్ను। గవనుజిమచిమయనుగోటికాటులకును । బలుచురుక్కను మోవి కెంపులకుదలకీ॥ ... వ॥ లజ్జావనతవదనయై నిలచియున్న చంద్రవదన నవలోకించి నిశ్చేష్టితుండై దేవేంద్రుం డిట్లనియె.

క॥ మన మోహమింతెచెల్లెను। వనితా నేనింకపోయివచ్చెదనాపై।
నెనరుంచుము సీవాడను । కనులలరగ నెపుడుజూడగలుగునొ మరల౯॥

క॥ అనిదీనాననుడైయిటు । ఘనవాహుడుతన్ను వేడగా నుల్లము
యు । ల్లనదాకొండొకధైర్యం। బునసక్షన మోము జేర్చిపొలతుకబలికె౯॥



{ ఇంద్రాహల్య లొండొరులు విడువజాలక జాలిజెందుట. }

(పున్నాగవరాళి- అటతాళము - సంవాదము.)

నినుబాసియే నెట్లనిర్వహించుదునుపా । వనచరిత్రా, నేడు। నను
విడనాడుటన్యాయమాధ క్షమ్య । ధ్వజమిత్రా॥ ౧॥

ఇంద్ర॥ గృందవల్ల్యదుశతానందుని శేతలే। మందుచానా, యిప్డు
డిందుకుచింతించినందునఫలమేమే। మందయానా॥ ౨॥

అ॥ పలుగాకివిధికేమిపగజేసెనొ మితొల్లి। బలనిరస్తా, మన। చెలి
మెడబాయగజేసె నేడయ్యయ్యో। కులిశహస్తా॥ ౩॥

ఇం॥ అలస్యమెంతలేదదెప్రొద్దుబొడిచెమ్మ। ణాళపాణీ, అకటా।
కాలాడకున్నదేనేలాగుబోదునే । నీలవేణీ॥ ౪॥

అ॥ వాలమేటిపురిపాలునితోడెసం। పీలజాలా, నెనరు । మాలి
యెప్పటికైనమరువకునన్నుదయాలవాలా॥ ౫॥

(ఇంద్రునివాక్యము.)

గీ॥ కాంతనామీదనింతవిభ్రాంతిగలిగి। యుంటెనా వెంటరారమ్మ పంటవలతి । నెంతపనియైనబూనిసాధింతునరుఱ । సేయుముల్లోకములవారితోయజాక్షి॥

(అహల్యవాక్యము.)

క॥ ఇందునిజెందినతారా। సుందరీచందంబుగాకసురనా[illegible]।
న్నందతడుదక్షసిచ్చునె। యిందుకువేరొకయుపాయమే నెరిగింతు౯॥

వ॥ అదియెట్లంటేని. (పూర్వకవిప్రోక్తము.)

సీ॥ దేవపూజకువిరులైచ్చెదనంచును వనికాంతరమునకు వచ్చునపుడు । నివ్వరిధాన్యముల్ నెవరకకేదార పరిసరంబులయందు దిరుగునపుడు । కడువేట్లనగోదకంబులుగొనితేర దూరతటాకంబు జేరునపుడు। చెరగుమాశెనటంచుజెప్పియూరకెవైన నొంటిగాకడయింటనుండునపుడు । వచ్చినాముచ్చటలుదీర్చు మెచ్చుగాను । నిచ్చతప్పనగాదు వియచ్చరేంద్ర । యనుచునకుటన జేర్చిమోహమునచెక్కు । ముద్దుగొనిపంపెనింద్రునమ్మో[illegible]నాంగి॥

(ఇంద్రవాక్యము.)

క॥ హరిణాంకాననమిటు। కాకఃకాకఃపికఃపికయటన్నవిధం। బైకవబాయగవలసెగ। దేకమలాసనుని చేత తెమనవచ్చునె॥

(అహల్యావాక్యము.)

వెనకటిచర్యలెన్నుటది వెఱ్ఱితనంబుగ తాంబు చేతుబం । ధనముస మానమంచనిబుధప్రవరుల్ వివరించువాక్యముల్ - వినవె మహానుభావ మన వేసటలింతటిలోనదీరునా । ననుమదిలోనమర్వకొక నాటికి నేటికిపోయి రమ్మికన్॥... హేమనోహరా.

క॥ అనిబలికినకలికినివిటొరినిస్వాకృతిమూని మరలకుహానాము నిమైగౌనకొనినాలుగుదిక్కులు। గనుచుకుటీరంబు వెడలిగమనోన్ముఖుడై॥

{ గౌతముండింద్రునెదుర్కొని ధిక్కరించి
మేషాండునిగా శపించుట. }

చ॥ మునియెదురైనాయందుసురముఖ్యుడు భీతినిబోవునంతలో। ననఘునిగౌతముంగనియెనత్తఱిదుండును వేషధారియై । దుర్జనిగనెరింగి యిట్టులనురోషసముజ్జ్వలితాత్ముడౌటజెం । దినయరి కాలిమంటనడునెత్తికినె క[illegible]టంబుగన్॥

(నాటరాగము.- చాపుతాళము)

ఓరివోరీసుర్జరేంద్ర పోవద్దురా నిల్వగావోరివోరీ। దురాత్మనీ ధిక్కరంబుచేడితస్కరుండవైతివి వోరివోరీ॥ ౧ ॥ తరంబెరుగక కర్థరాత్రి నన్నేమరించితివిగావోరివోరీ॥ సరోజభవదత్త రాజ్యమదమిటుబురికొల్పెనా వోరివోరీ॥ ౨॥ పరాంగనలశంబరారికేళికి మరులూరందురా వోరివోరీ। సరేసరేకావురాల్లూల్పదాపురంజైతివావోరివోరీ॥ ౩॥ దురంతకామాతురంబుననుమద్విరోధివైతివివోరివోరీ। కిరాతకపుపోకిరాట్లఫలమిత్తగ్గనూడురా॥ వోరివోరీ॥ ౪ ॥ ధరన్వాలమేట్పురంబేలు శంకరుండెఱుంగగ వోరివోరీ॥హరింతునీకావరంబునా మోహారంబుగ వరా॥వోరివోరీ॥౫ ॥



(పూర్వకవిప్రోక్తము.)

కొ॥ముష్కరహితవృత్తినిపర।పురుషరపత్రాక్షుబట్టిభోగించుటచే। ముష్కరహితుడవుగమ్మని। నిష్కరుణశపించిమౌనినిలయము జేరెన్॥

అంతటా.— క॥ మౌనీంద్రుడువచ్చుటగని । తానేమియెఱుంగ నట్టిదానివలెనుయూ।మానిని కాళ్లకుమ్రొక్కెను । పూనికరాజూచిపలికెమునియాగ్రహుడై ॥

{ గౌతముండహల్యాదేవిని
పాషాణంబుగాశపియించుట. }

(ఆరభిరాగము.- చాపుతాళము.)

ఓశోశీచాల్చాలు నీతమాసలింకనిల్పవే । బైశిమాలియెంతపనిజేసితివింతలోనహాహా॥ యోశోశీ॥ ౧ ॥ నీచబుద్ధిగలిగినాశీలాచారములుజెఱచితివి। ఛీఛీనాయెదుటికి రాకునీచేతినీళ్లంటదగదూ॥ యోశోశీ॥ ౨॥ గుండెరాయిజేసుకొనినిందుమతినియుండలేక। కండక్రొవ్వుచేతనీవుమిండగానిమరిగినావు॥ యోశోశీ॥ ౩॥ దోసకారిందునిన్నేమిజేసినరోసినకడ । ద్రోశినతిరదునాయాయాసమిదెంత మోసమె॥ యోశోశీ ॥ ౪॥ తటుకునశ్రీవాలమేటనిటలాక్షునిసాక్షిగని । విటుకులాడితనము నేడుచిటుకలోబోకార్తు చూడు॥ యోశోశీ॥ ౫॥ అనివెండియూ.

ఉ॥ కల్లరివేషమూనియతికామునకైసురరాజువేడ[illegible]మ్ముల్లమురాయిజేసుకొనియూరకయుండకనీవులోనుగా । జెల్లునెయిట్టిదుష్టకృత్యముచేసిఘోరాముపదాప్తిదాకమే । నెల్లనురాయిగాగవసియింపుముసర్జనమివ్వనంబునన్॥

క॥ అనిశపియించిహిమాద్రికి । జనియెన్- గౌతముడుజంభశాసనుమేషాం । డునిజేసిరిశ్వనిసుతు।లనుపముదివ్యౌషధములనమరులుమెచ్చన్॥

వ॥ ఇటనహల్యాదేవిపతిశాపవశంబున పాషాణంబైయనేకదివ్యసహస్రవర్షంబులువాయుభక్షణయునిరాహారయు భస్మశాయినియునై యెవ్వరికింగానరాకనవ్వనంబునంబడియుండెనంత కొండొకకాలంబునకయోధ్యాపట్టణంబునా॥

క॥ అనిధరణికోటకులపా।
వనసుబ్రహ్మణ్యసుకవివర్యుఁడుసంక్రమం।
దనగౌతమీవిలాస।
మ్మునను ద్వితీయప్రకరణమునువిరచించెన్॥
శ్రీమదింద్రాహల్యావిలాసంబను నాటకంబునందు
మూడవదినముకథ-సంపూర్ణము.

క॥ మంగళముసర్వమంగళ।
సంగతశ్రీవాలమేటిసదనాభవభృ॥
ద్గంగావృషభతురంగా।
సంగమదవిభంగచాక్షనాధశుభాంగా॥

## మంగళము.

(ముఖారీ రాగము - జంపె తాళం.)

జయమంగళంభక్తజనవశీకరునకును జయమంగళం నిర్వికారునకును। జయమంగళం మోక్షసామ్రాజ్యఫలదునకు। జయమంగళం లోకశంకరునకూ॥ జయమంగళంసదాశివమంగళం॥ ౧॥

కైలాసవాసునకు కవిజనోల్లాసునకు। నీలకంఠునకధికనిర్మలునకూ। కాలకాలునకు లోకాలవాలునకు సం। సీలునకు విబుధజనపాలునకునూ॥ జయమంగళం॥ ౨॥

కిన్నరేశాప్తునకు కీర్తిముదాప్తునకు। యున్నతోన్నతున కత్యుత్తమునకూ। పన్నగాభరణునకు పరమమునిశరణునకు। సన్నుతచరిత్రునకు శర్వునకునూ॥ జయ॥ ౩॥

సత్యసంకల్పునకు సద్వేదకల్పునకు। నిత్యునకు సురగణస్తుత్యునకునూ। మృత్యుంజయునకు గజదైత్యచర్మాంబరున। కత్యంతకరుణాకటాక్షునకునూ॥ జయ॥ ౪॥



భావజవిదారునకు భవభయవిదూరునకు। దేవదేవునకు ధాత్రీరథునకూ। శ్రీవిశ్వనాథునకు శీతభానుసుధాంశ। పావకాక్షునకు శోభాకరునకూ॥ జయ॥ ౫॥

యీశునకు నిరుపమోల్లాసునకు వినుతలో। కేశునకు నిత్యప్రకాశునకునూ। భాసిల్లువాలమేటీశునకు। మీనాంబికేశునకు లోకనాథేశునకునూ॥ జయమంగళం॥ ౬॥

శ్రీమద్గురుచరణారవిందార్పణమస్తు.

## గద్యం.

ఇది శ్రీమత్తారకేశ్వరకరివరదరాజ ప్రసాదితానవద్యాంధ్రప్రబం
ధనిర్మాణప్రవీణకాశ్యపగోత్రాభరణ ధరణికోటవంశా
ర్ణవపూర్ణశశాంక లక్ష్మణార్యతనూభవా
కలలక్ష్మాంబికాగర్భశుక్తిముక్తాయమాన
సూరిజనసన్మాన సుబ్రహ్మణ్యాభిధా
నకవీంద్రప్రణీతంబైన శ్రీమదిం
ద్రాహల్యావిలాసనాట
కమునందలిపూర్వ
భాగముసర్వం
సంపూర్ణం.
శ్రీ.












శ్రీరస్తు.

# శ్రీమదింద్రాహల్యావిలాసము.

## ఉత్తరభాగము.

శ్రీ సీతాలలనాప్రియ! వాసవముఖత్రిదశవంద్య* వనజదళాక్షా!
దాసజనపోషదశరథ! కౌసల్యాతనయరామ* కళ్యాణనిధీ॥

## (*)దశరథమహారాజుకథాప్రారంభము.(*)

ద్వి॥ శ్రీకరరఘువంశసింధుసంపూర్ణ - రాకాసుధాంశుండురమ
ణీయచరితు-డతులితోదారుడష్టైశ్వర్యహితుడు- జితకల్మషుండుయాత్రి
తపోషణుండు- వైరిభీకరుడనివార్యవిక్రముడు- సారపుణ్యుడుసదాచార
సంపన్ను- డురుతరసద్గుణుండుత్తమవ్రతుడు - సరసుండుభూలోకసం
క్రందనుండు- ధీజనమాన్యుండుదీర్ఘసాహసుడు - రాజరాజగుదశరథమ
హారాజు - పుత్రకాంక్షితుడయిపుత్రకామేష్టి- ధాత్రినొనర్చినందనచతు
ష్కంబు- కరమర్థిగాంచినఘనుడుసాకేత - పురవరాధీశుడేపునవొక్కనా
డు- సురుచిరాలంకారశోభితుండగుచు- ధరణిరక్షదలభద్రగజంబునెక్కి.
వరుసగామంగళవాద్యముల్ మోయ - వరమంత్రులుభయపార్శ్వముల
నేతేర- పటుతరంబుగవేత్రపాణులైవీర- భటులుముందరబరాబరులాచ
రింప- నాటచేడియలాడనటవీటిచెలులు - సాటికిబోటికిశాసలుజల్ల- గ
రుజనంబులగూడికుతుకంబుమీరి - విరివందుహాయలుచేవిల్లువీగుచున
వసుధనన్నారెడ్డివరరామచంద్ర- వసుమతీశ్వరునవరతమేల్వాల - మేట
పురీశునెమ్మిదలంచి- కొల్వు! కూటంబుశేయగాగోరితావెడలే॥

(*) దశరథమహారాజుకొల్వుజేయుట. (*)

(నాటరాగము - ఆదితాళము.)

రమణీయ్యగుణసాంద్రుడూ। వెడలెనుదశ। రథమహారాజచంద్రుడూ॥ అమరవిభునిసమమగువిభవముతన। కమరనమరవిద్యాధరులెన్నగ॥ రమణీ॥ ౧ ॥ భూజనులునుతింపగా। ప్రమదంబునది। రాజులుగీర్తింపగా రాజితమణిహారంబులురంబున। దేజరిల్లబహురాజసమమరగ॥ రమణీ॥ ౨॥ కుటిలులుభీతిజెందగా। సమస్తబుధ। కోటిసంతోషమొందగా॥ చెటులత నాశాతటములదరనటపటుభటపటలార్భటులుచెలంగగ॥ రమణీ॥ ౩। భూసురులుదీవించగా। సకలవాద్యములు। భోరునఘోషించగా॥ వాశిమీరవరవాలమేటిపుర। వాసుడైనపరమేశునిదలచుచు॥ రమణీ॥ ౪॥

వ॥ ఇవ్విధంబునకోసలదేశాధీశ్వరుండగుదశస్యందనుండు-సకలభృత్యామాత్యనటవిటగాయకవందిమాగధస్తూయమానుండును-నిటలతటఘటితమృగమదాంకితతిలకుండును. తారహారాదినానారత్నవిభూషణాలంకారశోభాయమానుండును- నైకొలువుకూటంబు బ్రవేశించి సింహాసనాసీనుండైయుండెనట్టియెడా॥

[*] రామలక్ష్మణులకథాప్రారంభము. [*]

సీ॥ హాటకరత్నకిరీటంబుధరియించి। రాణించుకల్గితురాయిచెక్కి। సొంపుగుల్కగకప్పురంపుతిలకముదిద్ది। రంగుమీరినవువ్వటంగిదొడిగి। యపరంజిముత్యాలహారంబులను దాల్చి। కరములవజ్రాలకటకములిడి * ఘుమ్మఘుమ్మనగకుంకుమపుగంధములంది। స్వర్ణచేలమువల్లెవాటువేశి। కనుపండువుగాకామకాముడగుచు। లక్ష్మణునిగూడినిరుపమోల్లాసమమర। జనకుకొలువుకుశ్రీరామచంద్రుడపుడు। వేట్టసురలిచ్చమెచ్చగావెడలివచ్చె॥

(నాదనామక్రియరాగము- ఆదితాళము.)

శ్యామలఘనసమకోమలదేహుడు। రాముడుజగదభిరాముడువచ్చెన్। ప్రేమనుసౌమిత్రినిగూడిమహా। ద్దామవిభవుడగుతండ్రికొలువునకు। శ్యామ॥ ౧॥ హారమకుటకేయూరాంగదమం। జీరాదులునంచిత



ముగమెరయా॥ మారకోటిసుకుమారహాసితశ్యం। గారమమీరగపౌరులుమెచ్చగ॥ శ్యామల॥ ౨॥ బారుదీరిపురభామలెల్లకను। లారజూచిమోహంబునసొలయా। నారదసనకసనందననతచర। ణారవిందచిహ్నాములమరగతగ॥ శ్యామల॥ ౩ ॥ శరణాగతరక్షణబిరుదులుగల। దొరయితడేననిసురలుబొగడగా। వరదుడైనశ్రీవాలమేటిశం। కరుడలరగసురుచిరహాసంబున॥ శ్యామలఘనసమ॥ ౪॥

వ॥ ఇట్లువచ్చిదశరథుంగాంచి. కరంబులుమొగిచి మృదుమధురవాక్యంబులరామచంద్రుండిట్లనియె॥

క॥ పండితనుతగుణవిభవా। ఖండలసంకాశనిఖిలకలుషవినాశా। ఖండశ్రీయుతమీకే। దండములర్పింతుగొనుముదంబునతండ్రీ॥

వ॥ అనివందనంబిడిననిజనందనుందిలకించి పులకించిబరమానురాగంబున పఙ్క్తిస్యందనుండిట్లనియె॥

క॥ సార్థకమైదగుకోర్కులు। నర్థులకొసగుచుసంతతానందమునన్। వర్ధిల్లుకకుస్థాన్వయ। మూర్ధన్యుండనగనెవ్వుడుముద్దులతనయా॥

వ॥ అనిదీవించివెండియునిట్లనియె॥

[గుమ్మకాంభోది - అటతాళము.]

నాముద్దులయ్యారారా। రామచంద్ర। ననగన్నతండ్రిరారా॥ నామనమత్యంతానందమునొందగ। కామించికన్నులకరువుదీరగనిందు॥ నాముద్దు॥ ౧॥ అరువదివేలేడులనపత్యతనుగృంది। స్థిరమైనసౌఖ్యముజెందిధన్యుడనైతి॥ నాముద్దు॥ ౨॥ నావరాలకుప్పానాచిన్నినాయనయ్యా। నావంశదీపకానాపాలిభాగ్యమా॥ నాముద్దు॥ ౩ ॥ నీయనుజులగూడినిఖిలసంపదలదీ। ర్ఘాయురారోగ్యములమరివర్ధిల్లుము॥ నాముద్దు ౪॥ యిలనువాలమేటినిలయునిసత్కృప। వలననేనీవంటికులవర్ధనునిగంటి॥ నాముద్దులయ్య॥ ౫ ॥

ఓరి నాయనా.

వ॥ అనిచేరంజీరి గాఢాలింగనంబుజేసి చుబుకంబుబుడికి శిరంబుమూర్కొని నిజాంకంబునంజేర్చి లాలించుచు రాజేంద్రుండు రామచంద్రునకిట్లనియె॥

హా తమ్ముడా నా రామచంద్రా.

చ॥ జగతిప్రసిద్ధిజెందిపటుశౌర్యముగైకొనిసంగరంబునన్। బగతు
రనోర్చెసర్వవరపాలురలోనుతికెక్కెచాలన। త్యగణితశాంతభావమున నా
శ్రితవర్గముబ్రోచుచుండియు। న్నగటిమిసూర్యవంశమునుమాన్యతజేయు
ముధాత్రినోసుతా॥ ౧॥ ఓరితనయా.

చ॥ సుగుణముగల్గికోవిదులజూచినభక్తునికైవడిన్భయం। బుగరి
మెతోడబూవివరపూజలొనర్చుచువారిదీవనల్। నగధరుసాక్షిగాబడసి।
నందితప్రాజ్ఞుడవైసుఖించియు। న్నగటిమిసూర్యవంశమునుమాన్యతజే
యుముధాత్రినోసుతా॥ ౨॥ హేరఘునందనా.

చ॥ అగజతురంగవిక్రమమునరక్షింపాకరతారలుండుదా। కగ
తభయంకరుండవయికౌతుకమొప్పమహోత్సవంబుగా। నగుమొగముల్ల
సిల్లశరణాగతవత్సలతన్ జరించియు। న్నగటిమిసూర్యవంశమునుమాన్య
తజేయుముధాత్రినోసుతా॥ ౩॥ అనీ॥

వ॥ ఇవ్విధంబుననపార్థివోత్తముండు సలక్ష్మణుండగురామభ
ద్రునందతివాత్సల్యంబునెరపుచుండెనాసమయంబున॥

(*)విశ్వామిత్రునికథ(*)

(మధ్యమావతిరాగము- ఆదితాళము.)

విశ్వామిత్రుడూవచ్చెనపుడూ। సాకేతపురికి॥ విశ్వా॥ విశ్వామి
త్రుడువిమలచరిత్రుడు। భాస్వద్వంశాధీశ్వరుకడకూ॥ విశ్వా॥ ౧॥ స్ఫటి
కాక్షమాలకేలమెరయా। కటితటమునకా। షాయాంబరంబులుదెంపొర
యా॥ నిటలస్థలముననిర్మలభస్మో। ద్ఘటితత్రిపుండ్రాంకముశోభిల్లగ॥
విశ్వా॥ ౨॥ నిడుదపల్లవజడలూడలా। నెరయగశ్రుతులు। నొడువుచుశిష్యు
లిరుగడలా॥ వడిమీరగనడువగసభవారలు। కడువిస్మయమునగనుగొనుచుం
డగ॥ విశ్వా॥ ౩॥ సురసిద్ధసాధ్యులునుతింపా। శ్రీవాలమేటి। పురిగారీనా
థుడామోదింపా॥ హరిణచర్మమునువరకమండలము। పరిపిగమెరయగని
రుపమానుడై॥ విశ్వా॥ ౪॥



వ॥ ఇట్లువచ్చిన విశ్వామిత్రునిరాక దౌవారికులవలనవిని దిగ్గున
లేచి పురోహితసహితుండై వనజగర్భునెదురోగు నువజ్రపాణిచందంబున
నెదురరిగిపూజించి నమస్కరించి దశరథుండిట్లనియె॥

గీ॥ ఓమునీంద్రచంద్ర యోభవ్యగుణసాంద్ర। తావకీయదివ్యదర్శ
నమున। దుశ్రితమెల్లబాసి పరమపుణ్యుడనైతి। వెలసెగీర్తికులపవిత్రమయ్యె॥

వ॥ అనినమస్కరించినందీవించి మునీంద్రుండునరేంద్రునకిట్లనియె॥

క॥ శుభమేనీపుత్రులకును। శుభమేనీపత్నులకును శుభమేమంత్రిప్ర
భృతులకుబంధుజనులకు। శుభమేగురునకునునీకుక్షోణీనాథా॥

వ॥ అనినవిని మునివరామీకటాక్షంబున మెమందరముక్షేమంబున
మున్నవార మిందువేంచేయుండని దోడ్తెచ్చి యగ్ర్యపీఠంబున నాసీనుంజేసి
రాజశేఖరుండిట్లనియె॥ ...ఓమహాత్మా.

క॥ మీరిటకువచ్చుకార్యం। బారూఢినసుజ్ఞయొసగుడరమరలేకన్।
యీరాజ్యమైననిచ్చెద। కారుణ్యమయార్కతేజగాధితనూజా॥

వ॥ అనినంబరితుష్టహృదయుండైకౌశికుండిట్లనియె॥

ద్వి॥ రాజదేవేంద్రసద్ధర్మలగుణసాంద్ర - రాజద్యశోనిశారాజమా
ర్తాండ- కులవర్ధనుడవనఘుడవుధార్మికుడ - వలఘుసత్యధనుండవార్యాను
మోద - శీలజాలుడవువశిష్ఠశిష్యుడవు - పాలితాశ్రితుడవైభాసిల్లువాడ-
వనివచ్చితిచటికినస్మదభీష్ట। మనుసమకూర్చుముముదముదీక్షింప-ధరణీతలే
శయుద్ధరునిశాచరులు - నరుదారయాగమెయత్నంబుశేయ - పరుపడిజను
దెంచిభంగపెట్టెదరు- యురుతపఃఫలహానికోడివారలను - శపియింపకుం
డునిశ్చయమిదిగాక- తపసులగ్గింపగాదశరాత్రమనెడు- సవనంబుశేయని
ఛ్ఛదలంచితట్టి- సవనంబురక్షింపశత్రులద్రుంప- జాలునీసుతురామచంద్రు
నావెంట - మాలిమితోబంపుమారాజయతని - బాలుడశక్తుడన్భావంబు
మాను- మాలోలనఖిలలోకాలవాలుండు- గాకన్నవత్తునేగాంక్షించియు
టకు- జోకతోనలతిగాజూడకుమితని- మహిమనెల్లవసిష్ఠనూనియెరుంగు
బహుసాహసుండునిర్భయుడుమద్యాగ- పరిపాలనార్గుండుపరిపరివిధ

యా- జరవరఁ జేయకుమధిపనీకొడుకు- నెడబాయకయ్యెడ నెలమిగాఁ బాడు-
కొడు వేడ్క-నొకమేలుగలుగఁగఁ జేసి- శ్రీమీనగొని తెత్తుఁ జెలఁగిచికిత్తు- నామా
టనమ్ముమన్నా రెడ్డిరాము- చంద్రన రేంద్రరక్షకుడువాల్మేటి - చంద్రశేఖ
రుడిలసాక్షి భూపాలా॥

వ॥ అనిబలికినకౌశికునివాక్యంబు కఠోరకశాఘాతంబై చెవినా
టినఁజలించి మహీకాంతుండు తనమనంబున॥

(ముఖారి రాగము - అటతాళము.)

యేమి శేయుదు దైవరాయా। యింక, కేమియోచనదోచదాయా॥
నాముద్దుతనయుడౌ రాముని గొంపోవ । ధీమసము ప్పవిశ్వామిత్రుడిటువ
చ్చె॥ నేమి॥ ౧॥ లేక లేక సుతులఁగంటి। కొదువ। లేదుగదా యనియుంటి।
భీకరాటవులకు బిడ్డను బంపిన। నాకుజీవములుండు నాయొక క్షణమైనా॥ నేమి॥
౨॥ ఆనాటికి హరిశ్చంద్రుని । రా, పాడిన జరిగిమునీంద్రుని॥ కేనేల బేల నై
తేమడిగిననొసౌ। గేనని కడుతెంపు బూనిబల్కితి వయయో॥ యేమి॥ ౩॥
మాటదప్పిననుదోసంబు। యోగీ, మానసమున కాయాసంబు॥ నేటికి
శ్రీవాలమేటిపురీశ్వర । ధాటిగయీ నెపము దప్పించుకొను పెట్లో। యేమి
శేయుదు ॥ ౪ ॥

వ॥ అనవిషాదతప్తుండగుచు కౌసికుంజూచి కౌసల్యానిభుండిట్లనియె॥

గీ॥ చిన్నవాడు సమర మెన్నఁ డెరుంగడు। సాధనప్రయోగసరణి నేర
డహితబాణహతులకళుకకనైప లే। డసురవరులఁ జూచి యడలకున్నె॥

ఓమహాత్మా॥ —. క॥ క్షితినరుపదినేలేఁడులు । బ్రతికి సుతులఁగననిమ
గనుబడలినఁదిమిసం। చితపూర్వసుకృతఫలసం । గతినేనిటుగంటిసుతులక
లుషవిదారా॥ వారిలోనా.

భా॥ క॥ రాముండగ్రతనూజుడు। రాముడు గులవర్ధనుండు రాముడు
ప్రియుడే। రామునిబుత్తేజాలను। రామునినెడబాసిక్షణము బ్రతుకగనోపన్॥

క॥ అక్షౌహిణీ సామంతులు। నీక్షణమున గొలువ వేగ మేవచ్చెదయా।
రాక్షసులదునిమిమీమఖ। రక్షయొనర్చెదనుధరను బ్రతికినదాకన్॥



వ॥ ఓమునీంద్రా యానిశాటులెవ్వరు వారిం బంచినవా రెవ్వరు త
ద్వర్తమానంబు సాంగంబుగా విననలతుం జెప్పుమనిన నృపతికి మునిపతి
యిట్లనియె. ...ఓయిరాజా.

క॥ వారలు రావణు బంచిన । వారలు మఖహరులగుచువర్తింతురి
లన్। మారీచ సుబాహులువా । రారయ సుందోపసుందులను వారిసుతుల్॥

వ॥ అనినపత్యంతభీతుండై మహీభుజుం డిట్లనియె.

[నాదరామక్రియ రాగము - ఆదితాళము.]

తాపసేంద్రా॥ చాలులేవయ్యా॥ తాప॥ తాపసేంద్రమాకీపనిచె
ట్టిన । నోపలేము బ్రిస్తాపము వలదు॥ తాప॥ ౧॥ ఆసమబలులు మనుజా
శులుమారీ । చసుబాహులమావశమా గెలువా॥ తాప॥ ౨॥ పోరులసుర
వరుజీకికిగొనరట । వారినెదిర్చే వారానరులు॥ తాప॥ ౩॥ ఇదివదలుము
దశవదనుహితులతో। కదనము జేయంగలవా రెవరు॥ తాప॥ ౪॥ వాలమేటి
పురిపాలుడలర పశి । బాలుడు రామునిపైదయయుంచు॥ తాప॥ ౫॥

భా - క॥ అకటా టనాశిశువెక్కడ । రకటాసులెక్కడమహోగ్ర
రణ మెక్కడయా । రకటాసుల గెలుచుటెక్కడ । నికార్యములేల బా
సగునిట్టివిగలవే॥ — హేమునీంద్రా.

క॥ ఏనున్ను వెరతునటరా । రాముడు శిశువంతకంటె రాముడు
వెరచున్। మామీదగరుణ శేయుము। ధీమయమద్గురుడవిష్ట దేవతవరయన్॥

వ॥ అనినన త్యాగ్రహంబున మొగంబు జేవురింప గనుంగొన లవి
స్ఫులింగంబులు జెదర సర్వలోకభీకరాకారుండై కటంబులదర బెటపెటం
బండ్లు దీటుచు బొమలుముడివడ బుడమిరేసిం జూచి తలయూచి జడదారి
యిట్లనియె-

(నాటకురంజి - అటతాళము.)

ఏమోయీ, దశరథ యిట్లయినను మేము । రామోయీ॥ రవివంశ
జుడవు గాన, ధీమతి విననృతంబు బల్కని । భూమిపాలుడవని దలంచితి॥
ఏమో॥ ౧॥ గొప్పగా, వీరందరు విన గబల్। మెప్పుగా॥ నేమైన నిచ్చెదనంచు,

జెప్పినన్నడిగించిపద్ధతి । నిప్పుడేసప్పితివియారా॥ ఏమో॥ ౨॥ నేటికీ, చెల సెనునీస్వభావమిం । కేటికీ॥ మాటలువేయుబలుకఁగ, కోటవచ్చిననిలువ రాదీ । చోటనేనికబోయివచ్చెద॥ నేమో॥ ౩॥ ధారుణీ, వరవాల్ మేటి నగరవి। హారునీ॥ కటాక్షమెట్లున్నదా, తీరుమాకౌగాకఇకనీ। వారునీవు సుఖాసనుండుము॥ ఏమో॥ ౪॥

వ॥ అనిఇట్టుల మహాట్టహాసంబుగా ధట్టించి బలుకుచున్న గాధి పట్టి నిష్ఠురవాక్యంబులాకర్ణించి తత్క్షణంబునా.

(*) వసిష్ఠమహామునికధా. (*)

(శుద్ధసావేరిరాగము - అటతాళము.)

వచ్చెవసిష్ఠమౌనివరుడూ । సచ్చరిత్రులెన్నవపుడూ॥ వచ్చె॥ ౧॥ ఫాలమునవిభూతి మెరయా । గాళీరుద్రాక్షమాలలూరయా॥ వచ్చె॥ ౨॥ వేదనాదమెల్ల జెలగా । వెంటశిష్యగణము మెలగా॥ వచ్చె॥ ౩॥ గాధితనయు ధాకవినుచూ। మేదినీశుచింతగనుచూ॥ వచ్చె॥ ౪॥ కేలబ్రహ్మదండమునచీ। వాలమేటిశివునిదలచీ॥ వచ్చె॥ ౫॥

వ॥ ఇట్లువచ్చిన గురునింజూచి దిగ్గునలేచి కరంబులు మొగిచి రాజవిభుండిట్లనియే. — హేగురువరా.

గీ॥ అజునిమానసపుత్రుండవై ప్రభాక । రాన్వయమునకు గురుడవై యాగమార్గ । వేత్తవై నట్టినీకువే వేదండ। ములుసమర్పింతునై కొమ్ము మునివరేణ్యా॥ ... హేరాజేంద్రా.

[వసిష్ఠ వాక్యము.]

క॥ దివ్యభోగములును తేజంబుసత్యంబు । యశముసంపదయు మహావిభూతి । బలమురిపుజయంబుబ్రమదమనామయం । బమరిసుఖము జెందుమజతనూజా॥

వ॥ అనియాశీర్వచనంబుచేసి దీవాసనుండైయున్న భూనాయకునకు తాపసోత్తముండిట్లనియే.



(నాదనామక్రియ రాగము- అటతాళము.)

యోచనేలభూపా, పరజిత। ప్రాచుర్యప్రతాపా॥రాజా॥ యోచనేల॥ యోచనలేలనుభూచక్రింబున । రాచందురులలోరంజిలువాడవే॥ యోచనేల॥ ౧॥ నీకుసాటివారూ, యీముల్లోకములనులేరూ॥ శ్రీకరుడవురణభీకరుడవుసు। శ్లోకుడవమలగుణాకరుడవెయీ॥ యోచనేల॥ ౨॥ కులదీపకులైనా, కొడుకుల। నలువురగనుగొంసినా॥ బలుసంభ్రమమెదదోలగజేసిచిం । తిలుకారణమును దెలియబలుకుమిక॥ యోచనేల॥ ౩॥ పన్నగేంద్రధరుడై, గిరివర । పట్టిమనోహరుడై॥ వన్నెమీరుశ్రీవాలమేటిశివు। నెన్ననాపదలన్నిబాయునిక॥ యోచనేల॥ ౪॥

వ॥ అనియడిగిన మునీంద్రునకు నరేంద్రుడిట్లనియె.

క॥ ధీమతివిశ్వామిత్రమ । హామునివెంచేయిపూజలర్పించియుమీ। కేమైనసత్తునంటిని । స్వామీయేమనివచింతు సంయమికాంతుల్॥

క॥ మారీచాదులక్రూరవి । చారులబరిమార్చితనదుజన్నముగావగ । గారాబుకుమారుండగు । శ్రీరామునిగోరెనేమి జెప్పుదునఘా॥

వ॥ అనిబలుకు చింతాక్రాంతుండైయున్న మహీకాంతునేకాంతంబుగాజేరి యరుంధతీకాంతుం డిట్లనియె. ఓయిరాజేంద్రా వినుమొక పరమరహస్యం బీరామభద్రుండు బ్రధానపురుషుండును బ్రకృతికతీతుండై వెలుంగు బరంజ్యోతిస్వరూపుండును నిరామయుండును నిరుపమానుండును నిర్వికారుండును నిరంజనుండును నిర్గుణపరంధాముండైన శ్రీమదాది నారాయణుండగుంగాని సగుణధాముండైన నరుండుగాడు ఇట్టిని రాకారునియందు కుమారుండను యభిమానముమానుము యీమహాపురుషుని మహిమంబు సమగ్రంబుగా వర్ణింప నేనెంతవాడ ననేకయుగంబులననేకజన్మంబుల ననేకవిధంబుల ననేకముఖంబులుగలవానికైనానశక్యం బితనిచరిత్రంబు లతిచిత్రవిచిత్రంబు లఘులతౌలవిత్రంబు లాగమాంతసూత్రంబు లార్యజనపవిత్రంబు లదియెట్లుండనిమ్ము॥

భా - ఉ॥ ప్రాకటధర్మమూర్తివతిబంధుర సత్యయశోధనుండవి
క్ష్వాకుకులప్రసూతుడవుసమ్మతినిచ్చెదనంచుబల్కి నీ। వాకృతినీకుబొంకు
టదియర్హమె బొంకినసర్వధర్మముల్। వేకడతేరిపోవె యుకువిశ్రుతకీర్తి
యుమాశిపోవదే॥ ఓ యి రాజా॥

చ॥ అనలముచేతగుప్తమగు నయ్యమృతంబునుబోలెనీతపో। ధన
పరిరక్షితుండగుచుతద్దయునొప్పెడునీతనూభవుం। డనినకృతాస్త్రుడైనను
నిరాయుధుడైననిశాటకోటికిన్। జెనకగరాదు కౌసికుడుజెప్పగ కేవల
సంయమీంద్రుడే। ఇదియునుంగాక॥

చ॥ అతులతపంబునందు బలమందుమతిన్ఘనభూతిలోకవి। శ్రు
తుడితడానిశాచరులదృంప్ప సమర్థుడయీమిషంబునన్। హితమతినీతనూ
భవునకెంతయుమేలొనగూర్పగోరినీ।సుతుగొనిపోవవచ్చెనిటు సూనృత
మొప్పగబంపునెమ్మదిన్॥

వ॥ అనినగురువాక్యంబులకామోదించి రాజశేఖరుండు రామల
క్ష్మణుల నలంకరించి మహోత్సవంబొనరించిభాగ్యలుందానుసుదీవించి
పరమోత్సాహంబున విశ్వామిత్రునకర్పించినా॥

భా - గీ॥ అపుడుసుఖవాయువులు వీచెనమరులోలి। పుష్పవర్ష
ముగురిశిరిభూరిదివ్య।శంఖదుందుభిస్వనములుచదలజెలగె। ముదితులైరె
ల్లసురలు సన్మునులుజనులు॥ వ॥ ...అప్పుడూ॥

మ॥ అతులోత్సాహధురీణులై పటుతరజ్యాంతర్ధనుఃపాణులై।
తతగోధాంచితభర్మనిర్మితభుజత్రాణాంగుళీత్రాణులై। యుతబాణో
న్నతతూణులైబిరుదకేయూరాద్యదోస్త్రాణులై।ప్రతతస్వీకృతపాణులై
త్రిభువనత్రాణైకపారీణులై॥ వెడలిరెట్లనినా॥

(శ్రీరామలక్ష్మణులుకౌసికాధ్వరమురక్షింపబోవుట)

(కాంబోదిరాగము - ఆదితాళము.)

రామలక్ష్మణులువెడలిరపుడూ। వేడుకమీర॥రామ॥ రామలక్ష్మ
ణులు రాజకుమారులు। శ్రీమీరగకౌసికువెనువెంటను॥ రామ॥ ౧॥ సుర



లుపుష్పవాలవానగురియా, దేవదుందుభులం। బరమువనురుతగముగమొర
యా॥ గరుడోరగకిన్నరమునివిద్యా। ధరులుబొగడనచ్చరచెలులాడగ॥
రామ॥ ౨॥ జననీజనకులయాజ్ఞబూని,వసిష్ఠాదిస।న్మునులదీవనలుగైకొని॥
కనకకిరీటములనుపమహారము।లినశశికాంతులనింపుగులుక॥శ్రీరామ॥ ౩॥
సిరిమించువాలమేటిపురినీ, వెలసినపరమే। శ్వరుడుమోదించగానత్తరిని॥
కరములశరములుమెరయగయోగీ। శ్వరునధ్వరరక్షణకొరకురువడి॥
రామలక్ష్మణులువెడలిరపుడూ॥ ౪॥

వ॥ ఈచందంబున పరమేశ్వరునివెనుకొను గజముఖషణ్ముఖులం
బోలి కౌసికువెంటనాటి దినంబర్ధయోజనంబరిగి సరయూదక్షిణతీరంబు
జేరి యందుకృతస్నానులై యుండిరంత రఘువల్లభునకు ఋషివల్లభుం
డిట్లనియె. హేరఘునందనా.

కౌసికుండు శ్రీరామునకు బలాతి
బలంబులను మహావిద్యలనుపదేశించుట.

(కందార్థములు-ఆట.)

శ్రీరామభద్రనీకిప్పు। డారూఢిబలాతిబలములనువిద్యలునే। కూరి
మినొసంగెదనువి।స్తారమతీయభ్యసింపు। సమ్మతముగనూ।సర్వాభీష్ట। సం
సిద్ధియగునూ॥ తమ్మిచూలికొమరులిమ్మంత్రయుగముమా। గ్గమ్మునబోవుచు
నెమ్మిబఠింతురు॥ సమ్మతముగనూ॥ ౧॥

(రామవాక్యము.)

మునివరమీరుపదేశిం।చినవిద్యలురెండుబ్రీతిచనర్చదనా।కనువం
దదత్ప్రభావము। ఘనముగశలవియ్యవయ్య। కలుషవిదారా। సారా
చార। జలధిగభీర॥ వలనొప్పమీకుశిష్యులమైమియానతి। కొలది మెలగు
టలుమాకుశ్రేయమేకదా॥ కలుషవిదారా॥ ౨॥

(మునివాక్యము.)

భా-కం॥ ఇవిజపియించినరఘుసం। భవసుప్తశవైనమరిబ్రమత్తుడ
వైనన్।భువిరాక్షసభయముబెం।దవుదుర్దశలెల్లబాయుతద్దయునీకున్॥

వ॥ ఇదియునుంగాక తత్ప్రభావంబు సమగ్రంబుగా నాకర్ణింపుము.

క॥ అమరబరించిన సౌభా। గ్యమునెనుకయు బుద్ధిశుచియు గౌరవమును బు। ణ్యమును బలంబును భుజశౌ। ర్యము నుతి త్రైలోకముల నీకు బ్రతిలేకుండున్॥ హే దశరథనందనా.

క॥ అని పలుక సంతసిల్లియు। ఘనవిద్యాకలితుడగుచు కౌసల్యానం। దనుడు శరత్కాలోదిత। దినకరు చందమున వెలిగె తేజం బెసగన్॥

వ॥ తదనంతరంబున సుగుణాభిరాముండగు రాముండు సౌమిత్రిసహితుండై విశ్వామిత్రుని వెంటనరుగుచు మార్గమధ్యంబున క్రూరనిశాటియగు తాటకం దెగటార్చి కౌశికువలన ననేకదివ్యాస్త్రలాభంబు వడసి కొండొకదడవునకు తదాశ్రమంబు బ్రవేశించి మహర్షిమాత్రంబు విశ్రమించి ప్రాంజలులై రాజపుత్రులు విశ్వామిత్రునకిట్లనిరి.

భా - క॥ దీక్షవహింపుడు మీమఖ। రక్షయొనర్చెదము దుష్టరాక్షసభటులన్। శిక్షించెద మనన మ్మునిదీక్షితుడై నియతినుండె దృఢతరనిష్ఠన్॥

అంతట — క॥ నేత్రము తెప్పుడు మొగుపక। ధాత్రీసుల ధీజ్యాచాపధరులై విశ్వా। మిత్రుని యాగము షడహో। రాత్రము రక్షించిరతి పురంధరలీలన్॥

వ॥ అంత నారవదివసంబున రాఘవుండనుజున కిట్లనియె.

(విశ్వామిత్ర యాగసంరక్షణము.)

(మధ్యమావతి - అట - సంవాదము.)

మునియాగము గావ నిదే సమయము। అనుజా యేమరకుండుమా॥ దనుజులు మాయాసాధనులు కామరూపు। లని వింటి మతిజాగ్రతను బూనవలెనేడు॥ మునియాగము॥ ౧॥ (లక్ష్మణునివాక్యము.)

అన్నా మీమదిగోరియున్నదినెరవేర। కున్నలోకమునిలచునా। యెన్నగా మనరాకవిన్న రక్కసులిందు। కన్నెత్తి చూడగగలరె యోచన యేల॥ నన్నా॥ ౨॥



(రామవాక్యము.)

ఖేచరవరునిభంగించు సాహసులుమా। రీచసుబాహులనీ। ప్రాచుర్యము గమున్నుబలికె కౌశికుడట్టి। నీచులబరిమార్చి నిఖిలలోకము మెచ్చ॥ మునియాగము॥ ౩॥ (లక్ష్మణునివాక్యము.)

కానీలే చెడుకాలము గూడెను। దానవాధములకు। మానుగవింట్లు చేబూని రుదెసలను। నీనాప్రతాపము నిలచి చూపము భళి॥ యన్నా॥ ౪॥

(రామవాక్యము.)

అదిగో మింటమహాధ్వను తెగసెను। త్రిదశారులజేమో॥ మదయుతులై యిమ్మఖమును జెరుపవ। చ్చెదరు వాల మెటిశివు డద్భుతము జెందదే॥ మునియాగము గావనిదే సమయము॥ ౪॥

వ॥ అని విజృంభించి దాశరథులు శరశరాసనంబులు చేబూని యుద్ధోన్ముఖులై యుభయపార్శ్వంబుల నేమరకుండి రక్షించుచుండ నఖిల మంత్రతంత్రంబుల విధ్యుక్తక్రమంబున నాచరింప గుశసమిత్ప్రసవస్రుక్స్రువ చెరువులనలార్పితంబు చేసిన మంటలాకసంబంట యజ్ఞవేదిబుత్విగ్విశ్వామిత్ర సహితంబుగా ప్రజ్వలింప మింటనొక్క మహాఘోషంబు ఘోషించె నాసమయంబునా.

భా - క॥ మారీచసుబాహులు నా। నారాత్రించరులతోడ నభము నమూయా। స్ఫీరదము బన్నియస్ర। గ్ధారలు వేదిపయి గురిశిగ జనసలెసగన్॥

వ॥ వైరిగనంగొనిసి రఘువీరుండనిలాస్త్రంబరించి బోశీ.

క॥ ఆలోననమారీచుని। శాలంబగువక్షమేయ శతయోజనముల్॥ తూలముగతిదచ్ఛరవా। తూలము చేదూలి వాడు తోయధిగూలెన్॥

వ॥ పెండియు కౌసలేయుండనలాస్త్రంబున సుబాహుప్రముఖ క్రవ్యాదులం బరిమార్చి విజయలక్ష్మీసమేతుండై ప్రచండమార్తాండుని దెరంగున ప్రకాశించుచుండె. నంత మునివరుండు జన్నంబు పరిపూర్ణంబు జేసి కృతార్థుండై సంతసంబున శ్రీరామునకిట్లనియె.

క॥ పితృవాక్యము చెల్లించితి। క్రతురక్షయొనర్చితధ్వర ప్రతిషేధ। ప్రతతిదును మాడిసురముని। హితములు జేసితివికీర్తి నెసగితివత్సా॥

వ॥ అనివెండియు నిట్లనియె.

క॥ అనుపమపుణ్యచరిత్రుఁడు । జనకుఁడు గావించుమఖముసమ్మోద మారన్ । గనుగొననేనుననిమ్ముని । జనములుఁబోయెదము వినుము జన వరయచటన్॥

వ॥ సుజనదుర్జనసంభావనా భయంకరంబును నిరంతరపూజనీయం బును నత్యద్భుతప్రభావంబును నగు నొక కార్ముకంబున్నది చూడఁబోదము రమ్మనిన నప్పింగుడు రాఘవుండనుజున కిట్లనియె.

శ్రీరామలక్ష్మణులు కౌసికాదులంగూడి జనకునియజ్ఞంబుజూడబోవుట.

(యమునరాగము - అటతాళము.)

తమ్ముఁడమిథిలకు, పోదము రారా। ముద్దుల। తమ్ముఁడమిథిలకు॥ యీ మ్మునిచంద్రులను నే। డిమ్ముగఁగూడి వేడ్క॥ తమ్ముఁడ॥ ౧॥ ఆపురమేలురాజు। ప్రాపుగ జేయుమఖము। మహాపుణ్యకరము॥ చూపుననందురనుగు॥ తమ్ముఁడ॥ ౨॥ త్రోవనుగల్గుసకల। పావనతపోవనుల। శ్రీవెలయుపురములు। కేవలంబుఁ గనుచు॥ తమ్ముఁడ॥ ౩॥ వాశిగవాలమేటి। వామునిశరాసనము। భాసిలు నం దటంచు। కౌశికమునిబల్కె॥ తమ్ము॥ ౪.

వ॥ అనిబల్కు నమ్మోదమ్మునందమ్మునింగలసి మునిజనంబులతోడం జనుచు నచ్చటచ్చటంగలుగుప్రభావంబులు కౌసిత్రువలన నెఱుంగుచు కతిపయదివసంబులకు మిథిలానగరంబునకేగి దదుపవనంబుఁబొడగని కౌసతే యయుండు గాధేయునకిట్లనియె॥ ఓమునీంద్రా.

భా॥ క॥ అనరుచునివటబురానా । శ్రమముస్నడిమునులు లేక జనశూన్యంబై । రమణీయాశ్రమమే యు । త్తమమునియాశ్రమము మున్ను తద్జ్ఞత జెపుమా॥ (కౌశికవాక్యము.)

క॥ ఈపుణ్యాశ్రమవనమును । బ్రాపించి యనేకగణసహస్రాబ్దములు। దీపితతపమంచితవి। ద్యాపరుఁడై గౌతముఁడనహల్యయుసలుపన్॥

వ॥ రఘునందనాయిందొకవిశేషంబుగల దదెట్లఁ జెప్పెద॥



(శుద్ధసావేరి రాగము- ఆదితాళము.)

రామవినుముపురాతనకథయొకటి। వివరించెదనేను॥ రామువిను॥ శ్రీమరసోద్భవుఁడవనహల్యా। నామభామనుత్పత్తిజేశెనే। నేమనిజెప్ప దుదానిసుందరం। బీముజ్జగములలేదుసమానము॥ రామ॥ ౧॥ ఒకనాడు విరించి। కొలువై। యుండఁగజనుదెంచి। సురపతి। శుకవాణినిగాంచి। మదిని, చ్చగమోహమునుమించి॥ కడువే, డుకనక్కన్యామణి దనకిమ్మనిన ముకుళితకరకమలుండై వేడిన। పకపకనగివిధియీనని బలికిన। పాకహరుఁడు [illegible]వీటికిజనే॥ రామ॥ ౨॥ వనజజుఁడంతటనూ। గౌతమ, మునికిబ్రియముతోనూ। యామా, నిన్నినియొసంగిననూ। బలసూ, దనుడదివినిదానూ॥ యొకరే, యునినిశీధికుకుటమై గూశిన। వినిగౌతముఁడేటికి। బోవగనా, తనిరూపంబుననింద్రుఁడహల్యను। మనోభవునికేళినిగలశెను శ్రీ॥ రామ॥ ౩॥ కొండొకసేపునకూ। వజ్రధ, రుండుదివంబునకూ। బోవుచు, నుండనూ గ్రమునకూ। దృక్సర, ణుండెదునైమిణుకూ॥ యతనిగ- తాందుఁగమీచర [illegible]దాకప్పెను। బండగతనకులసతినిజనములే। కుండగనీవనినిశపించిము నీ[illegible]ద్దుండుహిమాచలమునకుజనెను॥ శ్రీరామ॥ ౪॥ అనువొందగమే షాం। దునిగా, నాశ్వినేయులౌష। దంబుల, నొసరించిరిదివిష। దీశుని, ననయంబాయొూషా॥ రత్నం- బినకులేశవాలమేటిపురవా। సునిసాక్షిగ। నిందున్నదినీవా। మునిపత్నికిశాపమోక్షణముసే। యనుదక్షుఁడవు। కృపామతిరమ్మాటు॥ రామవినుము॥ ౫॥

(భుజంగప్రయాతము)—(పూర్వ)

బలారాతిరూపంబుభావించెగానన్ । బలారాతిరూపంబుబ్రాపించెదానన్। శిలాహారినారిన్నిషేధింపుమింకన్ । శిలాహారిరూపంబెశేషాఘుమింకన్॥

వ॥ అనిదెల్పినమునివచనంబులంగీకరించి యనుజఋషిసహితుండై రఘువల్లభుండచ్చోటికివెంచేసె నాసమయంబునన్॥

(*)అహల్యాశాపమోక్షణము.(*)

క॥ వనజభవాభవసురముని। జనపూజితమైనరామచరణరజంబు। ఘనపవనవశతసోకిన। మునిశాపముబాసిసురలు మునులరునందన్॥

సీ॥ మునుదలమున్కలో మోహాంధకారంబు । వెనుకదీసినరీతి వేణి దనర। శాపలీలదినాంతచంద్రోదయములీల । మొలకనవ్వులముద్దు మోము మెరయ। బహుకాలపరచితోపలతయంటినమాటికి । కరివనక్షోజయు గంబుగులుక। తదదృశ్యభావంబుదవిలిపోవనిరీతి । కడుసన్నమైలేతగానువ డక । క్షితిసిలోహంబులనుపైడిసేయుస్పర్శ । వేదినగిరామపాదారవింద రజము। పూనిశిలపైడిజేసెనా మేనుమింవ । గాంతమైమించెగౌతమకాం తయపుడూ ॥ ఈప్రకారంబునా.

గీ॥ పుటముదీరినబంగారుబొమ్మయనగ। మరుని తెరిద్పుపైబోవుమ ట్టమనగ। ముజ్జగంబులవలపించుమోహినసగ । నిలచెరఘువల్లభుని మోలనీలవాల॥

వ॥ అట్టియెడరామచంద్రుండతిపుణ్యకల్యయగు నహల్యాదేవిపా దంబులకెఱగినం బెండ్లికొడుకవుగమ్మనిదీవించి గౌతమవాక్యంబుదలంచి యర్ఘ్యపాద్యాదిషోడశోపచారవిధులంబూజించి కరపల్లవంబులుముకుళించి శ్రీరామచంద్రుసినుద్దేశించియిట్లనియె॥

[*]అహల్యాదేవిశ్రీరాముసిస్తోత్రముజేయుట.[*]

(కందచతుష్కము.)

దండమఖండాకారా । దండంబాఖండలత్రిదశనికరనతా । దండముఘండనధీరా। దండము వేదండవరద దండములుహరీ॥ ౧॥

జేజేలాశ్రితపోషణ। జేజేలురతీశకోటిజితశృంగారా । జేజేలజపశుపతిహిత। జేజేలఖిలేశరామ జేజేలుహరీ॥ ౨॥

జోహాగుజగన్మోహన । జోహారహిరాజశయనసుగుణనిధానా। జోహారంబుజలోచన। జోహారమరారిహరణజోహారుహరీ॥ ౩॥

వందనమజభూనందన। వందనముసనందనాదివందితచరణా। వందనమిందునిభానన । వందనమానందనిలయవందనముహరీ॥ ౪॥

ఓమహానుభావా.



సీ॥ శ్రీరమాలోలవారిజలోచనవిశాలసన్మౌనిజనపాలశరణుశరణు। మానినీజనకామమధుకైటభవిరామగురుతరామానవభీమశరణుశరణు శరణాగతత్రాణసంరక్షణత్రాణవరయోగికళ్యాణశరణుశరణు । కౌస్తుభాంచితహారఖగరాజసంచారగురుభక్తమందారశరణుశరణు। శ్యామలామలఘనదేహశరణుశరణు । శంఖచక్రాదిసాధనశరణుశరణు । సదయ సాకేతపురధామశరణుశరణు । పరమపూరుషశ్రీరామ శరణుశరణు॥

[ నాదనామక్రియరాగము- ఆదితాళము.] ఓదేవా.

శరణురామా। సద్గుణధామా ॥ శరణు॥

శరణుశరణువరఖరకరవంశాభరణఘోరభవహరమునిశరణా॥శరణు॥౧॥

కరధృతగురుమందరధరణీధర। శరనిధికన్యావరకరివరదా॥ శరణు ॥ ౨॥

మారమారమణిహారమీరరణ। శూరవైరిపరివారవిదారా ॥ శరణు ॥ ౩॥

బాలమేటిశశిమౌళిసచివలోల। కాలవాలసంశీలకృపాలా॥ శరణు॥ ౪॥

హేరాజాధిరాజామహాప్రభో

[భుజంగప్రయాతము.]

సరోజాసనస్తోత్రశాంతస్వరూపా । సురారివ్రజధ్వంసకుంభత్పతాపా। పరాంభోరుహాస్త్రాన్వవాయప్రదీపా। నిరాకారరామావనీపానమస్తే॥ ౧ ॥ ఓమహానుభావా.

ఉమానాధమిత్రత్రిలోకాభిరామా। సుమిత్రాత్మజోపేతశృంగారకామా। సమస్తాఘనిర్ధూతసాకేతధామా । రమాలోలశ్రీరామరాజానమస్తే ॥౨॥ హేరామభద్రా

భువిన్నేతలోకిక్ జేయుపుణ్యంబుచేతక్। భవద్దివ్యసత్పాదపద్మంబులక్కక్ । గవస్నూపగన్లైక్ సుకాంక్షల్ఫలింపక్ । కవీంద్రస్తుతానంతకళ్యాణనామా॥ ౩॥ హేరఘువల్లభా.

జితారాతిసందోహజీమూతదేహా । మితానందశ్రీబాలమేటీశసఖ్యా । శ్రితవ్యూహమందార శ్రీరామచంద్ర । క్షితీంద్రార్చితానంతసీలానమస్తే ॥ ౪॥ ఓదేవా.

(ఉత్పలార్థత్రయము-)

[మోహనరాగము ఆదితాళము.]

శ్రీరమణీయనీరదశరీరపరాత్పరహంసవంశవి। ఖ్యాతమునీంద్రచిత్తవిచారకుతూహలనైగమాంతసం। చారహిరణ్యహారధరశంబరజిద్ఘతకోటిసుందరా। కారా, సమస్తలోకా। ధారా, సంగతసారా। చారా, సాధుజనమం। దారా ॥ వారణపోషణవైరివిభీషణ । నారాయణసుకుమారసుందరా॥ కారా॥ ౧॥ హేరాఘవా.

వందితబ్రహ్మపుత్రకవివర్ణ్యచరిత్రపురారిమిత్రరా। కేందుసమానవక్త్రజగదీశ। రమారమణీకళత్రసం। క్రందనశతృజైత్రఘనకార్ముకచిత్రసితాబ్జనేత్రగో। వింద్రా, గోపాలాశ్రీము। కుంద్రా, సంతతపరమా। నంద్రా, సన్నుతామర। బృందా॥ అందముగలమీసుందరపదములు। డెందమందుసంపొందదలతుగో॥ వింద్రా॥ ౨॥ హేస్వామీ.

కేశవవాసుదేవవిహగేశతురంగభుజంగతల్పలో। కేశధరాధరాత్మజహృదీశయుతోన్నతచక్రహస్తయో। గీశమనోవిలాసపరమేశ- వికుంఠనివేశయాశస। ర్వేశా, ఘోరపాపవి। నాశా, నగధరహృషీ। కేశా, నిహపమువిత్ప్ర। కాశా॥ దాసపోషశ్రీదశరథనందన। కౌసలేయదరహాసభాసస। ర్వేశా॥ ౩॥ హేజగద్రక్షకా.

(*) మాలిక. (*)

శ్రీమత్సహస్రాంశువంశదుగ్ధార్ణవపూర్ణచంద్రోదయా। దయాహృదయా॥ కౌసల్యాగర్భశుక్తిముక్తాయమానకోసలరసామండలాఖండలహృతాఖండజాతోత్సాహకరసుకరశైశవక్రీడావిలాసా। శ్రీశ్రీనివాసా॥ పితృవాక్యప్రతిష్ఠితానూనముని జనమనోవనచైత్రపవిత్ర విశ్వామిత్రసుమిత్రాపుత్రాన్వితాగణ్యపుణ్యా। శ్రమవిహారరమాణవమాయామానుషవేషా। మృదుమధురభాషా ॥ సర్వనిర్వాహకాత్యంతగర్వితదుర్వ్యచారసుపర్వభయంకరనిరాఘాటతాటకాసుబాహుప్రముఖకుటిలపటునిశాటతమఃపటలభాస్వరస్వర్ణమ్ముఖరదిశాధిపస్తవనియ్యాంఘ్రిపంకేరుహా । సగుణ



సందోహా॥ గౌతమవాగ్వముక్తాతిదారుణకఠినశాపమానోద్ధారానేకహాయనపర్యంతదురంతసంతాపిశిలాస్వరూపవిమోక్షణాక్షీణకటాక్షవీక్షణా। కౌశికాధ్వరరక్షణా ॥ కిరీటహారకేయూరరత్నకుండలమేఖలాగ్రైవేయకాంగుళీయకతారతాదేశముక్తాహారనూపురకంకణాద్యలంకారా। వర్ణ్యమణిగణస్తగితప్రతపనియ్యభూషణసమాజవిరాజమానదివ్యమంగళవిగ్రహా। భక్తపాలనానుగ్రహా॥ నిత్యశ్రీలక్ష్మీవిలాసభాసురాలోలవాలమేటపట్టణాధీశ్వరమీనాక్షీ మనోహరాప్తకుమారదాప్రసన్నాశ్వవిలోచనద్వయా। అవ్యయా॥ సాధుసజ్జనాభీష్టప్రదాయకామితకృపాసముద్రా। శ్రీరామచంద్రా॥ త్వాంసంతతంభజామ్యహం॥

వ॥ అనిబ్రార్థించిమరియును.

(శుద్ధకాంభోదిరాగము-జాల్యతాళము.)

జయరమాపతే। ద్వయనమోస్తుతే। భయనివారణా। భక్తపోషణా॥ ౧॥

జలదవిగ్రహా। శతృనిగ్రహా। కలుషమోచనా। కమలలోచనా॥ జయ॥ ౨॥

శేషతల్పవా। రాశిమధ్యవా। గీశవందితా। కేశవాచ్యుతా ॥ జయ॥ ౩॥

మహితగుణయుతా। మానిహృస్థితా। విహగవాహనా। విశ్వమోహనా॥ జయ॥ ౪॥ కైటభారివా। ల్మీకినగరవా। ర్జాటప్రియసఖా। హాటకాంశుకా॥ జయరమాపతే ౫॥ హేమహానుభావా.

క॥ వాసిగపూర్వంబున నే। జేసినసుకృతంబువలన శ్రీకరమగుమీ। భాసురసాక్షాత్కారము। కౌసల్యాతనయ నేడుగనుగొనగలిగెన్॥

వ॥ అనియిట్లనేకప్రకారంబులం దన్నుగొనియాడుచేడియం గటాక్షించి దరహసితవదనారవిందుండగుచు భరతాగ్రజుండిట్లనియె॥

క॥ మానవతీమణినీవిక। నీనాధునిజేరి వేడ్కనిఖిలసుఖంబుల్। మానసమలరగగాంచిమ। హానందమునన్వెలుగుము శాంతమిలన్॥

[*] గౌతముండు రామునిసన్నిధికివచ్చి నుతించుట. [*]

వ॥ అనునాక్షణంబున నక్షీణతపఃప్రభావుండగు యతపాదుండా జగద్రక్షకునిసన్నిధికిం జేరవచ్చె నెట్లనినా॥

అహల్యాగౌతము లేకీభవించి
తపోవనంబున కరుగుట.

చ॥ దివివర్షించెఁ బ్రసూనవర్షమపుడందెల్ మ్రోయఁగా సెన్ సుధా శివధ్వానబృందము దేవదుందుభులు మ్రోసెన్ ధింధిమిధ్వానమై। ఇవతాళించెసుగంధగంధవహమెంతే రామపాదాబ్జప । ల్లవసంజాతపరాగచాతురినహల్యాగౌతముల్ గూడఁగన్॥

క॥ ఆమెడజాయామృదుకర । తామరసము స్వకీయపాణితో యురుహామునన్ । శ్రేయము నబూని శ్రీరఘు । నాయకుఁదలచుచును యోగినాయకుడరిగెన్॥

వ॥ ఇట్లహల్యాగౌతములత్తఱి తానందకందళితహృదయారవిందులై శ్రీరామచంద్రునిం గీర్తించుచు తపోవనంబున కరిగి సుఖంబుండిరంత నిచ్చట-

క॥ రాముని సౌమిత్రినిఁ గడు । ప్రేమంబున గూడి ముదము బెంపారగ వి॥ శ్వామిత్రమౌని మిధిలకు । శ్రీమీరగ జనియె శుభము జేకురు వేటన్॥

రామలక్ష్మణ విశ్వామిత్రులు
మిధిలకు బోవుట.

వ॥ ఇట్లుజనిచని దినమణిశతప్రభానిభానర్ఘ్యమణిగణస్థగిత భాసమానాసమానోన్నత రజితమహారజిత సౌధప్రాకారగోపురాట్టాలకాంచిత నికేతనకేతనాన్వితంబై భోగవతీపురంబునకు ప్రతికాశంబై భాసిల్లు విదేహరాజపురంబు డగ్గరి రామునకు విశ్వామిత్రుండిట్లనియె॥

సీ॥ శ్రీరమణీయశృంగారగేహసమూహ భాసితోద్దామమై పట్టుమగాంచి। రాజమార్గవిశాలరాజితమణితోరణంబుల చేమించుడంబుమీర॥ పగడకూచముల చేనగణితోత్తుంగమై విలసిల్లు చలువచప్పరిళులుగలిగి । సుందరప్రతిమాసచుంబితాంబరములై రహిమించుమణిగోపురములుగలిగి । దివ్యపటికంపుసోపానదీప్తికలిగి । లాలితంబైన శ్రీమిధిలాపురంబు । విభవమెంచంగదగదహీనప్రభునకైన। చూడుమల్ల దె ఘువరాచోద్యమవ్వ॥



గాపున ... ॥ కమలాప్తుఁడస్తమించెడు । సమయంబునఁబురము సౌరగజనదు నేటికి । ప్రమదావనమునుండియు । బ్రమదంబున రేపుజనుట చాగను నఘా॥ అనిన నాకర్ణించి.

(*) ...మవాక్యము - సంవాదము. (*)

(ముఖారి రాగము-ఆదితాళము.)

ఈవన మెవ్వరిదయ్యా మౌనీంద్రా, చూడ। కేవలానందమైనదీ మౌనీంద్రా॥ ౧॥ (విశ్వామిత్రవాక్యము.)

ఇది సీతా కేళీవనము రామచంద్రా, ఇందు । నీరాత్రి నివసించుదాము రామచంద్రా॥ ౨॥ (శ్రీరామవాక్యము.)

సీతాయనే నాతీ యెవరు మౌనీంద్రా, కడు । ప్రతితా శలవియ్యవయ్యా మౌనీంద్రా॥ ౩॥ (విశ్వామిత్రవాక్యము.)

జనకుని ముద్దుకూతురు రామచంద్రా, సరి । సాటిలేని సుందరాంగి రామచంద్రా॥ ౪॥ (శ్రీరామవాక్యము.)

యే పాటి సౌందర్యశాలి మౌనీంద్రా, దానీ । నే రాజు పెండ్లాడెనయ్యా మౌనీంద్రా॥ ౫॥ (విశ్వామిత్రవాక్యము.)

జానకీ భువనమోహినీ రామచంద్రా, పెండ్లి । గానీ కన్నెయై యున్నది రామచంద్రా॥ ౬॥ (శ్రీరామవాక్యము.)

బోటి వృత్తాంతమెల్లను మౌనీంద్రా, వాల । మేటి శ్రమడిందఁ దెల్పు మౌనీంద్రా॥ ౭॥

గాధేయుండు కౌసలేయునకు
సీతావృత్తాంతము దెలుపుట.

(విశ్వామిత్రవాక్యము.)

(ద్విపద - భైరవి రాగము.)

ద్వి॥ వినురఘునందనా వివరింతునిపుడు - ఘనపుణ్యుడగుజనకక్షితీశ్వరుడు - కరమర్థి దానొక క్రతువాచరింప - నుచుపడి యత్నించి యుర్విదున్నించ - గాగను పట్టె బంగరు పెట్టె యొకటి - నాగటిచాలులో నమహా చ

తమగ - నామందసంబులోనవనీశ్వరునకు - శ్రీమీరగనుపించె చిన్నారి
ముద్దు। కన్నియకలశాబ్ధికన్నియపోల్క। చెన్నుగాదాని దెచ్చియుసీతయ
పేడు - పేరిడిబలుకూర్మి బెంచుచున్నాడు-యారాజముఖివివాహప్రాయ
ముపచి- వర్ధిల్లుచున్నదావైదేహికీవృపార్థివనందనాపతివిగాదగును-యా
శరాసనీకుయుల్లాలుగాదగును - మీరిర్వురేకమైమెలగగాదగును - దగునను
మాటయెంతటికైనదగును- దగనిందుకగుప్రయత్నముసేయదగును- రా
మాయన్నారెడ్డి రామచంద్రాఖ్య- ప్రేమనుబాలించుశ్రీపాలమేటి- శేషభూ
షణునిసాక్షిగమరియుకవి- శేషంబుగలదునేజెప్పెదెట్లనినా॥

[కందార్థములు.]

ఖండేందుశేఖరునికో। దండంబొకరిటిపదారుతరములవరుః కో।
దండితమైయుండునుభూ। మండలపతిమందిరమున। మనువంశతిలకా। భూ
మాజన। మగువంపుమేలకా। ఘనసాహసమునయాధనువ్రఖండించిన। జ
నపాలునకుతనతనయనిచ్చెదనంచు ॥ ననఘుడతడుప్రతిజ్ఞశేసిస్వయంవర
ముజాటించియున్నా। డనువుగానాపనియొనర్పనునినువినాబలశాలులెవ్వ
రు॥ మనువంశతిలకా॥౧॥ హేరాజకుమారా.

వరుసన్దేశాధీశులు। విరిబోణిసివలచివిత్తుహిగుచవిధిలా। పురికరి
గిజనకుశపధము। సరగునసెరవేర్చుశక్తి। జాలనీదెరిగీః పోవుదురుల। జ్ఞ
నుశెందతిరిరీ॥ లాలతసిరుపమ। లావణ్యశాలియా। బాలికాపైయాశపడి
చినదినమిట్లు ॥ చాలుగాజనుజెంచిసర్వన్పపాలకోటులు పౌరుషంబున।
షాలనేత్రునివిల్లుగనుగొనిపంతమునుసాధించుబలిమి ॥ జాలనిదెరిగీ ॥ ౨॥

కావున—క॥ఆవృత్తాంతము రేపే। నీవెరిగెదవింతలోననేనంనేలా।
భూవరసుతసాయంసం। ధ్యావిధులొనరింపసమయమాగతమయ్యెక్॥

వ॥ అనిపలికి రాఘవులుందానును సాంధ్యకాలకరణీయ్యంబులు
తీర్చి వనస్యంగారంబునకచ్చెరువంది మెచ్చుచు జిగురుటాకుపాన్పులమర్చు
కొని పవళించినంత॥

క॥ మునిగనుజూడకనుగూరకి । దనకంటికినిదురగాకతద్దయు
ప్రేమంబునజనకాత్మజదలచుచు మనసిజతాపమునరాకుమారకుడంతక్



వ॥ మహామోహపరవశుండై తనమనంబున నిట్లనివితర్కించే॥

——[*]శ్రీరాముని విరహము.[*]——

[కాంభోదిరాగము- ఝుల్పతాళము.]

ఎప్పుడెప్పుడు తెల్లవారునో। కమలాప్తబింబ। మెప్పుడుదయశిఖరిజే
రునో॥ యెప్పుడీతముముదొలగునో। జనకునిపురం। బెపుడుప్రవేశింపగలు
గునో॥౧॥ఎపుడు రాజుకోలువుజూతునో। పంతమునవెల్ల। నృపులనెపుడు గెలి
శేతునో। ఎపుడుశివునివిల్లుద్రుంతునో। వైదేహినినే। నెపుడువేట్క-చేప
ట్టింతునో॥ ౨॥ ఇప్పుడు కౌశికునిపల్కులూ। విన్నంతలోనే। దర్పకుడెదబర
పెములుకులూ। ఎప్పుడెరుగనీ విమోహము। నేడింతవింత। లేమోపుల
కించె దేహమూ॥౩॥ సీతముచ్చటెపుడువిందునో।సౌఖ్యమునదాని। చెలిమి
చాయకెప్పుడుందునో। ధాతయేమిగాలిఖించెనో। శ్రీపాలమేటి। భూత
నాధుడేటుదలంచెనో॥ ౪॥ అని వెండియూ.

ద్వి॥ ఔరనేడివియేమియాశ్చర్యమైన - మారవికారంబుమదిగల్గె
నాకు - చిలుకలకొలికియాసీతాలతాంగి - సలలితలావణ్యసద్గుణాదుల
ను- కనులజూడకయున్నగాథయువలన- వినినమాత్రాననేవికృతమైనట్టి-
కొత్తమరుల్బుట్టెకుంభినీతనయ - పొత్తునాకెన్నడింపొసగగాగలదొ-క్షీ
రంబులకులు - కేకీపికావళులు - కెరికొల్వగమీనకేతనుండిప్పుడు - సమ
యంబుదెలసిపుష్పశిలీముఖములు - గుములుగామెయినాటగురినేసిథాన్స్-
నీతమంజెటుబాయనెవరుసహాయు - లాతలోదరిగూర్పహాతమిదీర్ప
ధాతకృతంబెవిధంబొనాయేమి-సేతునన్నారెడ్డిశ్రీరామచంద్ర- పరిపాల
వాల్మేటిపట్టణాధీశ - స్థిరముగానాకోర్కెదీర్పుసర్వేశా॥

వ॥ అనిమరియునూ॥

[కందార్థములు.]

పొలుపుగవిశ్వామిత్రుడు। దెలిపినసమయంబదేమొ। స్థిరమగుచి
త్తం। బలతరుణిమరిగితిరుగదు। దిలకింపకగానీకలత। దీరదూ। ఏవగను
దానీ। జేరదూ ॥ కూరిమితోరేపారాజేంద్రకు। మారిగనకనామదిగల
కోరికి॥ దీరదూ॥ ౧ ॥ మరియనూ

జానకీనాథుఁడైన జానకీశ్రీప్రియుడనఁగుచు సంతసమునను - ద్యాన వనసీమయందున - పానందంబునను క్రీడలాడఁగా - మరుశరములఁజిక్కాడఁగా॥ పోఁడిమినా కెప్పుడు జేకూరుమురా - వేడుకతో వగలాడినిఁగూడి॥యాడఁగా॥

క॥ కానిమ్మేలాగైనను । మానాథునివిల్లువిరిచి మానసమలరన్ । జానకిఁగొనకున్ననుయకా । హా నేనొకరాచవిద్దెగుదు నెపుడమిన్॥

వ॥ అనిదృఢనిశ్చయుండై కొంతసేపుండు కించిద్వాస్రాత్రం బత్తరు శాఖలపైనుత్తమల్లి మరునాడుష:కాలంబున ద్విజబృందంబుల కలకలశబ్దంబుల మేలుకని మునియుండమ్మోదుంబానను యధావిధిప్రాత:కాల కరణీయంబులుదీర్చి గమనోన్ముఖులై యుండిరంత నచ్చట.

(*) జనకమహారాజు కొలువుజేయుట. (*)

ద్వి॥ శ్రీమరయాగదీక్షితుండైనజనక - భూమినాయకుడచ్చపైప్రొద్దు వలేచి - పరిశుద్ధసీతలబాహ్యోదకమున - గరిమస్నానముజేసి కాల్యకర్మంబు - శిరవుగానొనరించికృతకృత్యుడగుచు - వరరత్నభూషణావళు లుధరించి- మానుగాఋక్స్వ మాజంబుసామ- గానంబునొదువుదుగడకనే తేర - బాయక దేశాధిపతులువెన్వెంట - ధీయుతంబుగసద్విధేయులై నడువ - పసబూనచతురంగబలములతోడ - ఘనులైనమంత్రిశేఖరులుసేవింప - పరమపవిత్రుడీపార్థివుడనుచు - పరిపరివిధములప్రజలుతన్నాగడ - మొగిశతానందాదిమునుల సంప్రీతి - నగధర్మశాస్త్రసద్ధతులెల్ల దెలుప - జయజయయనివందిజనులుగీర్తింప - నయశాలి శ్రీమదన్నారెడ్డికంశ - సింధుశశాంకుడౌ శ్రీరామచంద్రు - పొందుగారక్షించుభువివాల మేటి - నాగకంకణు గ్రిష్ణవదలంచుచును - యాగవాటముజేర నరుదెంచె నప్పడూ॥ ఞెండియు నెట్లనినా.

(కాంబోదిరాగము - ఆదితాళము.)

రాజువచ్చెనూ, జనక। రాజువచ్చెనూ॥రాజరాజాశ్రితకల్ప।భూజాయని భూజనులుబొగడ॥రాజు॥౧॥ శంఖదుందుభికాహళ। సంకులంబులాలయవార।పంకజపాణులయాట।పాటలధాటుల, గొలువ॥రాజు॥౨॥



శీలుమనమునస్తగుణ। జాలుడీభూపాలుడనుచూ। బాలగా వేలుపులమింట। పూలవానగురియగాను॥ రాజు॥ ౩॥ భాసిల్లుశ్రీవాలమేటి। పట్టడేసుడైనగగన। కేశు:ధ్యానించుచును। రేశునవైభవముమించి॥ రాజువచ్చెనూ॥ ౪॥

వ॥ ఇట్లరుగుదెంచి భృత్యునింగాంచి। ఓకిశేపక శిఖామణీ.

క॥ యాగమునకుభోగమునకు। త్యాగమునకునుయోగ్యమగుపదార్థములెల్లన్। బాగుగజాగ్రతజేసితి। వేగునసిద్ధివేగదెల్పువిశదముగాగన్

భృత్యునిమాట - క॥ ఔరతేమిలేక నన్నియు। బరిపూర్ణముగా తయారుపరపించియుంటి। వరవారికోలువునకు। జనగావచ్చితిని యుద్ధిజనమందారా॥ హేమహారాజా.

వ॥ అనినంబరితుష్టహృదయుండై యాజకసహాయుంబుగా యజ్ఞశాలం బ్రవేశించి నిత్యక్రమంబున యజ్ఞకృత్యం బత్యంతశ్రద్ధాభక్తుల నిర్వర్తించి కృతకృత్యుండై మొడియు నిండోలగంబున గొలువుంకి జనకుండు శతానందునకిట్లనియె. ఓమహాత్మా.

సీ॥ వినవయ్యగుణువరామనధరాపుత్రికి బరిణయప్రాయంబుప్రాప్తమాయె। మగధమాళవమత్స్యమనకయాళనేపాళ పాంచాలసింధుబర్బరమరాట। కర్ణాటలాటకొంకణఘూర్జరాదిదేశాధిపులమితసాహసబలాఢ్యు। లెల్లపౌరుషమునవేతెంచి: డులించ లేరైరిహరువిల్లులేశమైన। యివినేజేయునట్టి ప్రతిజ్ఞ నీర్పు।వానలింకేవ్వరిందురాన్రైదేశ। కాలదేహప్రమాణముల్గడుచుచున్న। దేమియోచనసేయుదమిద్ధచరితా॥

(పున్నాగరాగము - అటతాళము.)

ఇకనిందుకేమియోచింతుసూ, నే। నీనెపంబెటులభరింతుమా॥ ౧॥ ఎవరికరపరానిపంతమూ, జేసి। తేమనవచ్చునాస్వాంతమూ॥ ఆమాటదుల్కగదోచెనాటికీ, నగు। బాటులామెనుగదానేటికీ॥ ౩॥ కార్యసాధకుడిలజిక్కునా, మౌని। వర్యవాకికపరువుదక్కునా॥ ౪॥ వాలమేటీశ్వరుడీతపా, దయ। మాలినట్లున్నదినామెడా॥ ౫॥

వ॥ అనివగచు జగదీశునకు శతానందుండిట్లనియె.

క॥ ఇదుకుయాలోచించే । డెందుకు దైవానుకూలమెట్లున్నదో
యా । చందంబుననగురాజవు । రందరి తథ్యంబువిడువరాదెన్నటికిన్॥

వ॥ కావున మనసీతాకళ్యాణంబతిశీఘ్రకాలంబున దటస్థంబుగా గలదు రాజపుంగవా నీమనంబున నెంతమాత్రంబు వికల్పంబు జెందనీక సత్యసంకల్పంబున కభిముఖుండవై తదనుగుణ్యంబైన యీశ్వరానుగ్రహంబు గోరుచుండుమా యనిబల్కు సమయంబున.

## దాశరథులు విశ్వామిత్రుంగూడి మిథిలానగరంబు జేరుట.

క॥ అతులోత్సాహంబునముని। పతియుతులై నృపతిసుతులుబరువడి
గ్రతుభుక్। ప్రతతినతి శేయజనక। క్షితిపతిపురిజొచ్చిరచటిచెలువలు మెచ్చన్

వ॥ ఇవ్విధంబున రాజమార్గంబునం జనుచు శ్రీరామునకు లక్ష్మణుం డిట్లనియె॥ హేఅన్నయ్యా.

(ముఖారిరాగము - ఆదితాళము.)

చూడవేడుకైయున్నాదీ। జనకునీపురము ॥ చూడ ॥ చూడవేడుకై నదిజూడు రామన్న యీాడు । జోడుతేనిబంగారుగోడలమేడలమరీ ॥ చూడ॥ ౧॥ చాలుదీరినమందిరాలు పటికంపుసోపా । నాలుపచ్చలతోరణాలులీలజేలుచు॥ చూడ॥ ౨॥ గములుగూడినమాతంగములువడిగల్గుతురంగములు మొదలైనరాజాంగములు హంగుచెలంగీ॥ చూడ॥ ౩॥ సిరిమించువాలమేటిపురి మేరుధరునికరుణ । స్థిరమై పరిహాసితశక్రపురమై సుందరమై యహహా। చూడ॥ ౪॥

(రామవాక్యము.)

ఓరితమ్ముడా —— గీ॥ ఈపురంబిలభోగవతీపురంబు। గోపురంబు సుయులయులకాపురంబు । ఏపుమాపుచునిందిరాకాపురంబు। యనజెలంగెడు తమ్ముడాకనులకిపుడు॥



వ॥ అనియనేకవిధంబులం బురవిలాసంబున కానందించు రామలక్ష్మణులంగలసి మహోల్లాసంబున సభాసదనంబు జేరవచ్చు కౌశికుని గొంతదూరంబున నవలోకించి॥

గీ॥ వందిమాగధజనులుకైవారమొనర । జేయమంగళవాద్యము లెలగిమోయ । గురుసమేతంబుగా రాజుకొలువువెడలి । ముదముదీపింపమునికిదానెదురుజనియె॥

వ॥ ఇట్లెదురుజని కృతాంజలిపుటుండై విదేహుండు విశ్వామిత్రున కిట్లనియె॥ ఓతాపసోత్తమా.

క॥ వందనము యోగిచంద్రా। వందనమణిమాదికాష్టవరగుణసాం
ద్రా। పొందుగమీదర్శనమున। సందియములుడిందెవాంఛసఫలము జెందెన్॥

(ముని వాక్యము.)

క॥ విలసితలక్ష్మీకరము । స్తులలితసంపత్కరోస్తుసుమనోవాం
ఛా। ఫలసిద్ధిరస్తుసవనా। మలవ్రతపరిపూర్ణమస్తు మనుజాధీశా॥

(రాజువాక్యము.)

గీ॥ ఇందుమీరువచ్చివందుననాజన్మ। పావనంబు బురముపావనం
బు । యజ్ఞపావనంబు నన్వయపావనం। బైతరించగలిగెనమలచరితా॥

(ముని వాక్యము.)

గీ॥ కొదువలేలగల్గు త్రిదశేంద్రవైభవ । సువ్రతుడవు సద్యశోధను
డవు । కలుషరహితుడవు ఘనపుణ్యుడవు నీకు । శశికులప్రదీపజనకభూప ॥

(రాజువాక్యము.)

గీ॥ స్వామిమీబోటివారివిశ్వాసముననును । గాదెమాబోటివారికి
కలిమిబలిమి । గలిగిసతతంబుసౌఖ్యసంగతులమనుట । యనుచుమువ్వుర
గొనితెచ్చెతనదుసభకు॥

వ॥ ఇట్లుదోడ్కొనివచ్చి తత్తదర్హపీఠంబుల నాసీనులం జేసి కౌశికానుమతిం దానొకకనకసింహాసనాసీనుండై నభోమధ్యంబునం బ్రకాశించు ప్రభాకరసుధాకరులుంబోలె సకలరాజసభామధ్యంబున వెలుంగుచున్న రాజపుత్రుల నేత్రోత్సవంబుగానవలోకించి జనకుండు తనమనంబున॥

(*) జనకుండు రామలక్ష్మణుల వర్ణించుట. (*)

గీ॥ భళిరశతకోటిమదనులబరిహసించు । సుందరాకారుడీరాజసుతుడుపుడమి । నితనిగన్నట్టివారిసుకృతముబొగడ । దరమె మునిచం ద్ర రామునందంబునకును॥

వ॥ అని యివ్విధంబున బ్రహ్మానుసంధానంబు సేయు యోగీంద్రుని చందంబున దశస్యందననందనాననారవిందంబునం జూపులుబొందుపరచి వసుంధరారమణుండు వేడియు॥

[దేశియ్యతోడిరాగము - ఆదితాళము.]

ఎవరో వీరలుపవిమలాకారులూ - భువనమోహితులు । బుధసన్నుతులునై॥ ఎవరో॥ ౧॥ మారకోటిశృంగారులుబహుసుకు । మారులుసంగరధీరులుశూరులూ॥ ఎవరో॥ ౨॥ అనుపమమణిమయహార భూషితులు । దినకరపావకతేజవిరాజితు॥ లెవరో॥ ౩॥ నీలఘనారుణనిర్మలవర్ణులు । వాలమేటిపురిపాలహితోన్నతు॥ లెవరో॥ ౪॥

ద్వి॥ ఎంతచక్కనివార లీరాచకొమరు - లింతటివారినే నిన్నడుగాన - బ్రహ్మతోవాదించిసరసుడీమాని. సృష్టికి బతిసృష్టి జేసెనుతొల్లి - యసివినియుండుముయటువలెనిపట - నొనరగానొక్కటనిందుఁబ్రసేంద్రులతను - బ్రతిగనిర్మించెనొభానుచంద్రులకు - బ్రతియొనూరునకిలబ్రతిమారులొక్కొ - గాకున్ననింతశృంగారంబురాజ - లోకంబునందునారూఢిగాగలదె - పగవారిచిత్తమేమరిమెత్తురెయ్య - వగలాడులగుయూడవారనసేంత - ఇద్దరుడ్డరొద్దరిలోన - పెద్దయాతనిరీవిపెద్దదైయుండు - నితనికివాకూతునిచ్చివాయింట - కుతుకంబుననునిల్పుకొనెదుభాగ్యంబు - గలుగునోయన్నిలగలుగుదువృత్తిన - వెలయజేసిన యవివేకినైనను - గాధినాతుమిత్రుడన్నారెడ్డింపంశ - కలశసాగరచంద్రుఘనరామచంద్రు - వాలించువాల్మేటిపమేశ్వరుండు - యేలీలసేయునో యెరుగంగరాదు॥

వ॥ అని వెండియు॥



(తోడిరాగము - రూపకతాళము.)

వేలజేసితిప్రతిజ్ఞ । ఎట్టులౌనోయీశ్వరాజ్ఞ॥ యే॥ బాలకుడగినట్టివాడీ । బాలుడైననేమిఫలము॥ యేల॥ ౧॥ ఈశానుశరాసనంబునితడెక్కిడజాలకున్న । భాసురాంగునకునీకేటుల - బంపనామనసొప్పునుహా॥ యేల॥ ౨॥ చాలించగవగునెశౌర్ది - జనపాలురునవ్వుపోరె । జాలిమాలిజెందెమనసు - సందేహమేలాగుదీరు॥ యేల॥ ౩॥ ఆలోచనయేమిదోచ - దాయెకాలాతీతమాయె । వాలమేటిమీననేత్రి - లోలుడేమిదలచినాడో॥ యే॥ ౪॥

వ॥ అనిదలచి విశ్వామిత్రుంగాంచి జనకుండిట్లనియె॥

(*) సంవాదందరువు. (*)

[మోహనరాగము - అటతాళము.]

మునిశేఖరాయీబాలకులూ, ఏ । జననాథవంశదీపకులూ॥ ఘనులుసుందరతనులు యులకంతునిజయంతునిమించినారీ । యనఘచరితుల నామములునేవినవలెను వాక్రుచ్చుముత్తరీ॥ ముని॥ ౧॥

(విశ్వామిత్రునివాక్యము.)

రాజశేఖరవినుమీఘనులూ, దశ । రథమహారాజనందనులూ॥ ద్విజవ్రజప్రియులరపావకతేజులతులగు॥ ణాన్వితులువి । భ్రాజమోహనవిగ్రహులు శ్రీరామలక్ష్మణులనెడువారలు॥ రాజ॥ ౨॥

(జనకునివాక్యము.)

సరసిజపత్రలోచనులూ, బాహు । శౌర్యులుపాప్తయౌవనులూ॥ శరశరాసనధరులురిపుభీకరులురువీరలిటే నిమిత్తము । విరివిగాపదచారులైమీవెంటవచ్చిరితెలియబలుకుము॥ ముని॥ ౩॥

(విశ్వామిత్రవాక్యము.)

యజ్ఞసంరక్షణకేనూ, వీరి । నర్థిదోడ్కొనితెచ్చినానూ॥ ప్రజ్ఞచేవాల్మేటిపురిసర్వజ్ఞుడెన్నమహాహవంబున । నజ్ఞులగురక్కసులదునిమిమదధ్వరము పొంగముగబ్రోచిరి॥ రాజ॥ ౪॥ వ॥ మరియును॥

**కౌసికుండు విదేహునకు శ్రీరాముని వృత్తాంతము దెలుపుట.**

ద్వి॥ వినుమహీపాలకా వివరంబుగాను - ఇనవంశభవుఁడు మహేంద్రవైభవుఁడు - స్థిరయశశ్శాలిపంక్తిస్యందనుండు - యనుపదివేలేఁడుల సహాయశక్తి - ధాత్రినేలుచుసంతానంబులేక - పుత్రకామేష్టిపొల్పుగ నాచరించి - నలువురుకొడుకులనతగుణోన్నతుల - లలితుల శ్రీరామలక్ష్మణభరత - శత్రుఘ్నులను మహాసౌందర్యదివ్య - గాత్రుల గాంచిసౌఖ్యంబు వహించె - వారిక గ్రజుఁడనివార్యవిక్రముఁడు । శ్రీరామభద్రుఁడీచిత్తజాకారు - డితని రెండవతమ్ముఁడీలక్ష్మణుండు - ప్రతిపక్షభేదనోపాయసాధకుఁడు - చారుసువర్ణభూషణభూషితాంగు - లీరాజపుత్రంబులింపుదలిర్ప - ననుగూడివచ్చుటన్నారెడ్డివంశ-జననాంబునిధిపూర్ణచంద్రుఁడౌరామ-చంద్రునేల్వాల్మేటీశర్వసాక్షిగను-రేంద్రవైభవదెల్పుడింపుగావినుమూ॥

(జనకవాక్యము.)

గీ॥ భళిభళినేటివరకుయీపంక్తిరధుని । కిట్టిసంతతికలిగెనేఇష్టిసఫల । మాయెనేచాలసంతోషమాయెనాటి । గౌరవంబెల్లవింటిమి కలుషహానా॥ వ॥ ఇదియునుంగాక.

గీ॥ ప్రేమచెదానుగనుగొన్నబిడ్డలనుమ । హాత్మమనసొప్పితానెట్టులనిచెఘోర । కాననములకుమీవెంటతన్నోవిభుండు । తేటగాదెల్పుమయ్యసందియముదీరా॥ అనినవినీ.

(విశ్వామిత్రుని వాక్యము.)

ఉ॥ నీచులుదుష్టచిత్తులువినింద్యచరిత్రులు పాపవర్తనుల్ । ఖేచరకంటకుల్ఖలులుకృత్రిములుఙ్వికృతాంగులైనమా । రీచసుబాహులక్షైవిపరీతపురక్కసిమూకగూడిపె । ల్లేచుదురెల్లతాపసులనేమని జెప్పుదు రాజశేఖరా॥ ఇదియునుంగాకా.

క॥ వ్రతములుజపములుదపములు । క్రతువులుమొదలైనసుకృతకార్యములుమహిపా । ధ్ధతిభంగపరుచుచుందురు । క్షితివరబ్రతిలేదు వారజేయుతెఱఁతిక్షిగ॥ అట్లగుటవలనా-



గీ॥ వారివారించువారలెవ్వారులేమి । మానిరెల్లసునిష్టలు మౌనివరులు । పూనిదశరాత్రమనుమఖంబేనొనర్ప । గాబ్రయత్నంబుజేసిరాతుసులగెలువా॥ ఓయిజనకభూపాలా.

వ॥ ఈపార్థివకులవర్ధనుండుసమర్థుండగుననిదలంచి నేనయోధ్యకుంజని దశరథునివేడిన నితండతనయుసుమతిననుజునింగలసి బాణకృపాణతూణీగాదిసాధనధరుండై మత్పిరుందవరుదెంచి ఘోరారణ్యంబునందాటకయనుదుష్టరక్కసి నాక్కకోలంజకాటడి మదీయ్యతపోవనంబుబ్రవేశించి పుణ్యజనబాధితులగుపుణ్యజనులనగణ్యప్రావీణ్యంబునంబరిమార్చి నాయజ్ఞంబునిర్విఘ్నంబుగారక్షించి సిద్ధాశ్రమంబులుజూడనపేక్షించి క్రమక్రమంబున గౌతమాశ్రమంబునకేతెంచి యందుబతిశాపవశంబున ననేకహాయనంబులురాయియైబడియున్న యహల్యాదేవినైల్యంబు సాకల్యంబుగానివారించి భువనమోహనాకారంబునదొల్లింటికంటే మిన్నయైయున్నయావన్నెలాడి నతులతపోనిర్ధూతపాతకవ్రాతుండైన గౌతమునింజేర్చి పురాణదంపతులగువారలపీడుకొల్పి నృపపురందరా భవన్మందిరంబునందరతరంబుగాబెంపొందు ఇందుధరునికోదండంబుసందర్శించుకుతూహలంబున దశస్యందననందనుండిందు వేంచేసె ననినవినిబరమానందహృదయుండై యహల్యానందనుండైన శతానందుండుగాధినందనునకిట్లనియె॥

**గాధేయుండు శతానందునకు అహల్యాదేవికుశలంబు దెలుపుట.**

(దరువు - సురటరాగము - అటతాళము.)

సమధికసుగుణాకరా । వందనమువి । శ్వామిత్రమునిశేఖరా॥ అమలమానసనీదయారస। మమృతతుల్యంబైరహించెను॥ సమధి॥ ౧॥ మనుకులేశునిదెచ్చియస్మ। జ్జననికలుషముబాపితివిభళి॥ సమధి॥ ౨॥ నేటివరకీలాటిచల్లని। మాటనాచెవినాటవింటెని॥ సమధి॥ ౩ ॥ వాలమేటీశ్వరుని వలెమా। పాలవెలసి। శుభంబొనర్చితి॥సమధి॥౪॥ — ఓమునీంద్రా.

గీ॥ రామదేవుని శ్రీపాదరజమువలన । గౌతముని శాపదుర్గతిగడచి మరల । గౌతమునిగూడె నాయన్నగన్నతల్లి । సంశయముదీరశలవిమ్ము సంయమీంద్రా॥

(కౌసికవాక్యము.)

గీ॥ ఘనుడు జమదగ్నిరేణుకన్గలసిలట్లు । కాంక్షితుండైనకై వడిగౌతముండ । హల్యతోగూడినిత్యసుఖానుభూతి । ననుభవించుటకై వేడ్కనరిగెననఘా॥

(శతానందునివాక్యము.)

క॥ జననీజనకులకుశలము । వినుటయురవివంశభవులవీక్షించుటయుఁ । మునిపుంగవమీకృపనే । ఘనుపుగ్రాప్తించెనేకృతార్థుడనైతిఁ॥

వ॥ అనిపలికి - శ్రీరామభద్రునింగనుంగొని॥

గీ॥ దినకరకులేశనీవనుతెప్పవలన । దాటిరాపత్పయోధి నాతల్లిదండ్రులు । తెలమివారలసంయోగమిపుడుదెలసి । నిందువేడుకనేనుధన్యుండనైతి॥

(శ్రీరామవాక్యము.)

క॥ ధీవరసీతలిదండ్రులు । పావనులువినిర్మలప్రభావులుబుధసంభావితులై క్షేమంబున । శ్రీవిలసిలజనిరిదపముసేయయశేచ్ఛన్॥

(శతానందునివాక్యము.)

క॥ శ్రీమద్విశ్వామిత్రమహామునిపరిపాలితుండవగునీకెపుడున్ । క్షేమంబగుభూమీశ్వర । సామాన్యముగాదుదెలుపసంయమిమహిమల్॥

వ॥ అనిగౌతమసుతుండు గాధిసుతునిప్రభావంబుగ్గడించుచుండె నటయాంతఃపురంబునా॥

[*] సీతాదేవికథాప్రారంభము. [*]

(సీతాదేవివచ్చుట.)

ద్వి॥ చిన్నారిపొన్నారిచెలువవయ్యారి - కన్నెశృంగారిచకోరనిశాకుమారి - మరుపుమిటారికామునిచేకటారి - మరువంపుమొలకకోమలి పల్కుచిలుక - జాళువాబొమ్మగొజ్జగిపూలరెమ్మ - బాలేందువదనశోభనగుణసదన - మాణిక్యములదొంతిమల్లెపూబంతి - చానాశిరోమణి సైకతశ్రోణి - యకలంకవిజ్ఞాతయవనిసంభూత - సకలభాగ్యోపేతసమధికఖ్యాతకలుషనిర్ధూతజగన్మాతసీత॥ కలహంసయానబంగరుమేడలోన - నెలబాలుమమరినయింతులెల్లెడల - బలుదెరంగులబాలబరిచర్యసలుప - నుపమాపరహితసౌఖ్యోన్నతిగాంచి - యపరంజిబొమ్మగుటుయ్యాలబవ్వళించి - కడుచిత్రమగురెక్కలగాంచియాలికి - పడిమేలుకాంచివిభ్రమమువహించి - తత్తరంబునలేచితనమేనునరచి - కొత్తమరుల్ బుట్టిగుట్టుపోనెట్టి - ననలోత్రిశ్రీమదన్నారెడ్డివంశ - వనధిసుధాంశుడౌవరరామచంద్రు - శిరిమించపాలించుశ్రీవాలమేటి - పురిచౌకన్నాధునిసొప్పుగమదినెంచి - చెలికత్తెగువారిచేసన్నజేరి - కలతీరుదలపోయకంజాక్షివెడలె॥

వ॥ ఇట్లువెడలివచ్చుధాత్రీపుత్రికిసూత్రధారియిట్లనియె॥

క॥ తియ్యనిపలుకులుబల్కుచు । నెయ్యంబునవచ్చితిటకనీవెవ్వరో ముద్దుకియ్యాసలుతేటపరచుచు । వయ్యానతెరదీరవమ్మచక్కెరబొమ్మా॥

[సీతాదేవివాక్యము.]

[సౌరాష్ట్రరాగము - ఆదితాళము.]

కొమ్మరోజనకునిముద్దు । కూతురనైనట్టిదానా । నమ్మలారా॥ పైడీ బొమ్మలారా॥ ౧॥ మందయానానేభూదేవి । యందుబుట్టినట్టిపట్టి॥ నమ్మలారా । పైడీ, బొమ్మలారా॥ ౨॥ నాతీరొకవన్నెల్లవారు । సీతాయనిబిలతురేవో॥ యమ్మలారా । పైడీ, బొమ్మలారా॥ ౩॥ నమ్మతాంగివెండ్లిగానీ । కన్నెనై నేనున్నదానా॥ నమ్మలారా । పైడీ, బొమ్మలారా॥ ౪॥ సరసీజాక్షివాలమేటి । శ్వానికరుణాగోరియున్నా॥ నమ్మలారా । పైడీ, బొమ్మలారా॥ ౫॥

వ॥ అనిమరియునిట్లనియె॥

సీ॥ సఖులారోవినవెమజ్జనకుండుజనకుండు యాగంబుజేయుబ్రయత్నుడగుచు । నవనిదున్నించహలాగ్రంబునసుసొక్క మణిమయంబగుహేమమంజసంబు । యట్టిమంజసలోననావిర్భవించితి బోల్పారనేనుభూపుత్రినగుచు । ననుదెచ్చిగారాబమునబెంచివారువిల్లు ఖండించుఘనునకీకనిత్తు । ననుచుప్పంతంబుజేసిస్వయంవరంబు । జాటియున్నాడునారవేర్పేటిమొవరో । సారసదళాక్షినేనెల్లసౌఖ్యనుయు - మెలగుచుండుదుబంగారుమెడలోనా॥

అనిపల్కినపిమ్మట

సూత్రధారి-క॥ కాంతాలలామసీవిపు । డంతఃపురివిడచివచ్చుట రయగనేమో । వింతాయెదెల్పునీవ్వ । త్త్రాంతముసాంగముగసభికులందరువినగ॥

(సీతవాక్యము.)

గీ॥ అకటబంగారుటూగుటుయ్యాలలోన । బహుసుఖాస్పదమైన పూబాన్పుమీద । చెన్నుగా రాత్రిపవళించికన్నుగూర్కి । నంతలోనెంత చిత్రంబులాయెనమ్మా॥

(చెలికత్తెమాట.)

వ॥ అదియేమి చిత్రమమ్మా ముద్దులగుమ్మా॥

(సీతవాక్యము.)

సీ॥ శ్యామలాంబుదనిభచ్ఛాయదేహమువాడు చండమయూఖతేజంబువాడు । పరిపూర్ణచంద్రబింబవిభాననమువాడు రాజీవపత్రనేత్రములవాడు । ఆజానులంబిబాహాద్వయి గలవాడు డంబైనపీనవక్షంబువాడు । యేవరప్రాయంబునివ్వటిల్లెడువాడు। దర్పకకోటిసుందరమువాడు। సరసుడగువాడుమందహాసంబువాడు।రసికుడైనట్టివాడొకరాచవాడు। కొమ్మ నామానధనమెల్లగొనినయట్లు । కలవలంబుననొకకలగంటిగదవే॥

## ─(*)సీతాదేవి విరహము.(*)─

(నాదనామక్రియరాగము-ఆదితాళము.)

కలకంఠీకలగంటినమ్మా । గ్రక్కునమేల్కొంటినమ్మా॥ కలనిక్కమైదోచెనమ్మా । కల్లగాదెముద్దుగుమ్మా॥ కల॥ ౧॥ చెప్పనసిగ్గయ్యీనమ్మా । చెప్పకదాచలేనమ్మా । గుప్పుగుప్పునమదిలో । గుబ్బతిల్లెనే శోకమ్మా॥కల॥ ౨॥ అక్కటచక్కనివాడమ్మా।పక్కలోకూర్చుండెనమ్మా। చెక్కిలినొక్కి ముద్దాడి। చిక్కకమరపించెనమ్మా॥కల॥ ౩॥ ఏమేమో జేసినాడమ్మా। ఏమారించిపోయెనమ్మా। నామాటనిజమువాల్మేటి। ధామునితోడేవోశమ్మా॥ కలకంఠి॥ ౪॥

(చెలికత్తెమాట)

క॥ మగనినెడబాసినిగులున । వగజెందెడుచిగురుబోణివలెవిరహాగ్నిన్। బాగలెదవుసాటిబోటులు।నగనౌనాడుముగ్ధలనీకమ్మకుమమా॥



(సీతవాక్యము.)

ద్వి॥ మదగజయానయూమర్మమౌమాట - పదుగురువిన్నసభాసయేనిజము - యనువుగానీవుచిన్నప్పటినుండి - చనువైనయాంతర్యశాలివిగనుక - గుట్టురామదిదాచుకోలేకనిట్లు- దిట్టతనంబునదెలుపగావలసె- నంగనామణివినవమ్మనేరాత్రి- బంగరుయ్యాలలోపలపవ్వళించి - సఖియలతోడముచ్చట్లాడుకొనుచు - సుఖముగావాకసుసుప్తిజెందినను- మాని నీపిదపమైమరచినేనుండ - గావంతలోనచక్కని రాజొకండు - బలుఠీకుగావచ్చిపక్కలోజేరి - వెలదిరోచోటియ్యవే కొంచమనుచు - బాయక నాచెంతపవళించిమంచి - మాయలమాటలమదిసిగ్గుబాపి - వుక్కటవిడెమిచ్చిపూలుకీల్జెడను - చిక్కగాజుట్టిమచ్చికముద్దుబెట్టి - తొడతొడగదియించితోరంపుచనులు - కడకనొత్తుచువేడ్కకౌగిటపదిమి- మోహంబు బురికొల్పి ముచ్చటల్నెరపి - సాహసంబుననమైసఖియయేమేమొ- జేసెనోయమ్మనేజెల్లపిగ్గొల్ల - బాసియేమందునగ్బాసి తానరిగె - చెలియయన్నాగడ్డిశ్రీరామచంద్రుడు- నిలనేలువాలమేటీశునితోడె. కలలోనగన్న సంగతినిజంబయ్యో - పలుమాటలేలనే పంకేరుహాక్షి॥

(చెలికత్తెమాట.)

గీ॥ కలనుగన్నయట్టివలపులుమలుమారు । దలచుకొన్ననేమిఫలముగలదు । వసుమతీకుమారిపసితనమేగాని। హానివృద్ధితెలియదమ్మనీకు॥

(సీత - కందార్ధములు-రేగుప్తి-ఆది.)

పసిదానిమాటలనుచున్ । వసవసగాజూడవలదు । వనితామణియా । రసికసిఖామణిజిక్కెన। కసిదీరగబట్టిజెడను।గట్టనా॥ నాతనువుకానక । బెట్టనా॥ మట్టుమీరినాగుట్టుజెరచినీ । వెట్టుబోదువనిగట్టిగజడనుగట్టనా॥ ౧॥

ఓకీరవాణి.

రాకొమరునిచేసోకిన । కోకస్తనిమేనుబొంగిగుబ్బలుబికియున్ । శోకమ్ముడివదలిచ్చెదరేయు । చీకాకైరవికెముడి, చిట్లెనే । చెప్పకదాచే । దెట్లనే। [illegible]మోవిపలుగాట్లుక్షతంబుల। గోట్లగాట్లు జిగ్గోల్లై బెట్లు, చిట్లెనే ॥ ౨॥

ఓమందయానా.

పలుమాటలేలనతనికి । చెలిమిని నావిభునిగాగ జేకూర్చిన । చిల్కా
లకొలికి నాయొసంగెదను । గలసొమ్ములుంచమిత్తు, కామినీ। మత్తమరాళ
గామినీ। ప్రేమమీర నేమేమో జేసియు । నేమూరించెటులేగాని గద నా
కామినీ॥ ౩॥

(చెలికత్తెవాక్యము.)

క॥ వనబోణినీమనసిజాంతకు । ధనువునుగనవచ్చినట్టి ధాత్రీశులు
। నను శీకలలో వచ్చిన । ఘనునింబోడగాంచి నత్తుగలగకుమమ్మా॥

వ॥ అని యీ విధంబున నిలాపుత్రితో చెలికత్తెలు కుసమయంబున

—[*ఎరుకలసాని కథాప్రారంభము.*]—

ద్వి॥ సిరిమించుమువ్వంచుచీరనుగట్టి - తెరగొప్పజంటికుచ్చులకై కొ
ప్పుడిగ - సంకుటుంగరలుపచ్చరాయి చుక్కబొట్టు - కంకణాల్ దంతపుకమ్మ
లు చిలుక - తాళియు నాణిముత్యాలసరాలు - జాళువానిదు కెంపుజారు
ముక్కెరయు - పక్కపూబుగడలు బలుగవ్వపేర్లు - లక్కపట్టెలును నీలంపు
గాజులును - పగడాలచాకట్లు పాలపూసలును - సొగసుగుల్కెడు పయి
డి సొమ్ములు బెట్టి - రతిపతికుసుమమార్గణముకై వడిని - యతులితంబగు
మోహనాకారమమర - పూసిశిరంబునబుట్టిసి బెట్టి - కూననొక్కనిపయి
కొంగునగట్టి - గరితయన్నారెడ్డిఘన రామచంద్రు - ధర నేలువాని
మేటిధాముని దలచి - యెరుకెరుకో యవ్వ - ఎరుకో యటంచు - ఎరుకల
సాని దానేతెంచెనపుడు॥ మరియు నేలాగనినా—

(దర్వు-ఆరభి- త్రిపుట.)

వచ్చె నెరుకలసానిపురిగల । మచ్చకంటులుతన్ను గనుగొని । మె
చ్చనచ్చరపోలిక మచ్చిక। లెచ్చమచ్చటలాడుచూ॥ వచ్చె నెరుకలసానిహా॥
౧॥ తీరుగలయుపరంజిజిగిబంగారుబొమ్మను । గేరుచక్కని। సారుగులెక్క
డుమేనికాంతులు చాల థళథళమెరయగా॥ వచ్చె॥ ౨॥ ఎరుకవెరుకో ఎరుక
యని హెచ్చరిక సేయుచువాలమేటి । శ్వరుని శశిశేఖరుని గిరిజా। వరునిమ
లుమరుదలచుచూ॥ వచ్చె నెరుక। ల॥ ౩॥

వ॥ ఇట్లు వచ్చిన కొరవంజి మంజులవాణి కోకకుంజరయాన యిట్లనియె॥

క॥ కులమేతీరయినదో మీ । కులదైవంబెవరో నాయకుని పేరేమో॥
స్థలమేదో దిరిగినతా । వుల వేవో జెప్పగదవె యొప్పగ సింగీ॥



(సింగిమాట.)

[ఆరభి రాగము—ఆదితాళము.]

ఎరుకలసాని నేనోయమ్మా, కోరి। యెరుక జేసేటిదాననమ్మా॥ ప॥
కొల్లాపురమునుండి కొమ్మా, నేను। మెల్లిగా సిందువస్తినమ్మా॥ అ॥ ఎంక
టేసుడు పైడిబొమ్మా॥ ఇల, మేలు పైనమ్ము నేలునమ్మా॥ ౧॥ మా కొలమేలు
వుదయనమ్మా॥ ఎల్ల, లోకము సంచరింతుమమ్మా॥ ౨॥ మేలువాడయి యుండు
నోయమ్మా॥ వాల, మేటిశంకరుడు ముద్దుగుమ్మా। ౩॥ అని వెండియు॥

ద్వి॥ అక్కరో మీరువన్నడిగినమాట - చక్కగా జెప్పెదసడిలేక వినుడి-
కులదేవత కుప్రము కొరవంజి బుట్టి - తలబెట్టి లోకమంతయు జూడదలచి-
తిరుతుగా నే వెండికొండకు బోయి - అద్భుతైన సోదెగౌరమ్మకు జెప్పి - మూ
డువోసిళ్లాణిముత్యాలు కొన్ని - పైడిసొమ్ములు చాల బహుమతిగొంటి - వె
న్నుని ప్రోలికి వెసనేగి కడలి - కన్నియకెరుకతార్కాణగా జెప్పి - తల
గలనగలు నిద్దంపుచాకట్లు - చిలుకతాళియు ప్రీతి చేదీసికొంటి - పలనా
ప్పబొమ్మ దేవరవీటికరిగి - పలుకువెలందికి బాగుగా నెరుక - జెప్పి ముత్తె
పుపేర్లు చేకంకణాలు - మెప్పుగా గైకొంటి మెలత స్వర్గమున - నింద్రుని
రాణికి నెరుకనే జెప్పి - చంద్రహారంబు పచ్చలపతకంబు - లాలించి గొంటి
నేలావేయుబలుక - లోలాక్షి పదునాల్గులోకంబులందు - సొరది నేజూ
డనిచోట్లులేవు - శిరుణినన్నారెడ్డి శ్రీరామచంద్రు - నభయుని గా నేలు
పట్టిమాత్మేటి - యథవుండుమాకు సహాయుడైయుండు॥

వ॥ అవ్వోళయవ్వా ఇదియునుంగాక అంగ వంగ కళింగ కాస్మీ
ర కాంభోజ కర్నాట కరహాట మరాట మగధ మాళవ మత్స్య మళయా
ళ కుకురు కొంకణ టెంకణ ఘర్జర బాహ్లీక బంగాళ నేపాళ చోళ
గౌళ సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదర్భ ఘూర్జర కేకయ కోసల కుం
తల అవంతి కిరాత ఓడ్య శూరసేనాది యాబదియారు దేశంబులును దిరి
గినానే దుండీ, యాయా దేశంబులంగలుగు మహారాజుల సంస్థానంబులు
జూచినానేయవ్వా, అట్టి సంస్థానంబులగల మెరుగుబోడుల మనంబుల కొర
తలుదీర ఎరుక చెప్పినారా సామీ॥

వ॥ అనిబలికి- రాజమార్గంబునఁ బోవుచుకొరవంజి యిట్లనియె.

[దర్వు- సౌరాష్ట్రరాగము - ఆదితాళము.]

ఎరుకో యెరుకో యెరుకో। నా। ఎరుకవినరారో యమ్మా। ఎరుకమర్త్యులను ఎరుకపరచునె। వ్యర్థకైనుసద్గురుకీలకమిది ॥ ఎరుకో॥ ౧॥ సులక్ష్యముగు యలక్షుషుమ్నాంతమున। విలక్షణంబగు వెలుగు దెలుపగల॥ఎరుకో॥ ౨॥ మూడుమూర్తులకుమూలంబై పై। మేడనున్న యలమేటిసూటిగను॥ఎరు ౩॥ వామదేవుడగువాలమేటిపురి। ధాముని పరమపదం బెరుగందగు॥ ఎరు॥ ౩॥

వ॥ అనిబలుకుచు పురవీధులందిరుగు కొరవంజిసుందరీమణి అందచందంబుల కచ్చెరువందుచు కొందరిందుముఖులు చెచ్చెరంజని వసుంధరాపుత్రికతో నిట్లనిరి॥ అమ్మయ్యా.

క॥ తరుణీమనపురమునకొక। యెరుకతయరుదెంచితరుణులెదగల కోర్కుల్।గురుతుగ దెలుపుచునున్నది। తెరగొప్పగనిటకుబిలచి తెత్తుమటమ్మా॥

(సీతవాక్యము.)

(దరువు- కళ్యాణిరాగము - అటతాళము.)

ఇటుబిలచికొనిరావమ్మా। యెరుకులసాని నిటు ॥ ఇటుబిలచికొనిరా రేయిందీవరాక్షి, ఈ। మటుమాయలేమో నెమ్మది దెలసుకుందాము॥ ఇటు॥ ౧॥ కలలోనగన్నసంగతి తార్కాణము గాను। తెలియజెప్పినాక లతదీర్చును గాని॥ ఇటు॥ ౨॥ నిలజాల నామనసుకలిజల్లినట్లుంది। లలనామణిరో యింకాలస్యము సేయక॥ ఇటు॥ ౩॥ మదగజయానశ్రీమన్వాలమేటీశు। మదిలోన నెంచినామక్షువదీరగ। నిటుబిలచి॥ ౪॥

వ॥ అనిబల్కినచెలికత్తెలరిగి ఎరుకతతో నిట్లనిరి॥

క॥ ఓయెరుకలసింగిభూ। నాయకువరపుత్రితనదునగరికినినుదా। నీమెడదోడుకరవ్మనె। నేయెరుకదుగంగగోరెనే రాగదవే॥

వ॥ అనిబిలచితెచ్చినదైవజ్ఞురాలి వైఖరికిమెచ్చుకొనుచు జానకిదేవియిట్లనియె॥ ఓహో యెరుకలసాని॥



[కాంభోదిరాగము - అటతాళము.]

రామరో నీదుపేరేమొ నీయూరిపే। రేమొనీమొగనిపేరేమొజెప్పగదే॥౧॥ నీసవతులెందరే నీబిడ్డలెందరే। వాసిగానినుగన్నవారెందున్నారే॥ ౨॥ మగువరో నీయుత్తమామలేమాత్రమే। తగమీరుదిగియుండేతావులెక్కడనే॥ ౩॥ తోడబుట్టినవారు తోడికోడండ్లునీ। యాడుబిడ్డలు వెందరది జెప్పగదవే॥ ౪॥ వగలాడియాడదో మొగవాడో యీపాప। మొగినిన్నుజూడగాముచ్చటాయగదే॥౫॥ కలగన్నరాజు మొక్కట్లునీ మొక్కట్లు। కలికి చూడగనొకటిగానున్నదేమే॥౬॥ వరవాలమేటిశంకరుడు మేలనగనీ। వెరుకజెప్పినతావు లెరింగింపగదవే॥౭॥

వ॥ అనినముసిముసినగవులునగుచు నయ్యెరుకత యిట్లనియె.

(దర్వు - ఆరభిరాగము - ఆదితాళము.)

చిన్నారీతొలుతనునీవన్నదేనాపేరే। నీ, వన్నదేనాపేరే॥ ౧॥
పూరూరుదిరుగువారికొకపూరెక్కడిదే। వారి, కొకపూరెక్కడిదే॥ ౨॥
మెనిమిటిపేరడిగితీవి పెండ్లిగాలేదే।ఇంకా, పెండ్లిగాలేదే॥ ౩॥
పువ్వుబోణీ సవతులెవ్వారూ లేరే। సవతు, లెవ్వరులేరే॥ ౪॥
తలిదండ్రులునుముగ్గురుతమ్ములున్నారే। ముగురు, తమ్ములున్నారే॥ ౫॥
ఆడుబిడ్డలుతోడకోడండ్లులేరే। తోడి, కోడండ్లులేరే॥ ౬॥
సకియామొగవేలుపుల। సానినౌదూనే। వేల్పు, సానినౌదూనే॥ ౭॥
నరులూగొలుతురే।నను దేవరమూసినను చూ।నను, దేవరమూసినను చూ॥౮॥
వాలమేటీశుడు నావాడైయున్నాడే। చెలినా, వాడైయున్నాడే॥ ౯॥

వ॥ అవోళదుండీనేనెరుకజెప్పినచోటు లెరుగించెదవినుము పరబ్రహ్మనిర్మితంబును పంచభూతాత్మికంబును చరాచరజంతుసంతానమయంబును నగుబ్రహ్మాండంబున భూలోక, భువలోక, సువలోక, మహాలోక, జనోలోక, తపోలోక, సత్యలోకంబులనెడు వూర్ధ్వలోకంబులేడును, అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళంబులను యధోలోకంబులేడును. నీయుభయలోకంబులుంగలశిరాశికి పదునాలుగు [illegible]కంబులయ్యెంగావున॥

(సౌరాష్ట్ర - రుచుపజంపె.)

యీరేడులోకములలోనా, నెందునా। కెరుకలేనిదిలేదుచానా. ౧॥
మొగముజూచినయంతలోనా. కోర్కెజె। ప్పగగలనుమెవ్వారికైనా॥ ౨॥
జ్ఞానహీనులకుదుష్కరమూ। నమ్ముసు, జ్ఞానులకుకొంగుబంగరమూ॥ ౩॥
ఘనులునన్నెరుగుదురుగానీ। సామాన్య, జనులెరుగలేరెందుబూనీ॥ ౪॥
మాటలికవేయాడనేలా। ననువాల, మేటీశుడెరుగునేబాలా॥ ౫॥

(*) కొరవంజి సీతాదేవికి ఎరుకజెప్పుట. (*)

ద్వి॥ సెంతరొాఇనివెల్లనేజెప్పనేల - సలలితంబుగనాడుసాంగత్యమైన - తరువాతనీదుచిత్తమునకేజెలుసు - సొరదిముందటిపనిస్ఫూడగావలయు - చేడెరోముత్యాలుచేటతోదేమె-యీడకురామెచెయ్యీయెకూకోమె - ఎరుకలబుట్టికిసెలమిముమ్మారు - గురుతుగామొక్కేసుకో - యెమాటినవె-శ్రీరాజగోపాళసెసాచలేశ - యీరేశఇగనేశఏదగిరీశ - గౌరమ్మగంగమ్మకనకవల్లెమ్మ - మారెమ్మబారతీమదిరాలసత్తి - గజలచ్మిదురగాంబకంచికామాచ్చి - అజిసీమహాంకాళియొభద్రకాళి - మెయిగంగ్లనల్లికామేటిరంగేశ - కయిళాషవాసయోకాళహస్తీశ - వరదరాజాకాశవాణిబూదేవి - సిరిగిరినాదకాశీవిశాలాచ్చి - కూనలమ్మొబయ్యకొల్లాపురమ్మ - మీనాచ్చితాయివాత్మేటిపురీశ - వేయువిదాలనేమేడెదమిమ్ము। నీమెడమంచివాకియ్యారేమీరూ॥

వ॥ అనిదేవతలందలంచి సీతాజేవి వామహస్తంబుచేబూని మెరుకలసాసిఇట్లనియె. ఆవోళదుళదుండే.

క॥ గడ్డముసూపివపురుసుడు। దొడ్డుగశెవికమ్మసూప। తొయ్యలియగుమా। రొడ్డకయాలించవెయో। బొడ్డిసైదోడుయగునెబుజముసూపినన్॥

వ॥ ఓళదుండే గడ్డాముసూఫితే మొంఘోడు ఖమ్మసూఫితే అడధిబుఝాలుసూఫితే తోధబుట్టినోండ్లె॥

గీ॥ కడుపుసాయుసూపకలికిసంతానమా। చాలనాసలుసూపబాసికంబు। నాతిఎంకలేసుడేతిరంమణిసూప। నడ్డబొట్టుసూపనయ్యగారే



వ॥ ఓళదుండే కధుపుసూఫితే సంనథానము నొష్టసూఫితే బాసిఖము ధిరుమణిసూఫితే సీయెంకలేసుడు అడ్డబొట్టుసూపితే అయ్యోరుగాదంటేమఢీ॥ ఓళఓళఓళసానే.

క॥ జందెలుసూపినసూ ప్రతి। బందాలందిందుసుట్టుపక్కలుద్రిప్పన్। సుందరియువికొలలగునీ। సందియములుమానిమాటసక్కగవినవే॥

వ॥ ఓళదుండె జందెలుసూఫితే పతిబుదాలు అఖ్కడిఖ్కడసూఫితే ఖోలలు యీగురుధులఫఖారం సూఫేనిగనిసెప్పేదినవేని యుమాన్ఖూతరా॥

(సీతవాక్యం.)

అదియెట్లానో చక్కగాచెప్పకరావే ఎరుకలసానీ.

(ఎరుకతమాట.)

(అరభిరాగము - ఆదితాళము.)

ధరణీసుత వినవే నేవివరించెదనా। యెరుకమహిమ గనవే॥
గురుతరమగుయొకమేలుకార్యమును గోరిసఫలమో విఫలమోయనుచు। పరితపించెదవువలదువలదుఇక। సరగునవదికొనసాగుబాగుగను॥ ధర॥ ౧॥

వ॥ అవ్వోళసానె అదియెట్లంటేని. నిన్నటిరేయి చక్కని మొగవాడొక్కడు పక్కలోజేరి చెక్కిలినొక్కి పెక్కువిధంబుల బిక్కటిల్లు వినోదంబులసొక్కించి చిక్కిదక్కకటక్కరజేసి తొలగిపోయినటుల కలగని మేలుకొని బాయనివిరహంబున వానినేనాయకునిగాగోరి యీకోరికెకాయానోపండవునోయని యడిగితివిగావున॥

(దర్వు.)

కలగాదచిబాలా। అనుభవమునిజముకా। గలదనుమానమేలా॥ నెలతనీవువలచినట్టివాడే। నిన్నువలచివచ్చియున్నవాడే। ఇలణీపుట్టుకమంచిదిచెలువుని। నేలగలవుపట్టపురాణివగచు॥ ధరణీ॥ ౨॥

వ॥ అవ్వోళదుండే నీవుకోరియున్నవన్నెకాడు నీలమువంటివర్ణముగలవాడునిన్నెగోరివదోయీమూలనుండివచ్చియున్నాడుఅతడేనిన్నుపెండ్లియాడు నీసంకల్పంబుచేకూడు నీమనోవిచారంబువీడు నాయెరుకమహిమచూడు విదియుంగాక.

(దరువు.)

ఒకసంగతికోరకూ। శంకించెందవదిఎందుకు రేపిదివరకూ। ప్రకటితమగునిచిక్కులన్నియును। చాపివాలమేటీశ్వరుసాక్షిగ। శుకవాణిరోనిను జేకొనికవటా। యకనేలంగలడకడుముదంబున। ధరణీసుతవినవే॥ ౩॥

వ॥ ఓభామా ఒకటిఅడ్డపడియున్నదని దొడ్డవిచారంబునం దలపోయుచున్నావు ఆదియేమిటికి రేపటికి నీతలపునంగలచిక్కునివారించి నీయయ్యనుమెప్పించినిన్నువరించి మెల్లనిసరసల్లాపంబుల మల్లెపూలపాన్పునేమారక నిన్నుంగలశి నీవల్లభుండుల్లాసంబున భోగించు మరియునూ.

గీ॥ అత్తమామలు మరుదులుఅయిదువయును। జోడుకోడుకులు కొరలేనిచుట్టములును। జగములేలంగజాలినమొగడుగలిగి। ఎల్లకాలంబు సుఖియింతువేమిశారీ॥

వ॥ అవ్వోళధుండీ నీహస్తంబు పరిచ్ఛించినందు కులచ్ఛంబుసెప్పెద ఇనుము. వుత్తములైన యుత్తమామలుగలరు సరసులైనముగ్గురుమరుదులుగలరు, కలకాలంబైదువరేఖగలదు, అవడకోడుకులగనేపంతము గలదు, లెక్కలేనిచుట్టాలుగలరు, మగండులోకాలోకంబులకెల్ల పట్టభద్రుండు-నీజన్మంబుసార్థకంబైయుండునిందుకూ॥

గీ॥ కొమ్మఎల్లమ్మకొల్లాపురమ్మసాచ్చి। సంకబురకనిసాచ్చి సీమంకమ్మ। సాచ్చిజోతమ్మబూమమ్మసాచ్చి। కల్లలాడనావాకునమ్ము మేలౌనుసీకూ॥

వ॥ ఓళదుండే నాకొలదైవాలసాచ్చిగా నామాటబద్ధంబుగాదు శిద్ధంబుగా ఒండే-రెండే-మూడే-నాలుగే అయిదే- అయిదంటే అయిదు ఏండ్లుగావు- అయిదునెలలుగావు-అయిదువారాలుగావు-అయిదుదినాలు నాటికి నీకుకళ్యాణమౌతుందే దుండీ- నోసటబాసికముగట్టేవేదుండీ॥

సంధి-వ॥ అనినసుప్పొంగుచుదివ్యాంబరాభరణంబులు-బహుమానంబుగాదెప్పించినంగని, ఎరుకతముసిముసినగవుల వసుధాపుత్రికిట్లనియె

గీ॥ సీతనీవుపెండ్లికూతురవై తేనె। చాలునింకసొమ్ము తేలనాకు నీదుసొమ్మునీవునెమ్మినాసొమ్ము। గాదెమరువకింకమీదునన్నూ॥



వ॥ ఓళదుండే-నేనేసీసొమ్ము- సీవేనాసొమ్ము-పెడ్లికూతురవై నీవు మెచ్చినదేచాలు-నింకనీవిచ్చేబహుమానంబేల-నిదోపోయివచ్చెద దయుంచు- మనిబలికిఎరుకతజనిన జనకనందనివిస్మయంబున-సఖీమణులకిట్లనియె.

[పంతువరాళిరాగము- జుల్వతాళము.]

వింటిరవే కాంతలార। వింతఎరుకలసానిమాట॥ వింటి॥ కంటికి మింటికిసొక్కటి। గాసూత్రముబన్నెనుభళి॥ వింటి॥ ౧॥ మదిగలసంగతులు దెలుపు మానవులెవ్వారుగలరు। ఇదిఏమోమాయగనున్నది యోచనశేయగభళి॥ వింటి॥ ౨॥ అట్టెమాడచూడముచ్చటామె చక్కదనముచెయ్యిబట్టినంతలోనెమేనుపరవశమాయగదేభళి॥ వింటి॥ ౩॥ మెచ్చినదేచాలు ననుచుయిచ్చినబహుమతినొల్లక। చెచ్చెరజనేవాలమేటిశివుని దలంచుచు నహాభళి॥ వింటిరవే॥ ౪॥

వ॥ అనిసీతాదేవి కొరవంజి మంజుళవాణి చాతుర్యంబునెచ్చెలులతో దలపోయుచుండెనటసభాస్థానంబునకౌసికుండువిదేహునకిట్లనియె.

(*)జనకకౌసిక సంవాదము(*)

ఓయిరాజా-క॥ రాజాధిరాజులాశా। రాజులుగీర్తింపరామలక్ష్ములలరగ। రాజాదెప్పింపుముయుడు। రాజకళాశేఖరుని శరాసనమిటకున్॥

(జనకునివాక్యం.)

[కందార్థము - రేగుప్తి.]

హరికలశజలధినిలయము। సరగునజాలించిజగతిజనపాలకుడై। పురహరునిచాపమెత్తను। మరిచెల్లినచెల్లుగాకా॥ మనుజమాత్రులకూ। ఇంతటిపని, జనునె శేయుటకూ॥ ఘనులింద్రాదులచేతగాదికుమారులో। మునిచంద్రయీయాశలనుజెందఫలమేమీ॥ మనుజ॥ ౧.

[విశ్వామిత్రుని కందార్థము.]

నీమాటనిజమెయైనను। కామారిశరాసనంబుగనువేడుకనే। డీమహాత్ముల కోదవెను భూమీశ్వరసంశయింప। బోలదుయికనూ॥ చాలులకోక్యే-॥ గేలిశేయుకనూ॥ కాలకంఠుని కార్ముకంబుశీఘ్రంబున మాకిమిదెప్పింపుమాయాలోచనశేయు॥ బోలదు॥ ౨॥

రాజుమాట - గీ॥ గాధినందనమీయాజ్ఞ కరణిఘోరి। బలుల బెక్కం
డ్రని త్తరిబనిచి రాజ। శేఖరులసన్నిధికి రాజశేఖరునికి। రాసనంబును దెప్పిం
తు భాసురముగా॥ వ॥ అనిబలికి భృత్యులంగాంచి॥

క॥ నిటలాక్షుధనువు దేవతే। పటుతరభుజసత్త్వులగు శిపాయిదళం
బుల్। తటుకువరప్పింపుముచి। స్ఫుటచిత్తులవింకతడవుబోలదు భృత్యా॥

వ॥ అనిన రాజాజ్ఞ గొనిచని భృత్యుండు జీరిరా.

గీ॥ ఘోరరూపములును కోరమీసంబులు। స్థూలకాయములు విశాలవ
క్షములును గొప్ప కనులుగల శిపాయిదళంబు। వెడలివచ్చె రాజవిభునికడకు.




తోహరా॥ శ్రీశివశివశంభోశంకరగౌరీశ వినుతలోకేశా। ఆశాపా
శవినాశనవరకైలాసవాససర్వేశా॥ ౧॥ కాలకంఠకాకోలాశనలోకాల
వాలపురవైరీ। శూలాయుధధరవ్యాళవరాభరణాలంకృతపాదవారీ॥ ౨॥
మేరుశరాసనపారావారగభీరాశ్రిత మందారా। వారణదనుజవిదార
ణదురితనివారణసత్యవిచారా॥ ౩॥ చిత్రానలచక్షుత్రాధీశ్వర నేత్రతామల
చారిత్రా। ధాత్రీరథహరిమిత్రామరసుస్తోత్రాంచిత సత్పాత్రా॥ ౪॥
గజముఖజనకాంగజమదసంహరగజచర్మాంబరధారీ। కుజనదమనభక్త
జనావనఘనరజితాచలసంచారీ॥ ౫॥

వ॥ అనిబల్కుచువచ్చి రాజుంగాంచి ఇట్లనిరి.

క॥ మ్రొక్కెదముగుణసమాజా। మ్రొక్కెదమిదె యాచకప్రముఖ
సురభూజా। మ్రొక్కెదమవనిపభోజా। మ్రొక్కెదమో రాజరాజ
ముఖరవితేజా॥ హేమహాప్రభో.

క॥ కొలువుండియునుమ్మిత్తరి। వలనొప్పగబిలువనంపువైనం బేమో।
తెలవిమ్మెపనియైనను। దలగకచులకనగజేశెదము రాజేంద్రా॥

(రాజువాక్యము.)

గీ॥ వీరవిక్రములైరిదు వేలమంది। సంగునను బోయిత్రిపురభంజను
నివిల్లు। యుల్లసిల్లెడుమందసంబొప్పగాను। కొలువుకూటంబుజేర్చగావ
లయునిపుడూ॥ అనిసంజెలరేగి॥



(తోహరా.)

అండపిండబ్రహ్మాండనాయకా ఖండకోటిరవితేజా। ఛండవైరిభుజ
దండఖండనోద్దండభక్తసురభూజా ॥ ౧ ॥ దక్షమఖాంతక యక్షరాజసఖ
దాక్షాయణీలోలా। అక్షరరూపమహోక్షధ్వజఫాలాక్షాక్షీణకృపా
లా॥ ౨॥ శరధినిషంగాశరమదభంగాశరణాగతజనపోషా। కరుణాకర
హరహరపరమేశ్వరనిరుపమసురుచిరవేషా॥ ౩ ॥ నిత్యనిరంజనప్రత్యగా
త్మనిజభృత్యపాలనమహేశా। మృత్యుంజయమదదైత్యవిలయజయ। సత్య
సంధభూతేశా॥ ౪ ॥ అంబికాంగనాత్మాంబుజభాస్కరబింబహిమాకర
మౌళీ। అంబరకేశాశాంబరకంఠాలంబితదివ్యకపాలీ॥ ౫॥

వ॥ అనిస్మరహరునిస్మరణశేయుచుంజని చని.

శిపాయులీశ్వరునిధనస్సు రాజ
సభకు దెచ్చియుంచుట.

సీ॥ అత్యాయుతంబులో హామయంబువిదితాష్టచక్రంబుఘంటికా
శతయుతంబు। కాలమేఘాభంబు గ్రావసంకాశంబునైనట్టి శంభుశరాస
నంబు। గలమందసముపాలకడలి ఘధింపమున్నమరాసురులుమందరాగమే
త్తి। దెచ్చినపోల్కి ధాత్రీపతికింకరుల్ వీరవిక్రములైదువేలమంది। భీకరం
బునతమతమపేరువాడి। యందరొకపరిశరములయందుజేర్చి। హరవ
రాయనిగొనితెచ్చిరవనినాథు। నిండుకొలువునకహితులగుండెలగల॥

(తోహరా.)

పంచభూతమయపంచాక్షరమంత్రాంచితతత్త్వాధీనా। పంచాన
నభవసంచితహాసనప్రపంచమయాత్మనిధానా॥ ౧ ॥ సాదాచారవిశారద
ప్రణవాకారసదాగమమూలా। నారాయణశరఘోరాంధకహరనార
దగానవిలోలా॥ ౨॥ శాంతరూపకాద్యంతరహితముని చింతితసచిదానం
దా। అంతకాంత కాత్యంతశివంకర సంతతహిత గోవిందా ॥ ౩ ॥
పుణ్యజనావనపుణ్యాపుణ్యాగణ్యఫలదప్రావీణ్యా। పుణ్యపురుషసాద్గుణ్య
సుబ్రహ్మణ్యాశ్రాంతశరణ్యా॥ ౪॥ సుస్థిరభువనప్రశస్తవాలమేటిసా
నియ్యానివేశా। విస్తారదయావస్తనిరస్తార్యస్తుతమీనాక్షీశా॥ ౫॥

వ॥ అనియీవిధంబున కేవలశైవలంబోలె మహాకాలునిధనుర్దండ సంబుసభాస్త్రంబంజేర్చిచనిరంత విదేహుండు విశ్వామిత్రునకిట్లనియె॥

గీ॥ అనఘ కౌశికజూచితే ధనువుదీని । యత్తరాదు సగరుడోరగామరాది । ఖచరులకునైన బూనశక్యంబుగాదు । నరులకెంతనిప్పుడియత్నంబుగాక॥

ఓ మహానుభావా.

గీ॥ అయినకానిమ్ము నేనిట్టులాడనేల । ఘనపరాక్రమమేర్పడ కౌసలేయు। డీశరాసనమెక్కిడెనేని నాదు । కూరిసీతనికిత్తు సన్మానముగను॥

వ॥ అనిపలుకుచుండెనాసమయంబున॥

(శుకవాణికథ.)

సీ॥ హరినీలములబోలుకురులునున్నగదువ్వి । మెప్పుచేలెడు కీలుకొప్పమర్చి। చందమామనుగేరుసుందరాస్యంబునపొందుగాకుంకుమబొట్టుబెట్టి । కలువరేకులబోలుకలికివాల్గన్నుల కాటుకరేఖపొంకముగదీర్చి । మించుకాంతులమించుమెయినిండనవరత్నమిళితమౌపసిడి సొమ్ములుధరించి। నీటుమాటలుబల్కుచునేర్పుమించి । పత్తనస్త్రీలుతనుగాంచిపలువిధములు। మెచ్చుకొనగధరాపుత్రిమేడకపుడు । వచ్చెశుకవాణియనునొక వనజపాణి ॥

మరియు నేలాగనినా.

[మధ్యమావతిరాగము - ఆది.]

శుకవాణివచ్చెచూడరమ్మా । జానకీకడకూ॥ శుక ॥ ప్రకటితమగుయలమకరకేతనుడు । చికిలిజేయుసాయకమోయనగను ॥ శుక ॥ ౧॥ బాక్కమైనట్టినగలుబెట్టి। తులలేనియట్టి। సొగసుమైజారుచీరగట్టి । నిక్కువనుంగవపిక్కటిల్లగను। లక్కపూలమేల్రవికెధరించుక॥ శుక॥ ౨॥ కుముదబాంధవునిగేరునట్టి। జిగిమోమునకుం। కుంకుమబొట్టుపొంకముగబెట్టి। అమరకాంతలహాహాయిది బహుచిత్రం । దముగల్గిన సుందరియనిమెచ్చగ ॥ శుక॥ ౩॥ కరకంజములుముకుళించి। శ్రీవాలమెట్టి గౌరీసహాయునిదలంచి। విరివిగనంతఃపురమునగలభూ । వరపుత్రికిమేల్వార్తదెల్పుటకు॥ శుక॥ ౪॥

వ॥ ఇట్లువచ్చినమచ్చకంటికిసూత్రధారియిట్లనియె॥



క॥ ఎందుండియెందుబోయెద। విందీవరపత్రనేత్రియేమోనీ। పేరిందులగల్గుసభాసదు। లందరువినదెలుపవమ్మయళికులవేణీ॥

[శుకవాణిమాట.]

ద్వి॥ వినవమ్మయోకొమ్మవివరంబుగాను - వనితలోనిజనకభూపాలుపట్టంపు- దేవికెంగటికనుదినమువిధమున- బోవుచువచ్చుచుపూనాభిమాన- మెలమిసంపాదించిహితవువహించి- వలనొప్పగానాడవారిమర్మములు- దలపోయుకొనుచునూతనవిచిత్రములు - గలిగినయప్పుడేకడువేగమునను - తలిరుబోణిరవంతదాచకంతయును- దెలుపుచునుందుసందియమేమిలేక- నెందుకువేమాటలెల్లకాలంబు-నిందీవరాక్షినాకిదియెజీవనము- ఈపట్లనొకవార్తనెరిగింపబోదు- నాపేరుశుకవాణినాళీకపాణీ॥

వ॥ అనిపల్కి యంతఃపురంబునకరిగినశుకవాణింగాంచి జానకీదేవి యిట్లనియె ॥

క॥ రావమ్మాశుకవాణీ। రావమ్మఫణీంద్రవేణిరాకళ్యాణీ। రావే పులినశ్రోణీ। రావమ్మమృణాళపాణిరావిరిబోణీ॥

క॥ యేమోయికపనిబెట్టుక । నామేడకువచ్చినటులనామదిలోకె। క్షేమముననట్టిసంగతి। నామోదముమీరదెల్పవమ్మాకొమ్మా॥

వ॥ అనినసీతాంగనకుపౌరాంగనయిట్లనియె-

[జంఝూటిరాగము - ఆదితాళము]

సీతామణిరోవినవే। నేడొక ॥ చిత్రమగువార్తనీకుజెప్పగవచ్చితినింపూ॥ సీతా॥ నీకిందోపీదుడునిర్మలచరితుడు। వీతరాగుడగువిశ్వామిత్రుడు। ఖ్యాతిమీరా। సంప్రీతిదనరా। ధీవ్రాతమౌరాయున। మీతండ్రికొల్వుకూట మీతరిజేరవచ్చె॥ సీతా॥ ౧॥ ఆమునివెంటనుయనుజసహాయుడై। రాముడనెడుయొకరాజరుడొకడెను। కామాకారుడే - సంగ్రామధీరుడే । మ్యోమోద్దామశూరుడే। నేనేమనివర్ణింతునింతివానియందమిందు॥ సీతా- ౨॥ సందియమెందుకుసరిసాటిలేనివాడు। పొందుగఫాలమేటి। నందివాహనునితోడే। మందయానా- రాకేందువదనా। ఎందెందుకయినా। యీయిందీవరశ్యాముడే నీకుంకగులోలుడౌనమ్మా॥ సీతామణిరో.

(సీతవాక్యము)

గీ. గాథసునివిప్పుడాడినరాకుమారు। డెంతచక్కనివాడొవిన్నంత
లోనె। మేనుపులకించి మోహంబుమించెకనుల। జూడనెట్లౌనొగదవె
యోశోభనాంగి.

(శుకవాణిమాట.)

ద్వి॥ బాలామణీరామభద్రునిసాటి - బోలినవారలీపుడమిలో లేరు-
అళివేణికంతుజయంతవసంత- నలకూబరులకన్న నాణ్యమౌవాడు - కలికి
పావకసోమఖద్యోతులకును- తులదూగుదివ్యకాంతులుగలవాడు - తరుణి
సుమేరుమందరహిమాగముల- బురుడైనధైర్యమింపుగగల్గువాడు - మాన
వతీరాజమణియైనవాడు- చానరోమందహాసముఖంబువాడు- యణుమధ్య
యతసీసుమాంగంబువాడు- ఘనవేణిచారెడుకన్నులవాడు- భామినీయా
జానుబాహులవాడు- రామత్రిలోకాభిరాముడౌవాడు - స్వర్ణాంగిపీన
వక్షముగలవాడు- పూర్ణేందుముఖిమెగుభుజములవాడు-కుసుమకోమలి
పద్మకునిశహలాది- యసమానభద్రరేఖాంఘ్రులవాడు- ధరకుచాకోదం
డధరుడైనవాడు- వరమతీనూత్నయవ్వనమొప్పువాడు- మీనాక్షినూనూగు
మీసంబువాడు - జానకీసన్నెలజాలినవాడు - వాహువావేషేలవగలాడి
నుతులసాహసవితరణోత్సాహుడౌవాడు - యాశౌర్యమాధైర్యమా
మహిమాదార్య- మాశుభలక్షణంబతనికేదగును- సీతయున్నారెడ్డశ్రీరామ
చంద్ర- భూతలాధీశునిబ్రోచువాత్మేటి - చాకర్నాథుడుమెచ్చసుదతినీక
తడు. దక్కినజన్మసార్థకమౌనెకొమ్మా॥ ఇదియునుంగాకా॥

క॥ మననృపతివారికెదురుగ। జనిమన్ననజేసితెచ్చిసంతసమునన్।
జనపాలకసుతులెవ్వా। రనినకౌశికుడుదెల్పినదియట్లనినన్॥

వ॥ వీరలకజకులసంభూతులయోధ్యాపురంబేలు దశరధునితనూ
జులు రామలక్ష్మణులనువారలు మహాధీరులతిశూరులు పితృశాసనంబున
ధనుర్ధరులయి జనుదెంచి కలుషచిత్తులగుపలలాశనులనిలంగూల్చి మన్మ
ఖంబు సుఖంబుగాగడతేర్చి తరువాత శతానందునిమాతయగు యహ
ల్యాదేవి దుష్కృతంబంఘ్రిపరాగంబుననివారించి యనంతరంబున నీసం



తంబు సాంతంబుగానెంచవేర్చుటకువచ్చిరనివి శ్వామిత్రుండుబలిక-నమహీ
కాంతుండు సంతశిల్లియంధకారిచాపంబు సభాస్థలంబుజేర్పించియున్న
వాడు నేడావేడుకలెట్లుండునో సారణగండ్లంజేరి చూడందగు జోడుచేడి
యలంగూడుకొని రావమ్మాపల్లవాధరీ. అనినవిని మహామోహపరవశ
యై సీతామణి సఖీమణుల కిట్లనియే.

[పున్నాగరాగము - అటతాళము.]

రారే చెలియలారా। తడవేలను॥ రారే॥ రారమ్మసఖులారారా
జీవముఖులార! రారమ్మాశ్రీరఘురామునిజూతాము॥ రారే॥ ౧॥ దివిరియా
శుకవాణిచెలిపినపలుకులు। చెవులలోనమృతంబుజిలికినట్లున్నదీ॥ రారే॥ ౨॥
వనితామెందెందుజెందనినాదుమనసేమో। దిననాథకులదీపకునిజేరియు
న్నాదీ॥ రారే॥ ౩॥ ఎలనాగానాపూజాఫలమెట్టులున్నదో। ఇలవాలమేటి
గౌరీశునిదలచుచు॥ రారేచెలియలారా॥ ౪॥

వ॥ అనిసఖీసమేతంబుగాజనుదెంచి లక్ష్మణాగ్రజుని శుభలక్షణం
బులు గవాక్షిలోనీక్షించి యుత్సహించుసీతామణి శుకవాణికిట్లనియె.

(*) సీతాదేవిశ్రీరామునిజూచిమోహించుట. (*)

సీ॥ యీమహాసహుడటే యిందుబింబానన వనజాతహితవంశ
వర్ధనుండు। యీదివ్యతనుడటే పణాక్షిదశరథపృథివీతతేంద్రునిపెద్దకొ
డుకు। యీశుభాకరుడటే హేమాంగికౌశికాధ్వరరక్షణతాత్పరుం
డు। యీదయాపరుడటే యింతిరోగౌతమ మునిసతీశాపవిమోచనుండు।
యీనృపోత్తముడట వెఫణీంద్రవేణి। ఘోరదానవగర్వవిదారణుండు। యీ
సుచారిత్రుడట వేగజేంద్రయాన। సుప్రసన్నుండు రామచంద్రప్రభుండు.

వ॥ అని మోహావేశంబున నెండీయునిట్లనియే.

[యదుకులకాంభోదిరాగము - ఆదితాళము.]

కలలోవచ్చినామోహనాకారుడీతడేనమ్మా। ఓ, చెలియారోనా
భాగ్యమేమీజెప్పవచ్చునమ్మా॥ ౧॥ కనులకరువుదీరజూడగలిగెగదవె బా
లా। మనసుదీరగూడేదెప్పుడోమదనుఢాళియానా॥ ౨॥ చకోరనినారిలో

బహుచక్కనివాడమ్మా । దక్కితేచాలదేమేమితక్కువేయోశమ్మా ॥ ౩॥ పద్దుబూనీవానినినాయొద్దజేర్చరమ్మా। అద్దములోనిప్రతిబింబమటా నెముద్దుగుమ్మా॥౪॥ అతనునాకుజీవితేశుడైననీలవేణీ । ఇతివాక్యమేటికునవపూజలుజేయింతుశుకవాణీ॥

ద్వి॥ అనియిట్లుబలుకుచునద్ధరాతనయ - మనమునబొంగిపల్మరు రెప్పలిడక - మనుజేంద్రగణశిరోమణియైనవాని - ఘనరూపసౌందర్యఖనియైనవాని - దినకరశతకోటితేజంబువాని - దనుజభీకరధనుర్ధరుడైనవాని - పరిపూర్ణచంద్రబింబముఖంబువాని - సిరిఘరుకిళలల్లసిల్లెడువాని - సవినీలనీరదశ్యాముడౌవాని - శ్రవణాయతాబ్జలోచనములవాని - చెఱువారుబంగారుచేలంబువాని - సలలితరత్నభూషణములవాని - శృంగారరసమొల్లజిందెడువాని - నంగనాపంచసాయకుడైనవాని - రాముని లోకాభిరాముని సుగుణ - ధాముని బ్రణుతసుత్రాముని జూచి - తనస్వప్నఫలము చేతథ్యమాననుచు - కనులనానందాశ్రుకణములుజింద - బొంబారి నెమ్మేనపులకలుబొడమ - పరవశత్వముజెందిబాళిబెంపొంది - గ్రక్కున మోహసాగరమునదేలి - సొక్కుచునూర్పులిడిచిశుకవాణిజూచి - ప్రీతినన్నారెడ్డి శ్రీరామచంద్ర - ఖ్యాతిగాబ్రోచుశ్రీకరవాలమేటి - ప్రమథేశ్వరునివిల్లు బరికించివిస్మ - యమునవైదేహితానిట్లనిబలికె॥

(జుల్వ తాళము.)

ఏమనియోచింతునితనినెటువరింతుసఖియా। నామదినొకసందేహమునాకెగదేసఖియా॥౧॥ ఐదువేలమంది దెచ్చినట్టివిల్లుసఖియా। యీ దశరథతనయుండొకడెత్తెనెసఖియా॥ ౨॥ పూనెనలవిగానిపద్దు భూమీశుడుసఖియా। నేనోచిననోముఫలమెట్లౌనోగదెసఖియా॥ ౩॥ యీలలితుములోలుడైనన్నేలునెసఖియా। వాలమేటనిలయుండేటువలెదలచెనో సఖియా॥ ౪॥

(శుకవాణిమాట.)

క॥ బాలామణిసీతా। గేలావగజెదవు రాముడొల్లైనమహా। కాలుడనిలువిరచియుసిన్నేలిక। బెండ్లాడును మామముత్సాహమునన్॥



వ॥ అనినశుకవాణిపలుకులకలరుమనిలాపుత్రిసఖీసమేతయై కార్యానుకూలంబుగోరుచు నిరీక్షించియుండెనటకౌశికుండు రామునకిట్లనియె.

హేరఘునందనా. — గీ॥ శివునిచాపమిదియు శివుండసీకుసుంతయైన లేదుభేదమద్వయులుగ। దాకుమారఇంకదామసింపగనేల। నిన్నునీవెరింగి నెగడవలదె॥ ఇదియునుంగాక.

క॥ పోత్రీరూపంబునను। ధరిత్రీతలమెత్తినట్టిశ్రీహరివగునీ। కీత్రిపురఘ్నుడైన త్రిపురధనువే। మాత్రంబెత్తుటకు తృణసమానము గాకే॥ కావున.

గీ॥ రామనీబాహుశౌర్యమేర్పడగడంగి। నరులుసురలును మునులు భూవరులుజూడ। నీమహాధను వెవుననెక్కు బెట్టి। తివియుము నాలస్యమేల విదేహుడలరా॥

వ॥ అనినంగౌశికోపదేశంబున గించిన్మిలితాక్షుండై కౌసలేయుండు తనమనంబునా. (జుల్వ తాళము.)

ఓన్నమోసదాశివాయ। ఓంకారస్వరూపాయ॥ ఓన్నమో॥ పన్నగేంద్రభూషణాయ। పాపౌఘవిశోషణాయ॥ ఓన్నమో॥౧॥ శూలధర ౦ చితకరాయ। సూరిజనాభీష్టదాయ। కాలకూటాశనాయ। కనకాద్రిశరాసనాయ- ఓన్నమో॥ ౨॥ దుర్గాహృదయేశ్వరాయ। సర్గస్థితిలయకరాయ॥ నిర్గుణాయనిరుపమాయ। భర్గాయగిరీశ్వరాయ॥ ఓన్నమో॥ ౩॥ నాగచర్మాంబరాయ। నళినసాయకాంతకాయ। వాగీంద్రాదివినుతాయ। వాలమేటిపురీశాయ॥ ఓన్నమోసదా॥ ౪॥ అనిదలంచియంతటా.

సీ॥ అనుజుండుదానుచయ్యనలేచిగమకించి ప్రేమయుతమకంబు బెనగొనంగ। చెలగుచుతనమీదిచేలంబుసవరించి మొలనూలుబిగగట్టి మోహరమున। మంజులనవరత్నమాలికల్ బోరలాడ కర్ణకుండలదీప్తి ఘనత మెరయ। కరకంకణంబులుంగరములుశోభిల్ల దేహకాంతులుసర్వదిశలనోలయ। నిటలతటమునవలకలునటనమాడ। కోటిమన్మథలీలలు కొమరుమిగుల। నీటుగానిల్చిజనకభూనేతతోడ। దాటిగాబల్కెకౌసల్యాతనయుడపుడు॥

(కందార్ధములు.)

నరవరబహుళఘనమనిష। ల్కారుగొనియాడితివిధను వృషహీమనాకే
శక్ । యరయమిదితృణముపోల్కని। దిరముగ నే నెక్కు బెట్టిత్రుంచెదా
నీస్వాంతము మెప్పించెదా। భూపుత్రినివరించెదా॥ ఖిందుగధృతినివహించు
ముయనుమా। నించవలవదరనిమిషములో నే॥ ద్రుంచెదా॥ ౧॥

(కందార్ధము.)

విశ్వామిత్రమహాముని। విశ్వాసమువలనగలుగు విద్యాప్రౌఢిక్ ।
మహేశ్వరునివిల్లువిరచియు। శాశ్వతసత్కీర్తిగాంతు। చయ్యానా। ఖేచరులు
నరులూ। సైన్యావా। జయలక్ష్మికభయమియ్యానా॥ వెయ్యేలనుభవదియ్యా
శాబ్దివెను। తియ్యకనేసాధించెదజూడు॥ చయ్యావా॥ అనివిజృంభించి.

గీ॥ సంతసంబునతనచేతిసాధనంబు । తెల్లదమ్మునిచేతికందిచ్చి మే.
లు। మేలనివియచ్చరావళుల్ మెచ్చునట్టు। మట్టుమీరినసాహసంబుట్టిపడగ॥

(*)శ్రీరాముడుధనుర్భంగముచేయుట.(*)

(నాటరాగము - ఆదితాళము.)

రాఘవుడంతటనూ। సభగలరాజులు మెచ్చగనూ॥ లాఘవమున
నిటలలోచనునిసద। మోఘశరాసనమునుగదియగజనె॥ రాఘవు॥ ౧॥ పటు
తరముగమించి। బాహా, స్ఫాటనమొనరించి । కుటిలనిశాటులగుండెలవి
యపెట। పెటపెటమనిదిక్తటములగలశ్రీ॥ రాఘవు॥ ౨॥ మందసంబుదెర
చీ। గవిశన, యందోలగగద్రోచీ। మందేభంబరవిందముదెగలుచు। చం
దంబునకేలందినిలచె శ్రీ॥ రాఘవు॥ ౩॥ వాలమేటినగరా । ధీమని, వరచా
పంబారా। తూలమువలెనవలీలనెత్తెనీ। చాలుదెహరీయనివేలుపులెన్నగ॥
రాఘవుడంతటనూ॥ ౪॥ ఇట్లుచేకొని మోపెట్టి॥

గీ॥ తీవిగజ్యాణవార్తజూటించుదేవ । నారిమొరయించితెగనిండ
నారిదిగిచి । లస్తకస్తలవిన్యస్తహస్తమింత । సల్లపెళఫెళఫెళమంచువి
ల్లువిరిగె॥

వ॥ అట్టివిపరీతశబ్దంబునకు రామలక్ష్మణవిదేహవిశ్వామిత్రులుం
దక్కతక్కినసభాసదులదరిపడిమొదలుమరచిరివియనుంగాక॥



సీ॥ సర్వసర్వంసహాచక్రమల్లలనాడె । పెలుచకులాద్రులువెల్లగి
ల్లె। దిక్కుంజరంబులుదిమ్ములుగొనియుగ్గె। జలరాసులేదునుకలగబారె।
పటుగతిబ్రహ్మాండభాండంబులగలెను। విషధరాధీశుండువివశుడయ్యె । తో
డిబడిభాస్కరేందులగతిదప్పెను। జలజలరాలెనక్షత్రచయము । లభ్రము
లుదూలెదశదిశలావటిల్లె। పంచభూతంబులదరెప్రపంచమెల్ల । గోట్టువ
డెరామభూనాయకుండుజెలగి। హరధనుర్భంగమునుజేయునంతలోనా॥

గీ॥ సురలువిరులవానగురిశిరిశంఖదుం । దుభులరవముజెలగెనభ
మునందు। నాతిరప్సరసలుబాడిరిగంధర్వు। లమలమైసుఖానిలములువీచె॥

వ॥ అంతజనకమహీకాంతుండత్యంతసంతుష్టాంతరంగుండై రా
మభద్రునిగాఢాలింగనంబుజేసి యుప్పొంగుచునిట్లనియే॥

గీ॥ హరిహయప్రముఖసుధాంశులకైనశ । క్యంబుగానిమామక
ప్రతిజ్ఞ। నీకతమునదీరెనేగృతార్థుడనైతి। రఘుకులాబ్ధిచంద్ర రామచంద్రా॥

వ॥ అనిపల్కికౌశికుంజూచి ।

గీ॥ హరిహరాజపావకానిలచంద్రార్కు । లంబులాగమంబులవలన
భము। సాక్షిగాగ రామచంద్రునకతివేడ్క । సీతనిచ్చిపెండ్లిసేతుననఘ॥

వ॥ అనిబల్కుచుండెనట॥

ద్వి॥ అంతరాఘవశబ్దమాలించివేగ - నంతఃపురాంగనలాసీతక
నిరి- కలికివిన్నావెముక్కంటిచాపంబు - చెలగిరాఘవుడు ద్రుంచినమహా
ధ్వని- నీవాంఛలీడేరెనీదుజన్మంబు- పావనంబయ్యెసౌభాగ్యంబులమరె-
రాముడుమగడాయెరామాలలామ - సామాన్యమాపుణ్యసాధ్వివిగనుక-
గరితనీసత్యసంకల్పంబునకును- గురుతుగాబ్రహ్మనుకూలంబుగలిగె- తగు
రాఘవుడునీకుదగుదువునీవు- మగువరాఘవునకుమనయూర్మిళకును- ద
లక్ష్మణుండట్టిదాంపత్యమిలను- దగులుటెంతటిసుకృతంబనవచ్చు - నకట
య్యాయింతశీఘ్రబెబళౌచాలు- గ్రక్కునలెమ్మశృంగారించుకొమ్మ- విరి
దండచేకొమ్మవేడ్కచేరమ్మ - వరపూజసేయగావలయునుగాన- జన
కాజ్ఞమైనదాసరసునిజేరి - యనువైనమర్యాదలతిభక్తిదనర్చి - సేతువ

స్నారెడ్డి శ్రీరామచంద్రు- ఖ్యాతిగానేలు శ్రీకరవాలమేట - పురిపాలుదల
చుచుభూపతిసభకు- తరళాక్షిపోయివత్తముపదవమ్మా॥

వ॥ అనినవినిదిగ్గునలేచి ॥

(*)సీతాదేవివరపూజసేయవచ్చుట.(*)

సీ॥ అరవిరిమజ్జనంబనువుగానొనరించి। లలినిదుకూలచేలముధరించి। నగుమొగంబునమృగనాభితిల్కమదిద్ది । కనులకాటుకరేఖలొనరదీర్చి। నవముగాహరిచందనంబుమేననలంది। సన్నజాజులకీలుజడఘటించి। వెలలేనిభూషణావళులుశృంగారించి। నిలువుటద్దముజేరినీడగాంచి । యాటపాటలబోటులునీటుమించి। గొలువచెలికత్తెలూడిగంబులుఘటించ । లీలశుకవాణికెంగేలుకేలబూని। జానకీదేవిజనుదెంచెజనకుసభకు॥

(రేగుప్తి- ఆదితాళము.)

జానకీదేవివచ్చెనమ్మా। జనకునికడకూ ॥ జానకీ ॥ మానుగదివిగిన్యాణసతులుబహు। మానముగనుకుసుమములెగజల్లగ॥ జానకీ॥ ౧॥ కలహంసహొయలుగలయానమునా। మైకాంతులుమేల్। కళుకుకుందనపుతళుకిరా॥ కిలకిలమనుమొలచిలుకలపలుకుల । జిలజిలనమృతముజిలుకుచుకులుకుచు॥ జానకీ॥ ౨॥ సరిలేనియందముర్రాజిల్లా। నవరత్నఖచితా । భరణానులెల్లయుల్లాసిల్లా। గరిమెమెరుగుబంగరుబొంగరముల । సరిదనరినచిత్తరిచనులమురగ॥ జానకీ॥ ౩॥ అగణితమైనవేట్టమించి । శ్రీవాలమేటి। నగరాధీశునిమదిలోనెంచి॥ మృగధరుకళదెగడగదగుసొగసగు । జిగిమొగమునచిరినగవిగురొత్తగ॥ జానకీదేవివచ్చెనమ్మా॥౪॥

వ॥ ఇట్లువచ్చిజనకుంగాంచి॥

క॥ బాహుబ్భవాధిపశత్రు। వ్యూహభుజాగర్వవిదళితోద్దామబలాసోహాగ్రోసరుగ్గౌను। మోహిలిగాంతుయన్వయోద్భవశ్రీతిన్॥

(జనకవాక్యము.)

సీ॥ భోగభాగ్యములనుపూర్ణాయురారోగ్య । సౌఖ్యములనుగాంచిసంతతంబు । వరయశంబుదనరివర్ధిల్లవమ్మయో । జాజిపూలరెమ్మ జానకమ్మ॥ — అని వెండియు॥



(ఖమాస్- ఆదితాళము.)

చిన్నిసీతమ్మా। చిట్టిపట్టిరావమ్మా॥ చిన్ని ॥ కన్నతల్లినిన్నుప్రీతిగాంచిధన్యుడనైతి॥ చిన్ని॥ ౧॥ రాజీవనేత్రి। రమణీయచారిత్రి । నేజేసిసట్టిపద్దు। నెరవేరెనేయీప్రొద్దూ॥ చిన్ని ॥ ౨॥ కోరికలెల్లా। కొనసాగమదిరంజిల్లా। గౌరవముగొప్పాయె। శ్రీరాముడల్లుడాయె ॥ చిన్ని ॥ ౩॥ అళికులవేణీ। కలికీమృణాళపాణీ। వెలయుమాన్మోటిపురీ । నిలయునికరుణగోరీ॥ చిన్నిసీతమ్మా॥ ౪॥

గీ॥ అనుచుతనపుత్రికనుకౌగిటమరజేర్చి । శిరముమూరొనివద్దాడికరమునమర। తనువునివురుచుగొనితెచ్చిధారుణీశు। డమరగూర్చుండెసింహాసనమునప్రీతి॥ ఆసమయంబునా.

క॥ శ్రీదశరథరాట్తనయుడు। వైదేహీతనూవిలాస। వైఖరులెల్లన్మోదమునజూచిమోహప। యోదధిమగ్నుడయియుండెనుడుగనిప్రేమన్॥

అంతా — క ॥ రామునిరవివంశార్ణవ । సోమునిసర్వాంగదివ్యశుభలక్షణముల్। శ్రీమీరగాంచిజానకి । ప్రేమయులజ్జయునుభక్తిబెనగొనుచుండన్ ॥

ఉ॥ చివ్వునలేచిరామవిభు। చెంగటికిన్గదియంగబోయియూ। పువ్వులబోణిచెంగలువపువ్వులదండగళంబునందులే । నవ్వొలయంగవైచెను। ఘనంబగుమోహముమోదముల్మదిన్ । నివ్వటిలంగవేలుపులునెమ్మినిపువ్వులవానగుర్వగన్॥

వ॥ ఇట్లుపరిమితానురాగంబునవసుంధరాపుత్రిక వరపూజగావించి జనకుననుమతింగొని శుకవాణీప్రముఖసఖీసమేతంబుగానంతఃపురంబునకరిగి శ్రీరామచంద్రపదారవిందసమర్పితచిత్తయైయుండె నిటశతానందుండురాజేంద్రునకిట్లనియె॥

క॥ ఎందుకుతడవికనృపసం। క్రందనకళ్యాణమునకు । గ్రక్కునసప్తశ్రీ। స్యందనునింపొందగబిలు। వందగువారలను। బంపవలెశ్రీఘ్రముగాన్॥

వ॥ అనినవినిజనకుండుభృత్యునింగాంచి॥

క॥ బలువేగబోయిసేవిక। పొలుపుగపలుకూరిమెల్లుభొట్లగారినిం। దులగలసంగతులన్నియు। దెలియగవివరించి। దోడితెమ్ముభటాగా॥

వ॥ అనియుత్తరువొసంగివవినివాడతిత్వరితంబుగాబ్రాహ్మణశ్రేణికరిగి॥

గీ॥ మేదినీశ్వరుండుమిము దోడితెమ్మనె। నాలశింపగూడదయ్యామీకు। లొట్టైవిరిగినేశిలోబడెరండిప। లూరిఎల్లుభొట్లగారుమీరూ॥

వ॥ అనినన్నుల్లసిల్లి॥

(✻) ఎల్లుభొట్లకథా. (✻)

ఎన్నాళ్ళకెన్నాళ్ళకో। ఇంతమాట॥ యెన్నా॥ ఎన్నాళ్లకీరాజు నన్నుబిలపెంచుట॥ ఎన్నా॥౧॥ పేరావధాన్లాదీవూరిమిరాశిన। న్నూరకే తేరదురారమ్మనుపనేమొ॥ ఎన్నా॥ ౨॥ ఎల్లాకాలనుపొరుగూళ్ళోదెచ్చుక తిన్ని। వూళ్ళోవున్నందుకేమీమెల్లుభొట్లతోపని॥ ఎన్నా॥ ౩॥ ఈతని మోమాటము చేత నేనుండలేదు॥ సీతమ్మపెండ్లిజూగిశేతుయాత్రకుబోదు॥ ఎన్నా॥ ౪॥ పాత్రుగవాలమెటిపాలునిదయయుండె। ఏపాటివారికైన బాపలకేమికొదువ॥ ఎన్నాళ్ళ॥ ౫॥ అనిపలుకువెండియు.

సీ॥ మాచమ్మపురిటికైయాచించగానిచ్చె। పొరుగూరిలోనైదుపుట్లవడ్లు। నారాయణునియుపనయనమంచనిజెప్పి। కున్నందుకిచ్చెనేనూరు మాళ్లు। గంగాధరునిపెండ్లికార్యమంచడిగితే। వలశినయంతద్రవ్యంబొ సంగె। సుందరమ్మకుపునస్సంధానమన్నను। పట్టినఖర్చ్వదాబెట్టుకొనియె। నెప్పుడైననుపదునైమలిచ్చుచుండు। నింతకొకగుల్లకాసైననితనిసొమ్ము। బావుకున్నదిలేదుదాపరికమేమి। ఇంతమాత్రానకేమొగాయీబడాయీ॥

(భటునిమాట.)

గీ॥ భయముగోరంతలేకస్వభావమెల్ల। బయలుపరచుచునున్నా వుబయ[illegible]దేం। వచ్చితేనేసరేలేకనచ్చియున్న। బాపడానీవుయికబడే పాటుచూడూ॥ (విప్రవాక్యము.)

గీ॥ భూతలపతియభిమానము। చేతగదాపిల్లలాదిజీవించుటయుం। జేతపుషరాయోరీ। సీతంటాకోరుతనమునినువిడువదుగా॥



వ॥ అనిగాంభీర్యంబుగాబలుకుచు కుంభినీసురుండువచ్చెనెట్లనిన

(పంతువరాళి- ఆదితాళము.)

ఎల్లుభొట్లగారువచ్చిరి। వేవేగమున॥ ఎల్లు॥ ఎల్లుభొట్లగారువచ్చి రిల్లుబయలుజేరినది। నుల్లాసముమీరధాత్రీవల్లభునికొలువుజేర॥ ఎల్లు॥ ౧॥ పట్టంచుధోవతిపింజబెట్టికట్టియుత్తరియ్యా। మట్టైవల్లెవాటువేశిపట్టుశాల్వతలకుజుట్టి॥ ఎల్లు॥ ౨॥ ఎంతకాలమునకుశలవోయీ రాజుగారింటిలోన నింతకార్యమింతకుకొండంతలాభమానటంచు॥ ఎల్లు॥ ౩॥ చెవులపెద్దపోగులూరయ చేతులకడియాలుమెరయ। భువినివాలమేటిశివుని స్తవముజేయు చుచెచ్చేర॥ ఎల్లుభొట్లు॥ ౪॥ వ॥ ఇట్లువచ్చుచుండెనాసమయంబున॥

(✻) పేరావధానులకథా. (✻)

(మధ్యమావతిరాగము- అటతాళము.)

పౌరోహితుడనేనీవూరికీ। నాతో, పనులుగలవుమెల్లవారికీ॥౧॥ నాపేరూపేరావధానులూ। యే, బాపలునాకుసమానులూ॥ ౨॥ ఈవూరందరునాకేదాతలూ। తన, కెవ్వరులేరుదాయాదులూ॥ ౩॥ పంచాంగముచేతబూనుకా। శాస్త్ర, పద్ధతిజెల్పుదుమానకా॥ ౪॥ ఆజాయమంతటవస్తులూ। కొరవ, లేదింటిలోనిత్యాపస్తులూ॥ ౫॥ వచ్చితినొకవార్తవించునూ। నేడు,వాళ్ళోటీశునిదలచూకొంచునూ॥ ౬॥

వ॥ అనిఇట్లాయాసంబుగాపరువెత్తుచున్నధాత్రీసురునకుస్సూత్ర ధారియిట్లనియే॥

గీ॥ వెర్రిబట్టినట్లువెకరుసపడుచునే। డెందుబోయెదెవ్వరేమియ. నిరి। ముసలివాడనింతమూర్ఖణంబునీకేల। బలుకవయ్యావేగబాపనయ్యా॥

(విప్రునివాక్యము.)

[కాంబోదిరాగము- ఆదితాళము.]

ఎట్లబాయెరా। మెల్లుభొట్లూ। ఎట్ల॥ ఎట్లబాయెచూపరాతా కట్లమారిధగిడీకొడుకు॥ యెట్ల॥ ౧॥ వారైయైనేడింతపనికివచ్చినాదువా సీతల। పుత్రైబగిలేటట్లుమద్దు। కర్రతోగొట్టకవిడువా॥ నెట్ల॥ ౨॥ అట్టె[illegible]

ట్టబొడిచినయూడక్షరములులేనట్టిపా । పిష్టిరండాకొడుకునుగా కెట్టుబి లువనంపెనువా॥ డెట్లు॥ ౩ ॥ వుచ్చావుచ్చాలడిగినెత్తిబొచ్చూడగొట్టిపం పెదా । వొచ్చేదీరాసిమ్మునన్నువద్దనేవెధవా కొడుకెవరో ॥ యెట్లు॥ ౪॥ ఘాసిల్లుశ్రీవాలమేటివాసుదుభీయనగానామి । రాశిగ్రామమునకువీడుదై శీమాలీరావచ్చునా॥ యెట్లబాయెరా॥ ౫॥

[సూత్రధారిమాట.]

వ॥ అయి లేనీదేమిమునిగిపాయెను తొందరపడవద్దయ్యా అవధా నులవారూ॥

[పేరావధానులవాక్యము.]

వ॥ ఓరీఅష్టాగూశేవేమిరా జెప్టముండాకొడకా॥

[సూత్రధారీ]

వ॥ అదియెట్లానో జెప్పవయ్యా బాపడా॥

[భూసురునివాక్యము.]

సీ ॥ తిథివారనక్షత్రవిధి దెల్పుటకు నేను పుణ్యాహవాచనంబునకు నేను । పండుగలకు నేను పర్వంబులకు నేను । వరుసనబ్బందు చాకిరికి నేను మంత్రంబులకు నేను తంత్రంబులకు నేను। గజిబిజిరాకపోకలకు నేను। ఆలో చనకు నేను అంచజాబులకేను। అందుకు నేను అల్లందుకేను। యిన్నిటికి నేను బడియుండనీతడతని। నెట్లుబిలపించెవాడీడకెట్లువచ్చె। నుండినాపోయినా పేరుయుండవలెను। పరువుదీశెదరాజై తెభయమినాకూ॥

[సూత్రధారిమాటా.]

వ॥ బాపడా అట్లైతే మీతలపామమీజోళినాకేలపోవయ్యా॥

(బ్రాహ్మణునివాక్యము.)

గీ॥ నాకుబుట్టినాడొనాపాలిభాగరో। బుద్ధిలడొవానిపుటక జెడె నో। దోవమాలినట్టిదున్నలకొడుకుకు । నెట్లువచ్చె యెల్లుభొట్లపేరూ॥

వ॥ అని ఇట్లాఘూయిత్యంబుపతన్నుదూషించుచువచ్చుదున్న పేరా వధానులంగనిరోషంబున నెల్లిభొట్లుయిట్లనియె॥



(*)ఎల్లుభొట్లుపేరావధానులుపోట్లాడుట.(*)

(సంవాదము.)

(మధ్యమావతిరాగము · అటతాళము.)

దయ్యాముపలెవచ్చితలతికక్క కూతలు । గుయ్యాకుగావోరీపేరాయా॥౧॥

(పేరావధానులమాట )

ఓరీ ॥ ఎవడబ్బసొమ్మనియింత పనికివచ్చితివి జెప్పరా యోరీయెల్లాయా ॥ ౨॥

ఎ॥ ఓరీ॥ రాజుగారునన్నుగమ్మన్నవస్తినీ। నీజంభాలేమిరా పేరాయా॥ ౩॥

పే॥ఓరీ॥అతడు తెలివిహీనుడై నమ్మంచేనీవు । గతిమాలిరాదగునా యెల్లా॥

ఎ॥ ఓరీ॥ పలుగాకిమాటలుబల్తేవుని మెడ। నులిమెదచూడరా పేరాయా॥౫॥

పే॥ ఓరీ ॥ కొట్టిన నేవిడచిపెట్టనుపీజుట్టుబట్టియీడిచితోతూనెల్లాయా॥౬॥

ఎ॥ఓరీ॥ శిగట్టికిందదోశేవయ్యోలేస్తినీ।బాగురించకపోను పేరాయా॥౭॥

పే॥ఓరీ॥ వెళ్ళివదాక నేపడువనీప్రాణాలుచెల్లి చావనుకోరా యెల్లా ॥ ౮॥

ఎ॥ఓరీ॥ మొండిపిశాచీనేమోసపోయివస్తి ।గుండెలదరెగదరా పేరా॥౯॥

పే॥ఓరీ॥ తెంపునజంధ్యాలుదెంపిశెంపలుగొట్టి। పంపకవదలరా ఎల్లా॥౧౦॥

ఎ॥ఓరీ॥ శారానీపాటంతా రాజుతోజెప్పిని।మూన్నెళ్ళగొట్టింతూపేరా౧౧

పే॥ఓరీ॥వానితావుకునేను రానునిన్నువిడచి।పోను మొత్తుకొనేనూ ఎల్లా॥౧౨॥

ఎ॥ఓరీ॥ రాకుంటేతిరిగిపోరానోరుమూసుక। ఛీకొట్లుబడవద్దూ పే॥ ౧౩॥

పే॥ఓరీ॥ఇలవాలమేటీకు డెరుగనీవలసబో।వలశివచ్చేగద రా ఎల్లాయ॥౧౪॥

వ॥ అనియీ తెరంగున ముసలిబాపలిద్దరుసరిమసలి చేపట్లసరసంబు గా జెనుగులాడి రంతకొంత సేపునకుపోరజాలక పేరావధానులు వారిపో యె ననంతరంబునదనసముఖంబుజేరవచ్చిన నెల్లిభొట్లిగారిని గౌరవించి ధరావల్లభుండట్లనియె॥

క॥ దండమయా విప్రోత్తమ । దండమయా వేదశాస్త్రతారక సిప్ర ణా। దండమయా సుగుణాకర । దండమయా ఎల్లుభొట్లుదండము స్వామి॥

[విప్రునివాక్యము.]

క॥ యాచకకల్పమహీరుహ।ఖేచరవిభువిభవతావకీయ్యసువంశం। బాచంద్రార్కస్థాయిగ।భూచక్రంబుననువృద్ధిబొంది వెలయుమా॥

(రాజుమాట.)

క॥ మనజానకమ్మనీరా । మునకీవల చిత్తివివాహమునకిక యత్నం
బును జేయగవలెగావున । వినుమనఘా యొక్కమనవి విశ్వాసమునన్॥

క॥ త్వరితముగ నీవయోధ్యా । పురికరిగి యుదశరథునకు । పుత్రుల క్షే
మం । బెరుకపరచి కల్యాణో । త్తరమునగి యుతోడితెమ్మ తగువారలతోన్॥

వ॥ అనిపలికి శుభరేఖయొసంగినంబుచ్చుకొని మహీదేవుండు నిజమం
దిరంబునకరిగి ప్రయాణోద్యోగంబు జేయుచుండెనట సాకేతపురంబునా॥

క॥ అనిధరణికోటమలపా ।
వనసుబ్రహ్మణ్యసుకవివర్యుడు సంప్రీ ।
దనగౌతమీవిలాస ।
మ్మనను జతుర్థ ప్రకరణమును విరచించెన్॥

శ్రీమదింద్రాహల్యావిలాసోత్తర భాగంబునందల
ప్రథమాంకము సంపూర్ణము.

యీనాటకంబునందలి నాలుగవదినముకథ సమాప్తము.



శ్రీరస్తు.

శ్రీమదింద్రాహల్యావిలాసము - ఉత్తరభాగము,
ద్వితీయాంకము - అయిదవ నాటికథ.

క॥ శ్రీవైకుంఠేశ్వరపా । రావారసుతాహృదీశరమణవ్యధిపే ।
జేవోపమానసాంబుజ । పావనచారిత్ర చంద్రభాస్వన్నేత్రా॥

వ॥ అనిస్మరణ శేయుచు.

(✻) దశరథమహారాజు సభజేయుట. (✻)

గీ॥ భటులు కైవారములు జేయ పటహభేరి । మురజశంఖనినాదముల్
మ్రోయనాట । చెలులు నాట్యంబు శేయగా కొలువుదీరె । రాజసంబున
దశరథరాజమౌళి॥



(మధ్యమావతి రాగము - ఆదితాళం.)

రాజుసభ జేయుచుండెనపుడూ । దశరథమహా॥ రాజు॥ రాజరా
జరవితేజాశ్రితసుర । భూజాయని జగతీజను లెన్నగ॥ రాజు॥ ౧॥ భటనట
గాయకపండితమునిజన । పటలంబటు నిలువ్రక్కలగొలువగ॥ రాజు॥ ౨॥
కరకంకణనిక్వణము జెలగ సుం । దరీమణులు చామరములు వీవగ॥ రాజు॥ ౩॥
వరమతి శ్రీమన్నావల మేటిపురి । కరిచర్మాంబరధరుని నుతించుచు॥ రాజు॥ ౪॥

వ॥ ఆసమయంబున భటుండు కైవారంబు జేయుట.

సీ॥ రాజరాజకిరీటరత్నసంఘటితవిభ్రాజపదాంభోజ బహుపరా
కు । భండశాత్రవబాహుదండఖండోద్దండభండనభీకరా బహుపరాకు ।
తారనీహారపటీరమరాళాభపటుయశస్సంభృతా బహుపరాకు । ధైర్య
సాహసమహోదార్యశౌర్యాతివైభవజంభశాసనా బహుపరాకు । ధర్మ
నిర్మితభూషణా బహుపరాకు । భద్రసింహాసనాసీన బహుపరాకు । భా
నువంశప్రదీపకా బహుపరాకు । పఙ్క్తిరథరాజకులభోజ బహుపరాకు॥

వ॥ అనుసమయంబునా.

క॥ పరరాజభయంకరమగు । బిరుదులు మెరయంగ గనకపీఠంబునని ।
ర్జరరాజవిభవమేపడ । సరగున గూర్చుండియుండె జనవిభుడంతన్॥

(✻) భరతశత్రుఘ్నులు దశరథునికడకు వచ్చుట. (✻)

క॥ మనసిజజితశృంగారులు । కనకమయాభరణయుతులు కైకసు
మిత్రా । తనయులు దమసరిబాలకు । లనుగూడుక వచ్చిరతివిలాసంబమరన్.

ద్వి॥ వినరయ్య మీరు మావృత్తాంతమెల్ల - వనజబాంధవవంశవర్ధ
నుండతుల - ధీరుడైనట్టి పఙ్క్తిస్యందనునకు - గారాబుసుతులము కౌసలేయు
నకు - ననుగుతమ్ములమయోధ్యావాసులము - పసిబూనిమా యీడుబాలు
రతోడ - గూడికుశాలుగాకోరిన యాట - లాడుచు వేడుకల మరియుండు
దుము - పనిగొని మా పేర్లు భరతశత్రుఘ్ను - లనిబల్కుచుందుదురఖిలమాన
వులు - ఘనుడైన మాతండ్రిగారతివిభవ - మున జేయు సభజూడ ముచ్చట
మీర - పొలుపుగాకవగూడిపోయెదమిప్పుడు - జెలగియన్నా రెడ్డి శ్రీరామ
చంద్రు - చిరసౌఖ్యములనుబోషించువాల్మేటి - పురిపాలుడలరారబుధ
జనులారా॥ అనిబలుకుచూ.

(సావేరి రాగము - ఆట తాళము.)

వచ్చిరి భరతశత్రుఘ్నులెచ్చు గాదట తండ్రీసభకు॥ మెచ్చువచ్చూపాల రావళులూ॥ మెరయగా, నెనయగా, నొరయగా, మురియుచును॥ వచ్చిరి॥ ౧॥ అందెలూ గజ్జెలు పాదములందు ఘల్లుఘల్లని మ్రోయా। ఇందు బింబనిరాకారవదనము। లింపుగా, జెంపుగా, సొంపుగా, నింపగను॥ వచ్చిరి॥ ౨॥ కరములమణికంకణములుం। గరములుభుజకీర్తులెల్లా। దిరముగా ధరించిమంచి। తేటగా, నీటుగా, ధాటిగా, నేటుగను॥ వచ్చిరి॥ ౩॥ వరమతీవాల్మీకిపుత్రిని। వాసుతౌయిత్తు నెన్నుచూ। యరయగా శ్రీహరియంశజులిరంచుమును, లెంచగను, మించుగను, పెంచుచును॥ వచ్చిరి॥ ౪॥

వ॥ ఇట్లువచ్చి తండ్రినింగాంచి ఇట్లనిరి-

క॥ వారిధిగభీరమందర। ధీరాహవశూరదుర్మతీజనదూరా। వారిజబాంధవవంశో। ద్ధారావందంబులివె మాదండంబునగొనుమా॥

(దశరధవాక్యం.)

గీ॥ వరకుమారులారవంశవర్ధనులార। ముద్దుబాలులార ముదముమీర। సతులసౌఖ్యములను యాచంద్రతారార్కం। బమరవృద్ధినొందుడనియందూ॥

(భరతునివాక్యం.)

క॥ పున్నమనాటికళానిధి। కన్నామేల్ వన్నెగలిగినట్టినీదు మోమున్నగదు విన్ననై నే। దున్నవిధంబేమి దెల్పుమొప్పుగతండ్రీ॥

(దశరధవాక్యం — కాంబోదిరాగము - ఆట తాళము.)

ఏమిదెల్పుదు ఏమిదెల్పుదు నామదినిగల సంశయంబు। కుమారులారా, మన। రామలక్ష్మణులింతవరకిటు రాకయున్నారేమొగానీ। కుమారులారా॥ ౧॥ ఎంతజెప్పినకౌసికుడురవ్వంతయును నెనరుంచడాయె। కుమారులారా। ౨॥ బలవంతమున పసిబిడ్డలను గహనాంతరములకు గాంచబోయె కుమారులారా॥ ౩॥ ఖేచరాంతకులై సనీచులజూచిభీతిని జెందిరో। కుమారులారా, ఘోరరా। రాచముఖర శిలీముఖంబుల బీచమణచి జయించిరో। కుమారులారా॥ ౪॥ మాటబొంకగునంచునే మునిమాటలకులోనైతిన ప్పుడు। కుమారులారా। వాల, మేటిపట్టణ లయుదయ మేపాటిమనసౌడగల్గునో కుమారులారా॥ ౫॥



వ॥ అనిబల్కు దశరధునకు వసిష్ఠుండిట్లనియె.

క॥ భూమీశ్వరనీతనయులు। శ్రీమీరం పెటకనిన్ను జేరవచ్చినగో। ప్రేమమునగారవించక। నేమోదలపోసికొనెద। వెరుగబల్కుమా॥

(రాజువాక్యము.)

సీ॥ తాపసివెంటకాంతారసీమలకేగ శ్రీరామలక్ష్మణుల్ జేరరైరి। ప్రేమచే బెంచినబిడ్డలమునిచేతి కొప్పగించితిమనసొప్పి నేను। నాయంతవెర్రివాడీ యిలాతలమున గలుగునె యింతేమిగలదు నాకు। నెల్లసుఖంబులు కల్లగానోచెను మదిచెపలించె నెమ్మదిహరించె। నింక నేనేమిసేతు నేవంక బోదు। నేమిదోచకయున్న దేనెవరివలన। మేలువార్తనువిందు నేలీలనుందు। నెవ్వుడుతనయులగందుమౌనీంద్రచంద్ర॥ అనిమరియునిట్లనియె.

(పున్నాగరాగము-ఆట తాళము.)

మునివరా నేనేమిశేతూ। తనయులనెన్నడుగాంతూ॥ దివసమొకకల్పంబుగానా। మనమునదోచుచున్నాది॥ ముని॥ ౧॥ ఏమనవచ్చుకౌసికునీ। ధీమసమకటా నామదినీ। పామరమెరుగంగలేక। బాలులదోడ్కొనిచనెనూ॥ ముని॥ ౨॥ కడుసుకుమారులుచిన్నీ। బుడతలు నేటికెన్నెన్నీ। యడవులదిరిగియేమేమి। ఇడుములబడుచున్నవారో॥ ముని॥ ౩॥ రక్కసిచిక్కులలోనా। జిక్కిరోబిడ్డలకైనా। గ్రక్కునవశీవాలమేటి। చొక్కనాధేశ్వరుడే దిక్కు॥ మునివరా॥ ౪॥

(వసిష్ఠునివాక్యము.)

ఉ॥ వారిధులింకబారిన సువర్ణగిరిం దిరమొడ్డగిల్లినన్। సారసబాంధవుండపరశైలము పైనుదయించినన్ ధరి। త్రీరమణాదలంపభవదీయ తనూజులకేమిహానియా। నారయ గాధినందను మహామహిమంబసదే గణింపగన్॥ అనిబల్కునెడ.


ఎల్లుభొట్లు దశరధుని సన్నిధికివచ్చి శుభరేఖనొసంగుట.

[నాదనామక్రియ రాగము - ఆది తాళము.]

వచ్చెనెల్లుభొట్లుసభవా। రచ్చెరుపడునట్లూ॥ వచ్చెనయోధ్యాపురశృంగారము। మెచ్చుచు సంభ్రమమెచ్చ చెచ్చెరను॥ వచ్చె॥ ౧॥ ...

కనకన్నా। యీజనపాలకు డేమిన్నా । కలిమిసంపదయుగలవారింతటి।
చెలిమిగలుగుటతిశ్రేష్ఠంబౌనని॥ వచ్చె॥ ౨। పన్నుగనీపూటా। శ్రీరామన్న
పెండ్లిమాటా। విన్నతట తామిన్నందియు గా। జెంనోబహుమతిలిచ్చునుతన
కని॥ వచ్చె॥ ౩॥ మంచిసమయమనుచూ। శుభమానంచుబలికికొనుచూ॥ మిం
చుగ శ్రీవాల్మీకిటీశునిబ్రార్థించుచువాంఛలభించ జేయుమని॥ వచ్చెనెల్లి॥ ౪॥

వ॥ ఇట్లువచ్చినభూసురునకు భూవరుండిట్లనియె.

క॥ దండమయాధాత్రీసుర । దండముషట్కర్మనిరత దాగితదురి
తా । దండము పావనచరితా దండముదండంబుమీకు। దండముస్వామీ॥

(విప్రునివాక్యము.)

క॥ విభవనిభవజ్రసాధన । శుభముశుభముశుభముశుభము సుజ
నాధీరా। శుభమగిసముదయమధవా శుభమిందుసమానవదన। శుభగుణ
సదనా।

(రాజుమాట.)

క॥ ఎందుండువారుతపోనిధీ। బృందారకమెవరుబంపబ్రీతినిపటికిం।
పొందనరుదెంచినారా। నందమునవచింపుమయ్యానతగుణధుర్యా॥

[విప్రునివాక్యము.]

ఉ॥ రాజకులేంద్రనీసుతుడు రాముడుకౌశికలక్ష్మణాన్వితుం। ద్వైజన
కావనీంద్రపురమందుసుఖంబునయున్నవాడుమా । రాజొకమేలువార్తఘ
నరాజసమక్షమమందువ్రాసివి । భ్రాజితమొప్పబంచె శుభపత్రిక జేకొను
మా ముదంబునన్॥

వ॥ అనినవినిపరమోత్సాహంబున రాజవర్యుండవనీసురునకిట్లనియె.

(మధ్యమావతిరాగము-రూపకతాళము.)

సంతోషముసంతోషము । జగతీసురవర్యా బహు। సంతోషము॥
స్వాంతముననుగలవ్యాకుల। మంతాదీరెనుసేటికి॥ సంతోషము॥ ౧॥ వర
తనయులకుశలముకే। వలమైత్రినిదెల్పితివిపు డరయగమాపాలిటికి। వాప
ద్వాంధవుడవుభళి॥ సంతోష॥ ౨॥ తాపసితనపనిదీరిన । తక్షణముననను
జేర్చక । నాపసిబాలకులనుమిధి । లాపురికేలాగొనిచనె॥ సంతోష॥ ౩॥
కరముప్పగవాలమేటి। గజచర్మాంబరుసాక్షిగ। సరగుననటగలుగుసమా।
చారములన్నియుదెలుపుము॥ సంతోషము॥ ౪॥



(విప్రునివాక్యము.)

వ. రాజశేఖరా భవదగ్రపుత్రుండు భ్రాతృసహితుండై విశ్వామి
త్రునితోడంజనుదెంచి యనేకరక్కసులంజక్కాడికౌసికు యజ్ఞంబురక్షిం
చి యనంతరంబహల్యాశాపమోక్షణంబుచేసి పదంపడి జనకునిజన్నంబు
జూడంజనుదెంచి యచట సురాసురులకుదుర్భరంబైన భర్గునిచాపంబు
మోపెట్టివిరచిన రామభద్రుని భుజవిక్రమ సాహసంబులకు విదేహుం
డెంతయు నాశ్చర్యసంతోషంబులంబొదలి నీపుత్రునకుతనపుత్రియైన సీత
నిచ్చెదనని నిశ్చయించి కౌసికానుమతిమెప్పు బెండ్లికిబిలువంబుత్తెంచిన నే
తెంచితి నిదేశుభరేఖంబుచ్చుకొని శౌచ్చెరపైనంబై విచ్చేయుమా యని
యొసంగినంగైకొని విమర్శించె నెట్లనిన.

సీ॥ శ్రీమదఖండలక్ష్మీపరిసన్నులునైన మేరుభూధరసమధీరులైన।
రాజమాన్యవిరాజరాజపూజితులునై రాజిల్లుదశరథరాజుగారి । దివ్య
సన్నిధికివిదేహభూపాలుండు సంప్రీతిసరిబ్రయోజనముమీకు । మారశే
ఖరుడైనశ్రీరామభద్రుండు నరసురాభేద్యమాహరుసిధనువు । బలిమివిర
చినమెచ్చిరాబాలసీత। నొసగదలచితిమేముమహోత్సవమున । సహకు
టుంబసపరివారసహితులగుచు । సలలితంబుగమీరు రావలయునిటకూ॥

వ॥ అనువకరణంబుగలశుభోత్తరంబంగీకరించి బ్రాహ్మణోత్త
మునకుగనకాంబరాభరణాదులొసంగి జనకసంబంధంబునకు పొంగుచు
సుమంతునకుభూకాంతుండిట్లనియే॥

{ దశరథుండుసుమంతునితో
పెండ్లియత్నంబుజేయ నాజ్ఞాపించుట. }

ద్వి॥ అనఘసుమంతమహాగుణవంత - మనరామలక్ష్మణులమా
హేంద్రయాగ- పాలనజేసిమస్ఛరనిశాటులను - దూలించికౌశికుతోగూడి
మిధిల- కరిగియందుజలంధరారికార్ముకము - విరచివిదేహభూవిభుని మె
ప్పించి- గౌరవంబునక్షేమకరము గానున్న- వారటయింకొకవార్త రాము
నకు- తనపుత్రియైనసీతామణినొసగి - యనువుగాబెండ్లిజేయనునిశ్చయిం

సీ - వరమతిశుభరేఖ ప్రాశిభాస్వన్మూర్తి - బహువర్ణనత్రిమైత్రిబంపినాడిటకు-
నెలమిబిలచియు- బిడ్డనిచ్చెదనని- వలదనియాను వెర్రివారలుగల రె - తడ
విడకతి బ్రయత్నంబునవటకు - కదు శీఘ్రముగనింక కదలిపోవలయు - నా
యాజ్ఞ కొలదినన్నారెడ్డి ఫలశ్రీ- తోయధిపూర్ణచంద్రుని రామచంద్రు- నిల్
నెల్లవాలమేటీశ్వరుండలర- జెలువైన జాగ్రత జేయుమా మంత్రీ॥

(ఆనందభైరవిరాగము - ఆదితాళము.)

తగినప్రయత్నము జేయుచుండుమా। నాదు, నిరుణీవణులకు జెప్పి పంపుమా। పెద్ద, లఘువారినెల్ల బిలువనంపుమా । శీఘ్రము, గను ప్రయాణాలగ్నము మనిశ్చయము దెలిసి॥ తగిన॥ ౧॥ పరగశుభరేఖలు వ్రాయించుమా। మన, బంధుల నేపునగా పిలుచుమా। దిశల, నరయనీమాటజాటబంచుమా। నిఖిల, పరిచారకులకెల్ల పనులాజ్ఞాపించియుండి॥ తగిన॥ ౨॥ చతురంగబలములగూర్చియుండుమా । పురము, సర్వాలంకారము జేయించుమా। వస్తు ప్రతతిసంపూర్తిగా జేర్చియుండుమా । మదిని, క్షితివాలమేటిపురి శ్రీరంగ్రకర్తనుగోరి॥ తగినప్రయత్నము॥ ౩॥

వ॥ అనియానతిడి సర్వాయత్తంబు శేయను త్తరువాసంగి మరునాడుశుభలగ్నంబున బహువిధవాద్యంబులు జెలంగ బుత్రమిత్రకళత్రామాత్యబంధుపురోహితసహితంబుగా దత్తద్వాహనంబులగు వాహనాదుల నారోహించి - డెబ్బదిరెండు నియోగంబుల వారు బరివేష్టించికొలువ నతి వైభవంబున కదలి రెట్లనినా॥

(✻)దశరధాదులు మిథిలకు పెండ్లికిబోవుట.(✻)

(రేగుప్తి రాగము - ఆదితాళము.)

వెడలిరి శ్రీరాముని పెండ్లికి కడు వేడుకమీరగను ॥ విడిబడిమింటను జెలువులలరులు। జడిగా నిగురియగను। తగను, వెడలిరి శ్రీ॥ ౧॥ భటులాగిడికిలికారులు గొనిసలు। పార్శ్వంబులనడువా। కుటిలకుంతలలు మంగళగానసలు। కుతుకంబున జల్లగ రంజిల్లగ॥ వెడలి॥ ౨॥ ఘనులవశిష్టాదిమునీంద్రులనగి। కష్టేపనుగూడి। యనువొందనరుంధతి మొదలగుతము। న్నైదువ



లేతేరా। మేలూరా॥ వెడలి॥ ౩॥ వలనొప్పగ శ్రీవాలమేటిపురి । నిలయము మోదింపా । కలబంధులు చతురంగబలంబులు । ఘనవాద్యంబులు కలగి చెలగవడి॥ వెడలిరి శ్రీరాముని పెండ్లికి॥ ౪॥

వ॥ ఇట్లుజనిచని మిధిలానగర ప్రాంతంబున విడిసి తమ రాక జనకునకెరుకజేయుమని యొక్క విప్రపుంగవునింబుత్తెంచిన నతండు జనిచిన యంబున విదేహునకిట్లనియె॥

క॥ సతిసుతహితమంత్రిపురో । హితయుతముగ సపరివారమెల్ల
గొలువ। రాజితవిభవమున నయోధ్యా। పతి నీపురి జేరవచ్చె పార్థివతిలకా॥

వ॥ అనిననుల్లసిల్లి పృథ్వీసురునకు వితరణములంగ సత్కరించి యంతట

సీ॥ గౌతమసుతుడాదిగా గల్గుతాపసుల్ । వేదోక్తమైనదీవెనలొ
సంగ। మంత్రులు హితులు సామంతులు మొదలైన - పరివారమెల్ల గ్రిక్కిరిసి
కొలువ । చెలగి రాజాధిరాజులు బంధుజనములు ప్రక్కవీగుచు ముందు వెనుకన
డువ । నడవళ్ళకను వైన్నదరు చేబూనిము త్తైదువుల్ ముచ్చటనరుగు జేర।
నెలమి సాకేతపురవరాధీశ్వరునకు। నెదురుగాజని మదినుత్సహించి భద్ర।
కరులమీదను సంధించి గారవించి। సంభ్రమంబున జనకభూజానియపుడు॥

వ॥ ఇట్లు బూజించి దశరధునకు జనకుండిట్లనియె॥

(జనకుండు దశరథు నెదుర్కొని మర్యాద చేయుట.)

(ఖమాస్ రాగము - ఆదితాళము.)

రావయ్యా దశరధరాజోత్తమా। రాజితగుణధామ॥ రావయ్యా॥ నీతిపరుడవు వినిర్మలచరితుడవు। ఖ్యాతి జెందినావు॥ రావయ్యా॥ ౧॥ సీత నయోనిక తమ్మునన్నాపంతంబు । నావేరెనిజంబు॥ రావయ్యా॥ ౨॥ సీతో సంబంధము జేయగ గంటి । నెమ్మనిగైకొంటి॥ రావయ్యా॥ ౩॥ వాలమేటి పురి పాలునికృపవలనా। మేలుగల్గెగాన॥ రావయ్యా॥ ౪॥ అని వెండియు.

ద్వి॥ దశరధరాజేంద్రధరణీశచంద్ర - విశదంబుగా నేను వినుమొం
కమనవి - యరయుమదియ్యవంశాగ్రణి విమల- చరితుడై వగుణమిత్ర క్రవర్తి
కిని- యారవతరము వాడగు దేవరాతు - డారాజమణికి బుగారితక డాకు-

ధనువిచ్చెనదిదరతరమమాయింట - నొనరనిత్యార్చనలొందుచునుండు-
తి.శివరానేడాకట-చిత్రమెట్లనిన - క్రతుఘాతలంబువాగటదున్నుచుండ-
నుద్భవంబయ్యెనుయొకకోమలాంగి - యద్భుతంబుగసీతయనుపేరదాని-
నెలమితోబెంచిగిరీశునివిల్లు- బలిమిద్రుంచినమహీపతికిత్తుననుచు - ధాటి
గానేనుపంతంబుజేశితిని- నేటికిచెల్లించెనీతనూభవుడు- గాననన్నారెడ్డి
ఘనరామచంద్ర - భూనాయకునినెమ్మిబ్రోవుమాశ్మేటి - శ్రీచాకట-నా
ధూసాక్షిగమహీచరులు- ఖేచరుల్ మెచ్చసతీ-ర్తినాముద్దు - కూతురిసీపె
ద్దకోడలుగాగ - చేతోముదంబునజేకొనుమనఘా।

వ॥ అనినంబరమానందంబునదశస్యందనుండిట్లనియే-

క॥ సుమనసులుమునులురాజో। త్తములుంగొనియాడజనకధాత్రీ
శ్వరస। ద్విమలాత్ముడవగునీవి। య్యాముసంపాదిప్తించె। నేగృతార్థు
డనైతిన్॥ సంధివచనం.

వ॥ అనిబల్కుదశరథునిపల్కులకెంతయుసంతసిల్లుచు జనకుండువా
రలన్ దోడ్కొనివచ్చి తనసహాయాసనంబగుకుశధ్వజు:వీడు విడిదిజేయిం
చియుండెనాసమయంబున॥

క॥ సాకేతపురాధీశుని। రాకవినియుకౌశికుండు। రాఘవులం
డా దోడ్కొనిచిరినగవాలయుగ। ప్రాకటముగవచ్చెకనులపండువుగాగన్॥

## విశ్వామిత్రుండుదశరథునకు రామలక్ష్మణులనొప్పగించుట.

[ఆరభిరాగము - అటతాళము - సంవాదము.]

వి॥ నీముద్దుకొడుకులురాజేంద్రా- వీరే, నెమ్మినైకొమ్మురాజేంద్రా॥
ద॥ పరమోపకారివిమౌనీంద్రా- కనుల,కరువుదీర్చితివయ్యామౌనీంద్రా॥
వి॥ కడుపుణ్యుడవునీవురాజేంద్రా- దొడ్డ,కొడుకులగన్నావురాజేంద్రా॥
ద॥ కొడుకులుదీరెనుమౌనీంద్రా- మది, కోరిక-లీడేరెనుమౌనీంద్రా॥
వి॥ సత్యసంధుడవీవురాజేంద్రా - నీకు, సాటివారెవ్వరూరాజేంద్రా॥
ద॥ నీకృపవలననోమౌనీంద్రా- ధాత్రి, నేకృతార్థుడనైతిమౌనీంద్రా॥
వి॥ నాటిమాటజెల్లెరాజేంద్రా- వాల, మేటీశుసాక్షిగారాజేంద్రా॥



వ॥ అనియొప్పగించెనప్పుడు రామలక్ష్మణులు దండ్రికినమస్కరించి
వశిష్ఠాదులకభివందనంబులుచేసి తల్లులకుంబ్రణమిల్లి గ్రమంబునవారలచేదీ
వెనలంది చెంపొందుచుండిరంత దశస్యందనుండమందానందంబున నిజనం
దనులకిట్లనియె॥

క॥ ఎన్నోవ్రతములుగ్రతువులు। సన్నుతమతితోనొనర్చి। సాఫల్య
ముగా కన్నయ్యలారమిమునే। గన్నందుకునిహపరములు। గణ్యతగలిగెన్

వ॥ అనునెడమిధిలేశుడుదశరథునకిట్లనియె॥

(హిందుస్తానిరాగము - ఆదితాళము.)

మనువంశోత్తమమనమలరగయొక। మనవినిజేసెదవినుమాయా
హూ॥ మను॥ ౧॥ పనిగొనిమీసంబంధమునేటికి। ఘనముగగల్గెనుగానా
బోటికి॥ మను। ౨॥ నిర్మలమతిధరణీసుతసీతను। నెమ్మిశ్రీరామునకునొ
సంగి। కూర్మిలక్ష్మణకుమారునకిచ్చెద। నూర్మిళనపరిమితోత్సాహంబున॥
మను॥ ౩॥ ఇందుకుమీరేమందురోయనిమది। యందునసందేహముజెందీ।
యుందరిలోనేనిప్రస్తావము। జెందమలరజేసితిప్రభూ॥ మను॥ ౪॥ వలనొప్ప
గ శ్రీవాలమేటిపురి। నిలయుడుభళిమేల్ మేలనగా। చెలిమినిమనమిటుజేశిన
నిహపర। ములమహాయశముగలుగుసుమీ॥ మనువంశోత్తమ॥ ౫॥

వ॥ అనివవినిదశరథునభిమతంబెరింగి గాధేయుండువిదేహునకిట్లనియె.

గీ॥ జనకరాజేంద్రనీదుతమ్మునికుమార్తె। లైనమాండవిశ్రుతకీర్తు
లనెడువారి। భరతశత్రుఘ్నులకొసంగిపరిణయంబు। నొక్కపరినల్వురకు
జేయుటుత్తమంబు

(జనకునివాక్యము.)

గీ॥ కలుషహీననమీరుశలవిచ్చినటువలె। రాముడాదియైనరాసు
తులకు। సీతమొదలుగాగచిన్నారికన్నెల। బ్రీతితోనొసంగిపెండ్లిశేతు॥

వ॥ అనిబల్కి జనకుండు నిజసదనంబునకరిగియుండె నంతద్వితీయ
దివసంబునం గుమారులకభ్యంజనంబొనరించుచుండి రయ్యెడ విప్రాంగ
న లిట్లనిరి॥

(నలుగుపాట - ఆదితాళము.)

శ్రీరామ మదనకామా । శృంగారగుణధామా । ఘోరవైరివిరామా। వారిధరశ్యామా॥ శ్రీ॥ ౧॥ కనకపుపీటలమీదా। మనుకులవర్యులను నిచి। ఘనమగు వాద్యములమరా । కాంతలునల్గిడరే॥ శ్రీ॥ ౨॥ కస్తూరీమృగనాభీ। కమ్మని శ్రీచందనమూ।నిస్తులనొక్కటిజేసి। చేడెలునల్గిడరే॥ శ్రీ॥ ౩॥ చెలులారా రారమ్మా। చెలరేగి మనమిపుడూ।నలువురకూ యొకసారీ।నలుగులు బెట్టుదమూ॥ శ్రీ॥ ౪॥ నీటులు గులుకఁ దువాల । మేటపురాధీశ్వరునీ పాటలు బాడుచు పువ్వూ। బోటులునల్గిడరే॥ శ్రీరా॥ ౫॥ అని॥

గీ॥ ఇవ్విధమున నల్గులేపుమీరఁగ బెట్టి। సవ్వడేఁగినట్టి సొంగెమమర। పువ్వుబోటులెల్ల బొంగి చెలఁగుచు । సువ్వి బాడిరపుడు సొంపుగులుకా॥

[సువ్విపాట - జుల్వ తాళము.]

సువ్వి శ్రీరామరామ। సువ్వి రవికులాబ్ధిసోమ । సువ్వి లోకాభిరామ సువ్వాలాలే। సువ్వీ సువ్వాలాలే॥ ౧॥ ఇందుకుందమందహాస సుందరాననావినూత్న । సుందరీమనోభవా ముకుంద కేశవా॥ సువ్వి॥ ౨॥ నాగరాణ్మహాశ్రీ శోషణా నాగరాజధీర శేష । నాగశయనమణివిభూషణా జనార్దనా॥ సువ్వి॥ ౩॥ ఇందిరాహృదీశ్వరారవిందభవపురందరాది । వందితాంఘ్రియుగళ నందనందనాచ్యుతా॥ సువ్వి॥ ౪॥ పక్షివాహనా విపక్షశిక్షణాంబుజాక్షశిష్టరక్షణా విచక్షణా కటాక్షవీక్షణా॥ సువ్వి॥ ౫॥ నీలఘనశరీర లోకాలవాల వాలమేటి । శూలసాధనాప్తగోపాల కేశవా॥ సువ్వి॥ ౬॥

వ॥ అపల్లవాధరులెల్ల వేడుకలు శేయ మంగళస్నానం బొనరించి సర్వాలంకృతులై యుండిరంత దశరథుండు గురుచోదితంబగు శుభలగ్నంబున స్వస్తిపుణ్యాహవాచనపూర్వకంబుగా స్నాతకవ్రతంబొనరించి కుమారులరక్షణార్థంబు నీదేవతలకనూనంబులగు మహాదానంబు లనేకంబులొసంగె ననంతరంబున వివాహలగ్నంబు సమీపించెనని జనకానుమతిం బురోహితులు బిలువవచ్చినా॥






ద్వి॥ శ్రీరఘువీరుడంచితగుణాకరుడు - కూరిమి ... తమ్ముగ్గురయి నుజులును - చౌదంతినిభములౌ చౌదంతులెక్కి - సోదరులు ... మానులాశీర్వదింప - బిరుదులంకించిబల్ బెట్టుగామించి - కరమొప్పవందిమాగధజనుల్ బొగడ - కాంతలశోభనంబులు బాడుకొనుచు - క్రాంతలుగోనిపుణ్యకాంతలునడువ - దొరలును మంత్రులు స్తుతిమహీపాల - వరులుగ్రమ్మి కనలు వంకలేతేర - పగలువత్తులచాలుబదివేలుబట్ట - పగలు శేయగనలుప్రకటలబట్ట - వివిధంబులగు బాణవిద్యల తెగటు - భువియునాకసముసు బొదివికొనంగ - గురిమిర కెడలేకకోటులసంఖ్య - దిరమైనకేపురంపుదివ్వటీల్ వెలుగ - వారకమంగళవాద్యంబులెలమి - భోరుకొలంగ బెంపుగచతురంగ - బలములెల్లెడలను బలశి శేవింప - జెలగియన్నారెడ్డి శ్రీరామచంద్రు - నేలెడువాలమేటికొనుడలర - మాలిమి పెండ్లికొమారుడై వెడలె॥

(కాంబోదిరాగము-ఆదితాళము.)

రాముడు వెడలె చూడారమ్మా । కామినీజన, కొమారుడు పెండ్లికొడుకై కడువేడుకను నేడూ॥ రాము॥ ౧॥ నవరత్నభూషణములు దాల్చి। సొగసైన నృగ, సాఖీతిలక ముమ్ముద్దునగు మోమునను బెట్టి। రవికోటి తేజమున మించి, రాజసము వహించి॥ పవిధరనిభమై భవము రహించగ। ప్రవిమలమతులై ప్రజలను తింపగ, ఘనముగ జనకుడుగని యుప్పొంగగ । పనిగొని ముందరి భటులు నెలంగగ, చానలు పూలవసంతములాడగ। గానజ్ఞులు పొంకంబుగ బాడగ, బాణవిద్యలంబరమును నారయగ। వాణీశాదులు వై భరినరయగ, రాజితమగు పురి రాజమార్గమున। రాజీవాక్షుడు రఘుకులతిలకుడు॥ రాముడు॥ ౨॥ రాజాధిరాజులు గీర్తింపా। సౌధాంతరముల, మరాళయానలు కర్పూరంపు హారతులివ్వా। ధీజనులెల్ల సంతోషింపా, నద్భుతమున నీరాజులు భళిసై రాయనిబొగడగ। వాజులేనుగులు వరుసను నెగడగ, వరమునులాశీర్వచనము శేయగ। గరిమను పౌరులు కానుకలీయగ, దశరథుడామోదమున జెలంగగ। దశదిశలోకపద్ధతిని వెలుంగగ, పన్నీరత్తరు పైజిలి

కింపగ। కన్నవారు పేట్కానుపిలకింపగ, బాంధవులతిసంభ్రమమున మెచ్చగ। మందహాసకోమలవదనుడు॥శ్రీ॥ రాముడూ॥ ౩॥ సుందరాకారముచెన్నొందా। శ్రీవాలమేటీ నందివాహనుడాత్మ। నందమును జెందగానూ, యందముచందములందందా। జెంద జెంపొందా॥ వందిజనులు కైవారము జేయగ। దంధణయనివాద్యంబులు మ్రోయగ, మందారంబులు మల్లెలు కొల్లగ। మందయానలేమారక జల్లగ, రంగుమీరివారస్త్రీలాడగ। నింగిని వైమానికులాగి జూడగ, పూలవానవేల్పులు గురియింపగ। త్రైలోక్యములనురక్తి జనింపగ। మొగినిభద్రగజములపై నెక్కి - ముగుదుతమ్ములను ముదమున గూడుక॥ రామూడూ వెడలె చూడరమ్మా॥ ౪॥

వ॥ ఇట్లత్యంత సౌందర్యాతిశయంబున కంతు జయంత వసంత రోహిణీకాంతులందిరస్కరించుచు నపరిమిత వైభవంబునం గోటిశతకోటిసాధనులంధికరించుచు నిఖిలజనాన్వితంబుగా కళ్యాణనిలయంబు బ్రవేశించి శోభనోద్యోగంబు శేయుచుండె రటజనకానుమతి నతఃపురంబునా.

### సీతోర్మిళా మాండవీశృత కీర్తులు పెండ్లికూతుండ్లై వచ్చుట.

ద్వి॥ కోమలాధరులెల్ల గుమిగూడిజాన - కీమణి మొదలైనకీరవాణులకు-తలలంటినల్గిడితగిన వేడుకల- జలకంబులాడించిచలువచేలముల- తడియొత్తికురులార్చి తగుకుచ్చులమర- జడలల్లియురువిరిసరములుగూర్చి - కనులకాటుకదీర్చి కదుముద్దులొలుకు-గోనబుమామలనుకుంకుమబొట్లు బెట్టి- కళుకైన మెరుగుబంగారుజల్తారు - కొలుకులతులలేనికొమరుమల్లియల - గుత్తులచిత్తాడికోకలుగట్టి- బిత్తరిలేచనుల్ బికరాటిలంగ - రాచిలుకపట్టు మేల్ రవికలుదొడిగి- పూచినతంగేడుపోలికనిప్పశిడి- సొమ్ములు మెయినిండసొంపుగా బెట్టి- కమ్మనికస్తూరికాగంధమలది- రాజీవముఖులుబల్ రంగురక్తులను- కైజేయుచమితశృంగారంబుమీరి-పోలింపజాళువాబొమ్మలరీతి- మేలిమిదొల్లాయు మెరుములభాతి- చెలువలన్నారెడ్డిశ్రీరామచంద్ర- కలిమినినేలు శ్రీకరవాలమేటి-నిలయములోకాత్యాయనీమహేశ్వరులు- సలలితమతినిమెచ్చగవచ్చిరప్రదూ॥



(మోహనరాగము- ఆదితాళము.)

కలహంసలవలె ఘల్లుఘల్లున రాజ। కన్యాలు వెడలివచ్చిరేఓయమ్మా॥ సీతోర్మిళామాండవీశృతకీర్తులనదగుకం। జాతపత్రలోచనలేఓయమ్మా॥ ౧॥ పెండ్లికూతుండ్లైజవరాండ్లుగొల్వగ పేరంట్రాండ్లు నివ్వాళులివ్వగాఓయమ్మా॥ ౨॥ అంగజుబాణములగేరు బంగారుబొమ్మల తీరు। శృంగారముల్లసిల్లగాఓయమ్మా॥ ౩॥ భాసిల్లువాలమేటిపార్వతీశ్వరులపూజజేశికోరికలుగాంచిరే ఓయమ్మా॥ ౪॥

వ॥ అనయికైవడి భువనమోహనాకారంబులవచ్చుచు నచ్చటకొందరుమచ్చకంటులు ముచ్చటపడిమీపేరులేమని యడిగినవారలకచ్చిరుత కన్నియలిట్లనిరీ. (సీతవాక్యం.)

(శంకరాభరణరాగము - ఆదితాళము.)

కోమ్మా జెప్పెదవినవమ్మా కలికిబంగారు। బొమ్మా నాపేరు శ్రీసీతమ్మయందూరే॥ (యూర్మిళవాక్యము.)

కీరవాణిరో యెల్లవారూగా రాబముననా। పేరూర్మిళాయటంచు బిలచుచుందురే॥ (మాండవివాక్యము.)

పుండరీకాక్షిరో భూమండలమున నేను। మాండవియనదగియుందునమ్మా॥ (శృతకీర్తివాక్యము.)

క్షితివాలమేటిగౌరీపతి సాక్షిగా నాపేరు। శృతకీర్తియందురె రాజీవనేత్రి॥

వ॥ అనిబల్కు చిలుకలకొలుకులకలికిపలుకులకలరుచు వివాహగేహంబునకుందోట్కొనివచ్చి మచ్చకంటులు శోభనంబులం బాడిరెట్లనినా.

(శోభనపుపాట - జుల్వతాళము.)

శ్రీరామచంద్రునకు శోభనమే। శృంగారాకారునకు శోభనమే। నారీమణిసీతకు శోభనమే। నవమోహనాంగికి శోభనమే॥ శ్రీరామ॥ తపనకులమున జన్మించినాడే। దశరథాత్మజుడై క్రీడించినాడే। కపటరాక్షసుల ఖండించినాడే। కౌసికాధ్వరము పాలించినాడే॥ శ్రీరామ॥ ౧॥ ఘనపుణ్యా

శ్రమములీక్షించినాడే। మునులచేసత్కృతిగాంచినాడే। యనుజునిగూడిచరించినాడే। యహల్యాశాపముమాన్పినాడే॥ శ్రీరామ॥ ౨॥ మనపట్టణముప్రవేశించినాడే। మదనారిచాపముద్రుంచినాడే। జనకునిపద్దుసాధించినాడే। జానకీమణివరించినాడే॥ శ్రీరామ॥ ౩॥ తనవారినిందురావించినాడే। తమ్ములందరిగూడిమించినాడే। తనయంతవారిగావించినాడే। ధాత్రివిఖ్యాతివహించినాడే॥ శ్రీరామ॥ ౪॥ పరమపుణ్యులనుద్ధరించినాడే। పాపములెల్లహరించినాడే। వరదుడైసాక్షాత్కరించినాడే। వాల్మీకీశ్వరునలరించినాడే॥ శ్రీరామచంద్రునకుశోభనమే॥ ౫॥

వ॥ అనుసమయంబునమార్కండేయమందపాలాదులగుకొందరుమునులు వసిష్ఠశతానందులనాలోకించి యిట్లనిరి॥

క॥ సలలితమతులతులతపః। ఫలితాఖిలకలుషహతులు। పరమార్థవిదుల్। జలజహితాహితకులజుల। కెలమిబురోహితులుమీరలిరువురువరుసన్॥

క॥ కోసలపతివంశావళి। వాసిగజనకావనీశువంశావళినే। డీసభనెల్లవినను। ల్లాసంబునదెలుపగావలయుమీరుదయన్॥

వ॥ అనినవసిష్ఠుండెల్లవారలువినజనకునకిట్లనియె॥

(*) దశరథమహారాజువంశావళి. (*)

వ॥ ఓయిరాజా జగదుత్పత్తికారకుండైనబ్రహ్మయు-మరీచియు-గశ్యపుండు-వివస్వంతుండు-వైవస్వతమనువు-ఇక్ష్వాకుండు-కుక్షి, వికుక్షి- అనరణ్యుండు- పృథుండు, త్రిశంకుండు- దుందుమారుండు-యువనాశ్వుండు మాంధాత, సంధి- ధ్రువసంధి, భరతుండు-అసితుండు, సగరుండు- సమంజసుండు- అంశుమంతుండు, దిలీపుండు-భగీరథుండు-కకుత్స్థుండు, రఘువు, కల్మాషపాదుండు-శంఖణుండు, సుదర్శనుండు-అగ్నివర్ణుండు, శీఘ్రగుండు-మరుండు, ప్రశుశ్రుకుండు - అంబరీషుండు, నహుషుండును, యయాతి, నాభాగుండు-అజుండు, దశరథుండు-వీరలుక్రమంబునవంశకర్తలై ప్రకాశించిరీదశరథునకు రామ- లక్ష్మణ- భరత- శత్రుఘ్నులుదయించిరందురు॥

సీ॥ రమ్యచరితుడైనరామచంద్రునకునీ। కూతుసీతనిచ్చికులముపావనముగజేయగంటివమలాత్మకృతకృత్యు। డైతివపరిమితవిభూతిమెరసె



వ॥ అనుసమయంబునశతానందుండు దశరథుంజూచియిట్లనియె॥

(*) జనకమహారాజువంశావళి. (*)

వ॥ ఓయిరాజేంద్రా - అతిపుణ్యచరితుండును నీతివిశారదుండైన నిమిచక్రవర్తియు మిథియు జనకుండు ఉదావసుండు నందివర్ధనుండు సుకేతుండు దేవరాతుండు బృహద్రథుండు మహావీరుండు సుధృతి ధృష్టకేతుండు హర్యశ్వుండు మరుండు ప్రతింధకుండు కీర్తిరథుండు దేవమీఢుండు సుధీరుండు మహీధ్రకుండు కీర్తిరాతుండు మహారోముండు స్వర్ణరోముండు హ్రస్వరోముండు జనకుండు వీరలుక్రమంబునవిందువంశకరులతనిసహోదరుండుగుశధ్వజుండు ఈజనకునికులశీలపరాక్రమంబులు సీతగుణంబులు వర్ణింపసామాన్యంబులుగావు కావున నీపుత్త్రునకు సకలగుణాభిరాముండైనరామునకు చారుగుణసీలజాలవిశాలయగు సీతం బెండ్లిచేసి జగన్నుతకీర్తింజెందుమా దశస్యందనా॥

గీ॥ అనువశిష్ఠశతానందులనునుతించి। జనకదశరథమేదినీశ్వరులు భోగడి। రఖిలమునులును రాజులత్యద్భుతముగ। క్రంతలనుదెచ్చిబాడిరికాంతలపుడు॥

(*) సీతాకల్యాణఘట్టము. (*)

(కల్యాణపాట - అటతాళము.)

గౌరికల్యాణావైభోగమే। లక్ష్మికల్యాణావైభోగమే। సీతా, కల్యాణావైభోగమే॥ రామభద్రునిపెండ్లిరమణులందరునూ। ప్రేమచేరారమ్మ పేరంటమునకూ॥ గౌరి॥ ౧॥ ప్రవిమలాకారుతేపార్థివోత్తములూ। నవమోహనాంగులేనళినలోచనులూ॥ గౌరి॥ ౨॥ ఏమినోములునోచెనిశీతతల్లి। రామునిపట్టంపురాణీతానాయె॥ గౌరి॥ ౩॥ పసుపుకుంకుమనగలుపట్టుచీరలునూ। కుసుమకోమలులెల్లగొనితెచ్చిరపుడూ॥ గౌరి॥ ౪॥ గురుతుగాదశరథుడుకోడండ్లకపుడూ। వరుసైనసొమ్ములవారిగానిచ్చె॥ గౌరి॥ ౫॥ తగినట్టివియ్యాలేతరుణియీరేడూ। జగములవీరికిసరిసాటలేరూ॥ గౌరి॥ ౬॥ కరువుదీరగజూడగలిగెవేడ్కల్లూ। వరదుడైవాడమ్మ వాల్మీకిశివుడూ॥ గౌరికల్యాణా॥ ౭॥

వ॥ అంతవశిష్ఠవిశ్వామిత్రశతానందాది ముదితవిప్రప్రవరసముదితమంత్రపూర్వకంబుగా లక్ష్మణాగ్రజుపదారవిందంబులుగడిగి మణిమయభూషణాదిపరిణయదక్షిణసంపదలంబగుమధుపర్కంబొసంగి॥

గీ॥ శాశ్వతంబుగసహధర్మచారిణిగను । నీకొసంగెదనీసీత నాకుమారి। దీని జేకొనిసకలసుఖానుభవము। శ్రీరఘూత్తమసంప్రీతి జెందుమవనీ॥

వ॥ అనిదృఢమనస్కుండై రామలక్ష్మణభరతశత్రుఘ్నులకుగ్రమంబునసీతోర్మిళామాండవీశ్రుతకీర్తులనుకన్యలహిరణ్యోదకపూర్వకంబుగాదారబోసె నప్పుడప్సరాంగనలేమనుచున్నారు॥

(కేదారగౌళరాగము - ఆటతాళము.)

రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు పెండ్లి । రారే చూడవత్తము॥ లలనలారా॥ రారే చూచి॥ సోమవిజితాననులునూతన । కామినీజనపంచబాణులు। వామలోచనివనజబాంధవవంశవర్ధనులనఘులగు శ్రీ॥ రామ॥ ౧॥ కౌసల్యాకైకసుమిత్రనోచిననోము। కలికీయేమనవచ్చునే। వాసిగాపరమనిక్షేపమువంటికొడుకులగనిరివారల । తోసమానంబైనవారిలనోసఖీచనవెవ్వరే శ్రీ॥ రామ॥ ౨॥ స్థిరముగమదినిగోరినకోరికలుసంప్రా । ప్తించెంతటివారికే। పరగదశరథజనకులకుసంబంధమీలాగునఘటించుట। గరితవెలిగారంబునకుబంగారమబ్బినచందమే శ్రీ॥ రామ॥ ౩॥ పొందుగవాలమేటింపుధరునిడెందమందుదలంచుచును । మందగామినులార పరమానందమునుచెన్నొందగామీ । రందరందముజిందనేడొకచందమునగ్గుమిగూడుకొని శ్రీ॥ రామలక్ష్మణ॥ ౪॥

వ॥ ఇవ్విధంబున్న దాశరథులకేకకాలంబునంగన్నియల బాణిగ్రహణంబు జేయించి విదేహుండల్లుళ్ళకిట్లనియె॥

(*)జనకమహారాజు అల్లునితో సంభాషించుట.(*)

(సంవాదం - ఏలలు.)

రామాకళ్యాణగుణాభిరామా సీతానీకిచ్చెదా । నామోదమునగ్రహించుమా। సర్వసౌఖ్యములు। ప్రేమదీరననుభవించుమా॥



(రామువాక్యము.)

రాజేంద్రామీయాజ్ఞకొలది। ధీజనులెల్లగీర్తింపా। శ్రీజానకినీవరించెదా। ముజ్జగములందు। తేజమౌసత్కీర్తిగాంచెదా॥ అనినలక్ష్మణుంజూచి॥

అక్షణపరాక్రమ శ్రీలక్ష్మణాయామ్మళోశుభ । లక్షణాంగినీకిచ్చెనూ। కవబాయకీకం । జాక్షినేలుసురలుమెచ్చనూ॥

[లక్ష్మణవాక్యము]

మంచిబోధజేశితిరీమామాగారూమీయాజ్ఞకే। వంచనలేకవర్తించెదానీబాలాప్రేమ । మించగగూడిక్రీడించెదా॥ అనినభరతుంగాంచి॥

భరతానిర్మలానందసంభరితామాండవీకన్నియా । పరిణయమైదీనిగూడుకా। వాంఛితార్థములు। స్థిరముగాజెందుమువేడుకా॥

(భరతునివాక్యము.)

మాటమామీమాటజవదాటకధాత్రీగానేము । మ్మాటకీటికోటినేలొందమనూ। భూనాథ । కోటిప్రమోదముజెందనూ॥

అనినశత్రుఘ్నునవలోకించి॥

మిత్రవంశవర్ధనా శ్రీశత్రుఘ్నాశ్రుతకీర్తిను । గాత్రినీకిచ్చెదమైత్రిని। చేపట్టిక్షేమ । కరముగావర్ధిల్లుధాత్రిని॥

[శత్రుఘ్నునివాక్యము.]

మేలుగా శ్రీవాలమేటిపాలుడలరగనిచిన్నిబాలికా నెయ్యెడబాయకా। ముచ్చటగానే। నేలుకొందునుభూనాయకా॥

వ॥ అనినజనకుండత్యంతసంతుష్టహృదయుండై॥

సీ॥ శుభమస్తు శుభమస్తు శుభమస్తుయనిచాల్బ్రహ్మేశ్వరాదులుబ్రస్తుతింప । జల్లుఝల్లుజలుఝుల్లుఝుల్లని గీర్వాణవారంబుపువ్వులవానగురియ । ధంధణాంధంధణాంధంధణాయనినభమునదేవదుందుభులుమొరయ । తకిటకిట్టకధిత్తతాహత్తధిమియనిరంభాదిచెలులునర్తనముసలుప । నవనిసురలుమంగళాష్టకంబులుజదువ। వంగనంగనలుజెలంగిపాడ। జూచువారికెల్లలోచనోత్సవముగా। వాసిమీరపెండ్లిజేసిరపుడు॥

(ముఖారి రాగము-ఆది తాళము.)

పెండ్లి జేసిరి వేడ్క-మీరా। సీతారాములకూ॥ పెం॥ ఇండ్లవరుస జవరాండ్లుపండ్లుపూ। చెండ్లుకానుకలుచేకొనినడువగ॥ పెం॥ ౧॥ ఆణిముత్యాలతోరణాలూ।నవరత్నఖచితమైనట్టిద్వారబంధనములూ॥ మానుగబహువిన్నాణమైనక।ళ్యాణమంటపములోనందంబుగ॥ పెం॥ ౨॥ వందిమాగధకైవారములూ। చిత్రమౌవివిధ, వాద్యగంభీరఘోషణములూ। సందడిగొనద్విజసుందరులెల్లప। సందగుపాటలనుందగబాడగ॥ పెం॥ ౩॥ కుందనంపుపీఠములపైనీ। వధూవరుల। కొమరొప్పజేర్చిమేలుంబూనీ। పొందుగబ్రహ్మపురందరముఖసుర।బృందంబులుముదియందరుదందగ॥ పెం॥ ౪॥ వేదోక్తమైనపద్ధతిగనూ। వసిష్ఠశతానం। దాదీమునివర్యులొనరింపగనూ మేదురముగవాల్మేటినిలయుడా। ప్లాదమొందనయస్వానందంబుగ॥ పెం॥

అప్పుడు॥ —క॥ రంగుగనగుమోమునమో। ముంగదియగరామభద్రిక మోదంబునసీ। తాంగనదరకంధరమున। మంగళసూత్రంబుగట్టె మహిరవమీరన్॥

వ॥ అనంతరంబున॥

గీ॥ పొసగనోలిమెట్టుపుట్టికలనునిల్చి। యొకరికన్నొకరుయుల్లసమున। మూర్ధ్నిజనించుకొనిరిముత్యాలతలంబ్రాలు। దశరధాత్మజుడును ధరణిజయును॥

(*)విప్రులు- మంగళాష్టకములు.(*)

శ్లోకం॥ శ్రీకైలాసగిరీశ్వరాద్యుత శతానందామరాధీశ్వరో,। శోచిష్కేశకృతాంతకోణపవనాధీశాశుగోయక్షరాట్। ఆదిత్యాదినవగ్రహాఖిలమునీంద్రాశ్లేషిబృందారకాః। సీతారామమహావివాహసమయే కుర్యాత్సదామంగళం॥ ౧॥

కాత్యాయనీకమలావిరించియువతీ। ఛాయాసనసూయ్యాసతీ। సంధ్యారుంధతిరోహిణీముఖవపత్నీముఖ్యసాధ్వీజనాః।మానాక్షీయుతవాలమేటినిల యోశ్రీచాకనాథేశ్వరా।సీతారామమహావివాహసమయేకుర్యాత్సదా॥

వ॥ అంతటపౌరాంగనలేమనుచున్నారూ॥



(*) వివాహమహోత్సవము. (*)

(పెండ్లి పాట-ముఖారి రాగము-ఆది తాళము.)

సీతాకళ్యాణామెంతోవేడుక।చెలియా, చేతోమోదమునపొందువేడుకా।మనము, చూతామూరారేగుమిగూడుకా। జనక, భూతలేశ్వరుడెంతఖ్యాతీయుతుడాయెనహహా॥సీతా॥ ౧॥ సురలుపువ్వులవానగురియగా। భేరీ, మురజకాహళాదులుమొరయగా। దివ్యా, ప్సరలానాట్యమునీటుమెరయగా। భద్ర, కరినెక్కి-రామభద్రుడరుదెంచె నమ్మలారా॥ సీతా॥ ౨॥ రాముతమ్ములునవమారులే।సీతా, భామాచెల్లెండ్లుబహుశృంగారులే। తొల్లి, యేమినోములునోచినారలే। హంస, గామినిచూడచూడగాముచ్చటాయెనహహా॥సీతా॥ ౩॥ ఘనవేదవాదములుమించగా।తపో, ధనులైనమౌనులుదీవించగా। సకల, జనులుసైరాయనికీర్తించగా। వాణ్యాం, గనలూపాటలుబాడుచునశాసలిచ్చిమెచ్చ॥ సీతా॥ ౪॥ వెలలేనిరత్నపళ్లెరంబులా। వన్నె, గలిగినకానుకలుకట్నంబులా। గొనుచు, చెలగిపొవుదమామోదంబులా। శిరుల, వెలయువాల్మేటిపురినివేశుడానందమొంద॥ సీతాకళ్యాణ॥ ౫॥

వ॥ తదనంతరంబునాశీతారాములకుమంగళహారతులిచ్చిరెట్లనినా.

క॥పొంగిచెలంగుచుబంగరు।రంగగుదీపాలపళ్లెరంబులుగొనియున్। మంగళమనిమంగళమని।మంగళమనిబాడిరపుడుమగువలువరుసన్॥

(*) మంగళహారతీ. (*)

(బిలహరి రాగము-ఆది తాళము.)

మంగళాహారతులివ్వరెసీతాంగనకూ।శ్రీరామునకూ॥భృంగసముదయవేణికినీ।సంగరప్రచండునకుసారసలోచనునకు॥ మంగ॥ మేదినీసంజాతకుసదమలమిహిరాన్వయ.సంభూతునకూ। సాదరామృతభాషిణికీ। సారాచారవిశారదునకుసనకాదిసంశేవితునకూ॥ మంగ॥ ౨॥ భద్రకుంజ

రయానకుసతతప్రార్థితవరసుత్రామునకూ। భద్రగుణగణధామునకునూ। చిద్రూపునకునుకరుణార్ద్రవీక్షణునకుజయ॥ మంగ॥ ౩॥ నీరజాహితవదనకుభాసురనీలాంబుదసమదేహునకూ। చారుతరమణిహారకునూ। మేరుభూధరధీరునకువారిధిగంభీరునకూ॥ మంగ॥ ౪॥ ఏణలోచనకాశ్రితరక్షత్రాణునకధికప్రవీణునకూ। పాణివిజితమృణాళకునూ । వాణీశునిజనకునకువాలమేటీశాస్త్రునకు॥ మంగళహారతులివ్వరె॥ ౫॥

వ॥ ఇవ్విధంబున సకలసంభ్రమంబులుంగలిగి లక్ష్మీనారాయణుల కళ్యాణంబునుంబోలె నమందరాగదష్టికంబై పార్వతీపరమేశ్వరు పరిణయంబునుంబోలె సమరసాభిరామంబై పౌలోమీపాకశాసనుల పాణిగ్రహణంబునుంబోలె యుపేంద్రాగమనంబై సీతారాములమహోత్సవంబు వెలసె నంతవిశ్వామిత్రుండు వధూవరులదీవించి జనకదశరథులచే సత్కృతుండై హేమాచలంబునకరిగె నిచ్చటా

ద్వి॥ పరిణయంబొనరించి ప్రమదంబుమించి - కరమర్థి జనకుండు కవిగాయకాది - యాచకులకునెల్ల త్యాగముసంగి ప్రాచుర్యముగపత్తి - రథముఖ్యభూమి- వరులకుబాంధవవర్గంబునకును- పరిపరివిధములబహుమతుల్ జేశి - యతిప్రేమనల్లుండ్ల కాడుబిడ్డలకు - నతులితంబైనట్టియరణంబుగాగ - మదమేనుగులుమంచిమావుతేజీలు - విదితమాయరదముల్ వివిధాయుధములు - మంజుళాభరణముల్ మరియు రాచిలుక - పంజరాల్ పచ్చలపల్లకిల్ నిల్వు- టద్దాలుసురటీలుహంగొపతాలు- సిద్దంపుపైడిగిన్నెలు మేలుపట్టు- పుట్టంబులుడిగెంపువువ్వులబోండ్లు- పంట్టెమంచంబులుపరిమెళపేటి- కలుమొదలైనట్టిఘనవస్తుచయము- బలువేట్కనిచ్చియుపసవుగ్లుంకుమకు - గరిమతో వెయ్యేళ్లగ్రామంబులొసగి - బరమోత్సవంబుగా బయనంబుజేశి - భూవరాధీశోడన్నారెడ్డివంశ- శరధిచంద్రునిరామచంద్రునినేలు- వాలమేటిపురీనివాసునినెంచి - మాలిమిజానకీమణికిట్టులనియె.



(*)జనకుడు కూతుండ్లకు నీతులు జెప్పుట.(*)

(పాట-ఆదితాళము- సంవాదము.)

రామభద్రుడుపరబ్రహ్మంబని। నీమదినెంచగదమ్మా। నవ, నీరజముఖిసీతమ్మా॥ (సీతవాక్యం.)

మదిజెదరగనియ్యక శ్రీరాముని। పదపంకజములపూజా। జే, సెదనిశముగవితేజా॥ వ॥ అనినయూర్మిళంజూచి॥

తల్లీయూర్మిళాలక్ష్మణుండునీ। వల్లభుడాతనిగూడి। వ, ర్ధిల్లవమ్మ వగలాడీ॥ (యూర్మిళవాక్యం.)

జనకామీయానతిచందంబున। మనమలరగవర్తింతూ। యూ, ఘనచరితునిశేవింతూ॥ అనినమాండవినవలోకించి.

మాండవివినవమ్మాభరతుండువి। భుండునీకితనియందూ। పర్తి, పూర్ణభక్తిసంపొందూ॥ (మాండవివాక్యం.)

నాయకునెపననుకూలముగల్గియు। శ్రేయంబునవిహరింతూ। నృప, శేఖరయశముపహింతూ॥ అనినశృతకీర్తిందిలకించి.

శృతకీర్తినీకిలశత్రుఘ్నుడు। పతిహితరతమతిగోరి। సు. స్థితినలరవె చిన్నారి॥ (శృతకీర్తివాక్యము.)

వాలమేటిపురిపాలుసాక్షిసం। శీలభక్తిచందందూ। నే, నిలలితుని నేలొందూ॥

వ॥ అనిబల్కినకూతుండ్లు నీతివాక్యంబులకానందించి ప్రియవచనంబుల నల్లుండ్లంబహూకరించి బంచి జనకుండొంతయుం గృతార్థుండై చెవని హర్షమానసచేతస్కుండై యుండెనంత॥

(*)దశరథాదులయోధ్యాపట్టణంబునకరుగుట.(*)

సీ॥ గోరథంబులమీదకులగురుడాదిగా గలమౌనీంద్రకదంబకముల్లు జనగ। భద్రకుంజరములపైనెక్కి శ్రీరామ భద్రాదినిజతనూభవులుగదల। బంగారుమయమైనపల్లకీలెక్కి సీతాదిసీమంతినులటుగ్గుదేర। రాజులుబంధువర్గంబులుమంత్రులు వాజులపైనెక్కి వరుసనడువ। నటవిటులుగాయకుల్లు వీరభటులుగొలువ। దిక్కులనుతూర్యఘోషముల్ పిక్కటిల్లి విభవజితవజ్ర పాణియై వెడలెతనదు। రాజధానికిదశరథరాజమౌళి॥

(నీలాంబరిరాగము - ఆదితాళము.)

తనవారిగూడిదశరథమహారాజయో । ధ్యాపురి కరుదెంచెను॥ అనుపమానబ్రమోదమునపౌరాంగనామణులెల్లముంగి। ళ్లనువసించియు కానుకలిచ్చుచుకనులపండువుగాగనుంగొన॥ తన॥ ౧॥ అతులితవైభవో న్నతినమృతాశన। పతినిహసించుచునూ ॥ సతులుసుతులునునుతులసహు లా । శ్రితులుహితులుబురోహితులుద । త్సుతులుమంత్రులుభృత్యులును బాంధవులుజగతీపతులుమొదలగు॥ తన॥ ౨॥ వారకామినులాడవందిమా గధులుకై వారముశేయగను । భేరిఝర్ఝరజమృదంగ కాహళభూరిశంఖా రావములుదగ। భోరుకొలగమింటవేల్పులవారిగానరవిరులుగురియగ॥ తన॥ ౩॥ గరుడగంధర్వకిన్నరసిద్ధసాధ్యకిం। పురుషులుబొగడగను। కరు ణువాయములుకాల్బలంబులునరదములు నలుగడలవెడలగ । వరదుడగు శ్రీవాలమేటీశ్వరుడుబరమోత్సాహమొందగ॥ తనవా॥ ౪॥

వ॥ ఇట్లుజనిచనిమార్గమధ్యంబుననొకభీషణంబైన మహాఘోషంబాకర్ణించి కళవళించి వసిష్టుంగాంచి కోసలేంద్రుండిట్లనియె॥

సీ॥ తొమ్మిదిమేఘముల్దొమ్మిగానొకసారి। చెలరేగియుబ్బెగర్జించినట్లు । పెటపెటపటుపటాభటులచేనెడలేక । జడిగొనిపిడుగులుబడినయట్లు। భూనభంబులకెగబ్రాంగెడుసాంద్రముల్ । కల్లోలముగనుఘూర్ణిల్లినట్లు। సప్తాశుగములువిచ్చలవిడికసరున । మించిపీచుచునుఘోషించినట్లు॥ మనపురోభాగముననదేమట్టుమీరి। నట్టిఘనశబ్దమొకటిమహాద్భుతముగ। దిశలుభేదిల్లచిత్తంబుదిగులుజెంద । వినబడెనిదేమివిలయమోమునివరేణ్య॥

(వశిష్టవాక్యము.)

గీ॥ చిత్తముననట్టిచర్యయోచించిచూడ । తొల్మెతలాధీశనేడిట్టిసమయమునను। భయమొకటిబొడమువెంటశుభంబుగలుగు। మంచిదెటులైన ధైర్యంబుమానవలదు॥

వ॥ అనిబలుకుచున్నసమయంబునా॥



(*)పరశురామునికథాప్రారంభము.(*)

(నాటరాగము- ఆదితాళము.)

ప్రళయకాలరుద్రునివలెవచ్చెను । పరశురాముడపుడూ ॥ కళవళముగచీకాకై నృపవర। దళంబులెల్లనుతత్తరిల్లగా॥ ప్రళయ॥ ౧॥ శాంతంబొకగోరంతలేకదు । ర్దాంతతామసమునా । వింతలిదేకల్పాంతంబోయని। యంతగృంవిజనులంతబెదరగా ॥ ప్రళయ ॥ ౨ ॥ కటకటయిదియేమోవిక్రమంబని। క్రతుభుజతతులడలా। పటుతరమగుయార్భటులుజెలగబహు। హాటపటిమనుదిక్తటములగలగా॥ ప్రళయ॥ ౩॥ కీలాభీలముశేయుచుదివిపెం। ధూళిగ్రమ్ముకొనగా। వాలమేటినిలయునివిల్విరిచిన। వాడెవ్వడోచూపుచూపుడనివడి॥ ప్రళయకాలరుద్రుని॥ ౪॥ ఇవ్విధంబునా॥

ద్వి॥ గండుమీరియుగాంతకాలప్రచండ - చండభానుప్రతీతిసంవర్తకాల- కాలునికైవడికల్పావసాన- జ్వాలవిశాలాగ్నిచాట్పునబ్రకటి- తాలోలవిలయజంఝానిలుకరణి - కాలభైరవురీతికఠినోగ్రవీర- భద్రుపోల్కి నిపురభంజనరౌద్ర - రుద్రుచందంబునవ్యగ్రభీష్మమయ - దంభోళిధరుపోల్కిదపనియ్యాకసిప- జృంభణవిజితనృసింహునిరేవ - బలిభంజనక్రమోపాయప్రభావ - విలసితోద్దండత్రివిక్రమభంగి - నట్టహాసమునబ్రహ్మాండంబులగల- బెట్టుకేకలభూతబృందముల్బెదర - గిరినిభోన్నతనిజాకృతి కళల్దేల - చరణఘట్టనభూచక్రంబుదూల - కరకుచూటులనగ్నికణములురాల- బోరిగండ్రగొడ్డలిభుజమునగ్రాల- బ్రబలియున్నరెడ్డిరామఛంద్రునకు- శుభములొసంగుభాసురవాలమేటి- పశుపతినెంచుచుబరతెంచినిలచి - కసిమీరబలెభార్గవరాముడపుడు॥

(నాటరాగము- అటతాళము-)

ఏడిరారాముడేడిరా। ఓరీ॥ ఏడిరా॥ ఏడిరావాడునాజాడదెలసినిలువ। గూడదనుచువెళ్లినాడాడాగినాడా॥ ఏడిరా॥ ౧ ॥ గరువతనమునామద్దురుడైనబ్రీమహే। శ్వరునికోదండమువిరచినదుష్టాత్ము॥ డేడిరా॥ ౨॥ కరసహస్రముగలకార్తవీర్యునిబట్టి। బోరిగొన్నబలునినన్నెరుగడేమొవా॥ డేడిరా॥ ౩॥ నెట్టనవాల్మేటిపట్టణేశ్వరుసాక్షి। బెట్టివానినిమట్టుబెట్టకవిడనువా॥ డేడిరా॥ ౪॥

వ॥ అనియిట్లత్యంతభయంకరాకారుండై నిలచియున్నపరశురాముని మహోద్దండంబునకు వెరచుచు నర్ఘ్యంబులుగొని సముఖంబుజేరు సామర్థ్యంబుజాలక వశిష్ఠాదులుభయాపహామంత్రంబులుచ్చరించుచు నొదిగియుండిరి దశరథాదులేమియ్యుండోచక నిశ్చేష్టితులై తొలగియుండిరట్టియెడ॥

క॥ పలుమరుతనచేతోనిజె। ట్టాలయుగగసిమసగుభార్గవునిజేరి యొద్దా। ముకుళితకరుడై భాస్కర।కులవర్ధనుడిట్టులనియె గురుతరభక్తిన్॥

(కందార్థము - రేగుప్తిరాగము.)

ఘోరాట్టహాసమునవా। పేరుదలంపుచుమహోగ్ర। భీకరమునస్థిం। దారూఢిగనగుదెంచిన। మీరెవరో తెలియబల్కు। మీమేరుధీరా॥ కోపము జూపక। గామీకుమేరా॥ తామరచూలివోతగునేడుదుధరుడవో। దామోదరుడవోశాంతముతోడదెల్పుమా। హా మే సుధీరా॥

(పరశురామునివాక్యము.)

(కందార్థము - నాటరాగము.)

బాలకచూడగచూడగ। వేలెమలేషెమటనిలచి।। వెరపేమియులే! కీలాగునమీరెవరని। తాలిమివడిగితివిదెల్పె। దనువినగోరీ। జమదగ్నినం। దనుడనైమీరీ। ఘనులెల్లబొగడభార్గవరాముడనుపేర। వినుతిజెందితివాదు। వృత్తాంతమెరిగించెద వినరోరీ॥ ఇదియునుంగాక॥

సీ॥ కార్తవీర్యునిబాహుకదళీకారణ్యంబు ఖండించితిన్నిమహోగ్రతవహించి। షణ్ముఖగలసిక్రౌంచమహీధరంబును చండించితినిభూరిసత్వగరిమ। ఘోరప్రతాపాగ్నిచేరాజవంశముల్ మండించితినిమహామచ్చరమున। జనకునస్తపికసంస్థానస్తునిగజేసి పండించితినితపఃఫలము నెలమి దివిరియశ్వమేధదీక్షాంతమునధరా। తలముకశ్యపునకు దారవోసి నిరుపమానకీర్తినిండించితినివన్ను। రామదెలియుపరశురామునిగను॥



(రామవాక్యము)

(కందార్థము - రేగుప్తిరాగము.)

మునివరతావకదరిశన। మునమాజన్మములుసఫలమాయనుజెంతెను। నేడనువుగనెందుండెవటకీ। జనుదెంచుచున్నవారో। శలవియ్యదగునూ కరుణశవృత్తి। దొలగిపెల్లగనూ॥ అలుకకుకారణమదియేమోకొడువేమో। తెలియదుమాకుసందేహముదీరగ॥ శలవియ్యదగునూ॥

(భార్గవునివాక్యము - కందార్థము.)

నీలగ్రీవునికార్ముక। మోలింఖండించితనుచునుర్వీజనముల్। చలాబలుకగవినియును। నీలాపునుజూడగోరి। నేవచ్చినారా। తారితారి। పోవద్దురారా। ఈవార్తకలిగిమహేంద్రాద్రిపైనుండి। వేవేగమునసీదుకావరమణగింప॥ నేవచ్చినారా॥

వ॥ అసిబల్కుభార్గవునిపలుకులకులుకపడి జానకీదేవిచెలులంగాంచియిట్లనియె॥ ఓశమ్మా॥

{ పరశురాముని భీకరంబుగని
జానకీదేవి ప్రలాపించుట. }

క॥ ప్రళయాంతకువలెనొకగో। డ్డలిమూపునబెట్టికటకటాయీ మునిపే। రలుకగొనినిర్నిమిత్తము। చెలరేగుచువచ్చెనేమిశేయుదమమ్మా॥

(శోకవిరాళిరాగము - అటతాళము.)

యేమిశేయుదమె। వోశమ్మాయింకెమి॥ యేమిశేయుదమమ్మా యింతలోనింతటి। బాములుమనకుసంప్రాప్తించెకటకటా॥ యేమి॥ ౧॥ కాంసంతమైనా। తాళిమిలేదీ। ఘనుడెవరెచానా। యీసుమీరరాముడే డేడెడీయని॥ నాసామిపైనిషహాయాసమునవచ్చే॥ నేమి॥ ౨॥ రద్దిశేయుచునూ। యెంతెంతోచి। రాకుజూపుచునూ॥ గద్దరితనమునకచ్చుకుకాల్ద్రవ్వి॥ పెద్దభూతమువలెగద్దించుచున్నాడే॥ కేమి॥ ౩॥ బాలాయీమాయా। లేమమ్మాసం। భ్రమములేమాయా॥ కాలమేమనవచ్చువాలమేటిమహా। కాలునిదయమనపాలయెట్లున్నదో॥ యేమిశేయుదమే॥ ౪॥

ద్వి॥ అమ్మచెల్లయిదేమియాగడమింత- దొమ్మిగాబైకసిఘూర్తుడైపరశు- రాముడనేనంచురాముని జేరి - ధీమసంబునసాధించుచున్నాడు- యుండజయానటదారుతరాల- నుండిమాయింటిలోనుండినశివుని- ధనువుఖండించినదానికైయితడు- బనివడినాకాంతుపైనల్గులేమొ- కాలరుద్రునిభాతికాలుసరీతి- కాలాగ్నికైవడిగ్రాలుచున్నాడు - యెదురులేనిప్రతాపమెంచుచున్నాడు - సుదతిరోబహుభీతిజూపుచున్నాడు - లేశమైనను శాంతిలేదీసునేమి - జేసునోయిక నేమిశేయగావచ్చు - నిన్నమొన్నటికిని నేటికిప్పటికి - పన్నుగాలాభలోభములెన్నిగలిగె - వలనొప్పగాకాలవైపరీత్యంబు- దలపోయనెంతచోద్యంబాయెనకట- నీమహామచ్చరునీమహశ్శూరు - నేమాట్కిగమచుచుమిది యెట్లుబోసగు - పతిభిక్షయిమ్మని బార్థింతుననిన - మితిలేనిరౌద్రంబుమించినవాని - నంతకాకారుడైయడరెడువాని - చెంతకేలాగునజేరగాదగును - నాతియీబాములన్నారెడ్డిగోత్ర - జాతుడౌశ్రీరామచంద్రునినేలు - వాలమేటీశుడేవారింపవలయు- నీలాటియోచనలేమానెకొమ్మా॥

వ॥ అనికటకటంబడుకోడలిగోడుంజూడలేకదశరధుండువిషాదమానమానసుండై మెల్లమెల్లనభార్గవునిసన్నిధింజేరి కృతాంజలియైయిట్లనియె॥

[*] దశరథమహారాజు భార్గవునిస్తుతించుట. [*]

(ముఖారిరాగము - ఆటతాళము.)

శరణుశ్రీపరశురామసద్గుణధామా ॥ శరణు ॥ పరమపావనభక్తవత్సల । భానుతేజశుభాకరా॥ శరణు॥ ౧॥ పద్దుబూనుగవద్దుబాలులాపైని। ముద్దియలసుఖమెంచిపీరల । నుద్ధరించుదయానిధే॥ శరణు॥ ౨॥ క్రొత్తపెండ్లికొమారుడురాముడు । ద్వృత్తిజూపకచల్లగాదీవించిదయవీడ్కొల్పుమా॥ శరణు॥ ౩॥ కోపమేలనిరాపరాధులముమా । ప్రాపుడాపైవాలమేట్పురీపాలుసాక్షిగనేలుమా॥ శరణుశ్రీపరశురామా॥



ద్వి ॥ ఓసత్యగుణసాంద్రయోమానిచంద్ర - యోసాధుమందారయోమేరుధీర - కరమధీమఖవేళగస్యపాదులకు- ధరయెల్లనిచ్చినధర్మాత్ముడవు - జమదగ్నిసుతుడవుస్వాధ్యాయపరుడ - వమితతేజోనిధివమరేంద్రప్రార్థన - నాలించిక్షత్రియహతకుశేయుటయు - జాలించినట్టివిస్తారశాంతుడవు - తాపసోత్తముడవత్యంతపుణ్యుడవు - పాపదూరుండవుబ్రహ్మవర్చసుడ - వలఘునీతియుతుండవార్యపూజ్యుడవు - విలసితయశుడవువిజితేంద్రియుడవు - పసివాడురామునిపైనిమీకింత - కశిబూనదగునెయికటయీకుమార - కుడుబ్రాణమిత్వాకుకులంలకునెల్ల - కడుకెట్టిబుత్రభిక్షనుబ్రేచనొసగి - స్వామియన్నారెడ్డివరరామచంద్ర - క్షేమంబుగానేలుశ్రీవాలమేటి - ఫణిభూషణుండెన్నబాలింపవయ్య- బ్రణుతామరస్తోమభార్గవరామా॥ అనివెండియు.

(కందార్థము- రేగుప్తిరాగము.)

నాపుత్రుడనిదలంచక। నీపుత్రుండనుచునెంచి। నెమ్మినికరుణో। ద్దీపితమతివై రాముని। నేపునరక్షించుమేలా॥ కోపము। బూపినను మేమోపము॥ ఆపద్బాంధవుడనినమ్మితిమిని। రాపరాధులముమాపైనింత॥ కోపము॥

(పరశురామునివాక్యం.)

(కందార్థము - నాటరాగము.)

ఓరీదశరథభిలువని। పేరంటమువచ్చినటుల। బెక్కుసుద్దులీ। తీరున బ్రేలెదునీదుకు। మారునిపైయాశలింక। మానరా॥ వానినివిడచి। పోసురా॥ పోసిమనవులకేనువొప్పంగను। లేనిపోనియభిమానముమదినీ। మానరా॥

వ॥ అనిదశరథునిందిరస్కరించికౌసలేయునింగదిశిజామదగ్నిఇట్లనియె॥

(*) రామపరశురామసంవాదము. (*)

(పరశురామునికందార్థము- నాటరాగము.)

నేరాముడనొకడుండగ। శ్రీరాముడనేటిపేరు। జేకొనినీవే। ధీరంబునవిహరించెదో। రారాసన్నిహ్నుడీధ। రదుభూతబలిగా। జేతునుచూడ। రాలోకమెరుగగా॥ ప్రకటితమగునాయాగ్రహమునకెదురెవ్వ। రౌశకుణమునసుహైజకలాధమానికధ। రదుభూతబలిగా॥

(శ్రీరాముని వాక్యం.)

గీ॥ చలము వలదు వలదు చాలించి మేలెంచి। బాసగము మెచ్చుఘ
జలంది। నిజనివాసమునకు నెమ్మనివేంచేయ। దగునటంచు ప్రమోదము
మహాత్మా॥ (సంవాదము.)

(పరశురాముని వాక్యం-నాట రాగము-అట తాళము.)

నిభక్తి నేనొల్ల రాఘవా। నేడు, నీపొగరణచేరా రాఘవా॥
శ్రీ॥ మునిసుతుడనీకు భార్గవా। నేను, మ్రొక్కితి తప్పేమి భార్గవా॥
ప॥ క్షత్రియుడవు నీవు రాఘవా। నేను, క్షత్రియాంతకుడను రాఘవా॥
శ్రీ॥ బాపడనెంచితి భార్గవా। నీవు, పగ్గలకే వెరువ భార్గవా॥
ప॥ నా సరివాడవా రాఘవా। నన్ను, దాసిగద్దించేవా రాఘవా॥
శ్రీ॥ పసివానితో వాదు భార్గవా। వొద్దు. ముసలివాడవు నీవు భార్గవా॥
ప॥ నను వృద్ధుడంటివి రాఘవా। నీకు, కనుమిన్ను దెలియక రాఘవా॥
శ్రీ॥ మెచ్చుమాటలు మాని భార్గవా। ఇంధు, వచ్చినపని జూడు భార్గవా॥
ప॥ ఇరువదియొక మారు రాఘవా। ధాత్రి, వరుల జక్కాడ రాఘవా॥
శ్రీ॥ ఆనాటి బింకేలు భార్గవా। చెల్లె, వీనాడు నా చెంత భార్గవా॥
ప॥ నన్నెదిరించేవా రాఘవా। చూడు, నిన్నెంతకుని జేస్తు రాఘవా॥
శ్రీ॥ మంచిది కానిమ్ము భార్గవా। ఇంక, మర్యాద మాకేల భార్గవా॥
ప॥ వాల్మీకీశుడు మెచ్చ రాఘవా। నిన్ను, వసుధ గూల్చెద చూడు రాఘవా॥

(రామవాక్యము-కందార్థం-రేగుప్తి రాగము.)

అడ్డము లేదని భార్గవ। యొడ్డారించెదవు చాలు నో హెూనీచే। గొడ్డలియదెనా మెడయిదె। దొడ్డగు సంకల్పమేమొ। దొలగకా। నెరవేర్చుకొనుమా। ర్చులుకకా॥ బలశౌర్యముగో బ్రాహ్మణులెడరఘు। కులులుజూపరిద్దులనీచలమూ॥ దొలగకా॥ (భార్గవుని వాక్యం.)

వ॥ ఆహా వోరి రాఘవా తొల్లి గీర్వాణశిల్పాచార్యుండైన విశ్వకర్మ రెండు కార్ముకంబులు నిర్మించి యొకటి పురాంతకునకు నొకటి మురాంతకునకు సమర్పించె నొకనాడు జతుర్ముఖ ప్రేరితంబగు మచ్చరంబున శివకేశవులమ్మహానియ్యా సాధనంబులం బోరినం జూచి హరి పరాక్రమంబెరుకపడని సురలు వారిని యుపురసన్మతి పరచి జనిరంత నిజాయుధంబు పైన ప్రియంబు వంగనవి హరుండు తన పంటిని దేవరాతునకొసంగనది యునుంగాక జలంధరాంధక ప్రముఖులగు రక్కసుల బెక్కండ్రను క్కడంచి బహుకాలజీర్ణంబై విదేహునింటంబడియుండిన కోదండంబు ఖండించితి నని మదంబున విర్రవీగెదవది యేల జతుర్భుజుండు నిశితంబగు తన ధనువు నతిబేర్మంబున రుచికునకిచ్చె నమ్మహాభాగుండస్మజ్జనకుండగు జమదగ్నికిచ్చె నా సచ్చరిత్రుండు నాకొసంగెనిదె చూడుము వైకుంఠుని చాపంబు దీని నెక్కుపెట్టి రయంబున నెగగొంటివేని॥

క॥ మెచ్చెద బ్రాణముతో బో। నిచ్చెద లేకుండె నేని ఇక చాలకనిక। జెచ్చర శమనునిపురికిక। బుచ్చెదమన్మహిమ నార్యపుంజము లెన్నక॥ అనినవిని:

(*) శ్రీరాముడు పరశురాముని భంగపరచుట (*)

క॥ భూతములు తల్లడిల్లగ। నాతత ప్రళయోగ్రకోపుడై యొగశియు
శ్రీ॥ సీతాకాంతుడు భార్గవు। చేతి శరాసనము నాడి చేకొని బలిమిక॥

గీ॥ ఎక్కుబెట్టి ఱచి యేపున నిశితశి। లీముఖంబమర్చి భీమసమున। నఖిలదిశలు బెదర నాశ్రవణాంతంబు। జేసి జామదగ్న్యు జేరి పలికె॥

ఓయి భార్గవా॥ క॥ నాశరము మోఘము దెదెగ। ద్వే శెదనీపాదములను। విస్మయమున బ్రహ్మాదులభినుతించగ। నీశౌర్యము జూతమింక నిలువతొలగకక॥

వ॥ అనిదన పరణంబులగురినిలిపి, గంభీరంబుగా ధనుష్టంకారంబు సేయుచు విజృంభించియున్న రఘువీరుని దివ్యప్రభావంబునకు వెరగంది ముకుళితకరుండై పరశురాముండిట్లనియె.

గీ॥ కడుమహాత్ముకంబు నెక్కిడిన యపుడె। యహహ నీవాది విష్ణుండవగుట నిజము। దెలిసికొంటిని భవదీయ దివ్యమహిమ। మింతసామర్థ్యమితరులకెందుగలదు.

(*) భార్గవుండు శ్రీరాము సన్నుతించుట. (*)

క॥ శ్రీసీతాలలనాప్రియ। వాసవముఖత్రిదశవంద్య వనజదళాక్షా। దాసజనపోషదశరథ। కౌసల్యాతనయ రామ కల్యాణనిధీ॥

(మారువరాగము - జుల్వతాళము.)

ఓన్నమ శ్రీరామాయనిధ్యాన్నము శేతూ । సన్నుతచారిత్రునికౌసల్యాగర్భసంభూతుని॥ఓన్నమ॥ ౧॥ శరదిందుసమానముఖుని సర్వమయుని సత్యసంధుని। పరకాంతాజనవిముఖుని। శరణాగతజనపోషుని॥ ఓన్న॥ ౨॥ నాదబిందుకళాతీతుని । నాగేంద్రాధిపశయనుని । వైదేహీమనోహరుని శ్రీదశరథరాజసుతుని॥ ఓన్నమ॥ ౩॥ పవిత్రగాత్రునత్యనుపము । నిత్యుని నిర్మలుని సుధీ। స్తుత్యుని శ్రీవాలమేటి। కాత్యాయనిప్రియువాపుని॥ఓన్న॥౪॥

ఓదేవా—గీ॥ బ్రహ్మవిష్ణుశివస్వరూపప్రధాన । పురుషేశ్వర నారాయణారవింద । నాభగోవిందగోపాలనారసింహ । నినుభజించెదనిరతంబునిగమవేద్యా॥

వ॥ ఓదేవా నీవఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండవు పరబ్రహ్మమయుండవు మాయాతీతుండవగు నిన్నెవ్వరెరుంగనోపుదురు లేనును నీవును నారాయణాంశసంభూతులము పరోక్షంబగు శరీరంబులు దాల్పుటం జేసి నిన్నుం దెలియక దురభిమానంబున నీ కేనోడుట నాకవమానంబును మాత్రంబై నగలుగ దిదియునుంగాక॥

గీ॥ ధాత్రి గస్యపునకు దానమిచ్చుటజేసి। పగలుగాకపుడమిపైని రాత్రులందునిలువరాదుసందేహమునులేదు। నాదుపక్షతిదియు నాదిపురుషా॥

కావున—క॥ నాయంఘ్రులేయవలదుర : మాయురె నాపుణ్యలోకమార్గంబులపై । నేయుమునినుగీర్తింతుదు । బోయెదనే నికమహేంద్రభూధరమునకున్॥

సంధి-వ॥ అనినంగరుణించి రాఘవుండట్లచేసిననపరి శ్రీరామునకుం బ్రదక్షిణంబాచరించి పరశురాముండు మహేంద్రాద్రికిం జనియె॥

సట్టియెడ—గీ॥ దిశలుతెలివిదోచె దివిపుష్పవర్షంబు । గురిసె చల్లగాలికొసరివీచె । మ్రోసెదేవతూర్యములు సర్వసైన్యంబు । వేడ్క జెందె రామువిజయమునకున్॥

౹॥ అట్టియెడ వైమానికులగు దేవకాంతలేమనుచున్నారు.



(హిందుస్తాని - మిశ్రమురాగము.)

ఎంతహాయాయానైనేడో ఇంతులారా। సీతా, కాంతుడెంతో ధీరుడేమో కాంతలారా॥౧॥ అంతమనంతవానినియుక్తిలారా। ఇసు, మంతలానోడించెగద శేయతివలారా॥ ౨॥ చూడగపసివాడుగ దేనుదతులారా। తానే, నాడునేర్చెనీవిద్యలూచేడెలారా॥ ౩॥ సాటిలేనిమేటిగద శెభానలారా। యాకొ, సల్యాదేవినోముఫలమే సఖియలారా॥ ౪॥ వాలమేటిశాసహితుషోవనితలారా । భువిని, లీలరాముడైరాడేమోలేమలారా॥ ౫॥

వ॥ అననీచందంబున విజయసుందరీ కలితానందమందస్మితస్ఫురదధరవింబుండై దెంపొందునిజనందనునిం దిలకించి పులకీకృతవిగ్రహుండై వసుంధరాకాంతుం డరుంధతీకాంతునకిట్లనియే॥

క॥ ధీయుత శ్రీరాముండన । హాయుండై ఋట్టెపనులనాయాసముగా। జేయుచునెంతవరకుసు। శ్రీయుతుడై మనుమ బుడమి జెప్పుము కరుణన్॥

వసిష్టుండు దశరథునకు
శ్రీరాముని ప్రభావంబు దెల్పుట.

వ॥ ఓయి దశరథా నీవడిగిన ప్రశ్నకు సమాధానంబు వచించుటకు జతుర్ముఖ పంచముఖ సహస్రముఖులకైనా నశక్యంబతిరహస్యలబైయుండునైనను సమయోచితంబుగా నాకుదోచినమాత్రంబు వక్కాణించెద జక్కగా నాకర్ణింపుము॥

సీ॥ పరికింప బ్రహ్మాండభాండంబులెల్లవి । ధాతయైయెవ్వడుత్పత్తిజేయు । స్థిరముగా నెవ్వడు జీవకోటులనెల్ల పుండరీకాక్షుడై పొసగ బెంచు । ఏప్పుమీరినవిశ్వమెల్లను శంకరాహ్వయుడయ్యు నెవ్వాడు లయముజేయు । వ్యాపారములనెల్ల వర్జించియును నిర్వికారుడై యెవ్వాడు గదలకుండు। నట్టిపరమాత్ముడవ్యయుడాదిపురుషు। డప్రమేయుడనామయుండక్షరుండు। వాచ్యుడాగమవేద్యుడద్వయుడటంచు। దెలియుముమీరామభద్రు ధాత్రీతలేశా.

వ॥ మరియు నిమ్మహాపురుషుండు విలయకాలంబునం బదునాలుగులోకంబులు తనగర్భంబునందాచివకాకియై బాలకడలియందు బవిలుచు గు పదినూరుతలలుగల చిలువల రేని మెత్తసైన్ తొత్తుమిల్లి యోగనిద్రానుభ

వృండై యుండి కొంతకాలంబునకు సృష్టిచ్ఛాందముల మాయాంగలసి స్వాంతర్గతంబులగు భువనంబులు వెలిపరచి దానును గపటనాటకసూత్రధారియై రామకృష్ణముకుందగోవిందాద్యనంతనామంబుల దుష్టనిగ్రహశిష్టపరిపాలనాది వ్యాపారంబులొనరించుచుండు నట్టిపరబ్రహ్మమయుండౌ [illegible]బున నమరగణప్రార్థితుండై మాయామానుషవేషంబున భూవత్తనూభవుండై ప్రకాశించె నివియెరింగికాదె లోకలోచనకులంబున కే నాచార్యుండనై చిరకాలంబు ననుసరించియుండితి నింతటనాతపంబుసఫలంబయ్యె నీవునుం గృతార్థుండవైతి వింకనీరామభద్రుండు జితశత్రుండై సీతాసమేతంబుగా ననేకదివ్యాబ్దంబులు రాజ్యంబు సేయుచు గ్రతుశతంబుల నాచరించుచు భూసురాదులందనుప్రచు పుత్రవంతుండై పెద్దకాలంబు జగత్పూజ్యుండై వర్ధిల్లువిదియునంగాక॥

క॥ శతకోటిజన్మభవదా। ర్జితఘనసుకృతంబువలన। శ్రీమహితగుణా। పతినీవరసుతుడాయెను। బ్రతిగలదే నీకు। బాహుభవకులతిలకా॥

వ॥ అని వశిష్ఠుండు బలుకుసమయంబున సీతావల్లభుండు దన చేతిచాపంబు పాంపతికొసంగి బరమోల్లాసంబున నరుదెంచి గురుసంగాంచి యిట్లని యె॥

## (*) గురుపితృమాతృభ్రాతృసంవాదము. (*)

(నవరోజు రాగము - ఆదితాళము.)

శరణుశరణుగురువరా విస్తారకరుణోదారా। విస్తారకరుణో॥

(వశిష్ఠుడు)

నీవు॥ స్థిరమైనభోగభాగ్యముల జెలగుము రఘువీరా॥

(అనినతండ్రినీక్షించి)

జనకా మీ పాదములకు వందనము జేసేనయ్యా। వందనము॥

(దశరథుడు.)

చా లా॥ ఘనమైనసత్కీర్తి గాంచి మనుము ముద్దులయ్యా॥

(అనినతల్లులంజూచి)

మొల్లముగ మీకెల్లా నే। మ్రొక్కేతల్లులారా। నే మ్రొక్కే॥

(తల్లులు)

కడు। చల్లగా పుడమిలో నవర్ధిల్లు మోహనమారా॥



(అనినతమ్ముల నాలోకించి)

మేలెంచి తమ్ములారా। పాలిమనలా బ్రోవా। క పాలిమనల॥

(తమ్ములు)

అన్నా। వాలమేటి శునంతటివాడవీ వేకావా॥

ద్వి॥ అనియిట్లు శ్రీరాముడతులితోత్సాహ - మునగురుపితృమాతృముఖ్యులకెల్ల - వరుసగా మ్రొక్కి కూడి వారలవలన - స్థిరమైన మంగళదీవెనల్ వడసి - యనుజులమధురవాక్యంబులదనిపి - జనకజ మొదలైన చానలమనసు - ల్లుల్లసిల్లగ జేసి యోగిధరాపతుల - కెల్ల మేలొనరించి హితపరివారములకు ధైర్యము దెల్పి మొనసి బ్రేరేపి - చెలువార విజయలక్ష్మియుక్తుడగుచు - యుచ్చోటుగదలి వియచ్చరావళులు - మెచ్చగా జెచ్చెరమేళతాళాదిగాద్యముల్ మ్రోయంగ వందిమాగధులు - పద్యగద్యాదుల బ్రస్తుతిశేయ తుంబురు నారదాదులు నభోవీధి - తంబురుల్ మీటుచు దననామకీర్తి - నలుబాడ యక్షకిన్నరసిద్ధసాధ్యు - లెలమితో గొనియాడ నింపుగావారి - నళినాక్షులాడ నన్నారెడ్డివంశ - జలధీందుడగు రామచంద్రునిబ్రోచు - శ్రీకరవాల్మీకి శివుడు మెలనగ। సాకేతపురి జేర జనిమొనస్వేళా॥

వ॥ ఇట్లుజనిచని భర్మనిర్మితసౌధప్రాసాదోత్తుంగ గోపురాస్వితదివ్యాగార రేఖావిరాజితంబును తత్తద్ద్వారనిర్మిత కదళికాస్తంభముక్తాఫలప్రసూన తోరణాలంకృతంబును చందనాగరుకస్తూరి కర్పూర కుంకుమ గోరోజనాది మనోహరసౌరభ ఘుమంఘుమాయితంబును సర్వసంపత్కరంబును సాధుజనవశీకరంబును పరిపంథిలోకభీకరంబును పరిహసితలోకపాలపురంబును నగు సాకేతపురంబుడగ్గరి దత్పురోపవనంబున విడిది జేసియుండి రప్పుడప్పౌరాంగనలు దమలో నిట్లనిరి॥

(పాట- మధ్యమావతి రాగము- అటతాళము.)

రమణులారా రాగేమనము। రాముని జూచి వత్తాము। అమితవైభవముతోడా। నాహా హా వచ్చినాడటా॥ అ॥ విమలకమలదళాయతాక్షుని విశ్వమోహనవిగ్రహుని రిపు। దమను సుమశరకోటిజితసౌందర్యశాలిని సత్కృపాళుని॥ రమణు॥ ౧। సౌమిత్రి గూడీయావేళ। సంయమి వెంట రా॥

నేబోయీ । కోమలాంగీగూడి పెండ్లి । కొమరుడైవచ్చెనీవేళా। తాము యత్నము జేయకుండిన దైవయత్నంబుననువీరికి । కామితార్థంబులులభించెనుగద రేవరులనవచ్చునటరే॥ రమణు॥ ౨॥ యెంతసొగసైయున్నదోయమ్మా । ఇందువదనయగుసీతమ్మా । దంతిగమనామనరామునకూ । తగినవటుచేకూడేనౌర॥ కాంతులకుదగినట్టికాంతలకాంతలకుదగినట్టికాంతుల వింతగానొనగూర్చె భాషాకాంతుడెంతోనేర్పుననుభళీ । రమణు ॥ ౩॥ తమ్ములుతమ్ములిల్లాండ్లు। తమసాటివారైయున్నారూ। కొమ్మరోకోసలేంద్రునకూ। కొదువలువీరేసివరకూ ॥ నెమ్మిమీరగ తాముతొలజన్మమ్మునను జేశినమహాసుకృ। తమ్మువలననుగాకనిన్నిశుభమ్ములెవరికిగలుగునోకపరి॥ రమణు॥ ౪॥ వనితారో శ్రీవాలామేటివాసునీసతట్రుణవలన। కనులారజూడగమనకూ। గలిగెనేవిరీ వేడుకలూ॥ ఘనసిమంగళతూర్యరవములుమోవనశ్చరచేడెలాడగ । ననిముషులుగొనియాడనగరప్రాంతమునవిడిసియున్నారూ॥ రమణులారా॥ ౫॥

వ॥ అనిబల్కుచుండిరంతసాయంసమయంబునా॥



## శ్రీరాముండు స్వజనసమేతుండై అయోధ్యాపట్టణంబు బ్రవేశించుట.

గీ॥ హారరత్నకిరీటకేయూరకంక । ణాదిభూషణభూషితుండైనహంస । కరసహస్రసహస్రప్రకాశమాన। దేహుడైరాఘవుడుగజారోహుడయ్యె ॥ వెండియూ.

సీ॥ శంఖకాహళభేరిసంకులారావముల్ భూనభోంతరములబ్బోరుకొలగ। పరగజయావిజైభవదిగ్విజైభవా బహుపరాకనివంది । ప్రతతిబలుక। చాలగా రెండులక్షలసంఖ్యకపురంపుదివ్వటీలిరుప్రక్క దేజరిల్ల। చిత్రవిచిత్రమైనక్షత్రపథముసోకగబాణవిద్యలతెగలేగయగ । బహువివిధాలంకృతాగారపఙ్క్తిదనరి। విమలమైనట్టిపురిరాజవీథులందు। నవనిజానూజదళక్షితాప్రీతముగ। జెలగిశ్రీరామవిభుండు వేంచేశెనపుడూ॥ అట్టియెడ.

క॥ పల్లవపాణులుగుమిగొని। మల్లెలుజాజులుసురత్నమౌక్తికములుపై। కొల్లగజల్లుచుబంగరు పళ్లెరలనివాళులిచ్చి। బాడిరివరుసన్॥



(హారతిపాట- మధ్యమావతిరాగము- ఆదితాళము.)

హారతీపళ్ళెములెత్తారమ్మా। సీతారాములకూ ॥ హారతీ ॥ మేరుభూధరధీరపారా। వారనిభగంభీమారా। కారసత్యవిచారవాణిమయహారయనిమనసారకర్పూర॥ హారతీ॥ ౧॥ లోలలోచనలెల్లరారోయమ్మా। యుభయపార్శ్వముల । చాలుగాగడదీరినిలువరమ్మా । శీలగానవిలోలకాంచనచేలకవిజనజాలవినుతా। లోలదురితవిఘాలసీతా। లోలయనిముత్యాలుగూర్చి॥ హారతీ॥ కౌసికాధ్వరసంరక్షణుడమ్మా । మారీచతాట। కాసుబాహుగర్వనాశుడమ్మా॥ ౨॥ దాసపోషదయాసముద్రమ । హాసముఖాంతధీసతిలసుమ। నాసభువనవికాసపరమో। ల్లాసయనినీలాలుగూర్చిన॥ హారతీ॥ ౩॥ నీలనీరదకోమలాంగుడమ్మా। యీశాశారదా । లోలముఖదివిజాళివినతుడమ్మా॥ ఫాలనయనాలోలధనుగో। న్మూలకీర్తివిశాలసద్గుణ। జాలపరమకృపాలశశిసమ। ఫాలయనిపగడాలుగూర్చిన॥ హారతీ॥ ౪॥ కామితార్థఫలప్రదాయకుడమ్మా। గౌతమకుల । కామినీశాపమోక్షణుడమ్మా। రాఘరాజలలామసంగర। భీమజగదభిరామతారక । నామజితభృగురామనతసు। త్రామయనివజ్రాలుగూర్చిన॥ హారతీ॥ ౫॥ కౌసలేయుడు శ్రీనివాసుడమ్మా। రవికులాబ్ధిరా। కాశశాంకుడైజెలంగెనమ్మా॥ భాసతరదరహాసవాల్మే। టీశసహితదురాసురాంతక। భూసుతాహృదయేశనిత్యవి। లాసయనిరత్నాలుగూర్చిన॥ హారతీపళ్లెము॥ ౬॥

వ॥ ఇట్లెల్లవారలకు నేత్రోత్సవంబుగాభక్తవత్సలుం డుత్సవంబై శత్రుఘ్నభ్రాతృసహితంబుగా హజారంబుకడగజంబులుడిగ్గి॥

సీ॥ కమలాసమేతుడౌగరుడకేతనుభాతి భారతీయుతుడైనబ్రహ్మ । శైలజాన్వితుడైనచంద్రశేఖరుభంగి వరశచీయుతుడైనవజ్రిపోల్కి । రోహిణీయుక్తుడగుకళానిధిమాడ్కి ఛాయనుగూడినసవితృభంగి । స్వాహాసహాయుడౌజాతవేదునిరీతి రతియుతుడైనదర్పకునిసాటి । జానకీవికరపంకజంబుకేల। చేకొనిమహీసురాళియాశీర్వదింప। వరపురంధ్రీజనంబునివాళులొసగ। రామభద్రుండునిజమందిరంబుసొచ్చె॥ మరియును॥

## (*) గృహప్రవేశము. (*)

(సావేరి రాగము - అటతాళము.)

శుభము శుభమని జగములభినుతించగ రాము। విభుడు నగరు జేరెను॥ శుభయుతమగు గురుచోదితలగ్నమం। దిభయానమైన మహీకన్నియను గూడి॥ విభవమున శతకోటినిర్జరవిభులనిరశించుచును జానుజు। లుభయపార్శ్వంబులను జాయాయుక్తులై కడుభక్తి మెలగగ॥ శుభము॥ ౧॥ చారుమాణిక్యకాంచనసౌధాంతరములజేరి హాయులుమీరగా। నీరజాతాయుత నేత్రులు ఎసనెడ। చారుదీరిముత్యాలారతులెత్తగ॥ శ్రీరఘూత్తము భవత్కీర్తి ధరిత్రిపై నాచంద్రభాస్కర। తారకంబౌననివసిష్టముసారెకును దీవెనలొసంగగ॥ శుభము॥ ౨॥ అకలంకమగు మకూలాంబరంబులురత్నస్తకిత భూషణములును। సకల దేశాధినాయకులు కానుకలిచ్చి। ముకుళితహస్తులై ప్రముఖసేవింపగ॥ ప్రకటితంబుగ నటవిటులుగా। యకులు మార్దంగికులువైతా। ళికులు వైణికులొకటిగావే। దుకలు జూపగగను మహాయులగ॥ శుభము॥ ౩॥ ఇరుదెసలను వేత్రధరులై భృత్యులు బరా। బరులు శేయుచునుండగా। శరణు శరణు దయాశరధేదాశరథే యనం। చుమతరముగ నభశ్చరులు జోహారిడ॥ వరమతిని వాల్మీటిగౌరీ। శ్వరుని సితికంధరుని పన్నగ ధరుని బరమేశ్వరుని దలచుచు। వరహాసితవదనుడై ముదమున॥ శుభము॥ ౪॥

వ॥ ఈప్రకారంబున సమస్తకల్యాణగుణగణాభిరాముండగు శ్రీరామభద్రుండు స్వకుటుంబ, స్వజన, స్వపరివార సహితంబుగా శుభముహూర్తంబున గృహంబు ప్రవేశించి ఇలవేల్పునారాధించి విధ్యుక్త క్రమంబున నగ్నికార్యంబొనరించి సతీయుతుల గుక్షితిసురులకు ఫలసువర్ణదక్షిణంబుగా తాంబూలంబులపిడంచి వారలయాశీర్వచనంబులు గ్రహించి యుత్సహించె నంతదశరథుండెల్లవారలగౌరవంబుగా సత్కరించి సరసపదార్థసంపూర్ణంబైన విందు గావించె నప్పుడు విప్రాంగన లేమనుచున్నారు.



(బువ్వముబంతి పాట - అటతాళము.)

జానకీరాములబువ్వాయూ। సఖియరో ఎంతానందామే॥ మానితాలంకారసహిత। మైనరాజమందిరమున॥ జానకీ॥ ౧॥ బంతులుదీర్చిబంగారూ। పత్రములమరించి వారూ। వింత గానూరూరివారూ। విప్రవీగుచువచ్చేరూ॥ జానకీ॥ ౨॥ మానిచంద్రులొకరు బంతీ। మానవేంద్రులొక్క బంతీ। మానవతులొక్క బంతీ। గానుపూనికూర్చుండేరూ॥ జానకీ॥ ౩॥ ఖండశర్కరరటిపండ్లూ। కమ్మని శాకపాకములూ। మెండైనకలవంటకములూ। మేలైనరాజాన్నములూ॥ జానకీ॥ ౪॥ సారైనపాయసాన్నములూ। నానావిధములౌ భక్ష్యములూ। చారుపొప్పులప్పడములూ। సారమౌదధిఘృతములౌరా॥ జానకీ॥ ౫॥ పట్టంచుచీరెలుమేలూ। పట్టురవికలంధరించీ। పట్టినహంసగామినులూ। నేర్పుమీరి వడ్డించేరూ॥ జానకీ॥ ౬॥ బాయక శ్రీవాలమేటి। పార్వతీశ్వరుల స్మరణ శేయుచు సమస్తజనులూ। స్థిరముగా నారగించేరూ॥ జానకీరాములబువ్వాయూ॥ ౭॥

వ॥ అనియిట్లెల్లవారలు కొల్లలైన వేడుకల నుల్లసిల్లుచుండి రసంతరంబ వనీవల్లభుం డఖిలదేశాధీశ్వరులను బంధుమిత్రాశ్రితకవిగాయక యాచకప్రభృతులను బహువిధవస్తుపస్తారంబులం బహూకరించి వీడుకోల్పి రెట్టించిన కౌతుకంబున సుఖంబుండిరంత॥

## (*) సీతాదేవి రుతుమతియగుట. (*)

సీ॥ కొంతగాలమునకు కుంభినీసుత సీత। దేహసౌష్టవములు దేజరిల్లి కుతుకమెసగ ప్రథమ రుతుమతియయ్యెను। త్రిభువనప్రశస్తశుభదినమున॥

గీ॥ శోభనము జేశిరా కేయి సొంపు గులుక। కౌసలేయుండు మరుకేళికావిలాస। లోలుడై కేళిభవనంబులోనవన్నె। మీరు విరజాజి పాన్పుపై నుండే॥ సమయంబునా॥

॥ శృంగారవతియైన శ్రీజానకీలతాంగిః నవ్యదివ్యాంబరాభరణలగై చేసిగంధ - సింధురగామినుల్ చెలరేగిమంచి - పాటపాడుచునీటు - తేటలబాటల దిర మొనపడక - టింటికిముచ్చట

లింపారవాలు - గంటినివోద్దెచ్చికాకుస్తకులుని - సరసనుపువ్వులశయన స్థలమున - సురుచిరంబుగనుగూర్చుండగాబెట్టి - రాదటగురుదుగభోజనవిధులు- వేదోక్తముగనెరవేర్చిన తర్వాత - తప్పకదంపతితాంబూలములను - మెప్పుగానిప్పించి మెల్లననరుగ - కుసుమకోమలులెల్లగుములుగాగూడి - గుసగుసలాడుచుగొనదైన వెండి - పళ్ళెలరితనంపుపసిడిగిండియల - మల్లియజాజిశామంతిపూసరులు - చక్కెరయుక్కరల్చారపప్పులును. చిక్కనిపాలురుచించుఫలాలు - కమనియ్యాపరిమళగంధవస్తువులు-క్రముకచూర్ణముకప్పురంపుమడుపులును- బాగుగానమరించిపద్ధతిమించి- నాగేంద్రవేణులన్నాగెడ్డిరామ - చంద్రునిశాశ్వితైశ్వర్యసద్భోగ - సాంద్రునిగానేలజాలువాన్మేటి - భవుడెన్నగన్నులపండువుగాగ - వివిధసంభ్రమములవిలసిల్లిరప్పుడూ॥

(సమగ్రపాట - అటతాళము.)

అల్లో నేరేడల్లో। పల్లవాధరిసీతబహుభాగ్యశాలీ ॥ ౧ ॥ రామభద్రుడులోకరక్షకుండనుచూ॥ ప్రేమచే రారమ్మ పేరంటమునకూ॥అల్లో॥ ౨॥ చెల్లెలైచేసినోచిననోముఫలమూ। వల్లరాముడుబాణవల్లభుండామె॥ అల్లో ॥ శుభవారనక్షత్రశుభలగ్నములునూ ॥ శుభదినంబునగూడెశుకవాణిసమర్తా॥ అల్లో॥ ౪॥ సఖితీరగాసర్వసంశయములెల్లా । నికనువర్ధిల్లనీయిక్ష్వాకుకులమూ॥ అల్లో॥ ౫ ॥ రమణిరో వీనవెదశరథమహారాజు। అమితసంపత్పరుండా మెనీవరకూ॥ అల్లో॥ ౬॥ కొడుకుకోడలమేలుకొమరొప్పుజూచీ। కదుధన్యరాలామె కాంతకౌసల్యా॥ అల్లో ॥ ౭ ॥ భావషోడశకళాపరిపూర్ణుడైరా । సోముడై రామ డీసుంద రాననుడూ॥అ॥ ౮॥ కలకంఠితేరుశృంగారించినట్లూ । చెలువొందెచిలుకలకొలికిభూపుత్రి॥ అల్లో॥ ౯॥ సరసగూర్చున్నముచ్చటజూడచూడా। కరువెల్లదీరె [illegible] మరిలకూ॥ అల్లో॥ ౧౦॥ ఆహూర్తిభువనమోహనవిగ్రహులూ ॥ గహిం[illegible] రికదీర్చసేవించరమ్మా॥ అల్లో॥ ౧౧ ॥ తేమవాన్మేటిగౌరీమ [illegible] యేమారకనుభ్రోతురీదంపతులనూ ॥ అల్లో నేరేడ [illegible]

వ॥ అనిమహోల్లాసంబునా॥



సీ॥ సతికిబతికినిసమయోపచారములను। నేర్పునను జేసియొక్కొక్క నెపముబూని। తలుపుగదియించుకొనికామినులుదొలంగ । సిగ్గునను దిగ్గన నులేచిసీతనిలచే॥ ―అంతట॥

(*)సీతారాములయేకాంతమహోత్సవము(*)

(శ్రీరామునివాక్యము.)

శా॥ రావేపూర్ణశశాంకబింబవదనా। రావేప్రవాళాధరీ॥ రావేమత్తమరాళరాజగమనా। రావేమనోనాయకీ । రావేముద్దులజానకీయనుచు శ్రీరామప్రభుండంగనన్ । చేరందీసినిజాంకమందునచిదాచిత్తంబురంజిల్లగన్ ॥

చ ॥ చిలుకలకొలికిలేదళుకుచెక్కులుముద్దులుగొందుమొలక చన్నులుమెలమెల్లనొత్తుచువినోదమలాడుచుమోవియానుచున్ । చెలిమిఘటించి। కౌగిటనుజేరిచిపుక్కిటవీడెమిచ్చి చెం। గలువలపాన్పుపైసుఖము। సారతికేళియొనర్చె వేడుకన్॥ దత్సమయంబు నా॥

ఉ॥ సుంతెడబాటులేనిమృదుచుంబనదంతనఖక్షతాదులున్ । స్వంతసమైనవింతలునుజక్కిలిగింతలుకౌగిలింతలో । కింతగొరంతలేకకరగించెస్వకాంతునియంతరంగమే । కాంతమునంద్రుసీతమమకారవిలాస మనోజ్ఞవైఖరిన్॥ వ॥ ఇట్లన్యోన్యానురాగంబున॥

క॥ రతియుపరతిసమరతిప। ద్ధతులొనరంగనవారవాంబు । ధరణీకన్యా। యుతుడై శ్రీరామవిభుం। డతులితహర్షాబ్ధినోలలాడుచునుండెన్॥

వ ॥ ఆసమయంబునతుంబురునారదాదులగుపరమభాగవతోత్తములేమనుచున్నారూ॥

(భూపాళరాగము - ఆదితాళము.)

క్షత్రవంశవర్ధనుడగురాముచరిత్రమెంతబ్రహ్మానందం ॥ స్తోత్ర పాత్రంబేత। స్తోత్రముగాదతిచిత్రవిచిత్రము॥ క్ష॥ ౧॥ శా ధర్మకామమోక్షప్రదమవులనుధానుయమూ । విశ్వస్థితి గమ। వేద్యంబాద్యంతరహితమంబుజ॥ క్ష॥ ౨॥ మందమ

తులకతిదుర్లభమాశ్రిత। మందారంబునమాయికమూ । పొందు పురందరముఖసుర। బృందమహేంద్రాభివందనియ్యాము॥ మిత్ర॥ ౩॥
జదివినవిని నలిఖించిన। వారలకిహపరసాధకమూ । ధామంబుగా మేటిగా। రీశంకరులక్షుత్ప్రీతికరముభళీ॥ మిత్రవంశ॥ ౪॥

వ॥ అనిప్రశస్తంబుగా త్రిలోకస్తుంగుసజ్జనానీకంబులు స్వనంబుల విస్తారంబుగాప్రస్తుతింప గమస్తాన్వయదీపకుండు సేమవంబులం ప్రకాశించెనిట్టిధంబునా॥

సీ॥ తనదుగోడుకులకోడండ్లుతనవనితలు । సంతసిల్లగమమంతముఖర। పరిజనులుగోల్వధర్మంబుబాయకవని। పట్టింభుదే సంపదలు మెరయా॥ కావున.

క॥ చిత్రంబులుత్రిభువనవనత। పాత్రంబులునఖిలఘోర । వల్లి। దాత్రంబులకాహ్యహృద్వస। చైత్రంబులు రామదేవుచారిత్రంబు

(*) ఫలశృతిద్విపద. (*)

అనియిట్లు శ్రీనైమిశారణ్యవాసు - లనఘాత్ములగుశౌనక మునులకు- ననువొందసూతమహర్షిపుంగవుడు- ఘనతజెప్పినమోక్ష మునధికా లాలిత్యమైనదివ్యలాసమైనిగమ - మూలమైనగువిష్ణుమూ వతారంబులందునసత్తమమగునట్టి - శ్రీరామదేవుచరితలోనమిళి తమొప్పనింద్రయహల్యావిలాస - మేయడధీనుతులెల్ల మోదింప న రాముకళ్యాణంబువరకు - బరగపూర్వోత్తరభాగముల్ గాగ - మాయతగానముశేయుమునకె - గన్యకీర్తికరంబుగాధరణికోట శాంబునధిసోమవరిగుణధామ - పాత్రసల్లలామసుబ్రహ్మణ్యనా వర్యయనుచుమిక్కుటమైనవేడ్క - దవిలిలసత్ఖ్యాతిదనరినపంట భూషణుండునమ్మటిలమానసుమ - లలితుడవ్వారెడ్డి రామచ ద్యాత్మలౌహితులతో నలరెడువేళ- మర్యాదగాదెల్పయామక యమ్మొనటంచుజెలరేగియేను - తద్ధర్మమతిచేత తాంబూ లమ్మహించిశ్రీమన్వాలమేటి- సదనసంకలతముగాసంప్రీ పిలచెలమతో ధాత్రి- నాచంద్రతారార్కమైయుం



క॥ అనిధరణికోటకులపా ।
వనసుబ్రహ్మణ్యసుకవివర్యుడుసంత్రం ।
నంగొంతమీవిలాస ।
మ్మపదగబంచమప్రకరణమునువిరచించెన్॥

---

క॥ మంగళముసర్వమంగళ ।
సంగతశ్రీవాలమేటిసదనాధిపత్యా ।
ద్గంగావృషభతురంగా ।
నంగమదవిభంగచాక్రనాధశుభాంగా॥

## మంగళము.

(సురటరాగము - అటతాళము.)

మంగళమమలభుజంగభూషణునకు । మంగళమనుపమవేషునకూ।
ంగళమచలకన్యామనోహరునకు । మంగళమఖిలలోకైకశ్రీకరునకూ ॥
ంగళంమంగళంశ్రీసదాశివమంగళంమంగళం॥ ౧ ॥

హరునకుగజచర్మధరునకుశతృభి । కరునకుకాలకంధరునకునూ।
ంరునకాశ్రితసంపత్కరునకుమదనసం । హారునకు చంద్రశేఖరునకభ వునకూ ॥ మంగళం ॥ ౨ ॥

శీలికికల్మషోన్మూలికిమునిమనో । జ్ఞాళికనతకరుణాశాలికినీ। శూ లికిప్రణుతదేవాళికిభరితక। పాలికితాండవకేళికిహేళికీ॥ మంగళం ॥ ౩ ॥

ధీరునకునుమహాదారునకాపన్న । వారునకునునిర్విచారునకూ।
శూరునకుదధిగంభీరునకునుసారా। చారునకును మోక్షాధారునకునుజయ॥ మంగళం ॥ ౪ ॥

యీశునకునుస్వప్రకాశునకునునిత్యో । ల్లాసునకదిని వాసునకూ।
భాసిల్లువాల మేటీశునకునుమీనా । క్షీశునకును పరమేశునకునుజయ॥ మంగళం ॥ ౫ ॥



## గద్య.

ఇది శ్రీమత్తారకేశ్వరకరివరదరాజ ప్రసాదితానవద్యాంధ్ర
ధనిష్ఠ్యణప్రవీణ కాస్యపగోత్రాభరణ ధరణికోటవం
[illegible]
[illegible]ాన
సుం[illegible] స్థాన సు[illegible]ణ్యాభిధా
నకవీంద్రప్రణీతంబైన శ్రీమదిం
ద్రాహల్యావిలాస నాట
కోత్తరభాగంబు సర్వం
సంపూర్ణం.

ఔం.





